శ్రీమత్పరదేవతాయైనమః

# జాతకచర్య

# ఇటీవలిచర్య

(వెం॥ శా॥ జీవితచరిత్రలు)



Rs 1.

వెల రూ [redacted]/[redacted]లు

శ్రీమత్పరదేవతాయైనమః

# జాతకచర్య

(వెం॥ శా॥ జీవితచరిత్ర)




## శ్రీ
## తిరుపతి వేంకటకవి
## ప్రణీతము...

ప్రకాశకులు :

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు

వేంకటేశ్వరపబ్లికేషన్సు

కడియం P.O.

తూర్పుగోదావరిజిల్లా.

ఇది విద్వాన్

చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రి

పర్యవేక్షణలో ముద్రింపబడినది



రెండవకూర్పు

1957

వెయ్యి ప్రతులు



* ముద్రణ *

వేంకటేశ్వర ప్రింటింగ్ ప్రెస్,

ఆలమూరు

తూర్పు గోదావరి జిల్లా.

# ఉపోద్ఘాతము

## జాతకచర్య

చిరకాలముగా నాంధ్రలోక మెదురుచూచుచున్న యీ జాతక చర్యను తొలిసారి ముద్రించుభాగ్యము మా షష్టిపూర్తి కమిటీవారి కబ్బి నది. ఇప్పటికి సుమారు 35 సంవత్సరముల క్రితము, అనగా శ్రీకందుకూరి వీరేశలింగంపంతులుగారి స్వీయచరిత్రరచనమున కించుక పూర్వమే, యీ గ్రంథరచన మారంభింపబడినను ఉత్తరార్ధరచనము మాత్రము మొన్నమొన్ననే జరిగినది. తలవనితలంపుగా నీ గ్రంథమును శ్రీరావు గంగాధరరామారావు బహద్దరు వారికిఁ గృతివెట్టుటయు తటస్థించినది. ఆయీ సందర్భములను రచనాకాలమునుగూడ గ్రంథమే తెల్పగలదు.

తెలుగులో ఆత్మచరిత్రమును రచించుటకు శ్రీవేంకటశాస్త్రులవారే ప్రథములని చెప్పవలయును. అంతియేకాక, ఇట్టి స్వీయచరిత్రములు ప్రచు రముగానున్న ఆంగ్లాది భాషలలోగూడ నవి గద్యమయములుగా నున్నవే కాని, దీనివలె పద్యకావ్యములుకావు. స్వవృత్తాంతగోపనము విధించు ప్రాచీ నార్య సాంప్రదాయమునకు చెందినవారయ్యు శ్రీశాస్త్రులవారు ఇట్టి కృతికి దారివెట్టుట వారి యుపజ్ఞకు స్వతంత్రతకు మఱియొక నిదర్శనమగు చున్నది.

అట్లయ్యు, స్వకథాప్రకటనముచే వచ్చుదోషము తమ్ముఁ ఘటింప కుండుటకు గాఁబోలు శ్రీశాస్త్రులవారు "ఎవరో వ్రాసినరీతిని స్వవిషయము జాతకపు మిషచే వ్రాసిరి.

రాజసభలలో, పండితసదస్సులలో మున్ను తామొనర్చిన ప్రతిజ్ఞా దికముల విషయమెటులున్నను, ఈగ్రంథమున మాత్రము సాధ్యమైనంత వట్టు స్వోత్కర్షోద్ఘాటనము పరిహరించుచునే రచనము కొనసా గించినట్లు కన్పట్టును. ఆకారణముననే మిక్కిలి రసవంతములగు పట్టు

లందుగూడ కవితావేశపరవశులుగాక తటస్థభావయుతులై తేల్చివైచుచు వచ్చిరి.

శ్రీశాస్త్రులవారు మొనమొన్న కాశీయాత్రయను పేరుతో కృష్ణాపత్రిక యందు ప్రచురించిన గ్రంథమును పరిశీలించినచో నీగ్రంథమెంత సంగ్రహముగా వ్రాయబడినదో తెల్లము కాగలదు. గ్రంథమంతయు నంతవిపులముగా గద్యమయముగ రచించినచో వారి తరమునందలి ఆంధ్రవాఙ్మయమును గూర్చియు ఆంధ్రదేశమందలి మతసాంఘికాచారాదులను గూర్చియు అనేక విషయములను తెలుపు చక్కని చరిత్ర గ్రంథమయ్యెడిది. అట్లు వ్రాసినచో "నీకథా విధమెల్లన్ ప్రోవులు ప్రోవులు గాగన్ దైవారి, బండ్లపై తోలవలసి వచ్చెడి" దని శ్రీ శాస్త్రిలవారు గ్రంథమునందే చెప్పిరి. కావున "నేవిషయము సంగ్రహముగనే వ్రాయంబడియె నిందు" అనిరి. అందును ఉత్తరార్థ మిటీవల రచించిన దగుటచే గాబోలు మిక్కిలి సంగ్రహింపబడినది.

గ్రంథమిట్లు సంగ్రహింపబడుటకు మఱియొక కారణమును గద్దు. శ్రీశాస్త్రిలవా రీ చరిత్రమును "జాతకపుమిషతో" గదా వ్రాయబూనిరి. జ్యోతిషమందు వారికిగల శ్రద్ధాభక్తులును, జాతకభాగమందుగల గట్టి నమ్మకమును దమ్మీ గ్రంథరచనమునకు బ్రేరేచినవని గ్రంథమున వారు సెలవిచ్చియున్నారు. కావున ఆయాగ్రహములు వానివానిదశలయం దిచ్చిన ఫలములను సూత్రప్రాయముగా బేర్కొనుటమాత్రమే యుచిత మగును గాన గ్రంథమును బెంచుటకు వలనుపడదయ్యెను. ఈదృష్టితో జూచినచో నిది ఫలజ్యోతిషముపై చక్కని వ్యాఖ్యాన గ్రంథమగును.

వర్తమానకవులలో,పండితులలో నెవరిచరిత్రమునుగూడ శ్రీవేంకట శాస్త్రిలవారి చరిత్రమంత సువిదితముగాదు. శాస్త్రులవారు విద్యాశూరులు సత్యప్రియులు, నిరంకుశులుగావున వారెందఱెందఱనో శత్రువులను సంపాదించుకొని యుండిరి. అట్టిశత్రువుల బారినుండి తమయశో నైర్మల్యమును రక్షించుకొనుటకు వారు భగీరథయత్నములు చేయవలసిన

వారైరి. వారి ప్రౌఢనిర్భర వయస్సంతయు నాప్రయత్నమునందే గడచి పోయినది. గుంటూరుసీమ, గీరతము మున్నగు సద్గ్రంధములు నిజ యశోరక్షణమునకేగదా వారు రచించినది. కావున నీ జాతకచర్యాగ్రంధ మెంత సంగ్రహముగానున్నను వారి చరిత్రమునందలి ఏయంశమును గూర్చికూడ భావికాలపువారు సంశయమొందవలసిన పనిలేదు. పరిశో ధించు నోపికయుండవలయునుగాని ప్రతియంశమును గూర్చి సంశయ నివృత్తిచేసికొనుటకు వలసిన సాధన సామగ్రియంతయు శ్రీశాస్త్రిలవారే తమ గ్రంధముల యందు సమకూర్చియుంచిరి.

కావుననే యిది సూత్ర గ్రంథమనియు, వానికి "వృత్తిందెలియగ గోరువారు సందర్శనాది గ్రంధములచే సందేహనివృత్తి జేసికొనవచ్చు" ననియు వారీ గ్రంథమున చెప్పిరి. కావున రాజసందర్శనము, శతావధాన సారము, కలగూరగంప, గీరతము, గుంటూరుసీమ, వేమవరశతావధాన పీఠిక, ఆరోగ్యకామేశ్వరి, కామేశ్వరి, ఆరోగ్యభాస్కరము, మృత్యుం జయము మున్నగు గ్రంధములన్నియు దీనికి వార్తికములే యగును.

అదియునుగాక, ''పుక్కిటిపురాణ కల్పనములొనర్చువారు గాక యెల్లెడలను వాస్తవప్రచారము వచించు శిష్యులు సారమతులుగలరు, వారలు సందర్భములు వచింతురు'' అని కూడ శ్రీశాస్త్రిలవారు ఆసించిరి.

నిజచరిత్రమును, యశమును రక్షించుకొనుటకు వారింతగా బ్రయ త్నించినను, వారిజీవితకాలమునందే కొన్నికొన్ని చరిత్రాంశములయెడ వారి శిష్యులలో ముఖ్యులగువారే పొరబడుట తటస్థించుచున్నది. శ్రీవేంకట శాస్త్రిలవారి షష్టిపూర్త్యుత్సవాభినందన వ్యాసమున శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారు శ్రీవేంకటశాస్త్రిగా రెచటనో నాడీ గ్రంధమున ఫలము చెప్పించి కొనిరని యొక వృత్తాంతము వ్రాసిరి. ఇది యంత ముఖ్యవిషయము కాకున్నను, శ్రీశాస్త్రిలవారి జీవితకాలమునందే వారినిగుఱించి యెట్టిచిత్ర కధలు బయలుదేరుచున్నవో తెల్పుటకు శ్రీశాస్త్రిలవారు దీనినొక యుదా హరణముగ దెలుపుచు నీమధ్య నొక మిత్రునకు వ్రాసిరి.

శ్రీఅడవిశంకరరావుగారు ఈ మధ్య వేంకటశాస్త్రిగారిని గూర్చి కృష్ణాపత్రికలో ప్రచురించిన వ్యాసములో గూడ నిట్టిప్రమాదములే కలవు. అందు శాస్త్రులవారు విజయనగరములో సంగీతము నభ్యసించి రని వ్రాసిన పొరపాటునుగూర్చి శ్రీశాస్త్రులవారే "కాశీయాత్ర" లో స్పృశించిరి.

అదికాక, శంకరరావుగారు, 'వేంకటశాస్త్రిగారు శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రులవారికడ నైదుమాసములు పఠించి' రని వ్రాసిరి. బహుశః వారు గీరత ప్రథమభాగములోని 'శ్రీపాద కృష్ణమూర్తి కవీంద్రుకడ నైదు మాసముల్ శుశ్రూష చేసినాడ' అను పద్యమునుచూచి యట్లువ్రాసియుం దురు. కాని, యీ జాతకచర్యలో

'అచట శ్రీపాద వంశజుఁ డనఘమూర్తి
కృష్ణమూర్త్యాఖ్యసుకవివరేణ్యునొద్ద
మొదలిడి కుమారసంభవమునను రెండు
సర్గలు పఠించె మూఁడుమాసములలోన' అనియు

'అంత మేఘసందేశకావ్యమును మొదలువెట్టి చదువుచుండంగ విఘ్నకారణం బుదయమందె', 'గురు నింతి మృతింగనె' అనియు నుండు టచే, నచట చదివినది 3 మాసములేయని యేర్పడుచున్నది. ఈ వ్యత్యా సమును గూర్చి సందేహమును దీర్చుకొనగోరి, శ్రీవేంకటశాస్త్రులవారికి వ్రాయగా వారిట్లు సమాధానమిచ్చిరి.

"........అచట మూడు లేక నాల్గు అనియుండుట యుక్తము. వారి (శ్రీకృష్ణమూర్తిశాస్త్రులవారి) గ్రామము ప్రవేశించిన మాసము జ్యేష్ఠము. అచటనుండి యింటికి వచ్చినది కార్తికము, జ్యేష్ఠములో వారి తండ్రిగారు యజ్ఞముచేసిరి. అనంతరముగాని విద్యారంభము కాలేదు. ఈలోగా వారి తోబుట్టువుకు సన్నిపాతజ్వరపు చిక్కు సుమారు నెల రోజులు, వరదవలన పూర్తిగా గ్రామము మునిగిపోవుటవలన సాగక పోవుట కొన్నాళ్ళు, అంతలో శ్రీవారిభార్య స్వర్గస్థురాలగుట, ఇవి

యన్నియు విఘ్నములే. ఆ పిమ్మట నాకు జ్వరము, పథ్యముపుచ్చు కొని స్వగ్రామమువచ్చుటే. కాన అయిదు అని ఆయన (శంకరరావు గారు) వ్రాయుటకు, నేనే ఆ పొత్తములో (గిరతము ప్రథమభాగం) వ్రాసినది చూచివ్రాసినయెడల, అక్కడ నున్నరోజులని సమన్వయించు కోవలెను. చదివినకాలము మూఁడుమాసములనియు, అటనున్నకాలము యావత్తున్నూ అయిదు మాసములనియు యథాకథంచిత్తుగా సమాధానము చెప్పికోవలెను."

వెనుక కవితాపత్రికలో గూడనిట్లే వేంకటశాస్త్రిగారు కృష్ణమూర్తి శాస్త్రిగారి కడ నైషధాంతము చదివికొన్నట్లు ప్రకటింపబడినది. దానిని గూర్చి గిరతద్వితీయభాగపీఠికలో చర్చింపబడియున్నది. కావున నీగ్రంథములోని యొక్కొక్క విషయమునకిట్లే యితరగ్రంథ సాహాయ్యము నను, ఆప్తులమూలమునను వ్యాఖ్యానము చేసికొనవలసి యుండునని విన్న వించుచు నిది ముగించుచున్నాను.

ఈ గ్రంథము వేంకటశాస్త్రులవారి పృథగ్రచనమైనను, 'ఒక్కరు రచియించిరేనియును గాదగు దిర్పతివేంకటీయమై' అనువారి సమయము చొప్పున నుభయకర్తృకముగానే ప్రకటించితిమి. లేదా, ఉభయులను గూర్చికూడ నీగ్రంథమున జెప్పబడియున్నది కావున అట్లేని సమర్థించు కొనవచ్చును.

బందరు
20—9—34

కాటూరి వేంకటేశ్వరరావు,
ప్రచురణ కార్యదర్శి.

ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# జాతకచర్య

## ఆశీర్వచనము.

శా. శ్రీగోవిందపదారవిందయుగళీసేవారతున్, నిస్తుల
త్యాగభ్రాజితు నుత్తమోత్తముని, సత్సంతాను, సాంతఃపురు-
మా గంగాధరరామరాయనృపు, సమ్మాన్యార్హునిన్ వేంకట
శ్రీగోత్రేశుఁడు వేంకటేశ్వరుఁడు సుశ్రీలిచ్చి రక్షించుతన్. 1

శా. ఈ గంగాధరరామరాయ లన నెంతేమేటి పీఠీపురీ
శ్రీగంగాధరరామరాయలకు వాసిన్ గూర్చు మన్మండు వి
ద్యాగోష్ఠీప్రియుఁ డెంతలబ్ధియయినం దా వచ్చుఁ గాకేమి, స్వ
ప్రాగల్భ్యమ్మును వీఁడనేరఁ డసిధారాసువ్రతస్థాయియై. 2

ఉ. ఈనృపు డప్పుడప్డు ధవళేశ్వర మన్ పుర మేగుదెంచి యా
స్థానము ము- బితామహికిఁ దానకమైనకతమ్మునన్ సమా
ధానముఁమై నటన్ విడిది దా నొనరించుచునుండు, నెప్పుడో
యేనితనిన్ గనుంగొనఁగ నేగుటయుం గల దప్పుటప్పటన్. 3

ఉ. చూచుట తక్కువైనను నిసుంగగునప్పట నాఁటనుండి నే
నీచతురుం గణింతు మది నెక్కుడు పేర్మిమితోడ, నన్ను నీ
యాచనృపాన్వయాభరణుఁ డారయుచుండు నఖండగౌరవ
ప్రాచురిమై; నిటుల్ జరిగె వత్సరముల్ మఱి యెన్నియేనియున్. 4

చ. అఱువది దాఁటె నాకు నిటు, లాయనయున్ మఱి షష్టిపూర్తి ద
గ్గఱ కరుదెంచె, నిట్టిశుభకాలమునన్ గడియంబుదాపునం
దిరవగుచున్నయట్టి ధవళేశ్వరమం దరుదెంచి యున్న య
న్నరపతిఁ జూచువేడుక మనమ్మునయం దుదయించె నొక్కెడన్. 5

తే. గీ. రావు చిన్నరాయని కుమారకులు నేను
గలిసి దర్శనమున కేగి గడు ముదమునఁ
గొంతసే పిష్టగోష్ఠిమైఁ గూరుచుండి
యింటి కరుదెంచునప్పు డా నృపతివరుఁడు. 6

క. గురుభావము సౌహృద మం
కురింపఁ "గవిలోకనాథ ! కొండొకపరి మీ
దరిసెనము గావలయు"నని
పరమాదర ముట్టిపడఁగఁ బలికెఁ,బలికినన్. 7

క. చిత్తమని తేని యానతి
కొత్తిగిలనిపేర్మిఁ బలికి యొగి నాత్మపురం
బత్తఱిఁ జని మఱొకట భూ
భృత్తపు డిడు నాజ్ఞ జ్ఞప్తి కెలమిన్ దగులన్. 8

ఆ. వె. మరల బయలువెడలి మహిపాలు దర్శనం
బాచరించి మునుపటట్లఁ గొంత
తడవు ముచ్చటించి తగ నాజ్ఞగొనెడి య
య్యదన రామరాయఁ డాదరమున. 9

క. నూఱార్లు నేలువులుఁ గ
ర్పూరపుఁ దాంబూల మెలమి పొంపిరివోవం
గారవము మీఱ నిడి స
త్కారమ్మొనరించెఁ, బిదపఁ గడియము చనుచున్. 10

మ. అవధానం బొనరింపలేద, కవితావ్యాపారమున్ జూపలే;
దవలోకించితి దర్శనార్థ మగు భవ్యంబైన తేజంబటం;
చవలోకించిన మాత్రి నింతటి వదాన్యత్వంబు లీనాఁటి భూ
ధవులం దుండునె ! యీవితీర్ణి యభినంద్యం బెట్లు కాకుండెడిన్. 11

ఉ. ఏమి నిమిత్తమున్నదని యీయన నన్ను బహూకరించె ? ని
ట్లే మహిపాలుఁ డిచ్చుఁ ? గలి నిట్టి వదాన్యత లెందుఁజూడ, మే

సీమెయి దీనిఁ గైకొని యథేచ్ఛగఁ బోయినమాత్రఁ దీర, దీ
భూమిపు నప్పుదీర్చు పనిఁబూని యొనర్చియెతీరఁగావలెన్. 12

చ. కవినగు నే ఋణంపడితిఁ గావునఁ గావ్యపుఁ గన్యకామణిన్
జవులలరఁగా రచించి నృపసత్తము శాశ్వతుఁగా నొనర్చుటే
భవుకము, గాని యట్టి గురుభారము వార్ధకమందు మోయ నా
కవునొకొ ! కానిచో నితని యప్పెటు దీఱెడి వడ్డితోడుతన్. 13

ఉ. బొబ్బిలితేని కావ్యమును బూని రచించుటె కష్టసాధ్యమై
యబ్బె నెటో కృతార్థత; యుపాసితదైవత హేతువై; వృథా
సిబ్బితికిన్ గతంబగునొ, చెప్పఁగ నిప్పుడు పూనుకొన్నచోఁ
గబ్బము; చెప్పకున్నయెడఁ గాదుగదా ఋణముక్తి యెట్లహో ! 14

క. దీని కుపాయం బెంత ని
దానించినఁ గానఁబడ, దధమఋణభావం
బే నెటు లీఁగుదు ననుచున్
మానసమున నెంచుచున్ సుమాళమ్ము మెయిన్. 15

చ. చనునెడ నోలిమైఁ దవిలె "జాతకచర్య" యనంగనొప్పు చ
క్కని చరితాత్మకంబయిన కబ్బ మొకండు స్మృతిప్రతోళి, దీ
నిని గృతిగా నొసంగి నరనేతకు మెప్పొదఁగూర్చి కొంత యా
తని ఘనకీర్తికన్యక కుదారతగొల్పెదఁగాక పేఁకమై. 16

అ. వె. చాలవఱకువ్రాసి సంసిద్ధమొనరించి
నట్టిదగుట దీనికెట్టి శ్రమయు
నంత విస్తరించి యందఁగాఁ బనిలేద
యంచు నాత్మ నిశ్చయంబొనర్చి 17

క. మఱల మఱునాఁడు చని యా
దొర దర్శనమాచరించి తోఁచిన విషయం
బఱిముఱిఁ బద్యమ్ములతో
నెఱిఁగించితి వాని నిచట నిఱికింతుఁ దగన్. 18

ఉ. శ్రీకర! రామరాయనృపశేఖర! చేతికి నెమ్మిలేని బల్
వీఁక యెలర్ప నిన్న నవలీలగ నన్ను బహూకరించు నీ
ఢాకకు నే ఋణంపడి కడంగితి, నేమని లోన నెంచెదో?
నీకుఁ గృతిన్ ఘటింప మది నేఁ దలపెట్టితిఁ జిత్తశుద్ధిగన్. 19

చ. ముసలితనమ్మునందు ముదమున్ గొలుపంగల సత్కవిత్వమున్
వెస ఘటియించి నాకొసఁగ వీలగునే యని కొంకె దేమొ? మున్
కసిగల నాళ్ళలోన నొక కబ్బము చెప్పియె డాఁచినాఁడ, బల్
రసయుతమంచు దానిని గరంబును మెత్తురు సత్కవీశ్వరుల్. 20

ఉ. జ్యోతిషమందు నాకెపుడు శ్రద్ధయు భక్తియు నెందు, దానిలో
జాతకభాగమందున నెసంగెడి నెక్కుడు నమ్మకమ్ము; నా
జాతకచక్రముంగుఱిచి చర్చయొనర్చి లిఖించి యుంచితిన్
"జాతకచర్య" నానలరుచక్కని కబ్బమొకండు భూవరా! 21

క. అది వ్రాయునపుడు గానీ
పదపడి వేఱొకటఁగాని, పార్థివ! కృతివె
ట్టుదమని నే ననుకోలే
దిది నిక్కమొ కాదొ, నీదు హృదయమె యెఱుఁగున్. 22

క. మును శ్రీవణానందము నిటు
పొనరింపఁగ దాని నొక్కపుడు భూవర! నీ
జనకుఁ గొనుతేని మంతిరి
తనయుఁడు కృతిగొనియె నిదియుఁ దగ నట్టిదియే. 23

ఉ. నిన్నను నీదు సత్కృతిని నేఁగొని యేగుచుఁ ద్రోవలోన "ని
ట్లున్నతి గొన్నదాత సుకులోద్భవుఁ డూరక యుండరాద, పే
రెన్నిక గన్న సత్కవిత కేడ్గడ యై చిరకీర్తిగాంచి బల్
వన్నెకు నెక్కుటన్న నది పండితసమ్మత మెన్నిభంగులన్." 24

క. అని యాపోత్తము నీకున్
వినిచి భవత్సమ్మతి కది వీసంబేనిన్

గౌనముగలదిగాఁ దోఁచిన
ననుకొన్న యటుల్ పొనర్తునని యెంచి యిటుల్. 25

క. చనుదెంచితి నృపవర! పిలు
వని పేరంటమ్ముగాఁగ, వనిత తనంతన్
జనుదెంచినట్టు లెంచెదొ?
నన్నృతము లే దిం దటంచు ననుమతి నిడెదో? 26

క. ఇందెన్ని యేని విషయము
లందందు నిమిడ్చినార, మాబాల్యము మే
మెందెందుఁ దిరిగితిమొ త
త్సందర్భము లెల్ల దీనఁ దనరు నృపాలా! 27

తే. గీ. రాజుల చరిత్రలును గవిరాజచరిత
ములును గ్రంథమ్ములకు వన్నె గలుగఁజేయు
నందులో నామనమ్మున కరసిచూడ,
గవుల కతలకు రాజుల కతలు లొచ్చు. 28

వ. అని నొడువుటయు నారావు వంశపావనుండు.

క. అవ్యాజమ్మగు పేర్మిని
గావ్యము నాకొసఁగి నన్నఖండజయశ్రీ
సేవ్యునిగఁ జేయు మీదగు
సువ్యక్తాదృతి కొనర్తు జోహారెలమిన్. 30

ఉ. ఎందుకు మీకుఁ బుట్టినదొ! యీదృశమౌ జతనంబు సత్కవి
త్వేందిర తా స్వయంవరమునే పొనరించెడి పట్లఁ గాదనం
గం దరమే? కవీంద్రి! విధిగాఁ గృతిగైకొన సమ్మతించితిన్;
విందు నొకింత విన్చి తగ విందొనరింపుఁడు తత్కథాంశముల్. 31

ఉ. నావుడు నేను గాశికిఁ జనన్ జతనంబొనరించి యేగుచోఁ
ద్రోవను దారసించు గుణదోషములన్ బయినేగలేక యెం
తేవడి వెన్కకున్ మరలి దేశము త్రోవనుబట్టి వచ్చు నా
యావిషయమ్ములన్ వినిచినంతట తఁడు పరిహర్షమందుచున్. 32

క. "ఎపుడేగినారు కాశికిఁ
జెపుఁడా" యన దానిఁగూర్చి చెప్పినభాగం
బపుడు వినిపించి పదపడి
నృపునానతి నింటి కెలమి నేగి కడంకన్. 33

తే. గీ. మంచి సుముహూర్తమున నృపమణికి నాశి
షంబుగాఁ బద్య మొక్కండు సలిపియుంచు
నంత జేఁడంపె వంశవృత్తాంత మదియుఁ
గవుల యాచారమగుట నిక్కడ లిఖింతు. 34

—: కృ తి ప తి వం శ ము :—

క. సిరికి నిదానము వేంకట
గిరి సంస్థానమ్ము దానికీర్తి నెఱుఁగన
ట్టిరు లేరు గాన నిట వి
స్తరింపఁ బనిలేద, దానఁ దనరు నృపులలో. 35

క. ఇరువదియేడవ పురుషుఁడు
పరఁగు సిరిఁ గుమారయాచపమహీపతి, యా
నరపతికిఁ గుమారకుఁ లే
డ్గురు గల్గిరి వైరివీరకుంభిమృగేంద్రుల్. 36

క. అందొక్కఁడు బొబ్బిలిరా
జ్యేందిరకున్ దత్తుఁడయ్యె, నితరుఁడు జటప్రో
లిందిరకు దత్తుఁడై కీ
ర్తిం దెసలవి తెల్లవాఱ దీపించెఁ గడున్. 37

తే. గీ. ఇందు రెండవసుతు రామకృష్ణయాచ
బహదరును బీఠికాపురీప్రభువు మేటి
రావుకులుఁడు గంగాధరరామరావు
దత్తుఁగాఁ గొనెఁ దనకు సంతతియు లేమి. 38

క. ఇతఁడేడ్గురు తల్లులకున్
సుతుఁడయి వర్ధిల్లె మిగుల శూరతయు, గుణో

న్నతియు మతిమత్తయును, ను
ద్ధతమయి యెడతెగని పట్టుదలయుం గలఁడై. 39

క. వేంకటసూర్యమహీప
త్యంకితముగ మొదటి నామ మలరించియు యా
చాంకితమున్ దొలఁగించె శు
భాంకుఁడు దత్తుఁగొను తండ్రి యమ్మహిపతికిన్. 40

సీ. నారయప్పారాయనరవరేణ్యుఁడు మొద
లేడ్గురు సోదరు లేసతీమ
ణికి నలరారుదు రకలంకచరితుండు
నూజివీడ్రాజ్యంబుతేజ మెసఁగ
నేకాతపత్రిసుశ్రీకత నెవఁడేలె
నట్టి శ్రీ శోభనాద్ర్యప్పరాయ
నృపమణిపుత్రికనిచ్చి పెండిలిచేసి
రీదత్తునకుఁ బృథివీశ్వరునకు

తే. గీ. నాపె శ్రీరంగమాంబిక యలఘుచరిత
మఱియు నీజంపతులకు నేగురు కుమార
కులుఁ గొమిరె లిర్వురును నోలిఁ గలిగి రన్వ
యంపు నభివృద్ధికిని మూలమగుచు నెలమి. 41

శా. శ్రీ గంగాధరరామరాయ నృపుఁడే జ్యేష్ఠుండు సోదర్యులం,
దీఁగిన్ మేటి, గుణాలవాల మగు నా యీతేనికిన్నూజివీ
ట్ప్రీగేయంబగు తేలప్రోల్నృపుఁడు శ్రీ సింహాద్రిరాట్పుత్రికన్
శ్రీ గౌరీసమ రంగయాంబ నిడి పెండ్లిన్జేసి రుచ్చైర్గతిన్. 42

ఉ. వేంకటరంగయాంబిక వివేకధురీణ దయాలవాల ని
ష్పంకచరిత్ర దీనజనపాలనసువ్రత యప్పరాయనా
మాంకసువంశజాత పతియం దధికంబగు భక్తిపెంపుమై;
నింకిటువంటి సాధ్వి యెటనేనియు లేదని చెప్పనొప్పెడున్. 43

మ. కొడుకుల్ మూగురుఁ గూఁతు లిర్వురును నేగుర్ గల్గిరీజంటకున్
గడుయోగ్యుల్ గుణవర్ణనీయులు కలాగంభీరు లార్తావనుల్
పెడమార్గంబులఁ గాలువెట్టనిఘనుల్ ధీదూరు లత్యుత్తముల్
సడికిన్ జంకెడి శీలమొప్పెడి ధరేశానుల్ యశఃకాముకుల్. 44

సీ. సొరిదిమై వేంకటసూర్యమహీపతి
రామకృష్ణారాయభూమినాథుఁ
డీమూగురకుఁ బెద్ద, యీయన హైకోర్టు
నం "దడ్వకేటు" నిష్పందబుద్ధి
శాలి, యీనృపునకు శనివారపుంబేట
ప్రభువు నారయ్యప్పరావు కూఁతుఁ
బార్థసారథిమహాప్రాయని మనుమరా
లైన శ్రీ రాజ్యలక్ష్మాంబ నిచ్చి
తే. గీ. పెండ్లిచేసి రిప్పటికి నీపెకుఁ గుమార్త
గలిగె శ్రీలలితాదేవి సలలితముగ
నాత్మనామధేయముగల యల భవాని
కరుణ నీపె వర్ధిల్లుతఁ గడుసుఖముగ. 45

క. స్తుతమతి "బారిష్టరు" వి
శ్రుతసుగుణుఁడు, మేనమామ తెలప్రోలుమహీ
పతి యల్లుఁడు వెంకటమహి
పతి శ్రీ సింహాద్రిరావుబహదరు ప్రబలున్. 46

తే. గీ. ఇతఁడు రెండవ కొమరుండు, సతులమేలు
బంతి విజయలక్ష్మమ యీ నృపాలుభార్య;
అలరు నీజంపతులకు మోహనబహదరు
పేరి కొమరుం డితఁడు వృద్ధిఁ బెరయుఁగాక. 47

క. వేంకటమహిపతి నీలా
ద్ర్యంకుఁడు మూఁడవకుమారుఁ డల బీ. యే. యం

దింకఁ గృతార్థుండయ్యెడి
శంకరుఁ డీనృపసుతునకు శంకరుఁ డగుతన్. 48

క. ముత్తాతభార్య తన శ్రీ
మత్తన్ శ్రీసుబ్బయాంబ మహిళామణి స్వా
యత్తంబొనర్చె నీ భూ
భృత్తగు మునిమన్మనికి గరీయఃప్రీతిన్. 49

ఆ. వె. కొమిరెలందుఁ బెద్దకొమిరె శ్రీరాజ్యల
క్ష్మంబ యీపెఁ దిరురి కధిపతియయి
యెసఁగు నల్ల రాధకృష్ణరాయనికి వె
ల్లంకికులున కిడిరి లక్షణముగ. 50

క. వెంకటరమణయ్యాంబ య
లంకారీభూతసుగుణ లలితశ్రీలన్
బొంకమలరు నీయమ ని
ష్పంకచరిత తనరు రెండవ కుమారికయై. 51

సీ. శనివారపుంబేట సంస్థానపతి పార్థ
సారథియప్పరాడ్బహదరునకు
మూఁడవమనుమఁడౌవాఁడు నృసింహాప్ప
రాయని కిచ్చి యీరమణయాంబ
నకలంకగతి వివాహమ్మొనర్చిరి; యీమె
కొక కుమారిత యిప్పటికిజనించె
దోసతోఁటయుఁబోలె భాసిల్లునిట్టి మేల్
సత్కుటుంబమునకు స్వామియైన

తే. గీ. రావుకులుఁడు గంగాధరరామరావు
నకుఁ గృతీశ్వరునకు మహోన్నతియు జయము
నాయురారోగ్యములు గల్గు నట్లు సతము
దేవుఁ బ్రార్థింతు;నింకఁ గృతి వినిపింతు. 52

ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# జాతకచర్య

## పూర్వార్థము

శ్లో॥ శుభమస్త్వవిఘ్నమస్తు శ్రీరస్తు చిరాయురస్తు విజయోఽస్తు
అస్తు ధనధాన్యపుత్రశ్రేయోవిద్యాయశోంగనాసిద్ధిః॥ 1

క. మంగళపరంపరావ
త్ప్రాంగణ! విద్యావదాత్మభవతోషితహృ
ద్భృంగ! జయలక్ష్మిసంగత!
గంగాధరరామరాయ! కవిజనగేయా! 2

చ. సిరిఁదగు చెళ్ళపిళ్ళకులసింధువునం దుదయించె వేంకటే
శ్వరుఁ డల కామయార్యునకుఁ జంద్రమకున్ జిరకాలమేగ న
బ్బురపుఁ గుమారుఁడై యతని పుట్టినవేళను బట్టి దైవవి
ద్వరుఁడు *ద్విభాషివెంకన ముదంబున వ్రాసెను జన్మపత్రికన్. 3

చ. గురుకుజశుక్రరాహువులు గూడి తగన్ జననంపు రాశియై
పరఁగెడి యుగ్మలగ్నమున భానుఁడు కర్కటకమ్మునందు, శీ
తరుచిసుతుండు సింహమున, ధామనిధిప్రభవుండు వృశ్చికో
దరమునఁ, జంద్రకేతువులు దాము ధనుస్సున నుండి రయ్యెడన్.

---

* ద్విభాషి వెంకన్నగారు వ్రాసిన జాతకములోని ముఖ్యాంశములు.

స్వస్తిశ్రీ ప్రమోదూతనామ సం॥ శ్రావణ శు ౧౨ (ద్వాదశి) సోమవారము రాత్రి గ ౨౫-౨౭. విగడియల వేళ పూర్వాషాఢా నక్షత్ర మిధునలగ్నమున జననము – మిధునలగ్నభుక్తి ౩-౪౫ శేషము. ౧-౩౦ బుజ్యోద్యంతము ౫౬-౫౦, పాదప్రమాణము ౧౪-౨౬, చతుర్థ చరణ శేషము ౧౪-౨౧, హోర చంద్రునిది. ద్రేక్కాణాధిపతి బుధుడు.

జననకాల శుక్రమహాదశలో శన్యంతరములో గర్భభుక్తిగాక శేషించిన ౧౧ మాసముల ౧౬ రోజులకును ఫలము.

—• ప్రజోత్పత్తి సం॥ ఆషాఢ బ ౧౩ వఱకును •—

క. జననంబందుట యల శు
క్రునిలో శన్యంతరమునఁ గొంచెము దేహ
మ్మున కార్తి గూర్చినను దా
శని సౌఖ్యప్రదుఁడనన్ వెసన్ వర్తించెన్. 4

ప్రజోత్పత్తి సం॥ అషాఢ బ ౧౩ మొ॥ భావ సం॥ వైశాఖ బ ౧౩ వరకు

—• బుధాంతరము •—

క. శని యంతర మిటు లేఁగ బు
ధుని యంతర మెసఁగె నీ బుధుండొకభంగిన్
జనుచు శరీరమ్మున కా
ర్తిని గూర్చెన్ దద్విధమ్ము దెలియంబఱతున్ 5

క. తమ యూరగు కడియపు గ్రా
మముదాపున నాలమూర్ సమాఖ్యను దగు గ్రా
మమునన్ మాతామహగే
హమునన్ ఘటియించె నార్తి యటఁ బెండిలిలో. 6

---

నవాంశాధిపతి కుజుడు. ద్వాదశాంశాధిపతిశని త్రింశాంశాధిపతి బుధుడు – పేరు వెంకన్న – (చిన్నతనములో, తలిదండ్రులు వాడినపేరు వెంకటాచలము. పిదప గురువుగారు బ్రహ్మయ్య శాస్త్రులవారు వాడిన పేరు వేంకటశాస్త్రి– తిరుపతిశాస్త్రియును, ఇతఁడును కలిసిన పిమ్మట పేరు వేంకటేశ్వరుడు అని మాత్రమే) దేహస్థానమునకు అధిపతియైన బుధుఁడు అష్టమమునకు అష్టమమైన తృతీయమందు, అనఁగా నొక ఆయుస్థానమున నుండుటవలనను, గురు శుక్రులు లగ్నమం దుండుటవలనను, ఆయుఃకారకుఁడైన శని షష్ఠస్థితుఁడగుటవలనను, లగ్నము ద్విస్వభావమగుట వలనను, ఆయుస్థానాధిపతి అనఁగా శని స్థిరలగ్నమందుండుట

ఉ. ఆ పొరుగూరియందు శిశువార్తని గూరcగc దల్లి దండ్రి లెం
తోపరితాపమంది తమ తొల్లిటి యూరికినేగ నెంచి 'యీ
యాపదc బాపుcవాడు పరమాత్ముcడు గాక మఱెవ్వ'c డంచు లో
నా పురుషున్ భజించుచు నిరాశమెయిన్ జముచుండు పట్టునన్. 7

క. ఒక కోశ వేగుపయి జా
తకమును మును వ్రాసినట్టి ధన్యుం డెంతే
నకలంకుడు వెంకన యది
స్వకీయమగు గ్రామమగుట సన్నిధిచేసెన్. 8

ఉ. చేసి "యిదేమి ? రోదనముచేసెద రీ శిశువింత మాత్రలో
మోసముసేయc, డేమన; నమోఘము మద్వచనంబు, నేc గదా!
వ్రాసితి 'షష్టి' యంచు జనిపత్రికయం దది మీ రెఱుంగరే
వ్రాసిన వ్రాcత తప్పిన దివాకరముఖ్యులు త్రోవcదప్పరే ! 9

ఉ. బందుగు లిట్టివేళ మిముc బంపిరె ! మీ రిపు డేడ కేగువా
రిందుల మద్గృహమ్మునన యీనిసిc గడ్పుcడు, తెల్లవారునం
తం దెవులర్భకుc విడుచుc, దధ్యము పాలను గ్రోలు వీనికీ
మందత మందుదోస,మిcక మందులు మాకులు వేయమానుcడీ." 10

మ. అని తా ధైర్యము చెప్పివెండియును వా రానందముంజెంద ని
ట్లను దైవజ్ఞుcడు "సంశయింప నిcకనేలా? వీcడు నిక్కమ్ముగా
దనువున్ వీడునయేని నాదగు నిశాంతమ్మందు మిమ్ముండc జే
యను నేనంతటి వెఱ్ఱినే ! యిదియు యాథార్థ్యంబు చేకూర్పదే. 11

---

వలనను, దీర్ఘాయురోగము. గుణదోషసంవాదమువలన ఆయురోగము మధ్యాధికముగా నుండును. భాగ్య రాజ్యాధిపతులకు షష్ఠాష్టకము పట్టుటచే సామాన్యయోగము.

జననకాల శుక్రమహాదశాశేషము సం ౪. నె ౧౧. రో ౧౬, జనన కాలము మొదలు యువ సం॥ ఆషాఢ బ ౧౩ వఱకును శుక్రమహాదశ. దీనిలో ఫలము. శన్యంతర్దశ కనుక దేహపీడ. యీదేహపీడ ౨ వత్సరముల

క. మును మీపూర్వుల బలెఁ దా
నసూనమగు విద్దెనంది యశముంగని శ్రీ
యుసఁ గల్గి యెల్లనృపుఁబన్
దనకై తకు వశులు గా నితఁడు వర్ధిల్లున్." 12

చ. అని యతఁడాడు వాక్యములె యర్భకుప్రాణము లంచు నెంచి య
య్యనఘుని దైవమే యనుచు నాత్మఁదలంచుచుఁ "బూర్వ మీతఁడే
మనకు సుతుండుపుట్టు నను మాట వచించిన పుణ్యుఁ, డద్ది త
ప్పెనె ? యివు డిద్ది తప్పుటకు? వేదము లార్యులపల్కులెయ్యెడన్. 13

క. ఐనను నస్మ దదృష్టం
బేనియతిన్ దనరు నట్టులే యగు" నని దై
ర్యానుగతి కొంతగని వా
రా నిశ యాతని గృహమ్మునం దుండి వెసన్. 14

చ. తెలతెల వేగువేళఁ గడు దీనములై వదనంబులొప్పన
య్యలఘునియాజ్ఞగైకొని మృతాయితుఁడౌ సుతుతోడ నూరికిం
దలఁపు లనేకభంగుల నెదంగదియన్ జనుపట్టునన్ వికా
సలలితవక్త్రుఁడై శిశువు స్తన్యముగ్రోలె నొకింతప్రీతితో. 15

ఆ. వె. అటులు పాలుద్రావి యంతకు నంతకుఁ
దేఁకువగ మెలంగ దీనవృత్తి
విడిచి యూరి కంతవిచ్చేసి రానంద
మినుమడింప వారు తనయుఁగొనుచు. 16

---

వఱకును, మఱియు శేషించినశుక్రదశకును దేహపీడలోనగు మధ్యమఫలము. పైని-వ్యయ సం॥ఆషాఢబ ౧౩ పర్యంతము రవిమహాదశ-ఈరవి తృతీయాధిపతియై వాక్థ్సానమున నుంటచే విద్యాభ్యాసమును దేహసౌఖ్యమును ఉపనయనాది సిద్ధియు, పితృమాతృసౌఖ్యమును సోదరాదిలాభమును గలుగును. ఆయీ ఫలములను అంతర్దశానుసారమున నూహించుకోఁదగును.

పైని ఖర సం॥ ఆషాఢ బ ౧౩ పర్యంతము.

—• చంద్రమహాదశ •—

ఈచంద్రునిలో గుర్వంతరములో వివాహము, భాత్రాది శుభకార్యప్రాప్తి. లోనగునవి జరుగును. పైని - విలంబి సం॥ ఆషాఢ బ ౧౩

పర్యంతము — కుజమహాదశ — ఈకుజుఁడు షష్ఠలాభాధిపతియై దేహస్థానమున నుంటచే శరీరపీడ చేసినను, ఆరోగ్యము కలుగును. కళత్రసంభోగాది సిద్ధి కలుగును.

పైని— విలంబి సం॥ ఆషాఢ బ ౧౩ మొదలు నల సం॥ ఆషాఢ బ ౧౩ వఱకును పదునెన్మిదేండ్లు.

—• రా హు మ హా ద శ •—

"రాహూచ్చై ర్మిథునం భవేత్" అను న్యాయమున రాశి చక్రమున రాజ్యాధిపతి సంబంధమువలనను, అంశచక్రమున భాగ్యాధిపతి దృష్టియుండుట వలనను మఱికొన్ని శుభసంబంధములవలనను పుత్రస్థానాధిపతి యగు శుక్రుని తోడను పుత్రకారకుఁడగు గురునితోడను కలిసియుండుట చేతను పుత్రిలాభములోనగు ఫలములు అంతర్దశానుసారము గలుగును. పితృపీడాదియోగమున్నూ కలుగును. పైని - ఆంగీరస సం॥ ఆషాఢ బ ౧౩ వఱకును సం ౧౬ టికి — గురుమహాదశ — ఈమహాదశలో అంతర్దశానుసారమున దేహాయాసము, అఱువదివత్సరములు ఆయుర్దాయము, ఆయుర్దీర్ఘ మిత్యాశీరాశాస్యతే.

శ్రీరస్తు చిరాయురస్తు ఆరోగ్యమస్తు

అపసవ్యచక్రము









క. అనుజుం డొక్కరుఁ డాపై
జనియించి గతించె;నంతఁ జనుదెంచెన్ శు
క్రునిలోఁ గేత్వంతర మిది
యనుకూలంబైన భంగి నంది చెలంగెన్. 17

(ద్వ్యభాషి వెంకన్నగారు గీర్వాణభాషలో వ్రాసిన విషయములను తెలుగులో వ్రాసితిని. ఈయన వ్రాసిన విషయములలో నే స్వల్పమోతప్ప దాఖలాగానే యున్నవని తెలియఁదగును వెం॥ శా॥ శతావధాని)

(అమరవాది వెంకటప్పయ్యగారు వ్రాసినవానిలో ముఖ్యాంశములు)

ఇటీవల సుమారు నలుబది వత్సరముల వయస్సునాఁడు, అమరవాది వెంకటప్పయ్య సిద్ధాన్తిగారు వ్రాసిన సంగతులలో ఆయుర్విషయమైన ముఖ్యాంశములు, శ్లో. అష్టమం మందసంద్రుష్టమష్టమాదష్టమం పరంఅయమాయుష్కరో యోగః పునర్దంతాన్ వదేద్బుధః॥ ఇత్యాది ప్రమాణములనుదాహరించి అఱువదిరెండు వత్సరములు వెళ్లేప్రాంతములో ముగియు గురుదశ కాదుగదా అపుడుప్రవేశించెడిశనిమహాదశకూడమారకముచేయదనియు, బుధదశ వచ్చినతోడనే అనఁగా ఎనుబదియొకటి దాఁటినపిమ్మట వచ్చుబుధునిలో బుధుఁడు మారకుఁడనియు నొక్కి వ్రాసెను. ఇప్పటికి అఱువది మూఁడవ వత్సరము ప్రవేశించుటయే కాక అందు యెనిమిది మాసములుకూడ జరుగుటచే మొదట అఱువదివత్సరములే పరమాయుర్దాయ మనియు, గురుమహాదశాచ్ఛిద్రమే మారక మనియు వ్రాసిన ద్విభాషి వెంకన్నగారి వ్రాఁత తప్పిపోయినది. రెండవ సిద్ధాంతిగారి నిర్ణయమే దాఖలాగానున్నది. కేరళరీతిని శుకనాడి రీతిని; కాలచక్రరీతిని, శుక్రకేరళరీతిని, అష్టకవర్గురీతిని, గురునాడిరీతిని బట్టి చూడఁగా ఎనుబదికి మించియే పరమాయుర్దాయమని ఘంటాపథముగావ్రాసెను. ఇంతియకాక శనిదశ విశేషరాజయోగము, సుఖము, సంతోషము ఇస్తాడు. భూలాభము, యశోవృద్ధి, పుణ్యకార్యములు చేయుట, దేవతాపూజనము, అన్నదానము, పుణ్యనదీస్నానము ఇత్యాది మంచిఫలములు శని గురునివలెనే కలిగించునని వ్రాసెను.

భావ సం॥ వైశాఖ బ ౧౩ మొదలు యువ సం॥ ఆషాఢ బ ౧౩ వఱకును

—• కే త్వం త ర ము •—

తే. గీ. పిదపఁ గేత్వంతరం బేగు వేళ నొక్క
చెలియ లుదయించి యాయువు సిరియుఁ గలిగి
యెసక మెసఁగె, నాపిమ్మట నినుఁడు దా మ
హాదశానాయకుండయి యరుగుదెంచె. 18

యువ సం॥ ఆషాఢ బ ౧౩ మొదలు వృష సం॥ ఆషాఢ బ ౧౩ వఱకును

—• ర వి మ హా ద శ •—

క. ఆరవిలో రవి దా నొక
తీరున గతియించె, శశియుఁ దెవులఘులకున్

---

ఇందు కొన్ని దాఖలాగా కనుపించుచున్నవి. తక్కినవాటిని గూర్చి ముందు దాఖలా చూచుకోవలెను. (ఈయన వ్రాసినదానిలోఁ గూడ నే స్వల్పమోతప్ప సర్వమును దాఖలాగానే యున్నది) ఒకప్పుడు శుక్ర నాడీ గ్రంథమునుబట్టి చూడఁగా అఱువది యొక్కటి వఱకును ఆయు ర్దాయము తేలినది. ఆవిషయ మిప్పుడు అఱువది నాలుగు ముగియు రోజులు గనుక తేలిపోయినను, అందువలనఁ దేలిన అనేకాంశములు దాఖలాగానున్నవి. భ్రాతృహీనః గౌరవర్ణ కళత్రవాన్ పతిభక్తిమతీభార్యా, ఏకదారవాన్, వివాహానంతరయోగః, రాజద్వారా ప్రసిద్ధిః, విదేశేఖ్యాత కీర్తిమాన్, నరవాహన యోగాఢ్యః, యావదాయుస్సుఖీ, వార్ధకే పుత్ర యోగః, లాభాధిపదశా శుభా, ఇవియన్నియు దాఖలాగానున్నవి. మఱియు నొకప్పుడు విజయనగరములో నొకనాడీగ్రంథములోఁ జూడఁగా నొకకొన్నిసందర్భములు వచ్చినవి. అందు ఆయుర్దాయము అఱువది మాత్రమే వచ్చినది. కనుక ఆవిషయము దాఖలా ఈయకున్నను, ఈసంగతులు నిదర్శనముగానున్నవి; "సత్కావ్యరచనే దక్షః భూజీవీ, రాజజీవకః. గర్వహీనః, వామనాకారః, బాల్యయౌవనయోర్భోగీ, కౌమార కాలే సంప్రాప్తే దేవక్షేత్రగతిప్రియః సూక్ష్మబుద్ధిప్రచారీ, కళాన్వితః

గూరిచి పయిసుఖమిడె నం
గారకుఁడును దేహపీడ గావించె నొగిన్. 19

క. పిదపన్ భగినీలాభం
బొదవించెను రాహు వాపె యుదయమునకుఁ బూ
ర్వదిసంబందు ఘటించెన్
జదువునకున్ మొదలువెట్టు సంరంభంబున్. 20

తే. గీ. అక్షరాభ్యాస మొనరించె నంతెకాని
వాని యంతర మేగెడి వఱకుఁ బాఠ
శాలకేగెడి బుద్ధి యొసంగఁడాయె
నంత సన్నిధిఁ జేసె గుర్వంతరంబు. 21

క. గురువు బడిలోనికిం దా
నరుగంగాఁజేసి విద్య నతిశీఘ్రముగా
జరుగంగఁజేసె శనియు న
మరగురునింబోలె విద్య మన్నించి యిడెన్. 22

తే. గీ. మఱియుఁ గామేశ్వరి యను నామముననొప్పు
చెలియలికిఁ బెండ్లియును దనకు లలి నుపన
యనమును నొనర్చెఁ; నంతట నరుగుదెంచె
బుధుఁ డితండు కలావృద్ధి పొనఁగఁ జేసె. 23

తే. గీ. పిదపఁ గేతువు నొక భంగి వెడలె; నంత
భృగువు వేఱొక చెలియల నిచ్చెఁ, విద్య

---

విద్వద్గోష్ఠీప్రియః పరమార్థజ్ఞానరూపీ, పరపాండిత్యప్రియః, ఇవి దృష్టాంతములుగా నున్నవి.

మొత్తము దీనివలనఁ దెలియఁదగిన దేమనఁగా, జాతక శాస్త్రము కేవలము కొట్టివేయఁ దగినదియును గాదు, స్వీకరింపఁ దగినదియుఁ గాదు. ఎక్కువ పరిశీలన చేయుచో నూటికి తొంబది పాళ్ళు దాఖలాయిచ్చును, అనునది సారాంశము. వెం॥ శా॥ శతావధాని

జరుగఁగాఁజేసె, ఋణము లెసంగఁ జేసెఁ,
బితృశరీరమ్మునకొకింత పీడఁ గొల్పె. 24

తే. గే. తనకు విద్యాభివృద్ధియు జనకునకు శ
రీరపీడయు దఱిలేని ఋణము గృహము
నందు దారిద్ర్యమును నివి యంతకంత
కతిశయించెను రవిదశయందు నెందు. 25

వృష సం॥ ఆషాఢ బ ౧౩ మొదలు ఖర సం॥ ఆషాఢ బ ౧౩ వఱకును

చంద్రమహాదశ

దీనిలో చిత్రభాను సం॥ వైశాఖ బ ౧౩ వఱకును

—• చంద్రాంతరము •—

తే. గీ. అంతఁ జంద్రమహాదశ యరుగెదెంచ
నందుఁ జంద్రునిలోఁ జంద్రుఁ డల్ల ఋణము
కారణమ్మగ వృత్తుల కాళ్ళుగట్టి
స్థాన విభ్రంశ మొనరించె దయయులేక. 26

తే. గీ. యానమును పట్టణమునకు నరుగు టబ్బెఁ
దండ్రికిఁ గుటుంబరక్షణ దప్పకునికి
నందుఁ దమ బంధుగుల యింటియందు నుంట
యును గలిగె నింతకును గష్టి యొందు గలదె. 27

క. తమ పూర్వులు విద్యాభూ
ధనులగుటయుఁ దనకు భైక్ష్యదశ గల్గుటయున్
మనమున నెంచుచు జనకుఁడు
దనదు కుటుంబమ్ముఁ బెంచె దారిద్ర్యదశన్. 28

తే. గీ. ఇట్లు చంద్రునిలోఁ జంద్రుఁ డేగె విద్య
కీతఁడును నంతరాయమ్ము నీయలేదు
గాని హూణభాషాభ్యాసకలనఁ జొనిపె
నంధ్రభాషకు ప్రాధాన్య మనుఘటించి. 29

చిత్రభాను సం॥ వైశాఖ బ॥ ౧౩ మొదలు మార్గశీర్ష బ॥ ౧౩ వఱకును

—• కు జాం త ర ము •—

తే. గీ. అంతఁ గుజుఁ డేగుదెంచి తా నంధ్రహూణ
భాషలు సమమ్ముగా నేర్పి పటిమ నలరె
గాని శీర్షమ్మును వ్రణానుకలితముగ నొ
నర్చెః రాహ్వంతరమ్ము మొనసెను బిదప. 30

చిత్రభాను సం॥ మార్గశీర్ష బ ౧౩ మొ॥ తారణ సం॥ జ్యేష్ఠ బ ౧౩ వఱకు

—• రా హ్వ ం త ర ము •—

తే. గీ. హూణభాషకు విఘ్నంబునొసఁగి యంధ్రి
భాష నొక్కింత ప్రాబల్యపటిమ గూర్చె
యితఁడు తనయంతరం బేగు నింతలోన
బడిచదువు పూర్ణ మొనరించి పరిఢవిల్లె. 31

తే. గీ. అంతఁ దాఁ బోవుదెంచుచు నమరమంత్రి
సముని శ్రీ కానుకుర్తి భుజంగరావుఁ
గొల్వఁగాఁజేసి శ్రీ రఘుకులజుల చరి
తమును రఘువంశమును జదువ మతి నిచ్చె. 32

క. అటు సంస్కృతభాషాలం
పటమతి నొనరించి యతఁడు పదపడి యేగెన్
ఘటకుఁడగుచు గురుఁ డంతటఁ
బటుమతి నిడి కావ్యవిద్య బాగుగ జరిపెన్. 33

తారణ సం॥ జ్యేష్ఠ బ ౧౩ మొ॥ పార్థివ సం॥ ఆశ్వయుజ బ ౧౩ వఱకు

—• గు ర్వ ం త ర ము •—

తే. గీ. మధ్యకాలమ్మునందుఁ దా మాతులమర
ణంబు ఘటియించి యాత్మదేహంబునకు వి
శేషరుజ చేసి యారోగ్యసిద్ధియు నిడి
పిదప వేదవిద్యకుఁ గూడ మదినిగొల్పె. 34

పార్థివ సం॥ ఆశ్వయుజ బ ౧౩ మొ॥ సర్వజిత్ సం॥ వైశాఖ బ ౧౩ వఱకు.

—• శన్యంతరము •—

తే. గీ. అంత శని యేగుదెంచె; వీఁ డల్లనల్లఁ
దనదు నామంబు సార్థకత్వము వహింప
విద్య జరుపుచుఁ జిల్లర విద్యలందు
మధ్యమధ్య మనమ్మను మసలఁజేసె. 35

వ. ఆ విద్య లెవ్వి యన.

క. కొంచెము గానము
మద్దెల నించుక వాయించుటయు, జయేచ్ఛ మెయిశ్రమం
బెంచక కుస్తీవట్టుట
యంచితముగఁ దిట్టుకవిత నల్లుటయు నగున్. 36

తే. గీ. తిట్టుగవనమ్మునకు ఫలస్థితిగ ఖైదు
గల్గునంతటి యిక్కట్టు గడలుకొల్పి
మాతృపీడ నొనర్చి యిమ్మందుఁ దెన్ని
యేనిదొనఁగుల నొడఁగూర్చెఁ దాను మొదల. 37

తే. గీ. అంత మూఁడవ చెలియలి నంతరింపఁ
జేసి స్వస్థానమును వీడఁజేసి పిదప
ధనలాభం బొనర్చి విచ్ఛలవిడిగను
జదువుకొనునిచ్ఛ నాశ్రమంబు వదలఁజేసె. 38

సీ. అల్లమరాజాన్వయజుఁడు సుబ్రహ్మణ్య
కవిరా జొకానొక కారణమున
సకుటుంబముగను నాత్మకటకమ్మునకు రాఁ
గని యమ్మహాభాగు కరుణ వడసి
యక్కవి తనగ్రామ మరిగెడిచో వెంట
నరిగె నింటను జెప్ప కతిరయము
మార్గమధ్యమ మ్మన మహితమౌ కాకపు
రమ్ముఁ జేరినమీఁద నమ్మహితుఁడు

తే గీ. చదువు మొదలిడనెంచియు మొదలువెట్టి
కాఁగి మెల్లన నిట్లనె నాదరమున
"నిప్పురమ్మునఁ బండితు లెందఱేని
గలరు, భుక్తియు నిచట సుఖముగ దొరకు. 39

క. వారమ్ములు దొరకవు మా
యూరను నీ కనియు నిచట నుండియె విద్యా
ధీరుఁడ వయ్యెదుగా" కని
పేరిమి నాశీర్వదించి విడిచి చనె నొగిన్. 40

తే. గీ. పదపడి యితండు తత్పురవరమున గణ
పతిసమాఖ్య నెసంగు సత్పండితవరు
కడ కరిగి నాకు విద్దియఁ గఱపుఁ డనుచు
వేఁడికొన నాతఁ డిట్లను విపులకరుణ. 41

తే. గీ. భిక్ష కుదిరినపిదప జపింపనబ్బు
నది మొదలఁ జూచికొమ్ము, నీ కవుల విద్య
గఱపెద" నటన్న నప్పురిఁ గలయఁదిరుగ
నేరు నొక వారమేనియు నీయలేద. 42

చ. కటలి యనంతరం బచొటు కాటవరంబను నొక్క పల్లె కిం
పొదవఁగ నేగ నయ్యెడల నొండు విధమ్మునఁ గాక భుక్తియున్
జదువును సంఘటించుటయు సర్వసుఖమ్మగునట్టి యచ్చొటన్
గదలక కొంతకాల మెసకమ్మున నుండెఁ గలార్జునాధృతిన్. 43

తే. గీ. అచట శ్రీపాదవంశజుఁ డనఘుమూర్తి
కృష్ణమూర్త్యాఖ్యసుకవవిరేణ్యు న్యొద్ద
మొదలిడి కుమారసంభవమునన్ రెండు
సర్గలు పఠించె మూఁడు మాసములలోన. 44

ఉ. ఆ యనఘుండు దీక్షితసమాహ్వయుఁడున్ సవయస్కుఁ డొ సహా
ధ్యాయియుఁ గూడి నూత్నకవితాభ్యసనాదరు లౌట లక్షణం

చేయెడఁ జర్చసేయునపు డీతఁడు దా నొక కొంతకొంత త
ర్చ్రియు నెఱింగె వార లది చెప్పకమున్న స్వబుద్ధిపద్ధతిన్. 45

తే. గీ. అట్టి లక్షణలేశసంప్రాప్తి కతన
మున్న యించుక కవనంబు మొనసి "యుప్పు
లేని సామెతఁ" జరియించు వీని కంత
నబ్బె నకలంక పదకవిత్వానుభవము. 46

తే. గీ. పదకవిత్వమ్ము చెప్పుట పద్యరచన
కన్న నొక కొన్నిరెట్లు సుఖమ్ముగుటను
భక్తిపూర్వకముగ దైవభజన కుపచ
రించు కీర్తనలను విరచించుచుండె. 47

తే. గీ. అట్లు రచియించి గురువుల కరయఁజేయ
వార లవి గాంచి యొక్కింత పరిహసించి
"యిప్పుడ కవిత్వ మొనరింప నెంచెదేని
చదువు చెడుఁగాన నియ్యది వదలు" మనిరి. 48

క. వదలు మనినను౯ గవనము
వదలఁగలేఁడయ్యె నితఁడు, వామాక్షీసౌ
హృదమాదియైన వ్యసనము
లిదియును నొకవిధమ యనుచు నెంతురు తజ్ఞుల్. 49

తే. గీ. గురువుఁ దత్సహపాఠియుఁ గూడి తఱచు
నాడుచుందురు చదరంగ మట్టియెడల
లక్షణం బెట్టు లట్లు తల్లక్షణంబు
నితఁడు గ్రహియించె నాదర మెసక మెసఁగ. 50

తే. గీ. అంత మేఘసందేశకావ్యమును మొదలు
పెట్టి చదువుచునుండంగ విఘ్నకార
ణం బుదయమందె, శ్రేయోవలంబనమున
కనుపదం బంతరాయమ్ము లలరుఁగాదె. 51

చ. ఎది యెటులైన నేమి, గురునింతి మృతింగనె, నాత్మదేహమం
దొదవె నొకించుకంత జ్వరయోగము; దీనను దాన నింటి కే
గెద నని పేర్మి నగ్గురునికిన్ వచియించి స్వకీయవాసమై
పొదలెడి యానమాఖ్యపురమున్ జనెఁ దల్లిని దండ్రినిం గనన్. 52

తే. గీ. ఇంటి కేతెంచినది మొదలెల్లవేళ
నొక్క చదరంగ మాడుటయును నొకింత
కవనమల్లుటయును బనిగాఁగఁ గొంత
కాలము కలాభ్యసనమున నాలసించె. 53

క. ఐనను బద్యకవిత్వం
బీనియతిం జెప్పనొప్పు, నిది తప్పిది యొ
ప్పౌనను జ్ఞానము తనకున్
దానఁబు యార్జించి కొంత తజ్జుండయ్యెన్. 54

క. తన గ్రామమ్మున నెందఱు
ఘనముగఁ జదరంగ మాడఁగలరో యవ్వా
రిని బిల్చి యాడి పంత
మ్మునఁ గట్టెన్ స్వల్పకాలమునఁ దత్పరుఁడై. 55

తే. గీ. కాజులూరను దాదాపు గ్రామ మేగి
యచటఁ గామసోమాభిఖ్యులైన బుధుల
యొద్ద నితరులయొద్దను నొక్కభంగి
మేఘసందేశకావ్య మామీఁదఁ జదివె. 56

క. ఆయూరఁ జదువుకన్నను
వేయాఱు మడుంగు లొప్పు వృద్ధిగ జనులం
దేయెడలం జదరంగము
ధీయుక్తిగ నాడు తెల్వితేటల కలుముల్. 57

మ. అడుగుం బెట్టినదాదిగా నిచట నియ్యాటన్ బ్రవర్తించు టె
ప్పుడునుం జొప్పడి, విద్యకై కొన లవమ్మైనా గాలమే లేకపో

వుడు "నొజ్జల్ పలుమంది గల్గు టిదియున్ బున్నెంబహొ" మ్మంచునొ
క్కెడ నెద్దానిఁ బఠించు నేఁ డదియె రే పెందేఁ బఠించున్ వెసన్. 58

క. చదరంగము ముఖ్యమ్ముగఁ
జదు వుపసర్జనము గాఁగ సాగించుచుఁ దన్
వదలని కవితాకన్యకు
నెద నొసఁగి తదనుభవమున నించుక మెలఁగున్. 59

తే. గీ. అట్టు లొక మూఁడుమాసము లరిగెఁగాని
మొదలిడిన పొత్త మది తుదముట్టదయ్యెఁ
గాని చదరంగమున నేర్పుఁ గవనధోర
ణియును బ్రిబలించె వ్యాసంగనియతి కతన. 60

క. కవితాధోరణి గల మన
కు విద్య యిఁక నేటి? కనుచుఁ గొండొక గర్వం
బు వహించి యింటికిన్ జనఁ
గ వచ్చె బుధుఁ డంతఁ దనదు కాల మ్మగుటన్. 61

సర్వజిత్ సం॥ వైశాఖ బ ౧౩ మొ॥ సర్వధారి సం॥ ఆశ్వయుజ బ ౧౩ వఱకు

—• బు ధా ం త ర ము •—

తే. గీ. అంత కొక్కింత పూర్వమ యనుసరించె
దక్షిణాక్షికి నించుకంత యగు వ్యాధి
దానికిఁ జికిత్సయును గవిత్వంపుఁ గృషియు
నెలమిమైఁ జేయుచును నితఁ డింట నుండి. 62

క. యానాపు వేంకటేశుని
పై నొక శతకంబు చెప్పఁ బ్రారంభింపం
గా నందుఁ గొంద ఱొప్పుల
నేనియుఁ దప్పులని పల్కి రీర్ష్యాన్వితులై. 63

తే. గీ. సంస్కృతసమాసగతమగు సంధిగుఱిచి
వా రడుగ నాంధ్రిమంచలి వ్యాకరణము

దక్క సీతఁ డెఱుఁగనికతమున దాని
కు త్తరము చెప్పనేరక యూరకుండె. 64

క. అది యొప్పని తా నెఱిఁగియు
నదు త్తరము చెప్పలేమి సభ నవమానం
బొదవినకారణమున నది
యుదయించెన్ బాణిసీయ మొప్పుగఁ జదువన్. 65

తే. గీ. ఇట్లు వ్యాకరణాధ్యయనేచ్ఛఁ గాశి
కేగ సంకల్పమును జేసి యించుకేని
ధనమును సహాయమును లేమి మనమునందు
నొక్కభంగిని యోజించుచున్నయంత. 66

క. తనయీడు బాలుఁ డొక్కఁడు
తనవలె విద్యార్థియగుచుఁ దాఁ గాశికి నే
గను నిశ్చయించికొని మం
తనమునఁ దనుఁ గాంచి "వచ్చెదవె ? నీవు" ననన్. 67

తే. గీ "వచ్చెదనుగాని చేత ద్రవ్యంబు లేమి
సంశ యించెద'' నావుడు "సంశయింప
నేల ? ద్రవ్యంబు నేఁ దెత్తు నింటనుండి
కట్టుగుడ్డలతో నీవు కదలిరమ్ము.'' 68

క. నావుడు వెడలిచనుటకై,
భావమ్మున నిశ్చయించి పదపడి "నేతత్రిం
బీవిధమున నుండఁగఁ జను
టేవిధి యుక్త'' మని యెంచి యేగకయుండెన్. 69

తే. గీ. అంత నతఁ డేగెఁ బిదప నయ్యక్షిరోగ
మపనయింపఁగ నెన్నొ యంజనములు
సంతరించిన నది యినుమంతయైనఁ
దగ్గ దది యేమి గ్రహచారవశయొ కాని. 70

తే. గీ. అంత వేఁటొక్కరుఁడు మిత్రుఁ డన్యదేశ
సంచరణశీలుఁ డత్యంతచంచలుండు
స్వకటకనివాసి "కాశికిఁ జనియుఁ జదివి
కొందమే? మన" మని తమ్ముఁగూర్చి పలికె. 71

క. అన "నక్షిరోగ మిది హె
చ్చును దగ్గును లేక యొక్కచొప్పున నుండెన్
జని చదివికొనుట యుక్తం"
బని తా మది నిశ్చయించి యతని కిటు లనున్. 72

క. "ఏనును వచ్చెద ద్రవ్యము
లేని మనము కాశి కేగలే" మనుటయు "నెం
దేనియు సంపాదింపం
గా నగు మార్గమున నంత కావలసినచో." 73

క. అన నీకొని కొండొక దిన
మున మనుబలెఁ "గాజులూరు పోయెద" నని యిం
టను జెప్పి మిత్రుఁడును వెం
టను రాఁ బయనమ్మునకుఁ గడంగి కడంకన్. 74

తే. గీ. కాజులూరి కొగిం బోయి "కన్ను కుదురు
దనుక రాఁ దీఱ" దని చెప్పి తనదు సిఖిల
వస్తువులు పుచ్చికొని యప్డు బయలువెడలి
త్రోవలో నున్న మిత్రునితోడఁ గలిసె. 75

తే. గీ. గొల్లెపూడి సత్రమ్మునకుం జని రొగి
నాఁటి మధ్యాహ్నమున భోజనం బొనర్పఁ;
గల యొక శతంబు మార్జాలములు తదన్న
భక్షణంబున మిక్కిలి బలిసి యచట. 76

క. ఆరాత్రి కాకపురి, తెల
వారుపిదపఁ బీఠపురము, పైరాతిరికిన్

జోరు లనేకులు గల రను
కీరితిగల కత్తెపూడికిం జని పిదపన్. 77

తే. గీ. అచటి కొక్కింత దూరమ యని తలంచి
యన్నవరపు సత్రమునకు నరిగి భుక్తి
సలిపి యప్పుడ శకటంబు సాయమొదవ
బయలువెడలి నిశీథసమయమునందు. 78

క. మఱునాఁ డుదయమ్మునకుఁ జ
నిరి తుని, యట భుక్తిసలిపి నీరజబంధుం
డరిగెడి కాలమ్మునకున్
సరిగాఁ జని నక్కపల్లె సత్రమ్మునకున్. 79

క. అట భుక్తిం గొని నిశ న
చ్చోటు వీడి శకటము నెక్కి సూర్యోదయమ
ప్పటి కొగి నెలమంచిలి కే
గుటయున్ గ్రహణంపుదిన మగుట నాఁ డచటన్. 80

తే. గీ. కడపి మఱునాఁటి మధ్యాహ్న కాలమునకు
నరిగి ఖాసీముకోటయం దన్నసత్ర
మందు భుజియించి వెడలి సూర్యాస్తమయము
కాకమున్న యనకపల్లెఁ గాంచి యచట. 81

తే. గీ. రాత్రిదనుక వసించి సత్రమునఁ గుడిచి
తత్క్షణమ లేచి యొకకొంత దవ్వు నడిచి
శకట మొం డెక్కి యుదయంపు సమయమునకుఁ
బాళి నేగిరి వైశాఖ పట్టణంబు. 82

తే. గీ. ఏడు నూతుల వీధిని నెసఁగు సత్ర
మందు మధ్యాహ్నభోజన మాచరించి
రకట! యేమనవచ్చు నాయన్నసుఖము
మాషసూపంబు, దుర్గంధమయము నేయి. 83

తే. గీ. అంతఁ దో నరుదెంచినయట్టి మిత్రుఁ
డిట్టులను "బైని రాఁజాల నేను, నాదు
దేహమున రుజ జనియించెఁ, దిరిగిపోయి
యాత్మదేశమ్మునన విద్య నభ్యసింతు. 84

క. కాయమ్ము గలిగెనేని యు
పాయమ్మున విద్యఁ బడయవచ్చు నది చెడం
జేయునది లే" దనుడు నితఁ
డాయన కిట్టులను వెక్కు కరుగఁగలేమిన్. 85

క. ఇలు వెడలి వచ్చితిమి యె
ట్టు లేనియున్ విద్దె గొని తటుకున స్వదేశ
స్థలకడ కరుగుట తగుఁగా
కల "పుల్లయ వేమవరమ" యగు నిటు చనినన్. 86

చ. అనవుడు నాతఁ డిట్టు లను 'నర్థమొకింతయుఁ జేత లేదు, పైఁ
జనినకొలంది సత్రములుఁ జావడులున్ మఱి లేవు భాషయున్
మనయది కాదు నే నిఁక శ్రమమ్మున కోరువఁజాల నిట్టి తిం
డివి దినుచుంటిమేనియుఁ గడిందిరుజల్ జనియింపకుండునే? 87

తే. గీ. మనకు దిక్కెవ్వ రిచట నామాట వినుము
రైలు మనదేశమున కిఁక రాఁగల వొక
కొంత కాలమ్మునకు నప్డు సంతసమున
వేగవచ్చును గాశి కొక్కింతలోన. 88

తే. గీ. అంతదనుక స్వదేశమ్మునంద చదివి
కొనఁగఁదగుఁ జెప్పఁగలిగిన గురువరేణ్యు
లెందఱేనియుఁ గాశికి వెక్కుడుగఁ గ
లారు మన మండలమున నెల్లయెడలందు. 89

తే. గీ. అని యొప్పించి యచట భో
జన మొనరిచి, మొదలనుండి సహచరుఁ డగుచున్

జనుదెంచు ముసలి కోమటిఁ
గనుఁగొని యిటు లనియెఁ గరుణ గడలుకొనంగన్. 90

చ. ''మము నల కత్తెపూడిదరి మార్గమునం గవగూడి తీవు స
త్తముఁడవు స్నేహపాత్రుఁడవు తద్దయు వృద్ధుఁడ, వేల? నీకుటుం
బము విడనాడి యిక్కరణి బాములు చెందెదు; కాశి యేడ! నీ
గమన మదేడ! చేత నొక కాసును లే కెటు లేగెదీపయిన్. 91

క. వెనుకకు ర'' మ్మన నా వృ
ద్ధను ''నే నెటులేని గాశి కరిగెదఁ, గాకు
న్నను దారిఁ బ్రాణమోచన
మొనరించెదనొండె, వెనుక కొగి రా నెపుడున్. 92

క. అన 'నీకర్మం' బని వా
నిని వదలియుఁ బ్రోలు విడిచి నెట్టన దేశ
మ్మునకుం జనుతలఁపున రయ
మున నిరువురు బయలువెడలి మొగి రాతిరికిన్. 93

క. పదునాల్గవ క్రోశమ్మునఁ
బొదలెడి ఖాసీముకోటపురి చేరిరి; యెం
త దురమ్ముగ నడిచిరో వా
రది యెఱుఁగ రొకింతయేని యాదినమందున్. 94

క. జామున్నర రాతిరికు
ద్దామగతి నచటికి నేగి తత్సత్రమునం
దానెయి శిష్టాన్నమ్మను
దాము భుజించి రటు లవుఁగదా క్షుద్బాధల్. 95

తే. గీ. అట్టు లభ్యవహారంబు నాచరించి
శకట మొం డెక్కి తెలవారు సమయమునకు
మరల నెలమంచిలికి వచ్చి దురము దనర
నట వెడలి నక్కపల్లెకు నరిగి యచట. 96

తే. గీ. ఎలమి మాధ్యాహ్నిక మొనర్చి యేగి రాత్రి
తుని ప్రవేశించి మఱునాఁడు తోయజాప్త
పొడుపునకు లేచి రయముగ నడిచి యన్న
వరము యామద్వయం బగువఱకుఁ జేరి. 97

తే. గీ. సత్రముల కెల్ల నుత్తమసత్రమైన
యచటఁ దృప్తిగ భుజియించి యంత లేచి
కత్తెపూడికి వచ్చి చక్కఁగను రాత్రి
యచటి సత్రమ్మునను భుక్తి నాచరించి. 98

తే. గీ. పొద్దుటను లేచి పీఠికాపురికిఁ బోయి
యంత స్వస్థతఁజెంది యొక్కింత యచట
విద్య చెప్పెడి యొజ్జల వెదకుటయును
వ్యాకరణమును జెప్పెడివారు లేరు. 99

క. మొకమెఱుకగలుగు వైష్ణవుఁ
డొకఁ డటఁ గన్పట్టి "విద్యనొందఁగ మీ కి
చ్ఛ కలదయేనియుఁ జామ
ర్లకోటఁ జనుఁ డచట వ్యాకరణలబ్ధి యగున్. 100

క. ప్రతివాది భయంకర వం
శతిలకుఁ, డతిశాంతమూర్తి శాబ్దికుఁ డుద్య
న్మతి రాఘవార్యుఁ డట శి
ష్యతతికిఁ బాఠములు సెప్పు నహరహ మెలమిన్." 101

చ. అనపుడు సంతసించి జలజాప్తుఁడు గ్రుంకకమున్న యప్పురిన్
జని కని మ్రొక్కి "మీపగు యశమ్ము కడున్ విని యిల్లువీడి యొ
య్యన నిట కేగుదెంచితిమి వ్యాకరణంబు పఠించునిచ్ఛ" నాఁ
గను మహనీయుఁ డవ్విబుధకాంతుఁ డొకించుక నవ్వి యిట్లనున్. 102

తే. గీ "ఏమి చదివితి రీవఱ? కెద్ది వాస?"
మనుడు "యానాము కాపుర మనఘ! యాతఁ

డాంగ్లమును నభ్యసించె; నా కది యటుండ
మేఘ సందేశమున సాము మిగులు కలదు." 103

క. అను పలుకు లచటి శిష్యులు
విని నవ్విరి; యార్యుఁ "డెట్టి విధమున మీకున్
జను వ్యాకరణము చదువఁగఁ
బనిగొనవలెఁ బంచకావ్యపఠనమ్మునకున్. 104

క. అని "నీకు నొక్కభంగిని
జను మొదలిడఁ గావ్య మనెడి శబ్ద మెఱుఁగఁ డీ
తని కెటు మొదలిడనగు నె
వ్వనికేనియు సులభమగునె? వ్యాకరణ" మనన్. 105

చ. కవిత యొకింత తెల్గునఁ దగన్ రచియింపఁగనేర్తు, మక్కవి
త్వవిధికి ముఖ్యమౌకతన వ్యాకరణమ్మది మాకుఁగావలెన్
దవిలి పఠింతు మెట్లయినఁ దత్పరులై కరుణావిశేషవై
భవమున శబ్దశాస్త్రమును బాఠము చెప్పుఁ డనంగ నాతఁడున్. 106

తే. గీ. కావ్యపాఠమ్ముతోడ వ్యాకరణపాఠ
మును గలిపి చెప్పికొనుఁడు, రేపు మొదలిడెద;
భుక్తి కీయూరఁ గష్టము, పోయి దానిఁ
జూచికొం" డన, "సెల" వనిలేచి యచొటు. 107

తే. గీ. విడిచి యిల్లిలు గ్రుమ్మరి విసివి యొకట
నాఁటిరాతిరి దిని మఱునాఁడు పాఠ
మును మొదలుపెట్టి బసకేగి మనకు నిచట
భుక్తి ప్రతిదినమును నెట్లు పొసఁగునొక్కొ? 108

తే. గీ. అనుచు నాలోచనమొనర్చు నవసరమున
నింటి బ్రాహ్మణుఁ డిట్లను 'వింత యేల?
వారములు మీకు నీయూర వఱలు టరుదు
గాన మాధుకరమునకుఁ గడఁగు టొప్పు. 109

తే. గీ. ఇంచుమించుగ నొకశత మిచట విప్ర
గృహము లున్నవి, చక్కని వృత్తి యిదియ
చదువుకొనువారలకు; బ్రహ్మచారులైన
మీకు నిది యెట్లు తప్పగు మేలుగాక. 110

క. మాయింటనె వసియింపుడు
నేయియు మజ్జిగయు నెపుడు నే నిప్పింతున్
సాయంకాలముఁ బవలును
బాయక చదివికొని బాగుపడుఁ డణఁకువమై. 111

క. అన నిప్పని యేవిధమున
నొనరింతు నటంచు నీతఁ డొక్కింత మన
మ్మునఁ దలపోయుచునుండం
గను మిత్రుండిట్లు పల్కెఁ గార్యము పొసఁగన్. 112

క. "చదువేని మానుకోవలె
నిదియే నొనరింపవలయు నిఁక నియ్యెడ వే
ఱొదవ దుపాయము నీవిటు
లెద నింతగఁ జింతసేయు టేమిటికి సఖా! 113

ఆ. వె. ఏన మాధుకరము నెత్తుచు నొకకొన్ని
నాళ్ళు నీకు నాకు నడుపువాఁడ
విపర మెఱిఁగి పిదప "భవతి భిక్షాం దేహి"
యనుచు బయలుదేరు మదియుమొదలు." 114

క. అన "నభిమానమ్మునఁ గా
దనఘా యెటు జోలెఁ గట్టనగునో? యెటు ప
ట్టనగునొ? యను సంశయమున
మన మప్రతిపత్తివార్ధిమగ్నంబయ్యెన్. 115

ఆ. వె. మార్గదర్శివగుచు మన్నించెదేని నే
నవులఁ జేయనేర్తు" ననుడు నతఁడు

జోలెగట్టి చంకఁ జొనిపి "భిక్షాం దేహి"
యనుచు బయలువెడలె నమలుఁ డగుచు. 116

చ. పొలుపగు నీరుకావిగల పుట్టము గట్టి విభూతిఁ బూసి యా
వలిమలయల్లుఁడో ! యనెడి భ్రాంతి గనుంగొనువారి కబ్బ ని
ల్లిలుఁ జనుచుండె నాతఁ, డితఁ డించుక దవ్వున వక్త్రమందు న
వ్వొలయఁగఁజూచుచుం జనె"నహో! యితఁడెన్నఁడునేర్చె"నంచొగిన్.

ఉ. చిన్నతనమ్మునుండి కడుఁ జిన్నెలు వన్నె లెసంగ భోగపుం
గన్నెల యిండ్ల కేగుటయు గారముగా గృహసీమ నుంటయున్
మున్నరకంపుఁ జెయ్వులకు ముందఱికా లగుచుంటయుం గదా,
యెన్నఁడు వీఁ డొనర్చుపను; లిప్పని యెప్పుడు నేర్చియుంచెనో ! 118

క. అని దేశాటనమొనరుచు
జనునకు సకలకృతులందుఁ జాతురిదగు వీఁ
డెనిమిదవ యేఁడు మొద లె
ప్పనియో మిషవెట్టి చేయుఁ బరవాసంబున్. 119

ఆ. వె. దాన వీని కింత ధైర్యంబు గలిగె నం
చాత్మ సంతసించి యతనివెంట
కొంతదనుక నేగి కొండొక యారీతి
దెలిసి మున్న బసకుఁ దిరిగి వచ్చె. 120

క. ఒకపొర నన్నము మఱియుం
గొకపొర సూపంబు నింక నొకపొరఁ గూరల్
చికిబికి గా కొప్పెడి జో
లె కరమ్మునఁ దాల్చి నెచ్చెలియు వచ్చె నొగిన్. 121

ఆ. వె. వచ్చుటయును నింటివార లన్నాదిక
ముంచికొనఁగఁ దగిన మంచిచోటు
చూప నిరువు రచట సొంపుగ భుజియించి
వేడ్కమీఱ నొకట విశ్రమించి. 122

తే. గీ. పరికృతచర్యకు నక్కజంపడుచుఁ బట్ట
రాని నగవున బాష్పసాంద్రదృశు లగుచుఁ
గొంతవడి గడ్పుచున్నంత మంతనమున
నాతఁ డీతని కిట్లను నాస్థ యెసఁగ. 123

క. చిఱుదిండి నీకు నాకును
దఱచుగ నభ్యాస మది యొదవు టెట్లిట ? నొ
క్కఱకానైనను మనయెడ
నరయంగా లేద, రిక్తుఁ డధముఁడ యెందున్. 124

ఆ. వె. కాకినాఁడయందుఁ గలదు మాతోఁబుట్టు
వచటి కరిగి నించుకంత ద్రవ్య
మెట్టులేని దెత్తు నిప్పుడ వెడలి రే
పుదయమునకు వత్తు నుండు మిచట. 125

క. అని చెప్పి మిత్రుఁ డరుగుట
యును దానొక్కరుఁడ యచట నుండెఁ బిదప న
య్యనఘుఁడు మఱునటి యుదయ
మ్మునకున్ రాఁడయ్యె నెంత మోసమొ యకటా ! 126

తే. గీ. మాధుకరవేళవఱకును మాటిమాటి
కతనిరాక నిరీక్షించి యంత జోలె
గట్టికొని ద్విజగృహములు గలయఁదిరిగెఁ;
దనకుఁ దాఁగాక తగునె యితరుల యాశ ? 127

తే. గీ. అట్లు మాధుకరవృత్తి నాశ్రయించి
తనకు వేఱొక్కరుఁడు సహాధ్యాయి గాఁగఁ
జదివె నొక మూఁడుమాసముల్ శ్రద్ధ గలిగి
భారవియు లఘుకౌముది పాఠములుగ. 128

తే. గీ. మాధుకరవృత్తికన్నను మంచివృత్తి
చదివికొనుబాలురకు లేద, సత్య మిదియు

వినయ మొదవు బుద్ధియుఁ గడు సునిశితమగు
నేటజరుగు విద్దెయు నొకపూట జడుగు. 129

క. సితపక్షద్వాదశికి న
సితపక్షద్వాదశికిని సెలవుంగొని వే
గ తన పురమ్మునకుం జని
ప్రతిపత్ప్రతతిథికి వచ్చుఁ బాఠమ్మునకున్. 130

సీ. భారవి మూఁడు సర్గలును వ్యాకరణమ్మునఁ బంచసంధు లిం
పారఁ బఠించునప్పటికి నక్షికిఁ బూర్వపువ్యాధికొంత హె
చ్చై రసభంగముంగొలిపి యచ్చోటు వీడఁగఁజేసె; నేరికే
నారయ మేటిసంపద లనంతదురంతమహాంతరాయముల్. 131

తే. గీ. అచటనుండియు నితఁ డంజనాదికములఁ
గంటి కుపశాంతి నొనరించుఁగాని పథ్య
పానములు క్రిమరీతిని బరిఢవిల్ల
కునికి హెచ్చయ్యె గ్రహచారయుక్తిఁజేసి. 132

క. పదపడి యితఁ డాగ్రామము
వదలి పురమ్మునకు వచ్చి బహ్వంజనముల్
మెదిపి యిడిన నారోగము
తుదముట్టన్ హెచ్చు తగ్గు దొడరకయుండెన్. 133

తే. గీ. ఊరి కొక రెండుకోసుల దూరమందుఁ
గలదు పిల్లంక యనియెడి గ్రామ, మందుఁ
గలఁడు వైఖానసుఁడు లఘుకౌముదిని స
యమ్ముమైఁ జెప్పఁదగు ననంతార్యఘనుఁడు. 134

తే. గీ. అప్పు డప్పు డాయూరికి నరిగి రేయి
యచట వసియించి పాఠ మయ్యనఘునొద్దఁ
జాలినంతయుఁ గైకొని సరసిజాప్తు
నుదయమున లేచి తనయూరి కొలిఁ జేరు. 135

ఆ. వె. పల్లెపాలె మనెడి పల్లెయు నొక క్రోశ
మందుఁ గలదు సూర యాహ్వయుండు
సాహితీఘనుండు చతురుండు మధునపం
తులకులోద్భవుండు గలఁ డచటను. 136

ఆ. వె. అచటి కప్పుడప్పు డరిగి భారవికావ్య
మందుఁ దక్కుసర్గ లయ్యనఘుని
యొద్దఁ జదువుచుండు నూరకయుంట క
లార్థి కెందుఁ దగ దటంచు నెంచి. 137

క. క్షణమును వృథసేయక ల
క్షణసంగతులున్ బురాణగాథలు దగ వీ
క్షణమాచరించు; "క్షణశః
కణశశ్చైవ" యని చెప్పఁగా విందుమకా! 138

తే. గీ. ఇట్లు లోకమూఁడు మాసమ్ము లింటనుండి
భారవి సమాప్తినొనరించెఁ, బఠనసేయ
మొదలిడియె మాఘము లఘుకౌముదియు మఱియుఁ
గొండొక పఠించెఁ, గొంత తెల్గును గ్రహించె. 139

తే. గీ. విద్యకన్నను నెక్కుడు వేగమలర
నక్షిరోగంబు దా నంత నతిశయించె
నేమి చెప్పుదు దురవస్థ యెంతయేని
పగలు పగలయ్యె, విసి తన బంధువయ్యె. 140

తే. గీ. ఎన్ని కాటుక లిడిన నొక్కింతయేని
తగ్గ, దెచ్చు నదెట్టి దుర్దశయొ! "శతుర్ని
జనులకేనియు నిది వల" దనుచు దాని
ననుభవించుచు గృహమున నట్టె యుండె. 141

తే. గీ. అట్టు లొక పక్ష మయ్యార్తి ననుభవించి
యరిది యియ్యది శమియించు టని తలంచి

యాత్మ నిశ్చలమొనరించి యతివిరక్తి
గాంచి విద్యాభ్యసనమునఁ గాంక్షనించి. 142

క. ఒక కన్ను వోయినను వే
ఱొక కంటన్ జూడవచ్చు; నొకకన్నును లే
క కడున్ వందురు గుడ్డి గ
తికిఁ దుల్యమకాదె జడుగతియుఁదలపోయన్. 143

తే. గీ. అనుచుఁ దన పిన్నమత్తాత యగు నృసింహ
కవివరుఁడు లిఖియించిన గ్రంథములను
వెదకి సిద్ధాంతకౌముది వెలికిఁ దీసి
విద్యకై యెటకేనియు వెడలనెంచి. 144

శా. కాశీపండితుఁడై కృపాళుఁడయి పరిఖ్యాతిపరిభాపూర్ణుఁడై
యాశీర్వాదముమాత్రి శిష్యులను విద్యావంతులన్ జేయు మేల్
వైశద్యమ్మునఁ బొల్చు చర్లకులజున్ బ్రహ్మయ్యశాస్త్రిన్ గళా
రాశిన్ శ్రీకడియెద్దవాసు గురుఁ జేరంబోదు విద్యార్థినై. 145

తే. గీ. సంతతాన్నపరిదాత యా శాస్త్రనేత
కాశికాపట్టణమునుండి కదలి దేశ
మునకు నింతకుమున్న వచ్చెనని వింటి
ననుచుఁ జనె నమ్మహాభాగు నరయుపొంటె. 146

క. ఒక కంటఁ జూచుచును వే
ఱొక కంటికి గుడ్డ కట్టి యూరు విడిచి మి
న్నక యేగఁదొడఁగెఁ గనువా
రికిఁ దాఁ గవియగుటఁ దెల్పురీతి నతఁ డొగిన్. 147

తే. గీ. కుతపవేళకు నాఁడల కోటిపల్లె
సత్రమున కేగుటయును నచ్చట ద్విజుం డొ
కండు తన దురవస్థను గాంచి విదిత
సకలవృత్తాంతుఁడై పల్కె సదయుఁ డగుచు. 148

ఆ. వె. "పాలకొల్లునొద్దఁ బరిఢవిల్లెడిఁ జింత
పఱ్ఱు నాఁగ నొక్క పల్లె దానఁ
గలఁడు నేఁతకాఁ డొకండు, నేత్రంపు వై
ద్యమ్ము వాని సొమ్ము తథ్యముగను. 149

తే. గీ. అచటి కేగితివేని యీవ్యాధి కుదురు
నిపుడు చదివికొనుటకు నీవేగు టుడుగు"
మనుడు "మంచిది"యని తన యాద్యవాస
మునకుఁ గడియమ్మనకు నల్లఁజనెడునంత. 150

తే. గీ. "వెదకఁబోవు తీగ" యనెడి విధము దోప
నచటఁ గన్పట్టె శిష్యసంఘాన్వితుండు
బ్రహ్మవిద్వద్వరుండు శుభప్రదుండు
శాంతిగుణభూషణుంతు విస్తారయశుఁడు. 151

క. కని యమ్మహాత్ముఁ బెన్నిధి
గను పేద విధమునఁ బొంగి కడుభక్తిని మ్రొ
క్కి నిలిచి బంధుగుణైనక
తనఁ దా నిటు వల్కెఁ జనవు దైవారంగన్. 152

క. మీయొద్దఁ జదివికొనుటకు
నై యేఁ జనుదెంచుచుంటి నస్మదదృష్ట
శ్రీ యెట్టిదొ త్రోవన భవ
దీయంబగు దర్శనంబు దీర్చె శకునమున్. 153

క. అనవుడు "ముఖ్యమ్ముగ ర"
మ్మని యును "నీకీడుజోడునై తిరుపతి నాఁ
జను విద్యార్థియొకఁడు మొ
న్ననె కౌముది మొదలువెట్టె" ననియు వచించెన్. 154

చ. అనవుడు "నక్షిరోగమున కంజనమిచ్చెడి యూరు రేపు నేఁ
జని తమదర్శనమ్మునకుఁ జయ్యన వచ్చెద మీరు నిప్పు డే

గునెడల కేగి యింటికడకుం జనునప్పటి కించుమించుగా"
నని యితఁ డాజ్ఞగైకొని రయమ్మున నయ్యెడ కేగ నేగినన్. 155

క. ఆయూరి కరణ మతిసదు
పాయము తన కాచరించి యధ్యాత్మపు రా
మాయణమును దా నర్థ
శ్రీ యుతముగఁ జెప్ప విసయెఁ జెవులారంగన్. 156

క. ఆయూరి గేస్తు లెల్లరు
హాయిగను బురాణగాథ లాలిఁచుచుఁ దన్
బాయక గౌరవ మెలమిం
జేయఁగ నక్షికిఁ జికిత్స సిద్ధించె నటన్. 157

క. ఆసాలెవెజ్జు తొలిఁ దాఁ
జేసినపున్నెం బదేమొ! సేవింతురు త
ద్వాసగృహమువాఁకిలి సు
శ్రీ సంయుతు లెందజేని గృహయజమానుల్. 158

ఆ. వె. తనదు మేనయత్త తన కుపచారంబు
సంతరింప సకలజనులు గొలువ
నక్షి కంతకంత కారోగ్య మొదవంగ
నుండె నీతఁ డచట రెండు నెలలు. 159

క. అటు లుండియు విద్యాలం
పటమతి యగుకతనఁ గవనపాటవమది హె
చ్చుటకై మున్నటి యల వేం
కటేశ శతకంబు పూర్తికై దొరఁకొనియెన్. 160

క. ప్రతిదినము పురాణపునం
గతి గలుగుటఁజేసి హెచ్చుగా శ్రోతృజన
శ్రుతిపేయముగాఁ జదివెడి
గతి యలవడెఁ బూర్వసుకృతకారణమగుచున్. 161

చ. కసియొసఁగం బురాణము నఖండగతిన్ వచియించు నేరు పిం
పెసఁగఁగ నింతకున్ మునుపె యేర్పడియుండెను గాని సిగ్గు వీ
లొసఁగమిఁ జెప్పఁగాఁదొడరఁ డొక్కెడనేనియుఁ, దన్నెఱుంగువా
రసదగుటన్ భయం బుడిగి యర్మిలిఁ జెప్పఁదొడంగె నియ్యెడన్. 162

ఉ. అంతకు నేత్రరోగ మది యంజనపాటవహేతుకంబుగా
శాంతికి వచ్చెఁ, బిమ్మట వెసన్ దనయూరికిఁ బోయి జాల మా
వంతయునేనిఁ జేయక కలాభ్యసనాదరుఁడై కడెద్ద ని
శ్చింతగ నేగి బ్రహ్మగురుశేఖరుఁ జేరి తదీయసన్నిధిన్. 163

తే గీ. చదువు బాలురయం దెల్లఁ జటులబుద్ధి
శాలియగు నల్ల తిర్పతిశాస్త్రి తనకుఁ
దగిన సహపాఠి గాఁగ శ్రద్ధయును బుద్ధి
గలిగి కౌముదిఁ జదువ మొదలిడె నచట. 164

క. ఆవిద్వాంసుఁడు గృహమున
నే వీరలకెల్ల నన్నమిడుచున్ విద్దెన్
శ్రీవిలసిల్లఁగఁ జెప్పు న
హో వింటిమె యిట్టి గురువు లుండుట యెందున్! 165

క. ఘనుఁడైన యమ్మహాత్ముని
ననయము సేవించుచును మహామైత్రి యెసం
గను నిర్వురు వ్యాకరణం
బును జదివిరి బుద్ధిపటిమ పొంపిరివోవన్. 166

శా. పేరిమం బొల్చెడి యిర్వురం దతఁడు దా వెల్నాఁటివాఁ. డీతఁ డా
రామద్రావిడశాఖవాఁడు, మఱి తద్గ్రామంబు జల్లాఖ్యమౌ
సీమన్ బొల్చెడి యెండగం, డితఁడు తత్సీమేతరంబైన యా
నామన్ గ్రామమువాఁడు, దైవ మెటు సంధానంబు గల్పించెనో! 167

తే. గీ. అతఁడు దివాకరాన్వయశీతరోచి;
యీతఁడో, చెళ్ళపిళ్ళ విఖ్యాతకులుఁడు;

తిరుపతి యతండు, వెంకటేశ్వరుఁ డితండు;
వయసు బుద్ధియు నొక్కటై పఱలుచుండు. 168

చ. వయముఁ గులమ్ము రూపము మనమ్ము గుణమ్ము సమమ్ముగా సహా
ధ్యయనమొనర్చుచున్ జగము దమ్మనిశమ్ము నుతింప నెవ్వరే
నియుఁ దముఁ జూచి సంతసము నెమ్మదినూనఁ జరించుచుండు రీ
యయలకు లేమ భేద మరయంగఁ గుటుంబములందుఁదక్కనన్. 169

ఆ. వె. "అడవియుసిరికాయ యల సముద్రపుటుప్పు"
గలియురీతి మైత్రిగలిగి వీర
లచటఁ జదువుచుండి; రంతట వచ్చె గ
ణేశ్వరోత్సవంబు లెనయు చవుతి. 170

సీ. "రహి గణేశ్వరనవరాత్రముల్ పచరించు
విద్యార్థులకు విద్య వృద్ధిచెందు"
ననుచు దేశికుఁడు దా నానతిచ్చిన విని
తక్కు సతీర్థు లందఱిని గలిపి
కొని యిర్వురును ద్రవ్యమును నార్జనము సేయఁ
గామదినెంచి లక్కవర మనెడి
గ్రామమ్మునకు నేగి కలిమిమై నలరెడి
కోమటిగేస్తులఁ గొందఱఁ గని

తే. గీ. కవితచేతఁ బురాణాదికమున వారి
మిగుల నలరించి ధనమును దగ గ్రహించి
వచ్చి యుత్సవమును గురువై భవమునఁ
జేసి యెప్పటిగతి విద్దె చెందుచుండి. 171

సీ. పదపడి గ్రంథసంపాదనమ్మునకునై
రాజమహేంద్రవరమ్ముఁ గాకి
నాఁడయుఁ జని, మహోన్నతులఁ ప్లీడర్ల వై
శ్యాగ్రిణులను గాంచి, యంచితగతి

బంధచిత్రకవిత్వపద్ధతులను వారి
మెచ్చించి తమకు వారిచ్చు ధనము
చేత గ్రంథార్జనచేసి యల్లన గురు
సన్నిధిఁ జేరి యచ్చంపు బత్తి

తే. గీ. విద్య గఱచుచు సతతాభివృద్ధి దనర
నమితనిర్వ్యాజగురుకరుణాఢ్యు లగుచు
నలరునంతట వచ్చెఁ గేత్వంతరంబు
తత్ఫలం బివ్విధమ్మనఁ దనరె నెలమి. 172

సర్వధారి సం॥ ఆశ్వయుజ బ౧౩ మొదలు విరోధి సం॥ వైశాఖ బ౧౩ వఱకు.

—• కేత్వంతరము •—

తే. గీ. అప్పుడప్పుడు గురువరుఁ డచటికచటి
కరుగుచుండెడికతన దేశాటనంబు
నెడతెగక విద్య జరుగుట యించుకంత
కవనకారణమున ధనాకర్షణంబు. 173

విరోధి సం॥ వైశాఖ బ౧౩ మొదలు వికృతి సం॥ పుష్య బ౧౩ వఱకును

—• శుక్రాంతరము •—

తే. గీ. పిదపఁ గవి వచ్చి తనదగు పేరు సార్థ
కత్వము వహింప విద్దెకుఁ గాంతి నొసఁగి
యాంధ్రకవనమ్ముకన్న నత్యధికముగను
సంస్కృతకవిత్వమున బుద్ధి సంఘటించె. 174

క. తనలోన మాసషట్కము
చను పైఁ బెండిలియొనర్చె స్వదర్వ్యము కా
మను వెచ్చఁబెట్టకుండఁగ
వినిచెదఁ దద్విధ మొకింత విస్తృతఫణితిన్. 175

మ. ప్రతిసంవత్సరకార్తికమ్మనను గిర్లంపూడిభూమీశుఁ డం
చితరీతిన్ దమకిచ్చు వార్షికము వాసిన్ గైకొనన్ మేటి శ్రీ

ష్యతతుల్ గొల్వఁగ బ్రహ్మపండితుఁడు తత్సంస్థానమున్ బేర్మి నే
గి తగన్ గైకొని యింటికేగుతఱిఁ జక్కంగెద్దనాపల్లెలో. 176

తే. గీ. "స్కూలుమాష్టరు" తమయన్నసుతకు భర్త
రామడుగుకులజుండు ప్రోద్దామయశుఁడు
వేంకటాచలనామంబు వెలయు మహితుఁ
దేగుదెంచెను దముఁ జూడనెంచి యటకు. 177

ఆ. వె. ఏగుదెంచి కొంత యాతని ధోరణిఁ
గాంచి బుద్ధిమత్త గలుగువాఁ డ
టంచు నిశ్చయించి యాత్మజ నీనెంచి
మంతనమునఁ జిన్నమామఁ గాంచి. 178

క. "మీ మనుమరాలి నీతని
కీ మది జనియించె నిచ్చ నితఁ డేమేనిన్
ధీమంతుఁ డగునె?" నావుడు
నామహితుం డిట్టు లనియె నల్లునితోడన్. 197

తే. గీ. ఉభయభాషలఁ గవనమ్ము నొప్పఁ జెప్పు
శాస్త్రమునఁ జక్కఁగాఁ బ్రవేశంబు గలను
బుద్ధిమంతుఁడు నైపుణి పొల్చువాఁడు
తల్లిదండ్రులు గలవాఁ డితండు మఱియు. 180

ఆ. వె. వసతి యన్నమునకు వస్త్రమ్మునకుఁ జాలి
నంతవట్టు గలదు, చింతితార్థ
మిట్టు లుండవలదె ? యీయూహ కడు రమ్య"
మనుడు మామ కిట్టు లనియె నతఁడు. 181

తే. గీ. "నగల నాణెమ్ములను నిచ్చ నాకు లేదు
బొమ్మలకుఁ బెండ్లిచేసెడిపోల్కిఁ గార్య
మాచరించెద నుభయపక్షాభిమాను
లగుట మీ రిశుభముపొంటె నాఁగవలయు." 182

క. అన "విది చెప్పఁగవలెనే"
యని శిష్యుని బిలిచి "నీకు నాత్మజ నొసఁగం
గను నిశ్చయించె నీతఁడు
చనె నక్కన్నియకు నైదు సంవత్సరముల్. 183

ఆ. వె. పెండ్లి చేసికొనెదొ? పిల్ల చిన్నది యని
సంశయించెదవొ? వెసఁ స్వపురికిఁ
ద్వరగ నరిగి తల్లిదండ్రులతోడ యో
జించి వచ్చెదవొ? వచింపు" మనుడు. 184

క. ఏ ననఁగ నొక్కఁడనె? మీ
మానస మెటు వచ్చు నది సమంజసమగు మీ
రే నాకుఁ దల్లిదండ్రులు
నా నమ్రహనీయుఁ డల్లునకు నిట్లనియెన్. 185

తే. గీ. రయమునై సుముహూర్తనిశ్చయము చేసి
యత్న మొనరించికొను మేగు, మనుడు "మంచి"
దని యతం డేగెఁ బిదప బ్రహ్మగురుపరుఁడు
తాన యీశుభ మొనరింపఁదలఁచి యెలమి. 186

తే. గీ. అట జమీందారురాలు ధర్మాత్మురాలు
బుచ్చిసీతమ కెఱిఁగింపఁబోయి యచట
నెగడు పరిచారికల కధినేత్రి యగుచుఁ
బొలుచు కామాక్షి యను దాసిఁ బిలిచి యనియె. 187

ఆ. వె. "అమ్మగారియొద్ద కరిగి మా శిష్యున
కొకని కిచటఁ బెండ్లి యొదవె ననియు
మీర లీశుభంబు మేకొని చేయింప
వలయు ననియు నాదు వాక్యములుగ. 188

క. మనవియొనర్పు" మటన్నం
జనుచుం దానిట్లు లోనఁ జర్చించె ధనం

బున కింతకన్న ఫల మెం
దును దొరకదు పాత్రిమనఁగ దుర్లభమకదా! 189

ఆ. వె. అమ్మయాజ్ఞ నేన యాధనంబంతయు
నిడియుఁ బెండ్లిచేసి యిందు నందు
యశము సుఖము వడయునంతటి దానసై
నెగడుదాన నిదియ సుగతితెరువు. 190

---

(వివాహమునుగూర్చి కిర్లంపూడి వారిపైఁ జెప్పిన పద్యములు.)

క. శ్రీమచ్ఛోభనగుణగణ
ధామా! రామాభిరామ! తతబలభీమా!
శ్రీమదినుగంటివంశో
ద్దామార్ణవసోమ! బుచ్చితమ్మయనామా! 1

ఉ. శ్రీయినుగంటివంశవరసింధుసుధాకర! బుచ్చితమ్మయా
ఖ్యా! యరవిందసుందరముఖా! భవదీయయశోఽమృతంబు న
త్యాయతబుద్ధిఁ గ్రోలి శ్రుతు లచ్చుగ నన్ ద్వరసేయ వచ్చితిన్
నీ యురుదర్శనంబునకు నేర్పున వేడ్కలు పిచ్చలింపఁగన్. 2

ఉ. అంచితుఁడౌ భవజ్జనకుఁ డాదర మొప్పఁగఁ గాశిలోనఁ జె
ప్పించిన సర్వశాస్త్రములు పెంపుగ నభ్యసనంబొనర్చి రా
జించెడి చర్లవంశవరసీరధిశారదచంద్రు సార్థతో
దంచిత బ్రహ్మయాభిదబుధాగ్రణిశిష్యుఁడ వేంకటాఖ్యుఁడన్. 3

ఉ. ఓయినుగంటితమ్మయనృపోత్తమ! నీదు పితాపతుల్యుఁగా
నాయినుగంటి నామభ్రమ నౌర! వివాహప్రసక్తిలేమిచే
నాయినుకంటె మీర లధికాఢ్యు లటంచు నుతింప నేను వ
హ్వాయినుగంటి మిమ్మును వివాహముకై దపమధ్యకాంక్షినై. 4

స్ర గ్ధ ర

శ్రీమత్కస్తూరికాసంశ్రితవననిధిపుత్రీఘనోరోజబుద్ధిన్
దా మోహోద్రేక మింపొందఁగ నసితధరోత్తంసకూటమ్ములందున్

క. అని ధనవతియును ధర్మ
మ్మున బుద్ధిగలదియు నగుటఁ బొలఁతి తన మన
మ్మునఁ గృతనిశ్చయయై రా
ణిని జేరి వచించి యిట్లనియె వినయమునన్. 191

క. అమ్మా! యీశుభమును మీ
సొమ్మగు నా సొమ్మొసంగి సొంపగుగతి నే
నెమ్మెయిఁ జేయించెద మీ
సమ్మతియొక్కింత చూపఁజనుఁగరుణమెయిన్. 192

క. నావుడు రాణియు నెంతే
భావమ్మున సంతసించి "పండితులకు నీ
వీవిధిఁ జేసెద నన్నను
నేవారును నడ్డువెట్టరిది మే" లనుడున్. 193

ఆ. వె. అది "మహాప్రసాద" మని వచ్చి బ్రహ్మయ
గురున కిట్టు లనియెఁ గుతుక మలర
"నమ్మ యీ శుభమ్ము నంతయు నీవు చే
యింపు మనుచు నాజ్ఞయిచ్చె నాకు. 194

క. ధన మెంత కావలెనొ మీ
యనుమతమున నేన దాని నర్పించెద న
న్నును గారవించి యీ శుభ
మునుజేయింపుఁ' డన గురుఁడు ముద మెదఁదనరన్. 195

తే. గీ. 'ఎపుడు ధర్మకార్యమ్ముల నెఱిఁగి చేయు
రాణిపరిచర్య సల్పెడి రమణి కిది య

ప్రేమన్ గ్రీడించు లక్ష్మి ప్రియుఁ డనవరతప్రీతి నేవేళ మీకున్
రామారామేభరాజద్రథతురగకళారాజితశ్రీ నొసంగున్. 5

(షరా) తత్కాలశైలిని చదువరు లెఱుంగుటకై పైపద్యము లున్న వున్నటులు ప్రకటింపఁబడియె. వెం॥ శా॥

నర్హమే ? యట్ల కావింపు' మని తగియెడి
రీతి నద్దానితోఁ బల్కెఁ గృపదలిర్ప. 196

చ. పదపడి తల్లిదండ్రులకుఁ బత్రికఁబంపిన వార లెంతయున్
ముదమున వచ్చి, రంత ధనమున్ వెనుదీయక దాసియిచ్చె; న
య్యది గొని బ్రహ్మపండితుఁ'డహో'యని లోకులు మెచ్చఁ బెండ్లియిం
పొదవఁగఁ జేసె, దాసి మఱియున్ 'దరియించితి'నంచు మ్రొక్కఁగన్.

తే. గీ. ఇఁక నొకటి, పెండ్లికగు వ్యయమెల్ల దాసి
యిడియె, బసయింటియాబిడ యిద్ధచరిత
యన్నపూర్ణ తేజోమూర్తి యన్వవాయ
స్నాతకవ్యయము భరించెఁ గౌతుకమున. 198

తే. గీ. మఱియు నీయన్నపూర్ణమ్మ గురుఁడు బ్రహ్మ
పండితుఁడు శిష్యవర్గము బలిసి కొలువ
నచట నున్నంతకాలమ్ము నన్నమిడుచు
భక్తిసేవించుఁ దాఁ బ్రతివత్సరంబు. 199

తే. గీ. గురువరుఁడు కాశిలో నున్నతఱిని నీపె
యాత్రి సేవింప నరిగి బ్రహ్మగురువరుని
ఒరిసెనమొనర్చినట్టి యా పరిచయమున
నిమ్మహాభాగ యిటు సేయు నేటనేట. 200

తే. గీ. పదపడి నివాసమున కేగె బ్రహ్మగురుఁడు
శిష్యవర్గంబు తనవెంటఁ జేరికొలువ;
మరల నొకమాసకాలము జరుగుమీఁద
వెలయు వృత్తాంత మదియును విస్తరింతు. 201

ఉ. అమ్మహనీయునింట నెల యయ్యెడునంతకు నొక్కపుట్టె బి
య్యమ్ము సుమారు వారుఁ దిమదైన కుటుంబముగాక శిష్యసం
ఘ మ్మతిథిప్రజమ్మును సుఖమ్ముగ భోజనమాచరింపఁ బు
ణ్యమ్మన బ్రహ్మపండితునికన్న మఱొక్కని కెన్న నున్నదే ! 202

ఉ. ఉన్నది రెడ్డిసీమ, తమ కుండెడి దించుక వృత్తి, దాని కె
స్నెన్నియొ యోగముల్ కుదిరెనేని ఫలించు, ఫలించుదానిలోఁ
దిన్నదిగాక తా రయితు దెచ్చి యొసంగు ఫలం బ దెంత హె
చ్చున్నను వీరి కొక్కనెల యోపునొ, యోపదొ! సందియంబగున్.

క. ఆయనఘాత్ముని భార్య గ
దా యిల్లాలనఁగ, నాఖ్యయననేల? నిజం
బే యన్నపూర్ణ యాపె వృ
థా యుంతురె? యట్టిపేరు తజ్ఞులు పెద్దల్. 204

ఉ. చెన్నఁటిచూపు చూచి యొక శిష్యునినేనియు "నేమిరా" యటం
చు న్నిరసించి పల్క, దిది చోద్యము, దేశికభార్య లిట్టి వా
రున్నది వింటిమే! మఱియు నొక్కటి, లోకులు తన్నుఁ దిట్టినన్
సన్నుతిఁజేసినన్ సమము, సాటి మఱెవ్వరు? బ్రహ్మరాణికిన్. 205

తే గీ ఇంతమంది శిష్యులకును నింట భుక్తి
జరుగుగతి ధాన్యమొసఁగెడి "జల్లి" సీమ
రాచమండలమును వత్సరమున కొక్క
సారి చూడఁగనేగు నాధీరవరుఁడు. 206

చ. అది తఱి యొట శిష్యజను లందఱు గొల్వఁగ 'నెండగండి' కిం
పొదవఁగ నేగ నయ్యెడల నుండెడి తిర్పతిశాస్త్రితండ్రి బల్
పదయుఁడు వేదపారగుఁడు సజ్జనమాన్యుఁడు వేంకటావధా
ని దగ బహూకరించి కడు నెయ్యముఁ దియ్యము మిన్నుముట్టఁగన్.

తే. గీ. ఎదురు చని పూర్వరీతినె యొసక మెసఁగ
నాత్మగృహమున నిల్ప నయ్యనఘుభార్య
శేషమయు నిందఱికిఁ దాన చేసిపెట్టు
సంతతాన్నదానవ్రతచారుచరిత. 208

తే. గీ. అచట నుండెడికాలమం దాత్మ నుదయ
మందెఁ గాశికినేగు నుద్యమము తత్ష

ణంబ వేతొక్కరుని సహాయంబుగొనుచు
గురుని పంచించి యేగె సత్వరత దనర. 209

క. నిడమజ్జిను గ్రామమునకుఁ
గడుకొని చని యచట నున్న కచ్చేరీ నొ
ప్పెడి యుద్యోగస్థులలో
నడి నెఱుఁగని రామదాసు సందర్శింపన్. 210

క. చని శతఘంటాకవన
మ్మును నష్టవధాన మేను బొనరించెద సం
చును బద్యపూర్వకముగా
వినిచిన నాసభ్యులెల్ల విస్మయమయులై. 211

ఆ. వె. 'వయసు హెచ్చు లేదు, పల్కులు చూచిన
మిగులహెచ్చటంచు మించినతమి
సభ నొకండు సల్ప సమకట్టి విద్వాంసు
లైన వారిఁ బిలువనంపునంత. 212

క. ఎన్నఁడును జేయువారలఁ
గన్నారం జూడఁడఁట ! యఖండులు సభలో
నున్నారఁట ! యవధానం
బు న్నెఱవేర్చెనఁట ! పూర్వపుణ్యమొ! యేమో! 213

క. అటు లష్టవధానంబున్
ఘటియించిన రామదాసు కడుముదమున "మీ
రెటుఁ జనుచుంటి" రనిన "మే
మిటనుండి చనెదము కాశి కిర్వుర మెలమిన్. 214

చ. ఇపుడు వచించువాఁడ నిజ, మీయవధానవిధానమార్గ మే
నెపుడు నెఱుంగఁ; జిత్ర మిటు లేదియుఁ బన్నకయున్న నూరకే
కృపమెయి ద్రవ్య మీయరని యిట్టి యుపాయ మొనర్చినాఁడ; నిం
దపరిమితమ్ముగా దొసఁగు లయ్యెడ నయ్యెడ నుండకుండునే!" 215

తే. గీ. అనుడు నందలి పండితజనులు "దీన
దొసఁగు గన్పట్ట, దిట్టి వయసున నింత
ప్రజ్ఞ గల్గుట ప్రాగ్జన్మఫలమ కాని
కాదు వేఱొండు మీకబ్బుఁగాక జయము." 216

తే. గీ. అనుచు నాశీర్వచించెడి యవసరమున
రామదాసు పశ్చిమమున రమణ మూఁడు
పదులు రూపిక లుంచి మెప్పొదవ నిచ్చి
"చంద్రునకు నూలుపో" గని సాఁగిమ్రొక్కె. 217

మ. అవి వేడ్కం గొని "గుండుగొ" ల్లనెడి యాఖ్యం బొల్చు గ్రామమ్మునం
దవధానం బొకఁ డాచరించి యట ద్రవ్యప్రాప్తిచే మించి కొం
తవడిన్ శ్రీబెజవాడ కేగి యట వింతల్ సూచి రైలెక్కి మ్లే
చ్ఛవృతంబైన "సికింద్రబాదునకు" నిచ్చన్ బోయి యాప్రోలునన్.

తే. గీ. సంతతాన్నప్రదాత, పుచ్చాకులుండు
నైన లక్ష్మయగేహమం దతిముదమునఁ
గొన్ని దినములు వసియించి కొంతద్రవ్య
మచట నార్జించి పిదపఁ బ్రియాగ కేగి. 219

తే. గీ. అటఁ ద్రివేణికాసంగమమందుఁ దాన
మాడి వైశమ రైలెక్కి హర్ష మెసఁగఁ
గాశి యారాతిరికిఁ జేరి యీశుకృపను
నాల్గు మాసము లట నుండి నయమెలర్ప. 220

క. వెస శ్రీసుబ్రహ్మణ్యా
ఖ్యసూరికడఁ జదువుచును సుఖమ్ముగ, గంగా

---

{ బ్ర॥ శ్రీ॥ ద్రావిడ సుబ్రహ్మణ్యశాస్త్రుల వారింట పెండ్లినిగూర్చి
కాశిలో నున్నపుడు చెప్పిన శుభలేఖాశ్లోకము. }

శ్లో. మున్యబ్ధ్యంకేందువర్షే గుణగణమహితే రాధమాసే వళక్షే
పక్షేఽనంగస్య తిథ్యా మసురగురుదినే మత్సుతాయా వివాహః
ప్రాత్రర్భావీ బుధేంద్రా మహ ఇహ భవతాం యాచతే సన్నిధానం
శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రీ ద్రావిడకులభవ, స్స్వాహితాగ్ని ర్వనీతః.

లసమానవారి మునుఁగుచు
"రస నిది స్వర్గంబ"యని కరము మదిఁగనుచున్. 221

తే. గీ. కాశిపయి నన్నపూర్ణపైఁ గాలభైర
వుపయి విశ్వేశుపయిని గణపతిపయిని
గంగపై సంస్కృతపుబాసఁ గడుముదమున
నష్టకమ్ము లొనర్చుచు నడరునంత. 222

క. తలిదండ్రు లేగి దైన్యం
బొలయన్ దను వేఁడ నాజ్ఞ యుత్తరము ను వ్రా
సె లలిన్ దేశమ్మునకున్
సలలితగతి రమ్మటంచు సద్గురుఁడగుటన్. 223

క. ఆకమ్మభావ ''మిఁక నీ
రాక యొలయదేని నిన్ను రప్పించుటకై
వే కదలి తల్లిదండ్రులు
ప్రాకటముగఁ గాశిదనుక వచ్చెద'' రనుచున్. 224

క. కనుపట్టిన ''నిఁకఁ జనకుం
డినఁ దీర'' దటంచు నెంచి నెమ్మిన్ దనతోఁ
జనుదెంచిన మిత్రుని ''నీ
వును వచ్చెదె?'' యన్న నతఁడుపొసఁగకపోయెన్. 225

తే. గీ. అంతట సహాయు లెవరేని యబ్బుపిదపఁ
జనుదుఁగాకేమి యనుచు నచ్చటన యుండు
నంత నొక కోమటి సహాయుఁడై తటస్థ
మయ్యె నతఁ డెంతయేని యోగ్యత గలాఁడు. 226

క. ఇరువురును గలిసి కాశీ
పురి విడిచి స్వదేశమునకుఁ బోవుచు మధ్యన్
బరమాత్మ జగన్నాధునిఁ
గరమున్ సేవించి యచొటు గడచియుఁబిదపన్. 227

క. శ్రీకూర్మేశ్వరుఁ బొడఁగని
నాకాధీశాదిసేవ్యుఁడై సింహాద్రిన్
జేకొని వెలసిన దేవుని
యాకారము గాంచి మ్రొక్కి యటుపై నెలమిన్. 228

ఆ. వె. బయలువెడలి కొంతపయనము సాగించి
యుప్పమాకదేవు నోలిఁ గాంచి
యచటనుండి కదలి యరుదెంచి రిరువురు
పీఠికాపురంబు పేర్మి యెసఁగ. 229

ఆ. వె. కాశి విడిచి పిదపఁ గలకత్త వచ్చెడి
దమక రైలు, దాని దాఁటి కటక
పురికిఁ జనెడిదమకఁ బొల్చు నౌకాయాన
మది సముద్రమందు నల్పనదుల. 230

తే. గీ. అది మొదలు కాకినాడకు నరుగువఱకు
శకట, మియ్యది మార్గంపుసరణి; దీనఁ
గలుగు దోసమ్ము లెన్నెవి గలవు, వాని
విస్తరించిన గ్రంథంబు విస్తరించు. 231

ఆ. వె. వారణాసి విడిచి వచ్చినదాదిగాఁ
డనకు లోటువడిన ధనము నిచ్చి
యంతఁ బోక సేవ నాచరించుచువచ్చె
వైశ్యుఁడతని మఱువవచ్చునొక్కొ. 232

తే. గీ. విడువలే కట్టి వైశ్యుని విడిచి పీఠి
కాపురమునుండి తనదగు కాఁపురంపు
గ్రామమున కరుదెంచినఁ గాంచి తల్లి
దండ్రు లానందభరితులై తనిసి రంత. 233

క. గంగాసంతర్పణమున
కుం గా సొక్కటియు లేమిఁ గొండొక మదిలో

నం గాంచి కోనసీమకుఁ
బొంగారెడి పేక్క ద్రవ్యమును నార్జింపన్. 234

క. చని పండితమండలికిం
గనులగు ముమ్మిడివరంపు గ్రామమ్మున మీఁ
దను నైనాపురమునఁ గే
శనకుఁ ర్తిని నాశుకవనసామర్థ్యంబున్. 235

క. అవధానచ్ఛలమునఁ జూ
పి విశేషయశోర్థలాభవివశుండై తా
నవిరళరయమునఁ బూజా
ది విధుల గంగాంబఁ దనిపి తేఁకువకలిమిన్. 236

ఆ. వె. మరల బ్రహ్మగురుని మహితకృపామయుఁ
జేరి ధీరుఁడైన శ్రీపతిసఖుఁ
గలిసి చదువఁదొడఁగెఁ గవితావిశేషంబు
ప్రతిదినంబువృద్ధివడయుచుండ. 237

క. తిరుపతిశాస్త్రియుఁ దనతో
సరిగాఁ గవనమ్ము సెప్పు చతురుండై యీ
వఱకుఁ బృథగ్రచనాబం
ధురుఁ డయ్యును నిపుడు కలిసి చెప్పఁదొడంగెన్. 238

తే. గీ. అంత నిరువురుఁ గలిసియే యఖిలములగు
గ్రంథములు సేయ మొదలిడి, కన్న తల్లి
దండ్రు లొక్కరు గాకున్నఁ, దనరి రన్న
దమ్ములై విద్యయే కారణమ్ముగాఁగ. 239

చ. ఇరువురుఁ గూడియే రచన యెప్పుడుఁ జేయుదు రొక్కవేళ నొ
క్క రొకటి, యొక్క రింకొకటి కైకొని చేయుదు, రందు హెచ్చుత
గ్గొరులకుఁ గానరాక యది యొక్కరు చేసినభంగి నుండు, నొ
క్కరు రచియించిరేనియును గాఁడగు తిర్పతివేంకటీయమై. 240

తే. గీ. అంత ధాతురత్నాకర మనెడి చంపు
వొకటి మొదలిడి పాణినీయోపయోగ
మగు గతి రచించి; రాగ్రంథమందు రామ
కథ క్రమమ్ముగ ధాతువుల్ గ్రాల నలరు. 241

క. ఏతచ్చంపూరచనా
కౌతూహల మొసఁగి రచన కడముట్టకము
న్నె తరలె శుక్రుఁ డీతం
డాతతగతి మధ్యమధ్య నార్తియుఁ గొలిపెన్. 242

తే. గీ. మఱియు నీశుక్రునంతర మరుగునపుడ
బ్రహ్మగురువరుఁ డాత్మీయపాఠశాల
ధవళగిరిపట్టణమునకుఁ దగఁగ మార్చి
కాఁపురమ్మండె నట శిష్యగణము గొలువ. 243

క. గురువరునియొద్ద ధవళే
శ్వరమున నితఁ డుండునంతఁ జనుదెంచెన్ భా
స్కరునంతర మియ్యెడలఁ
జరిగిన సంగతులు వినుతు సంక్షేపముగన్. 244

వికృతి సం॥ పుష్య బ ౧౩ మొ॥ ఖర॥ సం॥ ఆషాఢ బ॥ ౧౩ వఱకు

—• రవ్యంతరము •—

తే. గీ. ధాతురత్నాకరమ్ము గొంతవడి పూర్తి
సేయుటయ కాక 'వీధి' నాఁ జిన్ని రూప
కం బొకటి రచియించుట గలిగె, విద్య
జరిగె ననుకూలముగ వీని సమయమందు. 245

ఆ. వె. శిష్యుఁడైన తనకు శిష్యులఁ గొందఱఁ
జేర్చి ప్రతిదినమున శేషభువన
కోటి మాన్యమైన గోదావరీనది
యందుఁ గూర్చె స్నాన మజ్జహితుఁడు. 246

ఆ. వె. మధ్యకాలమందు మరణంబు జరిగెడి
యంత వ్యాధిచేసి యదియు దాన
నుపశమింపఁజేసి యొయ్యన వేంచేసె
నంత వచ్చెఁ గుజమహాదశయును. 247

ఖర సం॥ ఆషాఢ బ ౧౩ మొ॥ మార్గశీర్ష బ ౧౦ వఱకు

—• కుజమహాదశలో కుజాంతరము •—

తే. గీ. వీనిలో వీఁడు నష్టధనానుగతియు
శాస్త్రసంస్కారవృద్ధియు సత్కవిత్వ
వృద్ధియును వేదవిద్యాపరివిష్టతయును
గలుగఁగాఁజేసి తన్మధ్యకాలమందు. 248

క. తిరుపతిశాస్త్రి సహితముగఁ
బరమంబగు కాకినాఁడ పట్టణమునకున్
సురుచిరముగఁ జనఁజేసె వి
వరింతు నచ్చటి విశేషమై ఖరు లెల్లన్. 249

క. దురిసేటికులజలధిహిమ
కరుఁ డతిసుగుణాన్వితుం డఖండయశుఁడు దా
త రసవశుండు కడు వివే
కి రమణ నొప్పారు శేషగిరిరా వచటన్. 250

క. అతఁ డష్టవధానం బొకఁ
డతిముదమునఁ జేయఁజేసి యంచితగతిఁ బూ
జితులన్ జేసె నిరువురన్
వితతంబై పురిని గీర్తి వెల్లడిగాఁగన్. 251

క. బాదము వేంకటరత్నము
సాదరముగ రామశాస్త్రి యనియెడి యొక వి
ద్యాదయితువలన విని స
మ్మోదమ్మునఁ బిలువనంపి మొగి నిట్లనియెన్. 252

క. "అష్టావధాన మది యొక
కష్టము గా దెందఱేని గావింత్రు కవుల్
కష్టము శతావధానం
బిష్ట మ్మది నాకుఁ జూడ నెన్నివిధములన్. 253

క. అది సేయఁగలరె మీ" రన
నిదివఱ కెన్నఁడును జేయ మెటఁ జూడమ మీ
రిది గోరితి రిది చేయం
గఁదగుఁ దగ దటంచుఁ దెలుపఁగల మవల పవల్. 254

క. అని నొడివి వ్యవధిగొని యి
ప్పని మన బుద్ధికొక పెద్దపని గా దని, యై
నను "నింట గెల్పుగొని ర
చ్చను గెల్పుట" యేరికేని సౌఖ్యం బిచ్చున్. 255

క. అనియప్పురమున కొకవై
పునఁ దగు నొక నారికేళభూజాతపుఁ దోఁ
పునఁ గల వృక్షమ్ముల మం
తనమున మనుజులని యెంచి తద్దయుఁ బేర్మిన్. 256

మ. అవియే గోరినరీతి నందొకఁడు పద్యంబున్ బదార్థంబు వా
ను విధింపన్ మఱియొక్కఁ డద్దిగొని యందున్ బాద మొక్కండు సె
ప్పి విరామంబొనరింపఁ బై చరణమున్ వేఱొక్కఁ డామ్యందు మూఁ
డవ పాదంబు చతుర్థ మింకొకఁడుఁ గా నాపద్యముల్ పూర్తిగన్. 257

క. విరచించి వాని నన్నిటిఁ
జెఱియొక చరణమ్ముగాఁగ శీఘ్రఫణితిమైఁ
బరిశీలనముగఁ జదివి య
పరిమిత సమ్మోదగరిమ భావం బలరన్. 258

క. శతమునక కాదిటులు దశ
శతమునకేనియును జెప్పఁజాలుదు మని ని

శ్చితచిత్తు లగుచు వీరలు
ప్రతినం బొనరించి రిటు సభకుఁ జని యెలమిన్. 259

వ. నిలిచి సహస్రపద్యములు నేర్పలరంగను సంస్కృతాంధ్రి భా
షలఁ దగఁ జెప్పనేర్తు మని చాలఁ బ్రతిజ్ఞను బూననేర్తు. మే
మెలమిని నూఱుపద్దెముల నిక్కడఁ జెప్పు టదేమి లెక్కయో
నిల; వరబాదమన్వయనదీశసుధాకర ! వేంకటాభిధా ! 260

ఉ. అంతట నొక్కనాఁడు మహిమాఢ్యులు పండితులున్ వణిక్కులా
శాంతయశస్కులై ధనికులై తగు ప్లీడరులున్ దదన్యులుఙ
బంతులు దీర్చి హెచ్చుగు సభం బొనరించి శతావధాన మన్
వింత గనుంగొనంగ మది వేడుక లెంతయుఁ బిచ్చలింపఁగన్. 261

తే. గీ. ఉన్నయంతట నూర్వుర కొక్క చరణ
మొక్కరు వచించు నాలోన నుష్ణకిరణుఁ
డపరవారిధిదరి కేగె; నంత నచటి
బుద్ధిమంతులు కొందఱు ప్రోవుగూడి. 262

క. ఇది యిపుడు పరిసమాప్తిం
బొదలుట ఘటియింప ది ట్లపూర్ణస్థితిలో
వదలిన వీర లిరువురును
బదపడి యోజించికొండ్రుపాయం బేమో ? 263

క. అని యా కాగితములఁ గై
కొని యందున్ "మధ్యమధ్యఁగొన్నిటిఁబూర్తిన్
బొనరించెదరే ?" యనుటయుఁ
"బొనరించెద"మనిరి సభ్యపుంగవులలరన్. 264

క. పదపడి "పది, పదునై, దిరు
వదియొక్కటి, మూఁడు, నూఱు, పదునాలుగు, తొం
బది, యేబది, యా అనుచున్
మొదలున్ దుదలేక యడుగ మొదలిడిరెలమిన్. 265

ఆ. వె. వరుస లేదు, మున్ను పంక్తిని గూర్చున్న
వారు లేరు; బుద్ధిబలమొ, లేక
దైవబలమొ కాని తత్తచ్చరణపూర్తి
సలిపి మించి రెల్లజనులు మెచ్చ. 266

క. అంత సభవార లెల్లర
నంతానందంబు కలిమి నాహారవ మా
శాంతములు నిండఁ దచ్చర
ణాంతమ్ములు సోఁక మ్రొక్కి యని రిప్పగిదిన్. 267

క. ఓయనఘులార ! నరనా
రాయణు లనవలయు మిమ్ముఁ బ్రాకృతు లిట్టుల్
సేయఁగనేర్తురె ! యింతటి
పాయమ్మున కింత విద్దెఁ బడయఁదరంబే ! 268

క. అని "యవధానం బిప్పుడ
యనుమానము లేద పూర్ణమయ్యె మఱియుఁ ద
క్కిన పద్దెమ్ముల పూర్తికిఁ
బనిఁగొని సభ రేపు మరలఁ బచరింపవలెన్. 269

ఆ. వె. మనుజమాత్రిలేని మఱపు ఘటిల్లుట
యమ్యలైనవారి కబ్బు బెట్టు
లనుడు హస్తతాళమాహారవఁబును
బిక్కటిల్లె సభను దిక్కులురుల. 270

క. నాఁటికి సభ సరి, మఱి యా
నాఁటికి నేడవ దినమ్మునన్ సభ యీలో
మాటికి దోసమ్ముల మది
పాటించెడివారితో వివాదము లెసఁగెన్. 271

తే. గీ. వెంపరాల వేంకటశాస్త్రి వెనుక ముమ్మ
డివరమందలి సభలోఁ గడింది శత్రు

వగుటఁ దా నాసభకు రాక యాత్మజుల ని
రువుర నంపించె వార లిరువురు వీఁక. 272

క. ఏఁబదిమూఁడవ చోటను
నేఁబది నాలుగవ చోట నెట్టెట్టులో దు
ర్ధీబహుళతఁ దప్పులయం
దే బుద్ధి నిగిడ్చియుండి తేఁకువకలిమిన్. 273

తే. గీ. ఒక్కఁ డుపజాతి, వంశస్థ మొకఁడుఁ గోరి;
రందు భూపుత్రి పెండిలి యాద్యవృత్త
మందు, రెండవ వృత్తమునందుఁ గాకి
నాడలోని ద్విజుల వర్ణనమును వలయు. 274

ఆ. వె. అందు మధ్యమధ్య నడిగిన ప్రశ్నమ్మ
లందుఁ బడియె మొదటి దక్కతమునఁ
బూర్ణమగుట దానిఁ బొరిఁబొరి వేఱొక్క
కాగితమ్మునందుఁ గలయవ్రాసి, 275

క. తన తండ్రికిఁ జూపిన నా
యన యాశ్లోకమ్ము* చూచి యది యుపజాత్యా
ఖ్య నెగడు వృత్తము గాదని
యును వర్ణ్యము తప్పినదనియును నెంచి వేసన్. 276

క. వెనుకటి వైరమ్మను దీ
ర్ప నిదియ సమయం బనుచు సభానాయకుఁడై
తనరెడి వేంకటరత్నముఁ
గనుఁగొని పరిహాస మెసఁగఁగా నిట్లనియెన్. 277

---

* శ్లో. ఏనా మనూనాకృతి భాసమానాం
మత్పుత్రికాం తే ప్రదదేహి జాయాం
తథాచ కించిత్తు వదామి సంజ్ఞా
శాస్త్రం త్వయైషా విధినేవ మాన్యా.

తే. గీ. అహహ ! మీరు చేయించు శతావధాన
సభకు మావాఁడు వచ్చి యచ్చటి దటంచు
శ్లోక మొక్కటి తెచ్చినఁ జూచినాఁడ
వృత్తమును వర్ణ్యమును దోషవేష్టితములు. 278

క. అన "వారి యెదుట మీ రి
ట్లనినన్ వా రిందు కేమి యందురొ ? మాయొ
ద్ద ననిన గుణదోషమ్ముల
గనుఁగొన మా కంత శక్తి గలదే ? చెపుఁడా !" 279

తే. గీ అనిన "భయమేమి మీదు సమక్షమంద
వారితో నేను వాదింతు వారిఁ బిలువ
నంపుఁ డొకమా"అటన్న నయ్యలఘుఁ డట్ల
కాక యని సమ్మతించి యొక్క దినమందు. 280

క. తిరుపతి వేంకటకవులన్
ద్వరమెయిఁ బిలిపించి "మీకవనమున దొసఁగుల్
దొరలెనఁట ! వింటిరే ? మా
పురిఁ బండితులందు, రిదియు బొంకో, నిజమో !" 281

చ. అనవుడు "నెంతవారికిని నబ్బు దొసంగులు; దానికేమి, మే
మన నొక లెక్కయే ! కపనమల్లుట కష్టము, దానిలోన నె
క్కొని కడునాశుగాఁ గవితగూర్చుట కష్టము, దానిలోన విం
త నియతు లొప్పఁగా శతవధానము సల్పుట మేటికష్టమౌ. 282

క. ఆరయ నవధానంబున
నేరిక్కి దోసఁబు లబ్బుటే ధ్రువ మిం దె
వ్వా రెయ్యెడ దోసంబె
క్కారణమున నున్నఁడనిరొ కనుఁగొను టొప్పన్." 283

చ. అనఁ బ్రతిపక్షి యిట్టులను "నక్కట మీ రుపజాతి యంచుఁ జె
ప్పిన దుపజాతి గా, దచటఁ బేర్కొను వర్ణ్యము సీతపెండ్లియే

యను పెటు ? లేరిదేనియును నా” నన; “నీతఁడు తప్పుఁద్రోవఁ బ
ట్టె” నని హృదంతరంబునఁ గడింది ముదం బెసఁగన్ గవీశ్వరుల్.

తే. గీ. “మొదల వృత్త మేకారణమ్మునను దప్పె
చెప్పుఁ” డన “నుపజాతిని జెప్పుచో ను
పేంద్రవజ్రేంద్రవజ్రాఖ్యవృత్తపాద
ములకు సాంకర్య మది సమముగను వలయు. 285

క. “ఏనా” మను శ్లోకమ్మున
నీనియతికిఁ దప్పి మీర లెక్కుతననొ సం
ధానించితి రొక పాదము
పై నెల్లయెడల నుపేంద్రవజ్రాకృతిగా. 286

తే. గీ. అని “మహాకవికాళిదాసాత్మరచిత
మగు కుమారసంభవమున నాదిపద్య
‘‘మస్తి’’ యనునది ఘటియించె నదియు మీరు
చదువలేదొకొ !’’ నావుడుఁ జక్క నగుచు. 287

తే. గీ. ఇట్టు లని రవధాను “లేమేమి మేము
చదువలేద మీరనిన పుస్తకము నమ్మ
హాకవికృతంబ రఘువంశ మందు రెండ
వదియయిన సర్గమున నాద్య మరసినారె ? 288

క. దానికిని దీనికిని వ్యా
ఖ్యానం బొనరించె నొకఁడె; యదియును నిదియున్.
మానుగ ‘‘నుపజాతులె’’ యని
తా నచ్చట లక్షణంబు దగ లిఖియించెన్. 289

క. “కనుఁగొనుఁ” డని చూపిన నె
ట్టన నది తాఁ గాంచి ‘‘యక్కటా ! యిది తప్పం
దునె ? యేమనినన్ మనకున్
‘ బనుపడు నిట జయ’’ మటంచుఁ బలుకకయుండెన్. 290

ఆ. అంతఁ గవులు పల్కి "రావృత్త మీవృత్త
మెంతమాత్రిమేని యేకమయిన
సత్కవీశ్వరు 'లుపజాతి' యటందురు
దీని లక్షణంబు తెలిసికొనుఁడు." 291

క. అనవుడు "నిది ముఖ్యం బని
యనుకొనకుఁడు దీనికిన్ సమాధానము సె
ప్పిన సంతోషించెద వ
ర్ణ్యనియతి సీతావివాహ మగునేః చెపుఁడా" 292

క. అనవుడు సభవారలు "మీ
కు నపజయం బిందు మొదలఁ గూరెనొ లేదో
వినిచి పయికిఁ జను టుచితం"
బన నాయన మాఱువల్కెఁ డపజయమగుటన్. 293

తే. గీ. అంతఁ గరతాళరవము మిన్నంటె; నది జ
యాపజయసూచకంబయ్యె ననుగుణముగఁ
గవులు మఱి యిట్లు వల్కి "రెక్కారణమునఁ
గాదు సీతపెండిలి" యనఁగా నతండు. 294

క. "ఈ నాపుత్రి నొసఁగెద న
నూనాకృతిభాసమాన నొగి భార్యగ ని
ద్దానిఁ దగ నేలుకొ" మ్మని
దీనికి నర్థంబు తేటతెల్లము గాఁగన్. 295

క. ఇది సీతాకళ్యాణా
స్పద మగు టెటు లెవని కొమిరె పరిణయమే ని
య్యది కాకయుండు టెటులొక
పదమును దదోబోధకంబు పఱలదు దీనన్." 296

క. అన "వ్యాకరణం బది మీ
కు నొకింతయు రాద; తెలిసికో శక్యమె దా

ని నెఱుంగక యీశ్లోక
మ్మునఁ గల యర్థంబు మిమ్ముబోంట్లకు నెందున్. 297

క. అని "ఏనా" మన నర్థము
వినుఁ డింక నకారమునకు విష్ణు 'విన' యనం
గను భర్త సమాసము చే
సిన లక్ష్మివాచకత్వసిద్ధియుఁ గలుగున్. 298

సీ. అల్ల లక్ష్మికిఁ దండ్రియగు సముద్రుం డాపె
నీయకమున్న తా నెనసె విష్ణు
నా మీఁద రుక్మిణి యగునప్డు రాక్షస
విధిచేతఁ గృష్ణుండు పెండ్లియాడె
నుభయత్ర విహితమైయొప్పు కన్యాదాన
మనుఘటింపకయుండు టభిమతంబు
పరికృతపద్యమ్మునఁ "బ్రదదే" యను పదంబు
దానవాచకమయి తనరుకతన

తే. గీ. నెపుడుగాని లచ్చిని దాన మెవ్వఁ డిచ్చె
నయ్యదియ దీని కగు లక్ష్య మదియుఁ గేవ
లము లభింపకయున్కి నాలక్ష్మి ప్రకృతి
గాఁ గలుగు "సీత" యను నర్థగతి లభించు! 299

* క. సీతను రాముని కొసఁగిన
దాత జనకుఁడగుట నిది యతని వాక్యం, బీ
సీతయు రుక్మిణిదక్క మ
ఱేతరుణిగఁ బుట్టె? లచ్చి, యేర్పడఁ జెపుఁడా! 300

తే. గీ. అదియుఁగాక మీచెప్పిన యర్థమేని
యొప్పు "నేతా" మని వచింప నెప్పగిది నె

---

* శ్లో. "రాఘవత్వేఽభవ త్సీతా రుక్మిణీ కృష్ణజన్మని"
అని విష్ణుపురాణ వచనము.

ఱుంగు ? వ్యాకరణంబు నెఱుంగని నరుఁ
డిట్టి గోప్యము, లిఁక నది యెట్టులనిన. 301

క. ఒక పవి సేయఁగ నెద్దా
నికి గ్రహణం బింక నొకపనిం జేయఁగ దా
నికి గ్రహణంబేనియు దా
నికి నేనాదేశ మొదవు నిక్క మెఱుఁగుఁడీ. 302

క. ఈ నూఱు పద్యములు నొక
దానికి నొక్కండుగాక తనరుకతన ని
చ్చో "నన్వాదేశం" బెటు
కా నాద్యంబగు పదంబునం దెఱిఁగితిరే. 303

ఆ. వె. అదియుఁగాక యుత్తరార్ధమ్ము మీకన్వ
యించెనే ? వచింపుఁ డెవరినేనిఁ
గొల్చి కొన్నియేండ్లు కొండొకవ్యాక ర
ణంబు చదివికొనుఁడు జ్ఞానమబ్బు. 304

చ. అన నరసింహశాస్త్రియు మహామహుఁడౌ నల రామశాస్త్రి త
క్కిన మఱికొందఱు "న్నిజ మొగిన్ గన కిట్టు లితండు వల్కురా"
దనియుఁ "గవీంద్రుభావ మది యారయరా" దనియున్ వచించి "య
య్యనఘుఁడు పెద్దవాఁ"డనుచు నప్పటికిన్ దగుమాట లాడుడున్. 305

క. విని సైఁపక "యిది యెంతే
నిని గ్లిష్టము దీని కొప్పనేర్తురె ? బుధు" లం
చును వారల నెదిరించిన
ఘనుఁడగు నల రామశాస్త్రి కడుఁ గోపమునన్. 306

తే. గీ. కాంచి "యాశుగాఁ జెప్పెడి కవనమునకుఁ
గ్లిష్టతాదోష మెందున లెక్క సేయ
రెన్నఁడేనియుఁ జెప్పితివేమొ ! యొక్క
పద్దెము వచింపు మద యెంత పటిమ గలదొ. 307

క. అనవుడు 'విను మయ్యదియే
యని వేంకటరత్నమునకు నాహ్లాదము నె
క్కొన మున్ను చేసియుంచిన
తనపద్దెము చదువఁగా నతం డది వినియున్. 308

తే. గీ. అందు "వర్ధిష్యదృద్ధి" యటన్న పదము
శబ్దశాస్త్రవిరుద్ధము శ్రీవణములను
మూసికోవలె నన దక్కు బుధులు నట్లె
యనిరి సభ్యులు నగిరి "వహ్వ" యటంచు. 309

తే. గీ. అంతఁ గరతాళములు సభయందుఁ జెలఁగె
దానఁ బ్రతిపక్షి కెంతయు దైన్యమొదవె
నెదుటి శక్తియుఁ దమశక్తి నెఱుఁగనట్టి
వార లవమానమును బొందువార లెందు. 310

తే. గీ. అవల నవధానపూర్తికై యఖిలజనులు
గూడి సభసేయుటయు మును గూరుచున్న
రీతి యెల్లను మాఱె; నేరీతిఁ బూర్తి
పేసిరో ? యది యెవ్వరు సెప్పఁగలరు. 311

క. 'తలక్రిందుగఁ జెప్పంగా
వలె నిఁక నా' కనుచు నొకఁడు వలుకున్ 'మఱి మీ
రలె చెప్పఁడు నాచరణం
బు, లనుచు వేఱొకఁ డొకరినె పూర్తిని గోరున్. 312

తే. గీ. వారి కోరికలెల్ల నవారితగతిఁ
గైకొనుచుఁ బూర్తిసేసి రక్కవు లిరువురు
చెఱియొక చరణము వరుసఁ 'జితశ్రీ' మనుచు
నెల్లవారు నక్కజపాటు నెనసి మెచ్చ. 313

క. ఆనాఁటి సభకు వచ్చిన
మానవుల గణింప శక్యమా ? కేవల మం

భోనిధికిఁ దుల్యమైతత్
స్థానంబగు పాకశాల తద్దయు నెగడెన్. 314

తే. గీ. సంస్కృతాంధ్రమ్ములం దిటు సమముగాఁగ
నూఱుపద్యమ్ములు రచించి నొడువుటయును
సభ్యు లెల్లరు నానందసాగరమున
మునిఁగి తేలిరి కరతాళములు నెలంగ. 315

క. నాలుగు నూటపదాఱులు
నేలువు లొకరెండు మేల్మిచేలమ్ములు మే
ల్మాలిక లత్తరువును దాం
బూలమునున్నగనొసంగి మ్రొక్కులొసఁగియున్. 316

ఆ. వె. "పుట్టి బుద్ధియెఱిఁగి యిట్టి కవీంద్రులఁ
జూడలే"దటంచు సూక్తులలరఁ
గా నుపన్యసించి పై నశ్వశకటంబు
కడు నలంకృతమ్ముగా నొనర్చి. 317

తే. గీ. అందు నిరువుర నుంచి యానందగరిమ
మొలయ నూరేగఁజేసి రయ్యూర మఱియుఁ
గొన్ని యష్టావధానముల్ కొంతమంది
గేస్తు లొనరింపఁజేసి రుత్కృష్టఫణితి. 318

చ. తిరుపతివేంకటేశకవిధీరు లిటుల్ యశ మర్థమున్ గడిం
చి రమణ శిష్యయుక్తముగఁ జేరి గురు న్నతులాచరింప న
ప్పరమగురుండు దీవన లపారముగా నిడి సంతసించె; నే
గురునకు శిష్యవృద్ధి మదిఁ గూర్పకయుండు నపారమోదమున్. 319

ఖర సం॥ మార్గశీర్ష బ ౧౦ మొ॥ నందన సం॥ పుష్య శు ౧౩ వ॥

— • కుజునిలో రాహ్వంతరము • —

తే. గీ. అంత గురుసన్నిధిని బూర్వమట్ల చదువు
చుండ రాహ్వంతరము వచ్చె నోలిఁ గాళి

కాసహస్రమ్ము మొదలిడి కవనపటిమ
మెంతయు నెసంగ రచియించు టెందుఁ గలిగె. 320

క. కవితయు విద్యయు సమముగ
నవిరళగతి జరుగుచుండు నవసరమున వీ
రవధానప్రకటనమున
కు వెడలి యల కోనసీమకుం జని రెలమిన్. 321

క. అట నగ్రహారములలోఁ
బటుమతి నష్టావధానపటిమమ్మున ది
క్తటయశులఁ బండితుల నె
క్కటి మెచ్చించుచును మేటికాన్కలు గొనుచున్. 322

తే. గీ. కౌశికాతీరమెల్లను గలయఁ దిరిగి
యేపునం బోల్చు నల యమలాపురంబు
చని యచటఁ గాకినాఁడఠీతిని శతావ
ధాన మష్టావధానంబు దగ నొనర్చి. 323

క. బంగారపుఁ బతకములు మె
ఱుంగారెడి సేలువులు వరుస నూఱాఱుల్
రంగారు పద్దెములు కా
న్కంగొని రాయూర నలరు ఘను లొసఁగంగన్.

తే. గీ. అంత గురుసన్నిధికి వచ్చి యాస్థ నుండు
నెడల రాహువు దేహార్తి నిడి గతించె;
నాపిదప దేవతాగురుఁ డరుగుదెంచి
కొంతకాలమ్ము చదువాడఁ గూర్చి పిదప. 325

నందన సం॥ పుష్య శు ౧౩ మొ॥ విజయ సం॥ మార్గశీర్ష బ ౪ వఱకు

— • కుజునిలో గుర్వంతరము • —

తే. గీ. ధాతురత్నాకరము పూర్ణదశకుఁ దెచ్చి
పిదపఁ గాశీసహస్రమ్ము విస్తృతమ్ము

గాఁగఁ జెప్పించి తన్మధ్యకాలమందుఁ
జోరబాధయు రుజయును జూసిపి మఱియు. 326

క. వ్యాకరణమహాభాష్య
స్వీకృతికిం జూవిపి పిదప శిష్యులతోడన్
శ్రీకరమగు నేలూరికి
నై కదలంజేసె ద్రవ్య మార్జనసేయన్. 327

తే. గీ. అచట నొండొక్క యవధాన మాచరింపఁ
జేసి కొండొక విత్తసంసిద్ధి గూర్చి
బందరుపురమ్మునకుఁ బంపి ప్రబలధన సు
చేల రాంకవ సంసిద్ధి చేసె నచట. 328

చ. తిరుపతివేంకటేశ్వరుల దివ్యకవిత్వరసస్రవంతి బం
దరుపురసజ్జనప్రకరతామరసాకరపూర్తిచేసి దు
ర్భరమయి యంతఁబోక పరితిరథ్యము దానయి యాదివాకర
స్థిరత వహించెఁ దత్పురవిశేషము లెంతయునేని వర్ణ్యముల్. 329

తే. గీ. అచటి విందులు సభలు గానామృతంపుఁ
జవులు నాటకములు విశేషములు తెలుప
నలవి యెన్నటికేనియుఁ గలుగఁబోదు
దాని కయ్యది సాటి నాఁ దగు నిజంబు. 330

క. శుకరంభాసంవాదం
బొకటియు మఱికొన్ని వచనయుక్తమ్మగు ప
ద్యకదంబము గలిగిన నా
టకములు నాటకుల కచ్చట నొసఁగి రెలమిన్. 331

క. అచ్చటి నాటకు లెల్లరు
సచ్చరితులు సత్కులజులు సాధూద్యోగుల్
నిచ్చలు వినోదముల కు
ద్యచ్చరితమ్ములను నాడునట్టి గుణాఢ్యుల్. 332

తే. గీ. మఱియు నచ్చటి విప్రసన్మాన మొందు
గాక హూణసమ్మానంబు గలిగెఁ దఱచు
నాత్మభాషలలోన వ్యస్తాక్షరి వచి
యించుకారణమున వారి కెసఁగె ముదము. 333

సీ. 'ఆనెబిసం' టను నాఖ్య నొప్పుగుహూణ
విదుషికి శిష్యుండు విదితయశుఁడు
'సి డ్నీ. వి. యెడ్జి' నాఁ జెలఁగు హూణుం డొక్కఁ
డయ్యెడ కరుదెంచి యచటి సభల
సంగతి విని కని చాతురీగరిమకు
మెచ్చి పత్రికయిచ్చి మేటిగ నుప
కృతి సేయనెంచి "మీ రీడిసెంబరు నెల
నల చెన్నపురి నడియారునందు

తే. గీ. జరుగు సభ కేగుదెంచిన సంతసింతు
ననుచు నానవాలునకయి తనదు చిత్రి
పటము నొండిచ్చి చనియె నప్పటము తమ స
మీపమున నుంచికొనిరి వీ రేగునిచ్చ. 334

క. పదిపడి బందరుపురమును
వదలి గురునివాసమునకు వచ్చి యచటఁగొ
న్ని దినమ్ము లుండి యితఁడు త,
నదుప్రోలికి నరుగునంత నవరాత్రిమ్ముల్. 335

క. కదిసిన నంబాపూజన్
ముదమలరన్ సలిపి గానమున కుపయోగా
స్పదమగు హరికథ యొక్కటి
మృదుమధురంబైన శైలి యెసఁగ రచించెన్. 336

క. అది దైవవశముకలిమిఁ ద
నదగు భవిష్యచ్చరితమునకు సూచకమై

పొందలెన్ లీలాశుకులీ
ల దగన్ దద్వాచ్యమై యలవడినకతనన్. 337

చ. ఇది యిటులుండఁగాఁ బిదప నిర్విడి దేశికునొద్ద కేగుచో
సదనముఁ గట్టికోఁదగిన చక్కని సుస్థల మొండు బ్రాహ్మణా
స్పదమగు "ఎంజరం" బనెడి పల్లియఁ జిక్కె; ననంతరంబు మే
లొందవఁగ బ్రహ్మసద్గురునియొద్దకు నేగి కలార్థియై తగన్. 338

క. తిరుపతియుఁ దాను బరమా
దరమున భాష్యంబు కొంతదనుకఁ జదివి బం
దరులో "యెడ్జీ" చెప్పిన
తతి యగుటయుఁ జెన్నపురికిఁ దరలి రిరువురున్. 339

తే. గీ. తరలి ధూమశకటము సాధనము గాఁగ
నప్పురవరమ్ము సొచ్చిదివ్యమగు నొక్క
సౌధరాజమ్మునందుఁ బొసఁగ వసించి
వంటపూటిల్లు భోజనవసతిఁ జేసి. 340

క. వసియించి కొన్ని దినములు
బస గేస్తుల సాయమొలయ బయలువెడలి యిం
పెసఁగు "నడియారు" చనుటయుఁ
బొసఁగెన్ రమ్మనినహూణపురుషుఁగనుటయున్. 341

ఆ. వె. అంత నతఁడు గాంచి యాదరమున మించి
సభ జరుగు దినమ్ముఁ జక్కఁ దెలిపి
యంతదనుక జగ్గికగు ధనం బిచ్చియు
"బస మఱెచ్చట" నని పలుకుటయును. 342

క. అమ్మాయమ్మ గృహమ్మునఁ
గమ్మగ భోజనము చేసి కడు వేడుకమై
నిమ్మగ నాళమువారి గృ
హమ్మున వసియింతు మేము హాయి యెలర్పన్. 343

క. అని చెప్పి పిదపఁ బట్టణ
మునకుం జని కొంత కాలమును గడిపినఁ దాఁ
జనుదెంచె సభాదిన మొ
య్యన నడియారునకు మరల నరిగి యిరువురున్.

తే. గీ. ప్రిమదమున నుండుచో హూణభాషయందుఁ
బరిచయము గల్గువార లపారముగను
నెన్నియో దేశములనుండి యేగుదెంచి
రట నుపన్యాసమును విననాస్థఁజేసి. 345.

సీ. అంత లండనునుండి 'ఆనేబిసెం' టను
దొరసాని యటకు హిందూమతోప
యోగమ్ముగా 'లెక్చె' రొసఁగఁగ నేతెంచి
సభచేసి శాస్త్రవిశ్వాసమొలయ
నెవ్వ రే మడిగిన నెలమి నుత్తరమిచ్చి
భాషాసతిని మించు పటిమ మెఱసి
యన్ని మతమ్ములకన్న హిందూమత
'మెంతయు పర' మని యెన్నియో ప్ర

తే. గీ. మాణములు చూపి సభలోని మానవులకు
నపరిమితమోదమును గూర్చె, నహహా! యాపె
శక్తి 'యిద మిత్థ' మని చెప్ప సాధ్యమగునె!
ఫణిపతికినైన నల బృహస్పతికినైన. 346

తే. గీ. ఆపెతో "యెడ్జి" వీరు శతావధాను
లనుచుఁ జెప్పిన నెంతయు నాదరించి
కొంత వీలిచ్చి యొకనాఁడు సంతసమునఁ
జూచె నష్టావధానవిస్ఫూర్తి నాపె. 347

తే. గీ. చూచి 'మా దేశమున నిట్టి ధీచతురత
మృగ్య' మని చెప్పి పత్రిక యిచ్చి నూఱు

లార్లు బహుమాన మిడి కడు నాదరించెఁ
దక్కు సభ్యులు మిగుల ముదమ్ము గనిరి. 348

క. ఈ రాజధానిలోఁ గల
వారు నితరరాజధానివాసులును సభా
స్తారుఁటః తత్సభా వి
స్తారము వచియింప నేరి తరమగు నెలమిన్. 349

తే. గీ. అట్టి యాపె సమ్మానమ్ము నంది వేంక
టగిరి సంస్థానమున కేగుటయును శనియు
నంత సన్నిహితుం డాయె నప్పురమునఁ
బట్టె నొకకొన్ని దినములు వ్యర్థముగను. 350

విజయ సం॥ మార్గశీర్ష బ ౪ మొ॥ జయ సం॥ పుష్య బ ౧౩ వ॥
—• కుజునిలో శన్యంతరము •—

తే. గీ. అందు నల్వురు రాజు లయ్యనఘులెల్ల
దాతలైనను నెక్కుడు దాత యనుచు
ముద్దుకృష్ణయాచేంద్రభూపుని నుతింతు
రతనియెడ బట్టుకవి యొకఁడలరుచుండు. 351

తే, గీ. ఇందు శ్రీరాజగోపాల కృష్ణయాచ
విభుఁడు జ్యేష్ఠుం డితం డంత వితరణమున
ఘనుఁడు గాకుండియును నాంధ్రకవనమందు
మంచిచెడ్డలు కనిపెట్టు మర్మవేది. 352

తే. గీ. తక్కుఁగల యిర్వురును భ్రాతృదాతృతాను
సరణము గ్రహిౘత్రదృష్టానుసరణమును వ
హించువారలు వేంకటకృష్ణయాచ
వేణుగోపాలయాచాఖ్య వెలయు ఘనులు. 353

ఆ. వె. అందుఁ బెద్దవిభున కర్జీ నొసంగిన
నతఁడు పద్యసరణి నలరు దానిఁ

గాంచి దర్శనంబు గా దిప్పు డని రూపి
క లొాకకాన్ని పంపి గారవించె. 354

తే. గీ. ముద్దుకృష్ణయాచేంద్రు సముఖమునకును
బంపినట్టి యర్జీ కల బట్టుసుకవి
గ్రామమున లేకయుండిన కారణమున
'నస్తి' యని 'నాస్తి' యనియు రాదయ్యె బదులు. 355

క. అట సత్రిమ్మున భోజన
మఁట ! కందయుఁ జేమ దక్క నన్యం బట లే
దఁట ! యా భోజనమును దు
ర్ఘటమఁట ! తత్పోష్టవంబు కనితీరవలెన్. 356

క. ఒకనాఁడు సత్రిభోజన
మొకనాఁడు స్వహస్తపాక మొకవింత సుఖ
ప్రకటనమొనరింపఁగ నా
త్మకు విసువుజనించి యచోటు దరలి రయమునన్. 357

క. నెల్లూరు చనుటయును నట
నెల్లరుఁ గడు గారవించి యింపుగ సభ న
త్యుల్లాసమ్మునఁ బొనరుప
జిల్లాజెడ్జియును దద్విశేషము వినియెన్. 358

క విని యాతం డొాకరోజున
ఘనమగు సభ నొకఁడు గూర్చి కాంచియు నింతిం
తనరాని ముదముఁ గని విం
దు నొకం డొానరించెఁ బేర్మి తోరముగాఁగన్. 359

క. పురిఁగల యుద్యోగుల నె
ల్లరఁ బిలువంబంచి విందు లక్షణయుతమౌ
సరణి జరిగించి పరమా
దరమున బహుమాన మిడి ముదం బెదఁ బొాదలన్. 360

తే. గీ. యోగ్యతాసూచకంబగు నొక్క పత్రి
మొసఁగెఁ బదపడి యాపురినుండు సుజను
లెల్ల విందుల నొనరించి యెంతయేని
గారవించిరి ధనలబ్ధి తోరముగను. 361

క. లీలమెయి గంటలోపల
మూలస్థానేశ శతకమును జేసి కళా
లోలురగు సుధీశులచే
బాలసరస్వతు లనంగఁ బరఁగిరి యచటన్. 362

క. ఇంకొకటి వీరలకుఁ గల
కింకవిగజసింహబిరుదు కేవలము స్వద
త్తాంకము; విద్వత్కావ్యా
ద్యంకములకు దాత లితరు లని యెఱుఁగఁదగున్. 363

క. ఇప్పురి నష్టవధానము
లెప్పు డెవరుఁ జేయఁదగని యేర్పాటులతో
నొప్పె నొకొక్కకవర్ణము
చెప్పుట నియమంబు కవిత చెప్పెడిపట్లన్. 364

క. చేలము లాభరణమ్ములు
చాలినదప్రివ్యమ్ము సభల సంపాదన కాఁ
గా లేచి యొందెడకుఁ బోఁ
గా లో నూహించునంతఁ గడు వినయమునన్. 365

క. ఉత్తర మొక్కటి మిత్రుం
డిత్తెఱఁగున వ్రాసె "మీర లేగిన మఱునాఁ
డుత్తరగుణుండు ముద్దునృ
పోత్తముఁ 'డరిగిరె?' యటంచు నొగిఁబలికెఁ జుఁడీ. 366

తే. గీ. బట్టుకవి యట ముఖ్యుఁడై పరఁగుకతన
నతనితోడ యోజింపక యవనిపతియుఁ

గవుల సమ్మాన మొనరింపఁగడఁగఁ దతఁడు
వచ్చె. వచ్చినతోడన వార్త నంపె 367

ఆ. వె. వార్త నంపినంత వారలు నిన్న నె
ల్లూరు వోయి రనియు నొక్క మాస
మునకు మరల మీ సముఖమున కరుదెంతు
మనుచు నాడివి రనియు నంటి మేము. 368

క. నెల్లూరిలోన మీకున్
జిల్లాజెడ్జిప్రభృతులు నేసిన బహూమా
నోల్లాసంబులు మాప్రభు
వుల్ల మలర వినియె నిదియు నుపయోగ మగున్. 369

సీ. అదిగాక పెద్దరాజాత్మరాజ్యం బెల్లఁ
దమ భావుకుండును దాతృతాది
గుణగరిష్ఠుండును గోవిదుండును రాజ
ఋషియును సత్యవర్తియును నైన
చెలికానికులవార్ధిశీతకరుండగు
గోపాలరాయని గోపనమున
నిడి తాను గాశికి నేగె; నీ గోపాల
విభుఁడు పండితుఁడన్న విడువఁ డెపుడు

తే. గీ. కాన మీర లీ నృపవరుకాలమంద
యిచ్చటికి నేగుదెంచిన హెచ్చుగాఁ ద
టస్థమగు గౌరవము వేంకటగిరినృపతు
లెల్ల నీతనికి విధేయు లింతనిజము." 370

క. అని వ్రాయుటయును దక్షిణ
మున ధూమశకటము నెక్కి ముదమున నటకుం
జని రిర్వురు గోపాలవి
భుని దర్శనమయ్యె సులభముగఁ జనుమాత్రన్. 371

తే. గీ. అంతగోపాలవిభుఁడు సహజకలావి
శారదుండగుకతనఁ దచ్ఛక్తిఁ గాంచి
మెచ్చియవధాన మొక్కటి మించుగతి ర
చింపఁగాఁజేసి గారవించి యిటు లనియె. 372

క. ఏనంతద్రవ్యవంతుఁడఁ
గా నిప్పని కిది బహుమతి గాఁదగునె ? ధనా
మానులు మత్స్యాలకు లే
మైనము మీ కీ సమర్థు లది నేఁ గూర్తున్. 373

క. అని పలికి నూఱు లాఱులు
ఘనరుచిఁ దగుభూషణములుగాన్క లొసఁగఁ ద
క్కిన పండితులును భటరా
జును బద్యమ్ములు రచించి స్తుతియించి రొగిన్. 374

క. ఆమీఁద ముద్దుకృష్ణయ
భూమీరమణునకుఁ జెప్పఁబోవుటయు నతం
డా మోదింపక యిట్లను
మోమోటము విడిచి గోపభూమీపతితో. 375

క. "వీరలు మన కర్జీ నిడి
వారక మనసెలవుగొనక వడిఁ బోయిరి నె
ల్లూరి కటుగాన నిఁక నే
వీరలసభఁ జూడ నంత వీఱిఁడినొక్కో !" 376

క. అన గోపావనిపతి చ
క్కని యుక్తుల నతని మనము గఱఁగించి యొకిం
తన సుముఖుఁ జేసి సభ నే
య నిశ్చయముఁ గొల్పె నతని యాదృతి యసదేః 377

తే. గీ. అప్పు డెట్టులొ యొప్పి యయ్యవనిభర్త
యటు లొనర్పక మిషలఁ గాలాతిపాత

మాదరించుడు గోపాలుఁ డర్జి యొకటి
పద్యములతోడఁ గూర్పించి పంపఁజేసె. 378

క. ఆపద్యమ్ములు మృదులము
లై "పృధ్వీపతులు కవుల కతి గౌరవమున్
జూపవలయు" నను సంగతి
యేపుమెయిన్ బోధసేయు నెయ్యోడఁగనినన్. 379

ఆ. వె. పిదప ముద్దుకృష్ణపృథివీంద్రుఁ డొక సభ
చేసి రెండునూర్లు సేలువులును
నొసఁగి గౌరవించె; వెస నంతఁజను దెంచెఁ
బెద్దవిభుఁడు కాశి విడిచి పురికి. 380

క. వచ్చినఁ బ్రసంగవశమున
నచ్చటి వారెల్ల వీరి యవధానములన్
హెచ్చుగ నుతియించుట విని
పొచ్చెము లేనట్టి కూర్మిపొలుపున నొకటన్. 381

క. తనయంతన పిలిపించి సు
జనహితముగ సభ నొనర్చి సంతోషమ్మం
గని తమ్మునిబలెఁ దానును
బొనరిచె గౌరవము గోపభూపతి యలరన్. 382

ఆ. వె. అన్న సభకు వచ్చి యరసిన వేంకట
కృష్ణయాచవిభుఁడు కేవలాద
రమున నన్నరీతి రాంకవాదిక మిచ్చెఁ
దదవరజుఁడు నట్ల తనిపెఁ గవుల. 383

సీ. ఆమీఁద గోపాలభూమీశుతోఁ దిరు
పతివేంకటేశ్వరు పర్వతమ్ము
చూడఁగానేగి యచోఁ గొన్నినా ళ్ళుండి
యాతేనికిఁ బ్రధానమౌ తిరూరి

కటనుండి చనియు నచ్చటఁ గొన్ని నాళ్ళుండి
సెలవుగైకొని మీఁదఁ జెన్నపురికి
నరిగి రెంటాలాన్వయజు సుబ్బరాయనిఁ
గని యవధాన మొక్కండు చేసి

తే. గీ. తత్సహాయమ్ము గొని యటఁ దగినయెడలఁ
గొన్ని యవధానము లొనర్పకోర్కి నున్న
యంతఁ దిరుపతిశాస్త్రికళ్యాణమహము
దరి కరుగుదెంచుటయుఁ బ్రస్తుత మటఁ గదలి. 384

తే. గీ. మరల రావచ్చు నని యెంచి తిరుపతియును
వేంకటేశుండు నాత్మీయవిషయమునకు
సేమముగ వచ్చి రానందసింధుమగ్ను
లైరి తలిదండ్రులును నుపాధ్యాయవరుఁడు. 385

తే. గీ. అవల యానాముపురమున కతిసమీప
మైన యల క్రొత్తపల్లెలో నయ్యెఁ బెండ్లి
మేళతాళమ్ము లెల్ల సమీప మగుట
యానముననుండియే యట కరుగుదెంచె. 386

చ. జరిగె వివాహ మద్భుతరసప్రసరత్కలకంఠకంఠభా
స్వరతరుణీమణీనటనసంగతమంగళవాద్యఘోషవి
స్ఫురితదిగంతరాగతవిశుద్ధచరిత్రధరాసురాధిరా
జరుచిరమంగళశ్రుతిరసప్రథితప్రమదప్రదమ్ముగన్. 387

క. శ్రవణానందాహ్వయకా
వ్యవిరచనకు వలయునంత బహుళమ్మగు వ
స్తువు తిరుపతి పెండిలిలోఁ
గవి వేంకటశాస్త్రి కబ్బెఁ గవితకుఁ దొడవై. 388

సీ. శ్రీమహాలక్ష్మివిశిష్టుఁ డానయశాలి
శ్రీమహాలక్ష్మి విశిష్టుఁ డితఁడు

నీలాచలాదరాన్వితుఁ డాచమత్కారి
నీలాచలాదరాన్వితుఁ డితండు
విబుధరాజస్తవ్యవిభవుఁ డామహితుండు
విబుధరాజస్తవ్యవిభవుఁ డితఁడు
బ్రహ్మగురుత్వవైభవుఁ డాయశోరాశి
బ్రహ్మగురుత్వవైభవుఁ డితండు

తే. గీ. నిరతతిరుపతివిరచితాదరుఁ డతండు
నిరతతిరుపతివిరచితాదరుఁ డితండు
వేంకటేశ్వరుఁ డాతండు వేంకటేశ్వ
రుం డితం డన నప్పుండితుండు తనరె. 389

క. ధవళాచలమం దుండియుఁ
గవి నీలాచలవిహారకథలనె తలఁచున్
నవరసభావం బెచ్చటఁ
గవగూడునొ కవుల కదియ కాఁపుర మగుటన్. 390

తే. గీ. ఇది యిటు ఘటించి వెండితా నినసుతుండు
స్వగృహమును తోడఁబుట్టుల పర మొనర్చి
యింజరమునకు వాసమ్ము నెలమి మార్చె
మఱియు విద్యార్థిభావంబు మానిపించె. 391

క. అవధానాదులఁ దక్కనఁ
గవనం బాంధ్రమునఁ జెప్పఁ గడఁగని యితనిన్
స్వవిశేషమ్మన నాంధ్రపుఁ
గవిగా నొనరించి మొదటి కవనము నిలిపెన్. 392

క. రసికానందంబను చి
న్నిసొగసుపొత్త మ్మొకండు నెఱిఁ జెప్పించెన్
వెస శుకరంభావాదం
బు సంస్కృతము తెల్గొనర్చు బుద్ధి నొసంగెన్. 393

తే. గీ. మఱియు శృంగారరసమున మనముఁ జొన్పు
కతన ననుభవ మెక్కుఁడు కారణముగ
నలరె నెన్నియొ పద్దెము లవియుఁ గొన్ని
కబ్బములఁ జేరె నింకను గడకు మిగిలె. 394

తే. గీ. అవల వైశాఖపట్టణ మరుగఁజేసి
యచట నవధానకారణమైన ద్రవ్య
లబ్ధి ఘటియించె నొక్కింత లాఁతి హేతు
వున మతికిఁ దన మందత ననువుపఱచె. 395

తే. గీ. మఱియు నాయేఁడు నవరాత్రిమహము చేయఁ
జేసె వెండియు గురుని నివాసమైన
ధవళగిరియందు నష్టావధాన కార
ణముగ ధన మొనఁగూర్చి ధర్మమున కిడియె. 396

క. అమలాపురమం దవధా
నము మరలన్ జేయఁజేసె నవరసయుతమై
కొమరారి కవిహితంబై
యమరెడి కాశీసహస్రి మది చెప్పించెన్. 397

తే. గీ. ఇట్టు లా యీ విశేషమ్ము లెలమిఁ గూర్చి
యించుక శరీరరుజ నేసి యేగె శనియు;
నంతట బుధుండు వచ్చి రయమ్ము మీఱ
వెడలఁగాఁజేసె గద్వాలవిభునిఁ జూడ. 398

జయ సం॥ పుష్య బ ౧౩ మొ॥ మన్మథ సం॥ పుష్య బ ౧౦ వఱకు

— కుజునిలో బుధాంతరము —

తే. గీ. వేళ కన్నమ్ము లే దాత్మవిధము రాజు
నకు వచించిననున్ దన్మనంబు చొరదు
తగిన గౌరవమును లేదు ధనము స్వల్ప
మకట ! యేమనవచ్చుఁ బ్రియాణమహిమ. 399

క. ఐనను నారాజుం గనఁ
గా నేతెంచిన ప్రసిద్ధగాయకుల మహో
గానం బొక్కఁ డది వెల యెం
తైనను జేయునని చెప్పనగుఁ దజ్ఞులకున్. 400

తే. గీ. అచటనుండి దేశమ్మున కరుగుదెంచు
తఱిని బెజవాడ నొక సభ జరిగె ధనము
స్వల్పముగ నందు లభియించెఁ జనిరి యచట
నుండి బందరుపురమును వెండి చూడ. 401

క. అందలివా రందఱు నా
నందమ్మున గారవించి నయమొప్పఁగ మేల్
విందు లొనరించి యొక సభ
పొందుగ నొనరించి పేర్మి పొంపిరివోవన్. 402

ఆ. వె. వెనుకఁ బోలె నంత విస్తారమును గాక
మిగులఁ దగ్గుగాక తగినమాత్ర
ధనము వీరి కిడిరి తదనంతరం బాత్మ
పురములకు నిరువురుఁ బోయి రెలమి. 403

సీ. అంత దంగే రనునట్టి గ్రామమున శ్రీ
బులుసు పాపయశాస్త్రి పుత్రపుత్రి
కయ్యెఁ బెండిలి మఱి యావివాహమునకు
నీ మండలమ్మున నెసఁగు నెల్ల
పండితజనులకుఁ బత్రికల్ పంపిన
నందఱుఁ జనుదెంచి రపుడు వీర
లును నేగి రయ్యెడ ననువయ్యెను వివాద
మిందుఁ బండితులెల్ల నేకమైరి

తే. గీ. గాయకుండును నించుక కవియునైన
యల యుపద్రష్టకులజుఁ డత్యలఘుబుద్ధి

సుబ్బరాయమనీషికి నబ్బె వీరి
కతులితంబైన కలహ మయ్యాది వచింతు. 404

తే. గీ. "వలచి" యనఁదగు చోటను "వలసి" యనియు
"నేత్రి" యనఁదగు చోటను "నేతి్రి" యవియుఁ
బలికె స్వరచితమౌ నొక వర్ణమందు
వీర లది తప్పనుటఁజేసి వైర మొదవె. 405

తే. గీ. ఆసభ నెసంగు పండితు లందఱుమ న
సూయ కారణముగ వీరి నాయతగతి
నెదిరి యవి యొప్పులని వచియించి కొంత
పోరి వహియించి రపజయమును దమంత. 406

ఆ. వె. ఇది యిటుండ నంత నేగిరి విజయన
గరపురంబు తేనిఁ గాంచు నిచ్చ
నచటి సభల చిత్రి మట్లుండ గానంపు
వినికి యొకటి కోటివేలు నేయు. 407

క. మును పమలాపురమున వీ
రొనరుచు నవధానమునకు నొగిఁ బ్రేరణచే
సిన ఘనుఁడు లక్ష్మినరసిం
హనామకుఁడు ప్రాడ్వివాకుఁ డటఁ గన్పట్టెన్. 408

తే. గీ. రమణ నయ్యనఘాత్ము దర్శనము చేసి
"విభుని నెలవాయె" నని తమ పేర నచటి
పండితులు బూటకమ్మను బన్ని వ్రాసి
నట్టి యుత్తరమును జూపి యిట్టు లనిరి. 409

తే. గీ. ఈమహారాజు దర్శన మేరికేని
యగుట "దుర్లభ" మని యెంచి యాత్మ నెపుడు
నిటకు రాఁజూడ మెవ్వరో యిట్టి యుత్త
రమును వ్రాసిరి "వేవేగ రం" డటంచు. 410

ఉ. "రాయఁడు శాస్త్రి(వా" లని భరమ్ముగ దీన నెసంగుటన్ దగం
బోయి తదీయ సన్నిధికిఁ బొచ్చె మొకింతయులేక యుత్తరం
బాయన కిచ్చి "మీఁదయిన యాజ్ఞకు బద్ధులమై మిముఁన్ గనున్
రోయుచు వచ్చినార" మన రోజుచు నాతఁడు మాకు నిట్లనెన్. 411

తే. గీ. "ఇదియొకఁడు బూటకము పన్ని యిట్లు వ్రాసె
నంతియే కాని యేనేడ ! నవనిపాలుఁ
డేడ ! నీయుత్తర మదేడ ! నిదిగొ, నాదు
లిపిని జూడుఁ డటం చాత్మలిపిని జూపి. 412

సీ. గతవత్సరము మీరు కదలి విశాఖప
ట్టణ మేగుదెంచి యట బహుదినము
లవధానకారణమగు వాస మొనరించి
పదపడి యిప్పురవరము రాక
వెనుక కేగుటఁజేసి విద్వజ్జనులు కొంద
అది తమ భయమున నంచు నెంచ
మఱికొంద అవ్వారి కరిపక్షము వహించి
మీవిశేషములు పేర్మిని గణించి

తే. గీ. రిదియ కారణమంచు నే నెంతు దీని
కింత యేల ? తనంతన సృష్టికర్త
మీకుఁ బొడకట్టు నాతని వాకు గట్టఁ
గలరు మీర లతండును గవిత నల్లు. 413

క. అవధాన మొనర్చెద నా
కవనిన్ సాటెవ్వరంచు నతఁ డస్మాదృ
క్సవిధమున విఱ్ఱవీఁగు నొ
క విషయమే ? మీకు నిట్టి గర్వ మడఁచుటల్. 414

తే. గీ. ఏది యెటులైన మీ రిట కేగుదెంచు
టస్మదాదుల కెల్ల మోదావహంబు

దైవవశమున మీ కిటఁ దగిన లాభ
మబ్బెనేని నిమిత్తంబ నగుదు నేను." 415

క. అని యాబుధవర్యుఁడు వ
ల్కెను నాతఁడు దోషి గాఁడు కృత్రిమ మిదియె
ల్లను "గాశినాథ" నామం
బునఁదగు పండితుని దనియుఁబోల్చెనతఁడొగిన్. 416

క. అనఁ బ్రాడ్వివాకుఁ డను "మీ
కినదర్శన మగుట బ్రాఁతియే ? యది నేనే
పొనరించెదఁ దమ దర్శన
మును మరలం జేయఁగంటిఁ బున్నెముకలిమిన్." 417

క. అని యెంతే నాదరమునఁ
దన గృహమున నుండఁగోరి ధరణీపతి ద
ర్శనకారకుఁడగు నల మం
త్రి నివాసమ్మునకు వీరిఁ దీసికొని తగన్. 418

చ. చని కని మైత్రి యొప్ప "నృపసంతతికిం దలమానికంబు మీ
జనపతి, యిక్కవీశ్వరు లసాధ్యులు నేఁటి కవీంద్రులందుఁ గా
వునఁ దమ నేర్పు కల్మి నల భూపతి దర్శనమున్ ఘటించి కీ
ర్తి నెగడు టొప్పదే ?" యని విధించిన నా సచివాగ్రగణ్యుఁడున్. 419

తే. గీ. మీరు మిన్నక చెప్పెడివారు గారు
వీర లట్టిరె" యని తన వెనుక ముందుఁ
గొలువుదీర్చిన విద్వజ్జనులను గాంచి
"వీరి నెఱుఁగుదురే ?" యన వార లనిరి. 420

తే. గీ. 'అనఘుఁడై ధవళేశ్వరమందు సత్రి
ముంచి నిర్వ్యాజకరుణ శిష్యులకుఁ జదువు
సెప్పు బ్రహ్మసూరికిఁ బ్రియశిష్యు లనియుఁ
దఱచు వినియుంటి మే మవధాను లనియు. 421

తే. గీ. వీరియొజ్జయు మేమును విద్దెలో స
తీర్థులము చిన్ననాఁ' డని తెల్పుటయును
రమణ నిట్లనుఁ గోదండరామమూర్తి
కవుల దిక్కయి మిగుల వక్రంపుభంగి. 422

ఉ. "అక్రిమభంగి నిచ్చ కగునట్లొనరించితిరే నచుంబిత
ప్రక్రియ, పూర్వకల్పనలు పట్టుట చర్వితచర్వణంబు స
మ్యక్కృతికర్త లిప్పు డరు" దంచు వచించెద నాఁగ, వీరున
వ్యక్రివచఃప్రసంగి సచివప్రివరుం గని నేర్పుమీఱఁగన్. 423

ఉ. "ఈ రనుమాట నిక్క మిటులేనిఁ బురాతనుఁడైన కాళిదా
సూరక యాత్మకల్పనము లోలి రచించెనొ? లేక పూర్వులొ
వారల గ్రింథపద్ధతులఁ బట్టి రచించెనొ? వాని కాలమం
దేరును నిట్టులాడు ఘనులే యసదో? వివరింపుఁడా" యనన్. 424

తే. గీ. అతఁడు యుక్తికి సంతసమంది మీక
విత్వమున శ్లోకములు గొన్ని వినఁగవలయు
ననినఁ గాళీసహస్రిమ్మునందు శ్లోక
మొక్కఁడు పఠించి యర్థము నొగి వచింప. 425

క. అతఁడును జుట్టును గల పం
డితులున్ సంతసము నంది "నేర్పరులును బం
డితమాన్యులు సుకవిత్వ
స్థితి నెగడెడువారు'' నని నుతించిరి పిదపన్. 426

తే. గీ. ఆశుకవితావిశేషసామర్థ్య మరయఁ
దలఁచి యిరువురచేతఁ బద్యములు రెండు
సంస్కృతాంధ్రభాషలయందు సలుపఁజేసి
యనియెఁ గోదండరావు మోదాబ్ధిఁ దేలి. 427

క. మీ యవధానం బొకపరి
మా యీ పండితులదగు సమక్షమ్మున సు

శ్రీయుతముగఁ గావలెఁ బై
నేయది కర్తవ్య మదియునే వచియింతున్. 428

క. నావుడు "వల్లె" యనిరి; పై
నావిభవము జరిగెఁ బండితావళి యది "మో
దావహ" మనియొప్పిరి; పై
భూవరమంత్రి యిటువల్కెఁ బోణిమిమెఱయన్. 429

క. మీరు సమర్థులు మా విభుఁ
డేరికి దర్శన మొసంగఁ డేనే యతఁడై
ధీరవరులఁ బూజించెద
నారీతిగ మిమ్ముఁగూడ నారాధింతున్. 430

క. అనవుడు నుత్తరమును నా
తని కేమియు నీయరైరి తదనంతర మా
మునసబుగారును గాలే
జిని దనరెడి మాష్టరులును జేసి రొక సభన్. 431

సీ. తనపిన్ననాఁ డవధానంపు నేర్పు చూ
పఁగ నేగుదెంచి యప్పార్థివేంద్రు
దర్శించి తన యవధానపుశక్తిని
జూపి యదృష్టంపు సొంపుకలిమి
"నింగ్లీషు చదువరాదే ?" యనునాజ్ఞేని
యానతి గొని దస్త్రివ్య మాతఁడొసఁగ
నెమ్ యే బి యల్ దాఁక నింగ్లీషుచదివి య
య్యాలఘు కారుణ్యమ్మనందియచటి
తే. గీ. పాఠశాలను "ప్రిన్సిపల్" పదవి గాంచె
నతులుఁడు కెశాంబికులుఁడు రామావతార
మెంతయేని యానందమ్మ నెనసె వీరి
దైన యవధాననైపుణీ నరసి; యితఁడు. 432

ఆ. వె. అట్లు సంతసించి యనుకూలమగు రీతి
సత్కరించి బిరుదొసంగి పిదప
రాజుతోడ వీరి రాణ నెల్లను జెప్ప
నెంచి యిట్టు లనియె నెసక మెసఁగ. 433

తే. గీ. "ఇచట జేనిదర్శనము చేయింప మీకుఁ
గలరె? యెవ్వారలేనియుఁ గారకు" లనఁ
"గారకుం డల్ల మంత్రిశేఖరుఁ" డటంచుఁ
జెప్ప "మంచిది" యని తాను జెప్పకుండె. 434

తే. గీ. పైని గోదండరావు సన్మాన మాచ
రించి పంపించుటకును యత్నించుటయును
"దర్శనంబీని మీ రాజుద్రవ్య మొల్ల"
మనిరి వీరలు సరసమై యలరు పగిది. 435

తే. గీ. అంతఁ గోదండరావు "నాదైన జాత
కంబు మీ జాతకము ధరాకాంతు జాత
కంబు మూఁ డుచ్చరీతిని గ్రాలునేని
ఇది సఫలమగు" నని వచియించి పిదప. 436

తే. గీ. అనఘు రామావతారసమాఖ్యుఁ గాంచి
"కవులు మన జేని దర్శనకాంక్షఁ జేసి
యుంట మీరు నెఱుంగుదు రొప్పికొనరు
దర్శనములేని సన్మానదశకు వారు. 437

తే. గీ. మీరును శతావధాను లౌవారు గాన
వారి శక్తి నెఱింగినవార లట్లు
గాన మన జేఁడు మీమాట కాదనక గ్ర
హించు నిఁక నొక్కమా టదియే వచింతు. 438

క. నవుకరు లయ్యును మీరలు
మివులఁ జనవు గలిగినట్టి మిత్రులు; మేమో

నవుకర్ణమె, కావున మీ
ౘరు వచించితిరేని యిదిజరుగు నిక్కముగన్." 439

తే. గీ. 'వ్రల్లె' యని యత్న మాతండు వలయునంత
సలిపి విఘ్నము లెన్నేని గలిగినను దు
దకు నొకానొక దినమున దర్శనం బొ
సంగఁగాఁజేసె నా రాజచంద్రుచేత. 440

క. ఆనందగజపతీంద్రుఁడు
గానమ్మన హూణభాషఁ గవనమునందున్
నానాశాస్త్రములందున్
దా నిపుణుఁడు వేతొకరుఁడు తత్సముఁ డగునే. 441

తే. గీ. సరసపండితమండలీసహితుఁ డగుచు
నతఁడు తనమీఁది పద్యము లన్నియు విని
సంతసించి శాస్త్రంపుఁ బరిస క్తియుఁ గని
కవుల కిట్లనె నాదృతి చపుకళింప. 442

క. రామావతార మెద నెం
తే మోదము చెంది మీకు నిచ్చెఁగదా! యీ
హేమంపుబిరుదు; లియ్యది
సామాన్యము గాదు మెచ్చఁజను మీశక్తిన్. 443

క. అని ప్రతివత్సరమును రం
డని యానతి యిచ్చి నూఱులాఱు లొసఁగి మ
న్ననఁ జేసె నట్టి ఱేనిం
గనఁబోల, దతండు ఘనుఁడు కళలం దెల్లన్. 444

తే. గీ. రాజనఁగ నాతఁడే, మంత్రిరాట్టనంగ
నాతఁడే, మునసబనంగ నతఁడె, వితత
సకలవిద్యలకు నిదానసదనమైన
పురమనఁగ నయ్యదియ, యొండు పుడమి లేదు. 445

సీ. తదనంతరమునఁ జిత్రాడనివాసుఁడు
బ్రహ్మయశాస్త్రికిఁ బట్టుఁగొమ్మ
శ్రీ పీఠికాపురీనృపతికి శ్వశురుండు
చెలికానివంశాబ్ధిశీతకరుఁడు
సంస్కృతాంధ్రికవిత్వసారస్య మెఱిఁగిన
జాణ దాతృత్వవిస్తారకరుఁడు
శ్రీ జగన్నాథతాప్ఛేఖరు సమ్మాన
మంది కొండొకకాల మరుగునంత

తే. గీ. క్రొత్తపల్లెనివాసి సుగుణుఁడు రావు
జగ్గభూపతి సంపూర్ణ శతవధాన
మును నొనర్పించి యిచ్చిన ధనమును గొని
మరల గద్వాల కేగిరి మహిపుఁ జూడ. 446

తే. గీ. అంతఁ గేతువు చనుదెంచి యతిరయమున
నచటి విద్వాంసుతో వైర మబ్బఁజేసి
యట జయము గూర్చి శతవధానాతితుష్టుఁ
డైన నరపాలు సమ్మాన మనుఘటించె. 447

మన్మథ సం॥ పుష్య బ ౧౦ మొ॥ దుర్ముఖి సం॥ జ్యేష్ఠ బ ౩ వ॥

—• కుజునిలో కేత్వంతరము •—

తే. గీ. అతఁడు శ్రీరామభూపాలుఁ డతివితరణ
శాలి ప్రతిమాఖమాసంబు సత్కవులకు
గాయకాదులకును విద్యఁ గాంచి ధన మొ
సంగుఁ గార్తికమున వేదశాస్త్రములకు. 448

తే. గీ. అచ్చటి పరీక్షకుఁడు వైష్ణవాన్వయజుఁడు
శాస్త్రి యగుఁగాని కవిగాఁ, డసత్యమునకు
జంకక నృపాలుసన్నిధి బొంకు లెన్ని
యేనియును నూఱిపోయుచు నెలమి నుండు. 449

తే. గీ. శని యనెడి నామ మితనికి సంతరించి
యెలమిఁ జెప్పిన పద్యము లితని గుణగ
ణమ్ముల వచింపఁగాన వైష్ణవుని నితని
విస్తరింపక యింతతో విడుచుటొప్పు. 450

తే. గీ. మంచి రాంకవములును, హేమంపు బిరుదు,
లరిది జయపత్రికయు, నూఱులాఱు, లివియు
నిట్టు లుండఁగఁ, బ్రతిపక్షి యెదుట జేఁడు
'తగిన కవిచంద్రు' లని సారె పొగడు టొకటి. 451

క. ఆ యీ బహుమానము ల
త్యాయతగతి స్వీకరించి యచ్చోటు విడిచి సు
శ్రీయుతులై దేశమ్మున
కీ యిరువురు నేగుదెంచి రెనక మ్మెసఁగన్. 452

తే. గీ. అంతఁ గేత్వంతరము సగమాయెఁ బిదప
వ్యాధిపీడయు బంధుశుభప్రసక్తి
నలిపి రాజసమ్మానమ్ము సంతరించి
యవుల నరసాపురమ్మున కరుగఁజేసె. 453

దుర్ముఖి సం॥ జ్యేష్ఠ బ ౭ మొ॥ హేమలంబి సం॥ శ్రావణ బ ౭ వ॥

—• కుజునిలో శుక్రాంతరము •—

తే. గీ. అచట సభఁజేసి సమ్మాన మందుపిదప
శుక్రుఁ డేతెంచి తనువున సుఖము గూర్చి
మొగలుతుర్తినృపాలు సముఖమునకును
వెడలఁగాఁ జేసె నెంతయు వేడ్క యలర. 454

తే. గీ. అతఁడు లక్ష్మీనృసింహసమాహ్వయుండు
సరసుఁ డతిదాత సాహిత్యసరణి నెఱుఁగు
మహితుఁ డాతనిఁ బోలెడి మహిపుఁ డొక్క
విజయనగరాధిపతి వేనవేలయందు. 455

క. సామాన్యమైన దశ నా
భూమీపతి యుండియున్ విపులమౌ ధనమున్
హేమంపు బిరుదములు తా
నామెయి నవధానమైనయపు డిడె నెలమిన్. 456

ఆ. వె. పాలకొల్లునందుఁ బాఁవడి యవధాన
మొకఁడు జరిగె నిది యటుండఁ గొణితి
వాడ "ప్రొపప్రయిటరు" బ్రాహ్మణకులజుండు
తా నొసంగెఁ గొంత ధనము నెలమి. 457

తే. గీ. ఇరువురను నిండ్ల కేగి యధేష్టసుఖము
లనుభవించుచు విజయపురాధినాథు
మరలఁ గనుఁగొను వేడుక నరుగుచుండు
నంత నొగిఁ గాకినాఁడ నున్నట్టి హితులు. 458

క. కొంద అవధానమును మఱ
లం దగఁ జూడవలెనంచు లలి నిలిపి మహా
నందమ్మున నవధానము
పొందుగఁ జేయించి పూర్వపువిధం బెసఁగన్. 459

తే. గీ. బహుమతి నొసంగి మఱియును బ్రబలభక్తిఁ
జిన్నచిన్న సభలు గొన్ని సేయుచుండ
విజయనగరేశ్వరుని జూడ వేడలు బుడిగి
యుండి రప్పురవరమున రెండు నెలలు. 460

తే. గీ. రమణ వాద్రేవు వేంకటరత్నమంత్రి
యంతఁ బిలిపించి యవధాన మాచరింపఁ
జేసి నూటాఱు లిచ్చె విశేషగౌర
వం బెసఁగఁ బీఠికాపురవరమునందు. 461

క. శ్రవణానందము పూర్తిం
దవిలించుట యిహపరప్రదము దేవీభా

గవతముఁ దెలిగించుటకై
యవలంబించుటయు శుక్రునందు ఘటించెన్. 462

ఆ. వె. వంటపూటి విందు, వారాంగనల పొందు,
దానఁజేసి కందు, దానఁ గుందు
స్వపరపురుల సందు సారెసారెకుఁ గందు
కంబు భంగి యిందుఁ గలిగె నెందు. 463

క. తనయింటన్ శుభకార్యము
లనూనముగ జరుగుటయును నర్థవ్యయమున్
ధనఋద్ధియు సంగీతం
బనుపదమును వినుట దీనియం దెపు డొప్పెన్. 464

తే. గీ. ఇట్లు శుకాంతరము సగం బేగుపిదప
మరల గద్వాల కేగి యమ్మహిపుఁ డొసఁగు
వార్షికముగైకొని సమీపవర్తి యైన
యాత్మకూరిరాజ్యమ్మున కరిగి రెలమి. 465

తే. గీ. అచటి ఱేఁడు సీతారాముఁ డనెడి ఘనుఁడు
గద్దవాలాధిపుని బోలె విద్దె లెల్ల
రహిఁ బరీక్షించి ప్రతివత్సరమును వార్షి
కము లొసఁగు; నటఁ బండితుల్ గలరు పెక్కు. 466

తే. గీ. అందు శ్రీనివాసాచార్యుఁ డధికుఁ డితఁడు
చదివికొన్నది తర్కమ్ము, సంగ్రహించి
నయది వ్యాకరణమ్ము వైష్ణవుఁడుగాన
నన్నివిద్దెలు నే నేర్తు నని వచించు. 467

తే. గీ. గద్దవాల నృసింహార్యుకన్న నితఁడు
కవిత నధికుఁడు తెల్గను కర్మ మించు
కయు నెఱుంగక యద్దానఁ గలియఁబడిన
కారణమ్మున సికపట్లు గలిగె నిచట. 468

క. అది యెట్టులన్న వివరిం
తుఁ దగన్ దన్నృపతి మొదలఁ దోరపు భక్తిన్
సదమలమగు చిత్తమ్మున
గదియించి విశేషముగను గౌరవ మిచ్చెన్. 469

తే. గీ. ఇచ్చి వీరల గ్రంథమ్ము లెల్ల వినుచు
శ్రీనివాసవిలాసమ్ము చేతి కిచ్చి
"దీనిఁ దెనిఁగించి మాకుఁ గృతిగ నొసంగుఁ"
డనుచుఁ గోరె విద్యాసక్తి యినుమడింప. 470

తే. గీ. అది సహింపమి శ్రీనివాసార్యుఁ డెట్టు
లేని "వీరల కవనమ్ము మాననీయ
తార్హమైనది కా" దని యంతరాయ
మును ఘటింపఁగఁ దనమనంబునఁ దలంచి. 471

సీ. వేడ్కమైఁ బతికి దేవీభాగవతమును
వినిపించు పట్టున వెదకి తప్పు
పట్టెడి తలఁపుతో నెట్టనఁ గూర్చుండి
యచ్చటనచ్చట నడిగి కొఱుకఁ
బడమికిఁ జింతించి దుడుకున నొక పద్య
మందు "గుణాలయ" యనెడి పదము
"త" ప్పని వాదంబు తద్దయుఁ జేయుడు
"నిది తప్పు గా" దని రిక్కవీంద్రు

తే. గీ. లంత "నిది యే సమాస" మటంచు నడిగి
"తత్పురుష మన్న" "నిప్పుడు తప్ప దిది య
థార్థముగఁ దప్పు త" ప్పని యతఁడు వల్క
గవు లతని కుత్తరము సెప్పఁగడఁగి రిట్లు.

సీ. "నిత్యపుంలింగమై నెగడు సంస్కృతమున
నియ్యది తెలుఁగున నిపుడు తత్స



మంబయి డిగి యంత మహిళావిశేషణ
మయి మహత్తను నమహత్తు గామి
డు ము లు చెందక సులోపము మాత్రమేచెందె
నిదిగాక తెల్గున నెల్లయెడలఁ
దఱచు లింగం బర్థతత్పరమై యుండు
భారతాదులనిది స్పష్ట" మనుడు

తే. గీ. "భారతకవిత్వ మది దోషభాజనంబు
గాన నే నొప్పననియె" నాఘనుఁడు పిదవ
భారతం బొప్ప నను టంత పాడి గా ద
టంచుఁ బార్థివుఁ డది యొప్పున ట్లొనర్చె. 473

సీ. తదనంతరము "దేవతలు ధర్మవర్తు" ల
నియెడి ప్రయోగంబు నయమెసంగ
నిచ్చి "తెన్గున నర్థమే ప్రధానం" బని
సాధింప "నచట నక్షరము తప్పు
వడె, 'ధర్మవృత్తులన్' బాఠంబు సాధు" వ
టంచు నొడువుటయు నట్టి వెన్ని
యో ప్రయోగమ్ములనొక్కమ్మడిగ నీయ
"నవియన్నియునునచ్చునందుఁబడిన

తే. గీ. తప్పులే" యంచు మొండి వాదమ్ము సేయఁ
బూనె నీరీతి నొక మూఁడు పూట లాయె
వాద మటుపిమ్మటను మధ్యవర్తు "లిట్లు
పలుకఁ దగ" దని యాతని వా దుడిపిరి. 474

సీ. అట జరిగిన వాద మంతయు వివరింప
గ్రంథవిస్తర మగుఁగాన దాని
విడిచి ముఖ్యాంశంబు వినుతుఁ బిమ్మట "తేఁడు
మొదటనిచ్చిన గ్రంథమును దెలుఁగొన

రించి యార్నెలల కేతెంచిన మీకు వి
శేషసత్కారంబు సేయుదు'' నని
తగఁ బ్రతిజ్ఞ నొనర్చి తాంబూల మిచ్చెఁ బ
దంపడి వీరును ద్వరయెలర్ప

తే. గీ. దేశమున కేగుదెంచి యెంతే ముదమున
నెవరి యిండ్లకు వారేగు నింతలోన
దారి గుంటూరిలో నవధాన మొకటి
జరిగెఁ గాని ధనప్రాప్తి జరుగలేదు. 475

తే. గీ ఇంటికేగిన తత్క్షణ మితని దేహ
మందు నొక్కింత పీడ దా ననువుపడియె
దానిపై ఋణబాధయుఁ దారసించెఁ
గాని యెందును లోపంబు గలుగఁబోదు. 476

తే. గీ. ఆత్మకూరినృపాలకుఁ డానతిచ్చి
నట్టి గ్రంథంబు తగ నల్లనల్లఁ దెలుఁగొ
నర్చుచును గాకినాఁడలోఁ గూర్చు నొక్క
యిల్లు గాఁపురముగ నితఁ డెలమి నుండె. 477

తే. గీ. వాడకట్టువంశమ్మునవాఁడు బుల్లి
రాజనెడి వైశ్యవర్యుండు రమణఁ దనదు
సౌధమున బసయిచ్చి విస్తారమైత్రి
యెసఁగ నితఁ డేమి యడిగిన నిచ్చునదియు. 478

తే. గీ. అప్పు డొదవినయట్టి ద్రవ్యంపులేమి
యనెడి సంద్రంబు నీఁద నీ యలఘుఁ డొక్క
తెప్పయై యించుకేనియుఁ దేజ మెడల
నీక గాపాడె మఱచుట యెట్టు లితని. 479

చ. మును పవధాన మొక్కటి సమున్నతిఁ జేయఁగఁజేసె,నంత నిం
ట నయినయట్టి పెండ్లికి హుటాహుటి ద్రవ్యము పంపె, నాత్మకూర్

చనుటకు ఖర్చొసంగె;నిటు పారెకుఁ దా నుపకారకారియై
తనరెడి బుల్లిరాజునకు దైవ మొసంగుఁ జిరాయురున్నతుల్. 480

క. సోమన్న యనెడి శిష్యుఁడు
పేర్మిమెయిన్ వంటఁ జేసిపెట్టఁగ ద్రవ్యం
బీమెయిఁబులిరాజిడఁ గవి
తామహిళాసౌమనస్యతత్పరుఁ డయ్యెన్. 481

తే. గీ. అంత రెండవ భగిని లోకాంతరగత
యగుట లోనగు మఱికొన్ని యాపదలు త
టస్థమై దేహమందును స్వస్థత చెడె
నవల రవి వచ్చి సుఖము దేహమున కిడియె. 482

హేమలంబి సం॥ శ్రావణ బ॥ ౭ మొ॥ మార్గశీర్ష బ॥ ౧౩ వ॥

—• కుజునిలో రవ్యంతరము •—

తే. గీ. రమణ వాడేర్వు వేంకటరత్నమంత్రి
సౌధమునఁ గూరుచుండి పరిశస్తగతిని
శ్రీనివాసవిలాసంబు చెప్పి రతఁడు
సర్వవిధముల మర్యాద సలుపుచుండ. 483

తే. గీ. అంతఁ గిర్లమపూడికి నరిగి చిన్న
రాయనృపశేఖరుని నవరాత్రిమఖను
దీక్షితుని గాంచి నూఱార్లు దీసికొని ర
రయమ్మమై నాత్మకూరికి నరిగి రెలమి. 484

సీ. ఆనృపాలుం డప్పు డంబాపురమ్మునఁ
గురుమతి గిరిపతిఁగూర్చి గొప్ప
యుత్సవమ్మను జేయనూహించి తనదగు
సేనతో నటకు విచ్చేసియుండ
వీరును రయమునఁ బృథ్వీశ్వరునిఁ జూడ
నట కేగుదెంచి యచ్చోటను జేనిఁ

గాంచి యాయుత్సవకాలమ్ము నెల్లనా
తనియాజ్ఞ నక్కొండదరిని గడపి

తే. గీ. రా కురుమతీశుమహిమ మత్యద్భుతంబు
మఱియు నయ్యుత్సవం బతిమానుషంబు
వేయి చెప్పఁగనేల ? యావేడ్కఁజూచి
తీరవలెఁగాక లేకున్నఁ దెలియు టెట్లు ! 485

తే. గీ. ఆకురుమతీశుఁ డనెడి రమాధినాథుఁ
డీనృపాలుని యిలువేలుపైనకతనఁ
దగఁగఁ బ్రతివత్సరమ్మ నుత్సవము లిట్లు
చేయుచుండును భక్తిసుశ్రీలు నెలఁగ. 486

తే. గీ. ప్రకృత మాంధ్రీకరించిన గ్రంథమందు
వర్ణ్య మద్దేవుపరిత్యబ్దమై భవంబు
గాన తేఁ డీకృతిని వినఁగాఁదలంచె
నుత్సవపుఁగాలమున దేవునొద్ద నుండి. 487

క. ఆ కారణమున వీరికిఁ
జేకూరెన్ గొండదరి వసించుట మహిత
శ్రీకాంతోత్సవ మెంతయు
నేకాలము మదికి వేడ్కలెసఁగింపంగన్. 488

తే. గీ. ఉత్సవప్రసక్తిచే నృపాలోత్తమునకు
గ్రంథమును వినుటకుఁ దగుకాల మబ్బ
దయ్యెఁ బదపడి తేఁడు దా నాత్మకూరు
పురమునకు నేగె నొక మాసమునకుఁ గడఁగి. 489

తే. గీ. అంత వీరును తేనితో నాత్మకూరు
పురమునకు నేగి మిగుల నాదరముతోడ
నృపుఁడు మన్నింప గ్రంథమ్ము నెపుడు విన్క
చేయుదు మటంచు నచట వసించుటయును. 490

తే. గీ. కొన్ని యంతరాయము లొడఁగూడుటయును
గ్రంథమును వినుటకుఁ దగ్గకాల మా నృ
పాలునకుఁ గల్గదయ్యె నా ప్రోలియందు
నంత నెల్లెడ జ్వరబాధ లలమఁ దొడఁగె. 491

తే. గీ. వంటబ్రాహ్మణునకును దిర్పతికవికిని
జలియు జ్వరమును బాధింపసాఁగె వేంక
టేశ్వరుండును విద్యార్థి యీయిరువురు
దానిబారిని బడకుండఁ దక్కి రెలమి. 492

తే. గీ. రాజు సర్వవిధముల మర్యాద సేయఁ
దమకు విద్యార్థి సోమన్న తగువిధమున
నెల్లయుపచారము లొనర్ప నిట్టు లుండు
నంతఁ జంద్రాంతరము వచ్చె ననుగుణముగ. 493

హేమలంబి సం॥ మార్గశీర్ష బ ౧౩ మొ॥ విలంబి సం॥ ఆషాఢ బ ౧౩ వ॥

—• కుజునిలో చంద్రాంతరము •—

తే. గీ. అంతఁ దిరుపతిశాస్త్రి దేహమునఁ గొంత
కలిగె నారోగ్య మది రాజు గాంచి గ్రంథ
మును వినంగ మొదల్వెట్టె ఘనులు పండి
తులు తనకు మంచిచెడ్డలు దెలుపుచుండ. 494

తే. గీ. గ్రంథమును వినిపించెడి కాలమందుఁ
గలిగిన వివాదముల నెల్లఁ దెలుప నొక్క
భారతంబంత యగుఁగాన వదలి ముఖ్య
మైన యంశఁబు దెల్పెద దాని వినుఁడు. 495

క. పదునైదు దినములకు నె
మ్మదిగా గ్రంథమ్ము విని సమగ్రానందా
స్పదుఁడై భూపతి యెంతయు
సదయుండై వీరి నిట్లు సన్మానించెన్. 496

సీ. మంచి విలువగల్గి చంచలాకాంతులఁ
బురుడించు మేల్ జరీపుట్టములును
కనులకు మిఱుమిట్లు గలిగించు సొబగున
వాలాయమును బొల్చు నేలువులను
పదియాఱువన్నెకుఁ బైవచ్చు బంగారు
తో రచించిన చంద్రహారములును
"సర్దాంగులకునివి" యంచు మేల్ చీరలు
పైరెండునూఱార్లు బహుమతిగ నొ
తే. గీ. సంగి యేనుఁగు నెక్కించి సకలపండి
తులును వెనువెంట రాఁగ శత్రులకు ఖేద
మెల్ల మిత్రులకును మోద మినుమడింపఁ
బేర్మి నూరేగఁజేసెఁ బృథ్వీధవుండు. 497

తే. గీ. అదియునుం గాక ప్రత్యబ్దమందు రెండు
నూర్లు వచ్చెడి భూమియును నిడి సముచి
తమ్ములగు భాషణమ్ముల నమ్మహీపతి
గౌరవించెను మోదంబు తోరముగను. 498

సీ. గద్వాలలోపల ఘనుఁడు శ్రీరామభూ
పాలుఁ డొసంగెడి వార్షికంబు
కైకొంట, యానందగతిని వర్తించుట,
యపురూపమౌ మనోహరపు గాన
రసము గ్రోలుటయు, సరసమగు రీతి దే
వీభాగవతమును వేడ్కఁ దెల్గు
సేయుచునుంట, వాసిగ శ్రవణానంద
కావ్యమ్మునకు మార్పు గలుగఁజేయు
తే. గీ. టయును, శ్రీలక్షణాపరిణయము నూత్న
గతి రచించుటయును నింతకన్న మున్ను

గలిగె నీరీతిఁ జంద్రుని కాల మర్ధ
మరిగెఁ బైసంగతులు వినుఁ డాదరమున. 499

క. కరి నెక్కి డిగినదాదిగఁ
దిరుపతి వేంకటకవులకుఁ దీఱనిగతిఁ దా
జ్వర మది ప్రారంభించె
న్నరపతి "యిదియేమి" యని మనంబునఁబొగులన్. 500

తే. గీ. జ్వరమునకు లక్ష్యపెట్టక చయ్యనఁ దమ
దేశమున కేగునిచ్ఛ మదిని గలంప
రాజునానతిఁ గొని యప్పురంబు విడిచి
చనిరి రంగాపురం బట జ్వరము హెచ్చె. 501

సీ. అచ్చటి నరపాలుఁ డతియోగ్యుఁ డీనర
పాలురఁబోలెఁ దాఁ బండితులకుఁ
బ్రతివత్సరమ్మును వార్షికమ్ముల నిడుఁ;
నయ్యెడఁ బండితు లనఘమతులు
వారిలో నుత్తమప్రఖ్యాతి నొప్పు రం
గాచార్యుఁ డనియెడి యనఘుఁ డితఁడు
వైష్ణవుఁడయ్యును బరమతంబునయందు
నెఱుఁగఁ డసూయ నొకింతయేని

తే. గీ. ఇతఁడు వీరల సంగతి యెల్ల నాత్మ
కూరియందు నెఱింగిన కారణమున
రాజుతోఁ జెప్పి మిగుల గౌరవ మొనర్చు
నట్లు ఘటియించె యోగ్యత కదియ గుఱుతు. 502

క. జ్వరబాధాపరిభూతులఁ
దిరుపతివేంకటకవికులధీరులఁ గని య
న్నరపతి యిట్లనుఁ బండిత
వరుల సమక్షమునఁ బేర్మి వడ్డికిఁ బాఱన్. 503

సీ. గద్వాలలో మీకుఁ గల్గిన వాదును
నాత్మకూరున మీకు నైన గౌర
వమ్మును బండితుల్ పరిపరి చెప్పఁగా
నింతకుమున్న మి న్నెఱిఁగినాఁడఁ
గాని మీ రీదేశగమనంబు మొదలిడి
నాల్గేఁడులయ్యెను నన్నుఁ జూడ
రాకుండి, రిప్పటి రాకచే నానంద
మబ్బె మీదైన శతావధాన

తే. గీ. మరసి మీచేత నొక గ్రంథ మాత్మకూరు
నృపతియుం బోలెఁ గొనఁగ నే నిచ్చగింతు.
నదియునుం గాక మీదైన యాశుధార
మొదల విని సంతసింప నెమ్మదిఁ దలంతు. 504

క. ఏదేని యొక్క పద్దెము
మోదముమైఁ జెప్పుఁ డనుడు భూమీశునితో
నాదరదైన్యము లొప్పఁగ
నాదం బొక భంగియై కనంబడ వీరల్. 505

క. పలికి రిటు లోనృపాలక!
తలమునిఁగె జ్వరంబు వాక్కు తడఁబడియెడి మా
తల మే? యాశుకవనమును
జలుపుటకును మీకు ముదము సమకూర్చుటకున్. 506

క. అవధానరచన గానీ
కవనవిధానంబు గాని కవివరులకు బు
ద్ధివిశేషం బారోగ్యము
దవులనిచో నెట్లు పొసఁగు ధరణీశమణీ. 507

సీ. అని చెప్పి యచ్చట నానృపాలకుఁ డిడు
విత్తమ్ము గైకొని వేగ దేశ

మన కెట్టు లెట్టులో చని యాత్మవాసంబు
లిరువురుఁజేరి; రిట్లిల్లు చేరు
టకుఁ బూర్వమే వీరి కొకకొంత జ్వరము మా
ర్గమ్మున శమియించెఁ గానికేవ
లమ్ము నిశ్శేషమై లావఱ కప్పుడ
ప్పుడు పీడఁగొల్పఁగ మొదలువెట్టెఁ

తే. గీ. జంద్రు నుత్తరఖండమ్ము జరుగుదనుక
జ్వరము మఱికొన్ని పీడలు సందడింప
నితఁడు వానిని లెక్కింప కెల్లవేళ
హేలగాఁ గాలయాపన మెసఁగఁజేసె. 508

సీ. కలఁడు పర్భిభాక రాఖ్య నెసంగు కవిమణి
గద్వాలలోపల ఘనుఁ డతండు
తిరుపతివేంకటేశ్వరులకుఁ బరమోప
కారంబు గద్వాలకాంతు నొద్దఁ
గావించె ము; న్నట్టి కారణమ్మున నాయ
లఘునకు వీరి కలవడె మైత్రి
యాతఁ డీయెడల దేశాటనాదరుఁడయి
యీదేశమును జూచునిచ్చ వీరి

ఆ. వె. తోడ నేగుదెంచి పోడిమి వేంకటే
శుని నివాసమునకుఁ జనవుమీఱ
వచ్చి యాతఁ డిట్లు జ్వరపరీతుం డగు
టకు మనమ్మునందు వికలుఁ డగుచు. 509

తే. గీ. ఇతని యాదృతి మైత్రియు హేతువులుగ
నింజరమ్మున వసియించె నితని యింట
నిక్కవివతంసు సహవాస మెసఁగుకతన
వ్యాధిబాధ యాతని కగుపడకపోయె. 510

—• విలంబి సం॥ ఆషాఢ బ ౧౩ మొ॥ నల సం॥ ఆషాఢ బ ౧౩ వ॥ •—

—• రాహుమహాదశ •—

ప్లవ సం॥ చైత్రి శు ౧౦ వఱకును ఇందు రాహ్వాంతరము.

విలంబి సం॥ మార్గశీర్ష బ ౯ వ॥

—• రాహ్వాంతరములో రాహువిదశ •—

తే. గీ. అంత రాహుమహాదశ యనుగమించె
దేహసౌఖ్యమ్ము క్రిమముగా దీటుకొనియె
వ్యాధిపీడ యొక్కింత తా నడరుకతన
నింటనే కాలయాపన మితఁడొనర్చె. 511

తే. గీ. పిదపఁ గిర్లమపూడి పృధ్వీధవుఁడు
జనహితుం డతిదాత విశాలహృదయుఁ
డైన శ్రీ చిన్నరావు తా నాచరింపఁ
జేసె నష్టావధానంబు శ్రీ యెసంగ. 512

తే. గీ. అవిభుఁ డొసంగు వార్షిక మంది పిఠి
కాపురము వచ్చి యచ్చట ఘనులు మెచ్చ
నూఱులాఱులు భూమియు నూత్నవస్త్ర
ములును గైకొనుటబ్బె సలలితరీతి. 513

మ. శ్రిపణానందము వాడరేవుకులభాస్వజ్జ్యోతి యాసక్తి లోఁ
దవులన్ వేంకటరత్నమంత్రి కృతిగాఁ దాఁ గైకొనెన్ భూమిలో
నవు సమ్మానము లాతఁడే యొనరిచెన్, వ్యాపించె శ్రీ దేవి భా
గవతం బాంధ్రిమొనర్చు పూనికయు నిక్కాలమ్మునందే తగన్. 514

విలంబి సం॥ మార్గశీర్ష బ ౯ మొ॥ వికారి సం॥ వైశాఖ శు ౪ వ॥

—• రాహ్వాంతరములో గురువిదశ •—

క. గురువిదశ యంత వచ్చియు
శరీరరుజ మొదటఁ గూర్చి సరగున నారో

గ్యరమం గూర్చి పదంపడి
స్వరమణితోఁ గాఁపురపుఁబ్రసక్తి ఘటించెన్. 515

తే. గీ. రమణ నేలామహాత్వవిరచనకు మొద
లిడుట, మిత్రగృహమ్ముల నెసఁగెడి శుభ
కార్యముల కేగుటయు, దీనఁ గలిగెఁ దఱచు
రాజబంధుల మైత్రి, దారసుఖరక్తి. 516

క. వీరవరగ్రామమ్మున
ధీరులు మెచ్చ నవధానధీ నెఱపిరి పై
సారసబంధుతనూజుఁడు
తారసమయ్యెఁ విదశకుఁ దరుణం బగుటన్. 517

వికారి సం॥ వైశాఖ శు ౪ మొ॥ ఆశ్వయుజ శు ౮ వ॥

—• రాహ్వాంతరములో శని విదశ •—

తే. గీ. ఆదికాలమ్మునందు వీఁ డాత్మమంద
తను గనంబడఁజేసి యంతఁ దగురీతిఁ
బోలవరపు జమీందారు నోలి మిత్రుఁ
గా నొనర్చె మహోన్నతికారి యగుచు. 518

తె గీ. ఆతఁ డింగ్లీషుభాషలో "నార నాల్డు"
కవి రచించిన బుద్ధుని కతను దెల్గుఁ
జేసి కృతితన కిమ్మని వాసి యలరఁ
గోరెఁ దిర్పతి వేంకట ధీరకవుల. 519

తే. గీ. రమణ నిది గాక రామచంద్రపురమందు
నాలమూరునఁ గపిశేశ్వరాఖ్యపురిని
గొత్తపేటను ధనము చేకూరె శతవ
ధాన మష్టవధానంబు దవులు కతన. 520

తే. గీ. అంత నమలాపురమునకు నరుగుటయుచు
నచట నివటూరికులజుఁ డయ్యన్నమంత్రి

పౌత్త్రమొక్కండు రసయుక్తముగ నొనర్చి
తనకుఁ గృతిగా నొసంగఁ బ్రార్థనమొనర్చె. 521

వికారి సం॥ ఆశ్వయుజ శు ౧ మొ॥ మాఘ బ ౧౧ వఱకు

—• రాహ్వంతరములో బుధవిదశ •—

సీ. బుధుఁ డంతఁ దా వచ్చె, బుద్ధచరిత్రంబు
రచియించుటయుశ్వశురగృహమందుఁ
దఱచు నుండుటయును దండ్రికినెక్కుడౌ
గురువరేణ్యుఁడుస్వర్గమరుగుటయును
ఈజాతకగ్రంథ మెలమిమై మొదలిడి
వ్రాయుచుండుట దేవిభాగవతము
నందలి తరువాయి యప్పుడప్పుడు శ్రద్ధ
పేరేప నాంధ్రీకరించుటయును

తే. గీ. ఉన్న గృహమును వీడి వేఱొక్కయెడకు
నేగుటయు నిల్లుగట్టుట కెలమి మొదలు
పెట్టుటయు గద్దవాలకై వెడలి త్రోవ
లోన రుజహేతువుగ మరలుటయుఁ దొడరె. 522

వికారి సం॥ మాఘ బ ౧౧ మొ॥ శార్వరి సం॥ చైత్ర బ ౧ వఱకు

—• రాహ్వంతరములో కేతువిదశ •—

తే. గీ. అంత దేహమ్ములో సుఖ మనువుపడియెఁ
బిదపఁ గేతువిదశ వచ్చె; వీఁడు గేహ
నిర్మితికి యత్న మెంతయేనియును బొసఁగఁ
జేసి భూధనలాభముల్ చేసి మించె. 523

శార్వరి సం॥ చైత్ర బ ౧ మొ॥ ఆశ్వయుజ శు ౫ వఱకు

—• రాహ్వంతరములో శుక్రవిదశ •—

తే. గీ. అంత శుక్రుండు చనుదెంచి యమరవిభు స
మానుఁడైన శ్రీ చిన్నరాణ్మానవేంద్రు

తోడ శ్రీపాలతేరను వీడు చూడ
వెడలఁగాఁజేసి గౌరవవిభవ మొసఁగె. 524

క. అట నవధానం బొకఁ డు
త్కటమగు గతి జరిగె నచటఁగల వెలమదొరల్
పటుమతులు కళాచతురులు
ఘటకులు ధనికులును సుకవికల్పద్రుమముల్. 525

తే. గీ. మఱియు నయ్యెడఁ జిన్నరాణ్మానవేంద్రు
కతన నెంతయు హేలగాఁ గాలయాప
నమ్మొనర్చు టొదవె నరనాథులందుఁ
గలఁడె తత్తాదృశుండు సఖ్యమ్మొనర్ప? 526

క. నిజదేశమ్మున కేగుచు
గజపతినగరమున సభను గావించియుఁ బై
విజయనగరముం గవి యం
తఁ జనిరి వైశాఖపట్టణముఁ గనుఁగొనఁగన్. 527

తే. గీ. అచట విక్రమదేవవర్మాఖ్యు నతియు
దారుఁ గవితావిధిజ్ఞు నుదాత్తచరితుఁ
గాంచి యవధాన మొనరించి కదలి వీర
వరమునకు నేగి రిర్వురు త్వర యెలర్ప. 528

క. అట నేలామాహాత్మ్యము
పటుమతియగు సర్వరాయపాదజునకు ను
త్కటయశునకుఁ గృతి నిడి వేం
కటతిరుపతికవులు భూమిగై కొనిరెలమిన్. 529

ఆ. వె. అంతఁ గాకినాఁడ కరిగి శ్రీ పోలవ
రపు జమీనుదారు నపరిమితవ
దాన్యుఁ గాంచి కృతిగఁ దమ్మొ మున్నడిగిన
బుద్ధచరిత మెల్ల బుధులు మెచ్చ. 530

క. వినిపించి బ్రాహ్మణప్రభు
వనన్యదుర్లభుఁడు నైన యాకృష్ణారా
యనియొద్ద నొక్క రుండిరి
ఘనమగు పండితవదంబు గైకొని యెలమిన్. 531

తే. గీ. ఇట్లు శుక్రవిదశ సగమేగె వేంక
టేశ్వరకవీంద్రునకు రుజ యేరువడియె
మొదలిడిన యింటిపని తుదముట్టదయ్యె
మఱియు నెన్నెని జిక్కులు వరుస నలమె. 532

తే. గీ. అంత నాకొండివంశజుఁ డలఘుబుద్ధి
యైన శ్రీరామమూర్తియా వ్యాధిపీడ
తనదు శక్తి కతమ్మునఁ దరలఁజేసి
సౌఖ్య మొనఁగూర్చె నతని మెచ్చువలె నెపుడు. 533

తే. గీ. శుక్రు నుత్తరఖండంబు చొచ్చినయది
మొదలు తుదిదాఁకఁ బీడయు మూర్ఖకోప
మును నకారణకలహము మూలధనము
వ్యయమగుట యను నియ్యవి వదలవయ్యె. 534

క. అది యేమొ కాని చిక్కులు
మొదలున్ దుది లేక తొడరి ముంచుటకై తా
మదను గనుచుండినను వీ
నదశకు రాఁ డితఁడు కారణము చింత్య మిటన్. 535

శార్వరి స॥ ఆశ్వయుజ శు ౫ మొ॥ కార్తిక బ॥ ౦ వఱకు

—• రాహ్వంతరములో రవివిదశ •—

తే. గీ. ఇట్టు లాయాయిపీడల నెల్లయపుడు
మున్గుచును దేలుచును నుండ మొనసె సూర్య
విదశ యియ్యది యొక్కింత ముదము గూర్చి
యిచ్చె నారోగ్యమును గృహ మెసఁగఁజేసె. 536

తే. గీ. అప్పు డప్పు డించుక పీడ యనుఘటించి
నను రవి యొకింత సుఖవిధానంబు చేసెఁ
గాని తరలుచు నొకనాఁడు కష్టపెట్టి
యొదవఁగాఁజేసె వాహనయోగగరిమ. 537

తే. గీ. అట్లు తత్తరమున వైద్యుఁడైన రామ
మూర్తి వసియించునట్టి యపోప్పలవరము
చనినయంతన పీడ యల్లన శమించె
నతని సామర్థ్య మది వర్ణ్య మనఁగఁ దగదె. 538

శార్వరి సం॥ కార్తిక బ ౘ మొ॥ మాఖ శు ౧౪ వఱకు

—• రాహ్వంతరములో చంద్రవిదశ •—

తే. గీ. అంతఁ జంద్రుఁడు చనుదెంచి వ్యాధి నూఱు
వంతులు శమింపఁజేసి యావల నొకప్డు
రామమూర్తిపెత్తండ్రి సద్ధామముకను
దగ జరుగఁజేసె నష్టావధాన మొకటి. 539

క. సంగీతసాహితులతో
డం గడు రమ్యమ్ముగాఁ దటాలునఁ గాలం
బుం గడపుటబ్బె వ్యాధియు
నుం గృశియింపంగఁజొచ్చెనూల్కొనె బలమున్. 540

తే. గీ. అట్లు కొండొకకాల మయ్యనఘుఁడైన
రామమూర్తి గృహమ్మున రమణ వాస
మును బొనర్చి యారోగ్యము గని స్వకీయ
వాసమున కేగుదెంచె సంతోస మెసఁగ. 541

తే. గీ. తీర్థయాత్రకుఁ దిరుగుట దేహమునకు
స్వస్థత యొసంగుటయు మైత్రి వఱలు జనుల
నరయఁగల్గుట యుద్యోగమందఁగను బ్ర
యత్న మొనరించుటయుఁ జంద్రునందుఁ గలిగె. 542

తే. గీ. గేహనిర్మాణమునకుఁ దగిన ప్రయత్న
మాచరించుట యానంద మనుగమించు
టయును రాజదర్శనమునకయి వెడలుట
యును గలిగె వీనియందు మహోత్సవముగ. 543

శార్వరి సం॥ మాఘ శు ౧౪ మొ॥ ప్లవ సం॥ చైత్ర శు ౧౦ వ॥

—• రాహ్వంతరములో కుజవిదశ •—

ఆ. వె. ఇందు బంధుజనుల గృహముల జరుగు శు
భముల కరుగుటయును బంధుకలహ
మవల రాజకలహ మందు నిందును జయం
బంది మించుటయును ననుఘటించె. 544

—• రాహుమహాదశలో రాహ్వంతరమున కంతకును ఫలము •—

తే. గీ. ఊరక ధనవ్యయము ఋణయోగ మపరి
తృప్త తేఁదగు రుజయును తీఱని వెత
యించుక ధనార్జనమ్మును గృహకలహము
ప్రాణసంశయమును రాహువందుఁ గలిగె. 545

ప్లవ సం॥ చైత్ర శు ౧౦ మొ॥ శోభకృత్ సం॥ భాద్రపద శు ౪ వ॥

—• రాహుమహాదశలో గుర్వంతరము •—

ప్లవ సం॥ చైత్ర శు ౧౦ మొ॥ శ్రావణ శు ౫ వ॥

—• గుర్వంతరములో గురువిదశ •—

తే. గీ. అంత గుర్వంతరము వచ్చె నందు గురుని
విదశలోనన గృహపూర్తి వేగఁ జేయఁ
దగిన యత్నమ్ము జరిగె యథాసుఖముగ
స్వపురమందు వసించుట సంభవించె. 546

తే. గీ. అంతఁ గలపకుఁ బోలవరాఖ్యగ్రామ
మునకుఁ బోవుట యవధానమును నొనర్చు
టేగుపని కాకయుండుట యిందుఁ దొడరె
నంత శని విదశానాథుఁ డగుచు వచ్చె. 547

ప్లవ సం॥ శ్రావణ శు ౫ మొ॥ మార్గశీర్ష బ ౬ వ॥

—• గుర్వంతరములో శనివిదశ •—

తే. గీ. ఇంటివేల్పగునట్టి కామేశ్వరిని గు
ణించి తన దుర్దశను దెల్పికొంచు శతక
మొండు రచియించుటయు ఋణ ముండు కతనఁ
దూర్పునకు నేగుటయును నిందు ఘటియించె. 548

క. తిరుపతిసత్కవి శ్రీ పో
ల్వారభూపతియొద్ద నుంటవలనఁ దనకుఁ దో
డరుదేరఁడయ్యె "సభనాఁ
డరుదెంచెదఁ దంతివార్తనందింపు" మనెన్ 549

ఆ. వె. ఈవు రాకయున్న నే నొక్కఁడనె యవ
ధాన మాచరింపలేనయేని
అట్లె తంతివార్తనంపింతుఁగా కని
మనమునందుఁదలఁచి చనియె నితఁడు. 550

తే. గీ. అనకపల్లెయు శ్రీకాకుళాఖ్యనగర
మవుల నుర్లాముసంస్థాన మన్నిచోట్ల
సభ లొనర్చి ధనమ్ము యశమ్ము గాంచు
నంత బుధవిదశయు వచ్చె సంతసమున. 551

ప్లవ సం॥ మార్గశీర్ష బ ౬ మొ॥ శోభకృత్ సం॥ చైత్ర బ ౧౦ వ॥

—• గుర్వంతరములో బుధవిదశ •—

తే. గీ. మందసా కేగి విభుని సన్మాన మంది
గ్రిహణిచే బాధపడి యరోగతను గాంచి
సుఖముగా నింటి కేతెంచి చూడనేగె
నవల గద్వాల వేంకటకవి యొకండ. 552

తే. గీ. అంతఁ దిరుపతి కవి గూడ నటకు వచ్చి
కలిపికొనియె నుభయులును గనకభూష

లచట లక్షణాపరిణయ మంకితముగ
నిచ్చుటంజేసి బహుమాన మెనసి రెలము. 553

క. ఆమీఁద నాత్మకూ ర్చని
భూమీశుఁడు మున్న యిడిన భూమికిఁ బట్టా
కై మేలుకొలిపి కుకవి
స్వాములు నోడించి చనిరి వనప ర్తిపురిన్. 554

తే. గీ. ఆనరేంద్రుఁడు గూడ నుదారుఁడయ్యె
వీరి నిర్లక్ష్యభావంపుతీరు విన్న
యట్టిఁ డయ్యును నితరులయట్లె వీరిఁ
గూడ మానింపఁ దలపూనెఁ గొసరి కొసరి. 555

ఆ. వె. అట్లు కొసరి కొసరి యల్పాల్పముగ నిచ్చు
నృపునియీవికిమదినేవపడుచు
నాశుధారలోన నాత్మనున్న విధంబు
పద్యరూపమున నృపతికిఁ దెలిపి. 556

ఆ. వె. మరల నాత్మకూరు మహిపాలుఁగనవచ్చి
యాతఁడొసఁగు భూమికై నపత్రి
మడిగి పుచ్చుకొనెడియప్పుడు తేనితోఁ
గలహ మించుకంత గాంచిపిదప. 557

తే. గీ. "సస్యగర్భమ్ముగా నున్నసమయమందు
మీకు నచ్చిన భూమిని మేలుదానిఁ
గైకొనుఁ" డటన్నఁ బదపడి కదలి గద్ద
వాల త్రోవను దేశమ్ము వచ్చునంత. 558

తే. గీ. రాణి తనభ ర్త సంవత్సరంపు దినము
దాపుగావున నందాఁకఁ దాళి యేగు
టుచితమని యాఁప నయ్యెడ నుండు దినము
లందుఁ బండితకలమ్ము క్రిందుకొనియె. 559

తే. గీ. కారణం బేమి యన వెనుక నొకనాఁట
నాత్మకూరునృపాలు మేనల్లుఁడైన
శ్రీనివాసుఁడు పచ్చిగాఁ జేయఁదగిన
యట్టిది సమస్య నిచ్చె పీ రపుడు దాని. 560

తే. గీ. తగుగతిని బూర్తిచేసి రద్దాని నతఁడు
వ్రాసి యిడఁబోలు నొరుల కప్పద్యము గని
వీరి రిపులగు వైష్ణవధీరు లెల్లఁ
తమక యది యన్వయించు నంచు మది నెంచి. 561

తే. గీ. అపజయమ్మనసే మున్ను గుపితులగుట
దీనిచే నది హెచ్చఁగఁ దెలివిఁ దక్కి
పేరిడియె బూతుపద్దె మంపిరి రచించి
దాన వారికి నవమానదశ ఘటించె. 562

తే. గీ. తాము చేసినయట్టి పద్యమ్మనకును
గర్తగా శిష్యు బట్టు నొక్కనినిఁ గల్ప
నమ్మ నేసిరి వానికి నమ్మగారు
ఖైదుశిక్షను విధియించి కలఁచుటయును. 563

తే. గీ. అపుడు నిజ మొప్పికొని వాని నట్లు సేఁత
మమ్ముఁ జేయుటయే యని మఱియు మఱియు
దైన్యమొందుడు నాయమ దయను జూపి
వాని విడుఁడని సెలవిచ్చె భటుల కంత. 564

తే. గీ. రామభూపాలు సంవత్సరంపు దినము
నాఁట నిప్పని జరిగె నానాఁడు వేల
కొలఁది బ్రాహ్మణు లయ్యెడఁ గూడికొనిరి
యందఱును గాదనిరి వీరి యహితబుధుల. 565

తే. గీ. అటనె మధ్వయతీశ్వరు నంతికమునఁ
గల్గిన వివాదమున గెల్చి కందనోలు

మార్గమున దేశ మేతెంచి మఱి శరీర
రుజ నొాకించుక గనినంతటఁ జనె బుధుఁడు. 566

శుభకృత్ సం॥ చైత్రి బ ౮ మొ॥ జ్యేష్ఠ శు ౧౩ వ॥
—• గుర్వంతరములో కేతువిదశ •—

తే. గీ. పిదపఁ గేతువు తా వది వృద్ధిచేసెఁ
గాని యయ్యది శమియించెఁ గష్టశ్లిష్టి
శాంతిఁజెందినయట్లుండి సరగ మరలఁ
దిరుగఁబడె నంతఁ శుక్రుఁ డేతెంచె మఱియు. 567

శుభకృత్ సం॥ జ్యేష్ఠ శు॥ ౧౩ మొ॥ కార్తిక శు ౮ వ॥
—• గుర్వంతరములో శుక్రివిదశ •—

తే. గీ. శుక్రదశ నది యెంతేని వక్రిత గని
బాధ గొల్పుడు వేవేగ వైద్యుఁడైన
రామమూర్తి గ్రామమునకు రహిని వాహ
నంపుయోగమ్ముతో నేగె నయ మెలర్ప. 568

తే. గీ. అతని యౌాషధబలమున నదియుఁ గొంత
యుపశమింపుడుఁ బిమ్మట నుదవసితము
నకును దారువు లంపించెఁ బ్రికటయశుఁడు
పోలవరపు జమీందారు పుష్కలముగ. 569

తే. గీ. అంత నింటికి వచ్చి గృహమ్ము పూర్తి
సడలుకొానెడి ప్రియత్నమ్ము నడిపి సర్వ
సిద్ధ మొనరించి యటఁ బ్రివేశించుటకు ము
హూర్తమునకయి వేచుచునుండి మరల. 570

శుభకృత్ సం॥ కార్తిక శు ౮ మొ॥ మార్గశీర్ష బ ౬ వ॥
—• గుర్వంతరములో రవివిదశ •—

తే. గీ. మొగిని వైద్యమ్మునకు రామమూర్తియూరి
కేగ నతఁ డిడు మందులో నించుకంత

భ్రాంతివశమునఁ బ్రాణ మపాయదశకు
వచ్చి యెట్టెట్టులో నాఁగవలసెఁ దుదకు. 571

తే. గీ. పైని దనబంధువులు వృథా వైరమూని
యితరశాఖీయులగువారి కెగ్గొనర్పఁ
గడఁగుటయు న్యాయ మయ్యది గామి వారి
నితఁడు వారించెఁ గవితచే హితము గలిపి. 572

శుభకృత్ సం॥ మార్గశీర్ష బ ఒ మొ॥ ఫాల్గున శు ౩ వ॥

—• గుర్వంతరములో చంద్రవిదశ •—

తే. గీ. అంతఁ బీఠపురమునుండి యరుగుదెంచె
జాబు శ్రీ యెడవర్తు నుత్సవ మటంచు
దానికై యేగి యచటి యుత్సవము చూచి
శ్వశురవసతి లక్ష్మీనరసపురి కేగ. 573

ఆ. వె. నూజివీటినుండి రాజుశ్రీ రామచం
ద్రాప్పరావు వార్త నంపుటయును
నేగి యచట నూర్వురేకత్రఁ గూర్చుండఁ
గా వధానమొకఁడె కడిమిఁ జేసె. 574

తే. గీ. అతఁడు రెండు నూటాఱులు ననఘమైన
నేలువులు నట్టి చీరలు నోలి నొసఁగి
"నూటపదియార్లు వార్షిక మ్మొఁటనేఁట
మీ" కనుడు సంతసించి యమ్మేటి విడిచి. 575

క. వచ్చుచు నేలూర్పురమున
సచ్చరితుఁడు శంకరుండు సఖ్యమ్మునఁ ద
న్నచ్చట నిలువంజేయుడు
నిచ్చమెయి వసించెఁ; గుఱుఁడు నేతెంచె నొగిన్. 576

తత్ప్రభృతి శోభకృత్ సం॥ చైత్రి బ ॥ వ॥

—• గుర్వంతరములో కుజవిదశ •—

క. నారాయణదా సనియెడి
ధీరుఁడు వైద్యుండు తనదు దేహమ్మునకై
యారోగ్య మిడియె నిదియే
కారణమాయూర నుండఁగా నొప్పుటకున్. 577

తే. గీ. శంకరుని సానియును నల శంకరుండు
సకలవిధముల నాదృతి సలుపుచుండ
నతని యింటఁ గుటుంబసహితముగాఁగ
నెలమి నుండఁ ఖాసిముఁకోట కేగవలసె. 578

తే. గీ. మొగి వసంతపునవరాత్రిము లను తిరుప
తియును దానును సమ్మానదీప్తులగుచుఁ
జిన్న యవధాన మొనరించి యున్నయెడల
కిరువురును జేరి రానంద మినుమడింప. 579

శోభకృత్ సం॥ చైత్రి బ ॥ మొ॥ భాద్రపద శు ॥ వ॥

—• గుర్వంతరములో రాహువిదశ •—

ఆ. వె. అంతరాహువిదశ నల శంకరుని యింటఁ
గొంతకాలమెంతొ సంతసమున
వఱలునెడలఁ దోట్లవల్లూరిలోనఁ బ
ట్టాభిషేకమగుట నరుగవలసె. 580

క. తిరుపతిశాస్త్రియు నచటికి
నరుదెంచెన్ సభయు జరిగె నధిపుఁడు నూటా
ర్లిరువురకు నిచ్చె నేలూ
ర్పురి మరలన్ వచ్చి ముదము పొంపిరివోవన్. 185

ఆ. వె. కొంతకాలముండి కొండొక యారోగ్య
మంది సభయు నచట నలరఁజేసి

గౌరవమ్ము నంది పేరిమి స్వగ్రామ
మేగుదెంచె సీతఁ డెసక మెసఁగ. 582

తే. గీ. గృహముపని పూర్తిచేయించి మహితులైన
తల్లిదండ్రుల నందు విద్వద్హితముగ
సుప్రవేశమ్ము చేయించి సురుచిరగతి
బంధుగుల గౌరవించె సంపత్తికొలఁది. 583

తే. గీ. ఇల్లు గట్టుటకొఱ కెందఱెందఱేనిఁ
జేసిరి సహాయ మందులోఁ జెప్పఁదగిన
యతఁడు నిర్వ్యాజదాత తా నచ్చిరెడ్డి;
యతని తర్వాత విరవ సూర్యప్రభుండు. 584

తే. గీ. కలప సకలమ్ము నొసఁగిన ఘనుఁడు వోల
వరవిభుఁడె కాని యీ యీవి ప్రతిఫలమ్ము
బుద్ధచరితమ్ము గలది యప్పుణ్యుకతన
నే గృహము నెఱవేఱెను నిశ్చలముగ. 585

శోభకృత్ సం॥ భాద్రపద శు ౪ మొ॥ పరాభవ సం॥ ఆషాఢ శు ౧౦ వఱకు

—• రాహు మహాదశలో శన్యంతరము •—

మ ఱి యు.

శోభకృత్ సం॥ భాద్రపద శు ౪ మొ॥ మాఖ బ ౨ వ॥

—• శన్యంతరములో శనివిదశ •—

తే. గీ. అంత శన్యంతరము వచ్చె నల్లనల్ల
వీఁడు తనుసౌఖ్యమునుగూర్చి వేశ్మమునన
తనదు విదశను గడపి యంతటను 'గౌర్న
రుసు'గనఁగఁ గాకినాడకుఁ జనఁగఁజేసె. 586

క. అట జ్వరము వచ్చె నది పి
మ్మట నెల దినములకుఁ దగ్గె మఱి యూపైనె
క్కటి నూజివీడు నామక
కటకమునకు నప్పరావుఁ గననేగుటయున్. 587

క. బందరు పురమున నొప్పెడి
హిందుకళాశాలనుండి యేతెంచెను జా
బందు "నుపాధ్యాయత్వము
నొందుట కంగీకరింపుఁ డొగి మీ" రనుచున్. 588

తే. గీ. రమణ శ్రీరామచంద్రాప్పరావుతోడ
యోజనంజేయ ''నొకచోట నుంట కిదియ
మంచి సదుపాయ'' మంచు నమ్మాన్యుఁ డనుడు
వార్షికము గొని బందరు వైపు మరిగె. 589

శోభకృత్ సం॥ మాఘ బ ౨ మొ॥ క్రోధి సం॥ ఆషాఢ శు ౧౪ వఱకు

—• శన్యంతరములో బుధవిదశ •—

తే. గీ. అంత బుధుఁ డేగుదెంచె నాయహామునంద
పాఠశాల నుపాధ్యాయపదమునందు
సుప్రవేశమ్ము నంది, శిష్యుండు వండి
పెట్ట నట నుండు టబ్బె నిక్కట్టు దొడర. 590

తే. గీ. అంత మృతశిశువును గని యాత్మగృహిణి
యెంతయును డస్సి జీవించె; నింతలోన
సెలవుదినములు రాఁగఁ జెచ్చెర స్వదేశ
మేగుట తటస్థమయ్యెఁ బై నేగె సెలవు. 591

తే. గీ. పిదప నర్ధాంగియును దాను బేర్మి బంద
రుపుర మేగి, వసించి రం దపరిమిత ము
దమ్ముమై; నోలి నష్టప్పు తనురుజ నొక
కొంత నేసియు సుఖ మొనఁగూర్చె బుధుఁడు. 592

క్రోధి సం॥ ఆషాఢ శు ౧౪ మొ॥ భాద్రపద శు ౧౩ వఱకు

—• శన్యంతరములో కేతువిదశ •—

తే. గీ. అంతఁగేతువు వచ్చె; వీఁ డప్పుడపుడు
దేహరుజ చేసియును సుఖదీప్తి నొసఁగె

సూ్కలుబాలురు గాక పైబాలకులు ప
లువురు విద్యార్థు లెపుడు చదువుచుసుండుర్రి. 593

క్రోధి సం॥ భాద్రపద శు ౧౩ మొ॥ ఫాల్గున శు ౪ వఱకు

—• శన్యంతరములో శుక్రవిదశ •—

తే. గీ. కవిత యెక్కుడు జరుగుట, కడు ముదమగు
గతిని నవరాత్రిమహమునఁ గాలగళుని
యింతిఁ బూజించుటయు, శాస్త్ర మెపుడుఁ బాఠ
ములు వచించుటయును దీనఁ గలిగెఁ దఱచు. 594

క. అవధాన మ్మొక్కఁడు రా
జవరుండగు నప్పరాయచంద్రుని సభలో
సవిశేషమ్ముగఁ జేయుట
దవిలెన్ బహుమతియు నం దొదవెనెక్కుడుగన్. 594

తే. గీ. మతములంగూర్చి మఱికొంతమందితోడఁ
గలిగెను వివాద మయ్యెడ నొలసె జయము;
పిదప నినశశికుజులును ముద మొసంగు
చును గ్రమమ్ముగఁ జనిరి; పై మొనసె రాహు. 596

క్రోధి సం॥ ఫాల్గున శు ౪ మొ॥ విశ్వావసు సం॥ చైత్ర బ ౧౦ వఱకు

—• శన్యంతరములో రవివిదశ •—

నాఁడు మొదలు ఆషాఢ బ ౫ వఱకు

—• చ ం ద్ర వి ద శ •—

నాఁడు మొదలు భాద్రపద బ ౫ వఱకు

—• కు జ వి ద శ •—

విశ్వావసు సం॥ భాద్రపద బ ౫ మొ॥ మాఘ బ ౯ వఱకు

—• శన్యంతరములో రాహువిదశ •—

తే. గీ. వీఁడు పండితకలహముల్ విస్తరించి
యందు విజయమ్ము నిడి పయి నంబికామ్మ

తిని బొసంగించి నృపసభ ఘనత నొసఁగి
మిశ్రిఫలదాయకుండయి మెలఁగెఁ బిదప. 597

విశ్వావసు సం॥ మాఘ బ ౯ మొ॥ పరాభవ సం॥ ఆషాఢ శు ౧౦ వఱకు

—• శన్యంతరములో గురువిదశ •—

క. గురువిదశయు ననుగుణముగ
నరిగెన్ బుధుఁ డంత వచ్చె వ్యవహారమునం
గర మాదర మొదవెఁ గవి
త్వరమయు వృద్ధిం దనర్చెఁ దగ నప్పట్లన్. 598

పరాభవ సం॥ ఆషాఢ శు ౧౦ మొ॥ కీలక సం॥ పుష్య బ ౧౩ వఱకు

—• రాహుమహాదశలో బుధాంతరము •—

తే. గీ. స్వయముగా వండికొనుట, పుస్తకపు వర్త
కమువలని ద్రవ్యలాభమ్ము. క్రమముగాఁగఁ
బుస్తకము లెల్ల ముద్రితమ్ములుగఁ జేయు
తలఁపు, రాజసన్మానంబుఁ దవిలెఁ దఱచు. 599

తే. గీ. వానమామల శ్రీగురువరుఁడు నూజి
వీటి కరుదెంచుటయు నట విభుఁడు రామ
చంద్రనృపతి ప్రసంగవశమున వీరి
వినిచె; విని స్వామియును గనుఁగొనఁగ నెంచె. 600

తే. గీ. రామచంద్రాప్పరాయలు రయము మీఱ
"రాక తీర" దటంచు వార్త నొగిఁ బంపె
నిరువురును గూడ నరిగిరి యెలమి స్వామి
సంతసించె వధానంపుసరణి నరసి. 601

క. నూఱార్లు నేలువులు నిడి
గౌరవ మొసఁగుటయకాక కడఁగి విజయవి
స్ఫోరకమగు పత్రింబును
గూరిమిమై నొసఁగెఁ బీఠగురువరుఁ డపుడున్. 602

క. కవితావ్యాసంగములో
నవు సువిశేషములతోడ నరిగె బుధుని య
య్యవసర మెల్లను జనువే
ళ విశేషముగా నొసఁగెఁ గళత్రిపుఁ బీడన్. 603

క. తక్కువ చెడ్డయు మిక్కిలి
యెక్కువమంచియును గూర్చియేగె బుధుఁడు, పై
నెక్కను గేత్వంతర్దశ
చక్కని యోగం బితం డొసంగెఁ గ్రిమముగన్. 604

కీలక సం॥ పుష్య బ ౧౩ మొ॥ సౌమ్య సం॥ మాఘ బ ౧ వఱకు

—• రాహుమహాదశలో కేత్వంతరము •—

ఆ. వె. విస్తరించి కావ్యవిరచనమ్మును, వీని
ముద్రిణమ్ము, కడు వినిద్రగరిమ
ద్రవ్యలబ్ధి, స్వల్పతనుపీడ, రాజస
మ్మాన మిందుఁ దొడరె ఘనుతముగ. 605

సౌమ్య సం॥ మాఘ బ ౧ మొ॥ పరీధావి సం॥ మాఘ బ ౧ వఱకు

—• రాహుమహాదశలో శుక్రాంతరము •—

ఉ. ఎంత కవిత్వ మిందు రచియింపఁగఁబడ్డదొ చెప్పఁజాల, న
త్యంతవివాదముల్ ప్రబలె నన్ని వివాదము లేకపోచు వి
శ్రాంతి యొకింతయే నిడక వ్రాయఁగఁజేసె ననేకకావ్యముల్
"చింత కవీశులం" దనుచుఁ జెప్పుట సార్థకమయ్యె నయ్యెడన్. 606

క. గీరతకావ్యము శిష్యుల
కై రచియింపంగవలసె నటుపిమ్మట గుం
టూరి వివాదములకుఁగా
శ్రీరుచి గుంటూరిసీమ చెప్పఁగవలసెన్. 607

ఉ. కాకరపర్తి కేగుటయు గందరగోళ మటన్ ఘటింప బ
ల్కీఁక యథార్థమున్ దెలిపి విశ్రుతి గాంచి విపక్షపక్షపున్

లేకితనంబు సర్వ మవలీల బయల్పడఁజేసి శత్రువుల్
ప్రాఁకఁగఁజేసినట్టి యపవాదలతల్ తెగఁద్రెంచెఁ గైతచే. 608

క. పై రెండు కావ్యములె కా
దారయ మఱి వీనితోడ నంతో యింతో
చేరికగల పొత్తము లె
న్నో రచియింపంగఁబడె నన్నృతము నడంపన్. 609

ఆ. వె. అరుల సంఖ్యకన్న నధికమై మిత్రుల
సంఖ్య సకలగతుల సాయపడి వి
పక్షులాచరించు బహుళానృతవ్యాప్తి
దొలఁగఁజేసి యశము గలుగఁజేసె. 610

తే. గీ. పాఠశాలకు సెలవును వ్రాసి మూఁడు
మాసములు శిష్యవర్గసమన్వితముగ
భార్యతోఁగూడ గుంటూరుపట్టణమున
నుండె నీతండు శత్రుల గుండె లగల. 611

తే. గీ. శత్రువుల మాటకేమి, విశాలహృదయు
లెందఱో మిత్రులై విందు లెలమిఁ జేయఁ
దిరుపతియు వేంకటేశుం డుదీర్ణగరిమ
నొప్పి రవధానసభల కాహూతులగుచు. 612

క. ధనమును యశము ననూనము
గను సంపాదనమొనర్చి కదలి యచోటు నై
జనివాసము బందరు పురి
కినరిగె సకుటుంబముగ నొగిన్ వెంకనయున్. 613

తే. గీ. ఆపురము వీడివచ్చిన యవులఁగూడ
మరల వాదోపవాదముల్ మానవయ్యెఁ
"బళ్యశబ్దవిచా" రాది బహుళపుస్త
కములు తద్వాదరీతి చక్కఁగ వచించు. 614

తే. గీ. అపజయము రాఁదగినయట్టి యంశములును
జయమునకుఁ గారకమ్ములై శత్రుపక్ష
మునకుఁ దలవంపు ఘటియించి ముదనుఁ బెంప
జరిగె శుక్రునంతర్దశాసమయ మెల్ల. 615

క. ధనమున యశమున లోపం
బనునది లేశమును లేక యత్యంతముదం
బునఁ బొదలునంతఁ బినత
ల్లినందనుఁడు వ్రాసె నిట్లు లేఖ తనంతన్. 616

తే. గీ. "పురుడు వచ్చెను మాయింటఁ బుత్రుఁ డుదయ
మందె నీనందనుని నీకు నర్పణంబు
చేయవలెనని నా మనస్సీమ నెంత
యేనియుఁ గుతూహలము కల; దేమి యనెదొ? 617

క. నెలపురు డరిగె యీలో
పల శిశువున్ దల్లిఁగూడఁ బంపఁదలఁచి యి
ట్లు లిఖించితి నీసమ్మతి
కెలమి నెదురుచూచుచుందు నిది మొద" లనుడున్. 618

క. సంతానము లేదనియెడి
చింత లవమ్మైనిలేని శేముషిగలయా
యంతర్వాణి యెదేనిఁ ద
నంతన్ రా సమ్మతించు నట్టిండగుటన్. 619

తే. గీ. "మంచి దట్టులె చిన్నికొమరుని బంపు"
మనుచుఁ బ్రత్యుత్తరం బిచ్చి ధనము కొంత
దారికర్చులకై పంపి దారకాగ
మనమును బ్రతీక్షసల్పుసమయమునందు. 620

మ. ఒక జ్యోతిష్కుఁడు జాతకాంశములఁ దానొక్కింతయుం జూడకే
మొకమున్ జూచియె భావికాలపు ఫలమ్మున్ భూతమున్ జెప్ప ని

శ్వికలపఠిజ్ఞకుఁ డేగుదెంచె నొకటన్ శ్రీ వేంకటేశావధా
నికిఁ బ్రిజ్ఞన్ గనఁజేసి బందరు జనానీకంబు మెప్పుంగనన్. 621

క. జిల్లాజడ్జీ "సత్కవి
తల్లజుఁడగు వేంకటేశు దర్శించియుఁ బ్రి
జ్ఞోల్లాసిఁ జేయఁగలవే
నెల్లరు నిను మెచ్చి యిత్తు రిష్టార్థంబుల్" 622

క. అనఁ నాయన యుపదేశము
విని యాతం డేగుదెంచె వెంకనకడ క
య్యనఘునకు నిసువుజాతక
ము నిడి "వచింపుండు దత్తపుత్రుండగునే." 623

క. అన "వీఁడు దత్తుఁడున్ గాఁ,
డనఘా! నీ జాతకమున కల యోగంబున్
గనరాద, నీవు సంతతి
గనియెద వద్దాన సుఖము గాంచెద" వనుడున్. 624

ఆ. వె. "అస్మదీయ జాతకాంశమ్ము లవి నాకుఁ
గూడఁ దెలియుఁ గొంతకొంత వఱకుఁ
దెలియుఁగాక సంతు గలిగినఁ గలుగుఁగా
కిపుడు వీనిఁ గొందు నింత నిజము." 625

వ. అని నొక్కిపలుకుటయు.

తే. గీ. "ఇంత నిజ" మని మీరలు పంతమూని
పల్కునప్పు డే నేమని పల్కనేర్తు;
జరుగఁగూడదు మీ వినిశ్చయము శతవి
ధాల, జరిగిననేమి, సంతతియుఁ గలుగు." 626

క. అని "యొకపని నేఁ జెప్పెద
నినుపళకలములు పదా ఱిదే రేయిని బా

లను నానఁబెట్టి విప్రున
కు నిండు రేపుదయమునఁ దగున్ దక్షిణతో." 627

ఆ. వె. అనుడు "నినుము దానము నొనర్చు టదియు సా
మాన్యమగునె! మనుజమాత్రు లెల్ల
నాచరింప నర్హులా? గొప్పదక్షిణ
యిడినఁ గాని ఫలము నీయ దదియు. 628

తే. గీ. వేలకొలఁది దక్షిణలిచ్చు పృథివిపతులు
దక్క నీదాన మీఁజాలు ధన్యు లెవరు!"
నాఁగ నతఁ డనుఁ "బాలలో నానఁబెట్టి
యుదయమున నూతిలో వేయుఁ డిదియు హితమ." 629

క. "మంచి"దని యతని సమ్మా
నించియనిపి యతఁడు చెప్పునియతి నితఁడు గా
వించి, శిశు వరుగుదెంచెనొ
యంచుఁ బ్రతీక్షించుచుండె నాదృతియెసఁగన్. 630

పరీధావి సం॥ మాఘ బ ౧ మొ॥ ప్రమాదీచ సం॥ పుష్య శు ౧౦ వ॥

—• రాహుమహాదశలో రవ్యంతరము •—

తే. గీ. శిశువు రాలేద, యంతట నెలవుదినము
లరుగుదెంచె, స్వకీయమైనట్టి గ్రామ
మునకుఁ గడియమ్మనకు యథాపూర్వముగను
వేంకటేశ్వరుఁ డరిగె; రవియును బొసఁగె. 631

క. పినతల్లి కొమరుఁ డచ్చటి
కిని దనయూ ర్దాపగుట నొగిన్ శిశువును జే
కొని వత్తు ననుచుఁ గబురం
పెను; జనకుం డన్యగోత్రమిష వలదనియెన్. 632

క. వలదని వారించియుఁ "గా
వలసినఁ గానూరు పేర వఱలెడి నూర

వ్వల నిల గోదావరి కి
మ్మల నట నొక యగ్రహారముం గల, దందున్. 633

క. మన యింటిపేరు గోత్రం
బును గల పండితకుటుంబము వఱలు దానఁ
దనరుదురు శిశువు లెందఱొ
కొను మందొక్కరుని నీకుఁగుతుకంబున్నన్." 634

తే. గీ. అంత నది యద్దె; నితనికి యత్నపూర్వ
కముగ నేకార్యమును జేయుకాంక్ష లేమిఁ
దండ్రిగారు చెప్పినయట్టి దత్తుఁగూర్చి
కూడ యత్నింపమియు నొడఁగూడెఁ బిదప. 635

క. తన పినతండ్రికుమారుం
డనఘుఁడు వెంకన్న స్వర్గమరిగె; నతఁడు నం
దినులఁ గనెఁగాని యొక నం
దనుఁ గనఁగాలేద, యపు డితం డెదనెంచెన్. 636

తే. గీ. "ముగురు తండ్రులు, తండ్రులు మూగు రందు
నొక్కరుఁ డపుత్రకుఁడె యతఁ డొరుని దత్తుఁ
గొన్న నాద త్తతయు శాస్త్రవిన్నియతికిఁ
జాల వెలియౌట నది లెక్క సలుపరాద. 637

తే. గీ ఔరసుండు పితృవ్యకుమారుఁ డేగెఁ
బుత్రసంతతి యతనికిఁ బొడమలేద;
ఏను నిప్పటి కుంటి, సంతాన మింక
నెప్పుడో పుట్టునను నాశ యెడఁదఁ గలద. 638

క. పది యేఁడుల దాదాపున
నొదవె నపత్యంబు నదియు నుండద యాపై
నుదయించుటొండె, సూచన
యొదవుట నదియొండె లేద యొక్కింతేనిన్. 639

క. కడచిన శుక్రాంతర మె
క్కడు బలవత్తరము దానఁ గూఁతురొ, కొడుకో
పొడమవలసినట్లుగఁ దా
నొడువున్ శాస్త్రంబు నొక్కినొక్కి యది చనెన్. 640

క. సంతానమునకు మాఱుగ
నెంతయుఁబుస్తకపు సంతు నిడె శుక్రుం, డా
యంతర్దశఁ జెప్పు కవిత
నెంతేఁ దోలంగవలయు నెన్నె బళ్ళన్. 641

క. నలువదికిఁ బైని మూఁడే
ళ్ళలమిన్ జనె వయసు; భార్య కేగన్ దాపై
యొలసెను మూఁడు పదులు నే
నలసత దత్తుఁ గొనకుంట యర్హ్యమ్మగునే.'' 642

తే. గీ. అనియు నానాఁడు జ్యోతిష్కుఁ డన్నమాట
లన్ని ఋజువిచ్చె; నటుపయి నమరవాది
వెంకటప్పయ లిఖియించె ''శంక లేద
కలుగు సంతాన మింత నిక్క'' మని మరల. 643

క. మాతండ్రిగారి కిట్టులె
పోతాలి నేఁ బొడమినట్లు ముసలమ్మలు నా
కేతఱి వచియింతురు నా
జాతకమునఁ గానఁబడెడి సంతానమ్మున్. 644

తే. గీ. కుల మనూచానముగ నిట్లె వెలయుచుండెఁ
గానఁ దొందరపడి దత్తుఁ గైకొనంగఁ
దగదనియు జాతకమ్మున భృగుసుతుండు
ముఖ్యుఁ డతఁ డేల సంతానము నిడఁడొక్కొ. 645

క. అని కొంకుచు మ న్ననుకొను
తన గోత్రపుఁ బిల్లవాని దత్తుఁగొనుటకై

యనుఁగుల నటకున్ గబురఁ
పిన నొప్పిరి వారు, వచ్చె వెన్నెలగామున్. 646

ప్రమాదీచ సం॥ పుష్య శు ౧౦ మొ॥ రాక్షస సం॥ ఆషాఢ శు ౧౦ వఱకు

—• రాహుమహాదశలో చంద్రాంతరము •—

తే. గీ. సర్వమును సిద్ధమయ్యె వేసఁగి సెలవుల
తఱిని గడియమ్మునం దల దత్తతయును
జరుగు ననుకొనుచుండు నత్తరుణమంద
అనువుపడియె వేఁకటియు వెంకనపడఁతికి. 647

తే. గీ. ఇంత కొక్కింతమును వెన్కఁ జేఁట వేమ
వరపు నగ్రహారమ్మున వైదికప్ర
కాండు లవధానమున కిడఁగాఁ దలంచి
నట్టి కంకణసమ్మాన మందికొనిరి. 648

క. ఎన్ని సభలేని జరిగిన
వెన్ని వివాదమ్ములేని యేర్పడినవి ము
న్నన్నియు నొక తల వేమవ
రోన్నత శ్రీశతవధాన మొకతలయుఁ జూఁడీ. 649

క. అయ్యవధానవిశేషము
లయ్యా! చదువరు లెఱుంగుఁ డప్రొత్తమునం
దియ్యెడ నవి యెత్తినచో
వెయ్యేఱుల కన్నఁ బద్యవితతియుఁ బెరుఁగున్. 650

ఆ. వె. అమరవాది వెంకటప్పయ సిద్ధాంతి
గారు వ్రాసెఁ గొన్ని కాలములను
"సంతు గలుగఁదగిన సమయమ్ము లివి" యని
యందుఁ జంద్రుఁగూర్చి యతఁడు మిగుల. 651

తే. గీ. నొక్కి నొక్కి లిఖించెఁ "జందురుని యంత
రమ్మునఁ గుమారుఁడే యుదయమ్మునందుఁ

గానిచోఁ గూఁతురేనియుఁ గలుగు నిక్క"
మనుచు; నది నిక్కముగఁ బుట్టె నాత్మజుండు. 652

తే. గీ. ఈతఁడే వెంకనకుమార జాతకమ్ము
వ్రాసి యిచ్చె; నాతఁడు వ్రాయు ఫలము లెల్ల
జరుగుచుండె ఋజువు గాఁగ; మఱియు నితఁడు
వేంకటేశ్వరు జాతకవిధము నరసి. 653

క. అఱువది యేఁడులనుచు బుధ
వరుఁడగు వెంకన ద్విభాషివంశ్యుఁడుమునుదా
నఱిముఱి వ్రాసిన వ్రాఁతను
సరి గాదని, యెనుబదేండ్లు సరియని వ్రాసెన్. 654

క. అఱువదిమూఁడవ దిప్పుడు
జరుగుచునికి నితని యూహ సరి యని చెప్పం
గరము కుతూహల మయ్యెడి
నెఱుఁగుం డీయనఘుప్రజ్ఞ వీవిషయమునన్. 655

క. ఆరోగ్యభాస్కరమ్మున
సారంబగు నితని ప్రజ్ఞఁ జర్చింపఁబడెన్
ధీరుఁ డితఁడు జాతకసం
స్కారమ్మున నిట్టివారు కడు మృగ్యు లిలన్. 656

క. "మారకశాస్త్రి" యనుచు నీ
ధీరునకుం బేరు గలదు, తెలివి యితనికిన్
మారకనిర్ణయమందు న
పారం బని కొంద ఱట్లు వాడుదు రెలమిన్. 657

క. కొమరునకు బారసాలను
గరిమముగ జరిగించుపొంటెఁ గడియము స్వగ్రా
మముఁ జనియె వేంకటేశుఁడు
ప్రమోదముగ నదియు జరిగె బంధుగులలరన్. 658

క. అది మొదలు కడియమున నే
పదిలముగఁ గుటుంబ ముండె బందరు వారల్
వదలమిని వేంకటేశుఁడు
ముదమున వసియించె నబ్దము నొకం డచటన్. 659

రాక్షస సం॥ ఆషాఢ శు ౧౦ మొ॥ నల సం॥ ఆషాఢ బ ౧౩ వ॥

—• రాహూమహాదశలో కుజాంతరము •—

తే. గీ. అంతటఁ గుజాంతరము వచ్చె నఖిల మితని
యంతరము బందరున నుంట యనుఘటించు
కతనను గుటుంబ మొక్కట నితఁడు నొకట
వేఱువేఱుగ నుండుట యేరుపడియె. 660

తే. గీ. అచట నుండెడినాళ్ళలో హైదరుపుర
ప్రముఖు లాహ్వానమును బంపి ప్రబలమైన
గౌరవము నాచరించి; రక్కడ నితనికి
జ్వరమువచ్చి యెట్టెట్టులో శాంతిఁ జెందె. 661

తే. గీ. మఱియు నెల్లూరుపురమున మంత్రిప్రగడ
శ్రీ భుజంగరాజేశ్వరు చెల్మికతనఁ
గోర్టులో సాక్ష్యమునకు నేగుట ఘటించెఁ
బ్రకట శ్రీనాథ వీధినాటకముకొఱకు. 662

తే. గీ. అం దసభ్యమ్ములయిన వాక్యముల కెల్ల
మంచి యర్థమ్ముఁ గల్పించి యంచితగతిఁ
గోర్టునధికారి నెమ్మది గూడఁ దనదు
వైపునకుఁ ద్రిప్పె నీతఁ డవార్యగరిమ. 663

క. ఆ యూరన్ మోతేవా
రాయతమగు సభను గూర్చి యం దవధాన

శ్రీ యొసఁగం జేయించి ధ
నాయామము గలుగఁజేసి యర్చించి రొగిన్. 664

క. తలత్రి ప్పధికమ్మై తన
కలసట గొలిపినను బంద రది తన్నుఁ గడున్
వలచిన కారణమున విడు
దల గలుగమి నుండవలసెఁ దా నొక్కరుఁడున్. 665

ఆ. వె. అప్పుడపుడు కొమరు నన్నంపుఁ బ్రాశన
మాదియైన మిషల కాత్మవాస
మునకుఁ జనుచు మరల మొగి నేగుచును గాల
మెట్లొ గడపె నెలవు లేగుదనుక. 666

తే. గీ. అంత వేసవి చనుదెంచె; నాత్మవాస
మునకుఁ గడియమ్మనకు నేగి ముదము మిగులఁ
గడపి యక్కాలమును, స్కూలు గడలుకొల్పు
కాలమునకు బందరు వచ్చి యొలి నచట. 667

క. నాలుగొ మూఁడో రోజులు
స్కూలునఁ బనిచేసి పిదప స్కూలుపనిన్ దాఁ
జాలించి యేగునంతటఁ
గాలము కుజునకును నిండఁగా నతఁ డరిగెన్. 668

తే. గీ. దాన రాహుమహాదశ దవిలెఁ బూర్తి
వీని దశలోన వ్రాయక మానినట్టి
వింక నెన్నియొ గలవు బల్ వింకమైన
యంశములు, వానిలోఁ గొన్ని యనువుపఱుతు. 669

సీ. మైలవర మ్మేగి మహిపాలు కోర్కెపై
నవధానమున మెప్పునందు టొకటి

చెన్నపురం బేగి శ్రీవెంకటగిరి ప్ర
భుని కోర్కి శృంగార పుస్తకముల
నిల్పుపూనిక శాస్త్రనియమమ్ము లడరంగ
నెలమి నుపన్యాసమిచ్చు టొకటి
శ్రీరావుచెల్లాంబగౌరవార్థ మ్మాపె
షష్టిపూర్తికిఁ గడు జ్వరితుఁడయ్యె

తే. గీ. నేగి తిరుపతియును దాను నెల్ల సభ్యు
లలర నవధాన మొనరించి పలువిధముల
నల జమీందార్ల బహుమతులందు టొకటి
గాక యిం దెన్నియో చేర్పఁగలవి గలవు. 670

క. ఆ యీ సందర్భమ్ముల
నేయెడ నెవి చేర్చు టొప్పొ యెఱుఁగుదురు మహా
ధీయుతులు; జాతకజ్ఞు లు
పాయజ్ఞు లెఱుంగరాని యంశము లున్నే? 671

క. ఈ రాహుమహాదశ దాఁ
బ్రారంభము మొదలు గొంతవఱ కెటులెటులో
గాఱియ వెట్టియుఁ గడు యో
గారూఢి నెసంగె, మందునంతరము మొదల్. 672

క. ధనవృద్ధియు, శ్రీవృద్ధియుఁ
దనువున కారోగ్యవృద్ధి, తతకవితానం
దనవృద్ధియు, వేయేటికిఁ
దనచరితకు నిష్కళంకతయు రాహు విడెన్. 673

తే. గీ. రాహు వరిగెడి తఱిని స్వగ్రామమందు
మొదలువెట్టించె వ్యవసాయమునకు నెలమి

నాఁడు శన్యంతరమ్మున నాటఁబడిన
యంటుమావి తోఁటయుఁ జేతి కందివచ్చె. 674

క. ఈరీతిఁ బలు శుభమ్ముల
నారూఢి నొసంగి రాహు వరిగెఁ బిదపఁ దా
స్వారాడ్గురుండు శుభవి
స్తారకుఁడై డిగె మహాదశానాథుండై. 675

సమస్తసన్మంగళావిభవంతు

క. ఎవరో వ్రాసినరీతిని
స్వవిషయమును జాతకపుమిషన్ వ్రాసెను దాఁ
గవియగుట వేంకటేశుఁడు
భువినిది పూర్వార్ధ మగుచుఁబొలుచున్దానన్. 676

జాతకచర్య పూర్వార్ధము
స మా ప్త ము

---

ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# జాతకచర్య

## ఉత్తరార్ధము

క. సంగీతసాహితీమృదు
శాంగికమనాతిధేయ ! హరిహరభేదా
నంగీకార శుభాహ్వాయ !
గంగాధర రామరాయ ! కవిజనగేయా ! 1

వ. అవధరింపుము.

స్వస్తి శ్రీ నల సం॥ ఆషాఢ బ ౧౪ మొ॥ ఆంగీరస సం॥ ఆషాఢ బ ౧౪ వఱకు

— గురుమహాదశ —

నల సం॥ ఆషాఢ బ ౧౪ మొ॥ కాళయుక్తి సం॥ భాద్రపద బ ౨ వఱకు

— గురుమహాదశలో గుర్వంతరము —

క. శ్రీమీఱఁగ గురుఁ డంతట
నామెయి రాస్యూలు విడిచి యరుగుతలఁపుతో
ధీమంతుఁడు వెంకన స్వ
గ్రామముపై దృష్టి నిగుడఁగాఁజేయుటయున్. 2

చ. అది పురమెల్లఁ బాగ్రికి యట నందఱ మానసముల్ గలంచి "యే
మిది, మన వేంకటేశకవి యేగెడినే ! యిట నేమి లోపము
న్నది యని యెంచెనొక్కొ ! యిఁక నక్కట ! యిట్టి గురుండు చేకుఱం
డెదిగెఁ గవిత్వ మీతఁ డిట నెప్పుడు కాలిడె నాఁట నుండియున్. 3

క. ప్రతికుఱ్ఱవాఁడు కవితా
సతికిన్ హితుఁడయ్యెఁ, జెప్ప శక్యమె మన సం
తతి కీతఁడు చేసిన యుప
కృతి; యిది మరలించుకొనుట కెది తెరువొక్కో ! 4

ఆ. వె. "తెలుఁగుక్లా" సటన్నఁ దేలికగాఁ జూచు
టాంగ్లపాఠశాలలందుఁ గలదు;
ఈయవస్థ మనదు హిందుకళాశాల
యందు లేద, యిదియు నక్కజంబు. 5

మ. తెనుఁగుంగ్లాసనువేళఁ గాస్గతరులందే కోఁతికొమ్మచ్చులన్
బనిగా నాడెడి బాలు రీతఁ డిచటం బాదం బ దేనాఁడు వె
ట్టైనొ నాఁడాదిగఁ గ్లాసు కేగి తగుమాడ్కిన్ బాఠమున్ జెప్పికో
వినయంపుంగనులై మెలంగెదరు బల్ వింతౌఁ గదా! యీస్థితుల్. 6

ఆ. వె. ఆంగ్లపాఠశాలయందుఁ దెలుంగు పం
తులుగఁ జేరుటన్నఁ దొలిభవంపుఁ
బాపమంచుఁ దఱచు పల్కువాక్యమ్మ లీ
తనికి నన్వయింప" ననుచు మఱియు. 7

క. ఏమేమొ యతనియెడఁ గల
ప్రేమపునుడు లాడికొనుచుఁ బెద్దలుఁ బిన్నల్
దా మొక సభగాఁ గూడి మ
హామోదము పిచ్చలింప నాగురుసభకున్. 8

తే. గీ. శ్రీనెడిఁబికులశ్రేష్ఠుఁ జిరయశు నధి
పతిగ వరియించి, వల్లూరి వరకులుండు
సూర్యనారాయణుఁడు మొద లార్యు లిట్లు
చర్చచేసిరి వేంకటశాస్త్రిగుఱిచి. 9

తే. గీ. "పదియు రెండేండ్లు దాఁటె నిప్పండితుండు
మనకు లభియించి; స్కూలునఁ దనరు బాల
కుల నొకం డెవ్వఁడో దక్కఁ గలరు తఱచు
కవిత రచియించువార లెక్కడలఁ గన్న. 10

క. గోదావరి నీరే కవి
తాదాయిని యనియుఁ గృష్ణ తగదు కవిత్వా

స్వాదంబు పట్ల నను నప
వాదం బది మనకు నితనివలనఁ దొలంగెన్. 11

తే. గీ. ఇంత యుపకృతి చేసిన యితఁడు జన్మ
భూమియందలి వాత్సల్యమున స్వకీయ
వాసమున కేగనుండె నిప్పట్లు మనకృ
తజ్ఞతను జూపుటకు నేవిధంబు సెపుఁడు." 12

క. అనవుడుఁ దత్సభఁ దమతోఁ
చినవిధమున నొక్కరొకరు చెప్పఁదొడఁగి రీ
యన గౌరవించు టిట్లని
విని యధిపతి తనకుఁ దోఁచు విధముం దెలిపెన్. 13

తే. గీ. అందఱును జేతులెత్తి రానందగరిమఁ
దమమదికి సమ్మతం బను క్రమము దెలుప
వెనుక నొక రెవ్వరో వినూతనపురుషుఁడు
పలికె నిర్భీకుఁడై సభాపతినిగూర్చి. 14

ఉ. "వేంకటశాస్త్రిగా రనఁ బ్రవీణులు వారిని గౌరవించు టే
వంకనుగాని కూడదనువా రెవ రుందురు? నిక్క మింత; నా
కొంకు వచింతు, నాకు నల గుంటురిసీమ నివాసభూమి ని
ష్పంకనియోగివంశజుఁడ, శాత్రవుఁడన్ మఱి నేను వీరికిన్. 15

తే. గీ. ఏను మాత్రమ కాదుసుఁడీ: నియోగు
లెల్ల నీతని కరిపక్షమే యటంచు
నాదు నూహ; నియోగిజనంబు దీనఁ
బాలుగొనరా దటంచు నేఁ బలుకువాఁడ." 16

తే. గీ. అనుడు శ్రీ సూర్యనారాయణాభిధానుఁ
డాదియైన నియోగు "లీయంశ మొక్క
కొన్ని వ్యక్తుల కగుఁగాక కులము సకల
మిందుఁజకు గుఱి గాఁదగ; దింత ధ్రువము. 17

తే. గీ. వ్యక్తిగతమైన యాయాయివైరములను
జాతి కంటఁగట్టుట యనఁ జాలఁ దప్పు;
ఎవ్వనికి నరిగాకుండు నెందుఁ బొసఁగు?
నంతమాత్రాన నిటు లాడు టనుచితంబు" 18

క. అను మాటలతో సభ ముగి
సెను బిమ్మట నితని కిట్లు చేయుట తగునం
చును నిర్ణయించి గౌరవ
ము నొనర్చెడి పనికి యత్నము నొనర్చునెడన్. 19

క. అరి పక్షమూను నల గుం
టురి ప్లీడరు యత్నమున నియోగి జనులఁ గొం
దఱఁ దనపక్షమునకు నే
ర్తైఱఁ ద్రిప్పి కలంచె వారి తియ్య మితనిపై. 20

క. తిరిగినవారలలోఁ గొం
ద ఱుదాసీనులయి రింకఁ దక్కిన మఱి కొం
దఱు ప్రతియింటికిఁ జని "మన
మరుగం బనిలేద దీని" కని చెప్పి రాగిన్. 21

ఆ. వె. "బ్రదుకుఁ దెరువు లేక బడిచదు" వను నెవ్వ
రెఱుఁగ, రిట్టి పనికి నింత యేల
నాకుఁ జేయఁబూని నారు పౌరు లటంచు
సిగ్గుఁజెందె లోనఁ జెళ్ళపిళ్ళ. 22

తే. గీ. సడియుఁ జప్పుడు లేకుండఁ జక్కఁబోవు
టుచితమని వెంకనయు మది నూహసేయు
చుండె, నంత సమ్మానంపుఁ బండుగు దిన
మరుగుదెంచె దాదాపున; కట్టియెడల. 23

ఉ. పాండవరాజసూయ మను భవ్యచరిత్రము నాటకమ్ము నొ
క్కండు రచించె నీతఁ డెసకమ్మున నాశువులోన నప్పు, డం

దుండు నవాంతరార్థములు యోజనచేసెడి బుద్ధిశాలి త
త్ఖండనమండనంబుల ప్రకారము సర్వ మెఱుంగనేర్చెడిన్. 24

క. తదనంతరంబ యుత్సవ
మది జరిగెన్ వర్ణనీయమై యా చరితల్
ముదమునఁ గృష్ణాపత్రిక
చదివినఁ దెలియునని యది పొసంగింతు నిటన్. 25

1916 సం॥ ఆగష్టు 12 తేదీ కృష్ణాపత్రికనుండి

—• కవిపూజ •—

"....ఈనిబిడాజ్ఞానాంధకారపటలమును జీల్చఁదొడంగిన ప్రముఖులలో తిరుపతివేంకటేశ్వరులు గూడ నగ్రిస్థానమున వెలయుచున్నారు. భాషాప్రపంచమున నెక్కడఁ జూచినను వీరి సాక్షాత్కారము తప్పదు. ఆధునికాంధ్ర కవులలో ననేకులకు గ్రంథరచనాప్రోత్సాహము వీరివలనఁ గలిగినది. వీరి శిష్యసమూహము భారతసైన్యము వలె ననంతమైయున్నది. వీరి గ్రంథములు గూడ నగణ్యములై దేశమునం దెల్లయెడల వ్యాపించియున్నవి గాని ప్రకృతి ధర్మము ననుసరించి వీరి గ్రంథములను గుఱించియు నభిప్రాయప్రభేదములు ప్రబలియున్నవి. తిరుపతి వేంకటకవులకు సంఘటిల్లిన సంఘర్షణము మఱియొకరికి సంభవించినచో మనము మఱియొక రీతిని వినియుందుము. నలువైపులనుండియు నిశాతఖడ్గములు వీరిపైఁ దాండవము చేసినవి, గాని వీరు ధైర్యచ్యుతులు గాలేదు, అడుగు వెనుకకుఁ బెట్టలేదు. అన్ని కత్తులను వీరు తిరిగియు నెదిరించిరి. ఈభయంకరసంగ్రామము ఇంకను చల్లారలేదనియే చెప్పవచ్చును. అయినను లోకము వీరిని జూచి చేతులెత్తి "ధన్యులు ధన్యులు" అని పొగడుచున్నది. వీరి వీరాధివీరత్వము అంగీకరింపఁబడినది. భావగంభీరులకెప్పుడును బ్రతిస్పర్థ తప్పదు. ఎవరివల్లను ఎదిరింపఁబడకుండ నుండవలెనన్నచో అభావము నాశ్రయించుట తక్క వేఱు మార్గంబు లేదు. వివాదాంశములను విడిచిపెట్టి సర్వసమ్మతములగు వాక్యరత్నములను బురస్కరించుకొని కవివీరులను బూజిం

చుట ఆంధ్రలోకమునకు విధి. దీనిని గుర్తించి ఆచరణమునఁ బెట్టిన మాపురవాసులు వివేకమహితులు.

తిరుపతివేంకటేశ్వరులు ఆధునికాంధ్రకవు లెవ్వరును బడయని గౌరవములను బడసినారు. అనేకులు కవీంద్రులు రాజులచేఁ బూజింపఁ బడినారు గాని బహుళజనానురాగమును బడసినవారు వీరే. బందరు పౌరులు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికిఁ జేసిన పూజ ఆంధ్రకవులకు ఆనందప్రదము. ఆంధ్రకవితకు గౌరవకారణము.... వేంకటకవులకు ఉత్తరవయస్సు ప్రారంభమైనది. ఉత్తరవయస్సు అయినను పూర్వవయస్సు అయినను ఈనడుమ కొంతకాలము కలహమార్గమునఁ గడచిపోయినది. ఇఁక వీ రామార్గమునందలి గమనమును వెంటనే ఆపివేయవలయును. మరలసద్గ్రంథరచనము ప్రారంభింపవలెను ........ప్రమాదములు ఉన్నవని తోఁచినచో దిద్దుకొనవలెను. లేవని ధైర్యమున్నచో నూరకుండవలెను.... పూర్వపక్షసిద్ధాంతముల కంతముండదు............

వేంకటశాస్త్రిగా రిప్పుడు పొందఁబోవుచున్న విశ్రాంతి సర్వాభీష్ట ప్రదంబగు నూతనకావ్యరచనలకు ఆలంబమగుఁగాక!........ఇవన్నియు నొక్కచోఁ జేరినఁగాని కవితాసంపద సంభవింపదు. మతప్రవక్తలు సంస్కరింపలేని, తత్త్వశాస్త్రకోవిదులు కనిపెట్టలేని, రాజ్యాంగనిర్మాతలు నిర్మింపలేని సంఘధర్మములను, తత్త్వరహస్యములను, రాష్ట్రసంస్థలను, రాజ్యశాసనములను కవులే కనిపెట్టఁగలరు; కవులే నిర్మింపఁగలరు; కవులే శాసింపఁగలరు.

కవులు చూపిన త్రోవనే జగము నడుచుచుండును....విద్యార్థులు కవిపూజ నారంభించిరి. ఏదివ్యవాణి నన్నయతిక్కనాదిమహాకవులనుండి నేఁటికిని ధారావాహికముగఁ బ్రతిధ్వనించుచు ఆంధ్రవాఙ్మయప్రపంచ మును సృష్టించి పాలించి పోషించుచున్నదో, ఆవాణినే నేఁడు వేంకట శాస్త్రిగారి రూపమున బందరు పౌరులు గొల్చిరి. ఈయాంధ్రవాణి నేఁడు తిరిగి విజృంభించి........సమస్తకళ్యాణములను గూర్చుచు ఆంధ్రజాతి నుద్ధరించుఁగాక.

క. పరిపూర్తిగఁ గైకొన వి
స్తరమగునని సగము సగము జాఱవిడుచు మ
త్కరగతమగు లేఖినిఁ గృ
ష్ణరావు ముట్నూరికులుఁడు సైఁచుంగాతన్.

మఱియు నానాఁటి కృష్ణాపత్రికనుండియే మఱికొన్ని యంశములు.

—• శతావధాని వేంకటశాస్త్రిగారికి వీడు కొలుపు; •—

—• బందరు పౌరులు సమ్మానించుట •—

బ్రహ్మశ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారిని గౌరవించు నిమిత్తము బందరులో నీ నెల 5 తేదీ సాయంకాలము పురమందిరమున గొప్పసభ జరిగెను....చల్లపల్లి కుమారరాజుగారును న్యాయవాదులును ఉపాధ్యాయులును వర్తకులును సభ నలంకరించిరి. సభలో విశేషభాగము విద్యార్థిబృందము.

ఈసభ కధ్యక్షత వహించుటకు కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు ప్రత్యేకముగ నాహూతులై....వచ్చిరి.

అగ్రాసనాధిపతులు...."వేంకటశాస్త్రిగారి కుశాగ్రబుద్ధియు....సంస్థానములయందు పండితప్రవరులతోఁ గావించిన వాదప్రతివాదములను బట్టియే....వెల్లడి యగుచున్న" దని నుడివిరి; "శాస్త్రిగారి ప్రబంధముల యందును భారత నాటకములయందును గనుపడు పదముల పొందికయు రసౌచిత్యమును అతిశ్లాఘాపాత్రము" అనియు "వారి కృతులు ఆంధ్ర భాష యున్నంతకాలము చిరస్థాయిగ నిలుచు" ననియుఁ జెప్పిరి. సభాధ్యక్ష ఉపన్యాసమును ముగించినపిమ్మట పురజనుల పక్షమున వేంకట శాస్త్రిగారికి సేలము పట్టంచు వస్త్రములను కాశ్మీరపు సేలువును కింకిణీ కంకణమును కరమునకుఁ దొడిగిరి....పిమ్మట వేంకటశాస్త్రిగారు లేచి సభాధ్యక్షుల పాదములకు మ్రొక్కి బందరు పౌరులు తమకుఁ గావించిన గౌరవమునకుఁ దగిన యాధిక్యము తమయందు లేదనియు వారి యవ్యాజానురాగమే దీనికిఁ గారణ మనియుఁ గడునమ్రతతో నుడువుచు బాల్య

మున నిల్లువిడిచి గురువులయొద్ద నెట్లు శుశ్రూష చేసినదియు బహుహృద్యముగ నచ్చటచ్చట పద్యములను జిల్కరించుచు నుపన్యసించి సభాసదుల రంజింపఁజేసిరి. తా మెవ్విధమున వారములు చేసికొనియు మాధుకరము నెత్తికొనియు అధ్యయనము గావించినదియు.... మొదలగు విశేషముల నెల్లను.... వెల్లడించుచు ఆవిషయములను ముఖ్యముగ విద్యార్థులను గమనింపఁగోరిరి. సభాధ్యక్షులైన కృష్ణమూర్తి శాస్త్రిగారియొద్ద నాలుగు మాసములు కుమారసంభవమును మేఘసందేశమును జదివినను వారు తమ్మును శిష్యులుగ భావించక మిత్రులవలె నాదరించుట యుక్తముగ లేదని సూచించిరి. కానుకుర్తి భుజంగరావుపంతులుగారు, రేగిళ్ళ కామ శాస్త్రులుగారు, పప్పు సోమనాథశాస్త్రిగారు, ప్రతివాది భయంకర రాఘవాచార్యులుగారు, పిల్లంక అనంతాచార్యులుగారు, మధునాపంతుల సూరయ్యా శాస్త్రిగారు మొదలగు వారియొద్ద కొన్ని నెలలచొప్పున అధ్యయనము గావించి తుదకు చర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారియొద్ద వ్యాకరణశాస్త్రమును కృషిచేసినవిషయమును జెప్పిరి.... పిమ్మట కడచిన పదుమూఁడు సంవత్సరములనుండియు బందరునం దుంటచే బందరుపౌరులై తాము గ్రంథముల రచించి ముద్రింపించి విక్రయించి ధనార్జన గావించితి మనియు బందరునందే తమ గృహస్థాశ్రమమును గడపితిమని చెప్పవచ్చు ననియు తమ స్వస్థలమగు కడియమునందు తాము వేయించిన తోఁటకు నరుగుచుంటచే నిఁక వానప్రస్థ మారంభించుననియు తమ్ము నింతకాలము గాపాడుచు వచ్చినబందరు పౌరుల సౌహార్దమును మఱువఁజాల మనియుఁ చెప్పి తుద కీ రెండు పద్యములను జదివిరి.

మ. కడియంబా, వినుమమ్మ ! నీవు జననగ్రామంబ వీనాకు నిన్
గడుబాల్యమ్మననే త్యజించితిని; నన్ గష్టించి వీక్షించి కే
లొడియంబట్టి నిజాంకసీమ నుపన్యోజించి యెన్నెన్నొ మా
ర్లడియాసంపడిపోతి వింక నటు గాదమ్మా ! యిదే వచ్చితిన్. 1

ఉ. బందరు పౌరులార ! యిదె వందనముల్ పచరింతు మీకు నా
యందలి గౌరవమ్మున మహామహుఁ గృష్ణకవీంద్రు మద్గురున్

జందనభూజసన్నిభుని సత్కృతిమై నిటఁ దోడితెచ్చి నా
రిందలి సభ్యు లెల్లర కహీన ముదమ్మును గూర్చి పేర్చఁగన్. 2

నాఁటి రేయి వేంకటశాస్త్రిగారికిని వారి మిత్రులకును పురాణం సూరి శాస్త్రిగారు విందొసఁగిరి. మఱునాఁటి దినము ఆదివార ముదయమున నగర సంకీర్తనము గావింపఁబడెను. శ్వేతపతాకములపై పురాతనాధునిక కవుల పేళ్లు లిఖింపఁబడెను. మకరతోరణమున "జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః" అను నార్యోక్తి స్వర్ణాక్షరములతో భాసిల్లుచుండెను. సరస్వతీ విగ్రహము కదళీస్తంభములతో నలంకరింపఁబడిన పీఠముపైనమర్పఁ బడెను. ముందు గాయకులు భజనలు సల్పుచుండిరి. వెనుక విప్రులు స్వస్తి వాచకంబులను బఠింపుచుండిరి....తుదకు గొడుగుపేటలోని శాంతమల్లే శ్వరస్వామి కోవెలకుం జనెను. అచ్చట వేంకటశాస్త్రిగారు యథోక్తముగ సరస్వతీపూజ గావించి సరస్వతీదేవి యొక్క ఆధ్యాత్మికతత్త్వమును గూర్చి యుపన్యసించిరి....కవులెల్లరు తమకుఁ గల వాగ్విభవమును ఈశ్వరదత్త మనియే నమ్మెరనియు....తమ యపూర్వ ఫణితిని జదివి శ్రోతల కర్ణపుట ముల నమృతముతో నింపిరి. మధ్యాహ్నము వేంకటశాస్త్రిగారికిని వారి మిత్రబృందమునకును కూనపూడి లక్ష్మీనారాయణగారి యింట విందొసఁగఁ బడెను. తదనంతరము గొడుగుపేట నాటకశాలలో సంగీత విద్వాంసులగు హరి నాగభూషణముగారు తమ ఫిడేలునకు జీవముపోసి అందు త్యాగరా జార్యుని అమృతవాణిని బలికించిరి. సాయంకాలము హిందూహైస్కూలులో గొప్పసభ అతివైభవముగా జరిగెను. స్కూలు హాలులో సభను జరుపుట కసాధ్యమగుటచే ముందున్న ఖాళీస్థలమున సభ జరిగెను....ఈ మధ్య నీయూరిలో నింతసభ సమావేశము కాలేదని చెప్పవచ్చును....తిరుపతి వేంకటకవుల ప్రబంధరచనాచతురతయు....కేవలము ప్రాచీనపక్కిని గాక వర్తమానకాలమున కనుగుణమగు రీతిని స్వాతంత్ర్యలక్షణములతోఁ దన రారుచున్నవని చెప్పిరి....పురాణం సూరిశాస్త్రిగారు కొంతవఱకు సూచించి ఈలోపమున్నను మొత్తము మీఁద తిరుపతివేంకటకవు లాంధ్రకావ్యప్రపం చమున నూతనయుగప్రవర్తకులుగఁ బరిగణింపఁబడుదు రనిచెప్పి తమ

కథనమును ముగించిరి....పిమ్మట స్కూలు విద్యార్థులును తదితరశిష్యులును వేంకటశాస్త్రిగారీగ్రామమునువదలిపోవుటవలన తమకుఁ గలిగిన దుఃఖభారమును వెల్లడించు పద్యములను జదివిరి. వేంకటశాస్త్రిగారు సయితము ఆపద్యములను విని కంట తడిపెట్టిరి ...ప్రస్తుత మాంధ్రదేశమున కవులని చెప్పఁదగినవారు ముగ్గురు నలుగురి కంటె నెక్కువ లేరనియు వేంకటశాస్త్రిగారు వారిలో నొకరనియు....సభాధ్యక్షులు (మానవల్లి రామకృష్ణకవి ఎమ్. ఏ. గారు) నొడివిరి. పిమ్మట వేమూరి వెంకటసుబ్బారావుగారు లేచి.........భక్తిభాజనముగఁ జేసినందుకు స్కూలుకమిటీపక్షమున వేంకటశాస్త్రిగారికి అభివందనముల నర్పించిరి. జయజయ ధ్వానములతో సభ ముగిసెను. ఆకసమున కారుమబ్బు లల్లుకొనియున్నను వర్షము కురియక సభ జయప్రదముగ జరుగుట అదృష్టము. ఆరాత్రి పదిగంటలకు దేశీయనాటకశాలలో రాయల్ హిందూథియేటరు వారు శాస్త్రిగారి గౌరవము నిమిత్తము పాండవోద్యోగమును బ్రదర్శించిరి. ఒక అంకము ప్రదర్శించినపిమ్మట నాటకసభ్యులలో ప్రముఖులగు బసవయ్యనాయఁడుగారునుపింగళి లక్ష్మీకాంతముగారును....వేంకటశాస్త్రిగారి కొసంగుటకు గండపెండేరమును విద్వాన్ శిష్టా నరసింహశాస్త్రిగారి కిచ్చిరి. నరసింహశాస్త్రిగారు సంస్కృతాంధ్రములలో తమనిరుపమానమైన అనర్గళధారతో కవి సంప్రదాయమును ప్రశంసించి వేంకటశాస్త్రిగారి కవితాధిక్యమును కడురమ్యముగ నభివర్ణించి గండపెండేరమును వెంకటశాస్త్రిగారికొసంగిరి. వేంకటశాస్త్రిగారు అచ్చట సభకు వేంచేసియున్న తమ గురువులగు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు ఆశీర్వదించి సెలవొసంగినఁ గాని తాము ధరించుటకు అర్హులు కామనిరి. అటు పిమ్మట శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారు లేచి "వా రర్హులే"యని సెలవిచ్చినపిదప నాటకసభ్యులు ఆగండపెండేరమును వేంకటశాస్త్రిగారిపాదమునకుఁ దొడిగిరి .... ఇవ్విధమున నీ రెండుదినములును శాస్త్రిగారికి పలుజనులు పలువిధముల గౌరవ సూచకంబులగు కార్యములను జేయుచుండిరి.... ....కంతేటి రామకృష్ణయ్యగారు వేంకటశాస్త్రిగారికి అమూల్యములగు నూతన వస్త్రములను బంగారు అంగుళీయకము నొసంగిరి.

ప్రసంగి రంగయ్యంగారు శాస్త్రిగారికి బనారసు పట్టుసేలువును వస్త్రములను బహూకరించిరి. కాంచనపల్లి నరసింహారావు గారును తగురీతిని గౌరవించిరి. కాశేపల్లి రజతగిరిపతిగారి కుమారులు వెండి యుద్ధరిణెను సమర్పించిరి. బందరుపురవాస్తవ్యుల సత్కారాశీర్వచనములతో జన్మస్థానమున కేగుచున్న వేంకటశాస్త్రిగారు చిరాయువులై ఆరోగ్యైశ్వర్యములతో వర్ధిల్లెదరుగాక !

---

క. ఇటు లాయాయివిశేషము
లటఁ గైకొని కడియ మేగునల్లంతట న
ప్పటి 'హెడ్మాష్టరు' శ్రీ వెం
పటి నరసింహమ్మగారు పరమాదృతితో. 26

క. ఇఁక నాల్గురోజులేసియు
సుకముగ నిట నుండి యేగుచొప్పున కీ రి
య్యకొనుట నా కోరిక యన
నకలంకమనీష నొప్పె నందుల కితఁడున్. 27

ఆ. వె. అంతలోన వచ్చె నాత్మసోదరికిఁ గా
మేశ్వరమ్మ కెంతయేని ప్రాణ
భయము గలుగునంతపాటి జ్వరమ్మంచు
దానఁజేసి యేగెఁ దత్క్షణంబు. 28

తే. గీ. ఆపె స్వర్గస్థురాలయ్యె; నకటః భవము
రీతి గన్గొంటిరే మహాఖ్యాతికరమ
హోత్సవము వెంబడినె యెట్టియోగ మబ్బె !
సుఖము దుఃఖము నను నివి జోడులెండు. 29

ఆ. వె. మఱియుఁ బిదప రెండు మాసమ్ములకె బంద
రరుగవలసె; నేటికనఁగఁ, దోఁట్ల
వల్లు రి పర్రిభుండు భాష్యకారుల పుత్రిఁ
డపుడు పిలువనంపె నాదరమున. 30

తే. గీ. అతని పట్టాభిషేకమహంబు గాంచి
ఆనృపతి యిచ్చు బహుమతు లందికొనియుఁ
దిరుపతియు వేంకటేశుండు నరిగి రాత్మ
వాసములకు సంతోషవిభాసురముగ. 31

సీ. ఆమీఁదఁ గడియమ్ము నందు నూతనగృహ
నిర్మితి పూర్వ మెన్నేనినాళ్ళ
క్రిందటి యింజరగృహపు విక్రయమును
శ్రీయినుగంటివంశీయుఁడైన
యల్ల పరికాశరాయనికిఁ గూర్చెడి వేలు
పన్నవరేశు కళ్యాణమునకు
నాహూతిమై నేగి యట నవధానంబు
సలిపి యచ్చటి ధర్మశాసకుండు

తే. గీ. శ్రీ పరికాశరాయని కోర్కెఁజేసి స్వామి
వారి యాస్థానకవివర్యపదము గొనుట
బహుమతిగ నూఱు లాఱులు వడయుటయును
దఱచు పండితగోష్ఠియు వఱలె మఱియు. 32

ఉ. గంపలగూడెపున్ విభుఁడు కైతకు మిత్రుఁడు కృష్ణరావుగా
రంపె "కుమారి నామకరణాత్మక ముత్సవ మంచు లేఖ; త
త్సంపద గాంచి యాతఁ డిడు సత్కృతి గైకొని వచ్చునంతలో
నింపుగఁ జెన్నెక్రొత్తపలె కృష్ణుఁ డనంతపురమ్ము రమ్మనెన్. 33

సీ. ఈతఁడు సామాన్యగృహమేధియేయయ్యు
గవితకొండొక చెప్పఁగలుగుయోగ్యుఁ
డది కతమ్మునఁజేసి యాత్మతనూజాత
పెండిలి కెల్లేని వేంకటతిరు
పతికవులను బిల్చి కుతుకమ్ముమై వీరి
కతమునఁ దమప్రోలి కతులితమగు

సంతసంబును గూర్ప జతనంబు చిరకాల
మునుండి చేయుచు ననిపె నూఱు

తే. గీ. రూపికలు కర్చులకును వీరు నొగిఁ జనిరి;
కాని యప్పుడు పెండిలి గాక యడ్డె
సభ నుపన్యాస మొక్కటి సలిపి యింటి
కరుగుదెంచిరి వెంకన తిరుపతియును. 34

తే. గీ. అంత రెండవ సంతాన మనుఘటించెఁ
గాని యయ్యది నిలుచుట కలుగదయ్యెఁ;
నింతలోఁ గొత్తయిలు పూర్తి నెనయుటయు గృ
హప్రవేశోత్సవం బయ్యె నంచితముగ. 35

ఆ. వె. ఆప్రవేశమునకు నరుదెంచె హరి నాగ
భూషణుండు; గానభూషణుండు
అతఁడె కాక కొంద ఱరుదెంచి రాత్మీయ
పూర్వశిష్య లెలమి పొలుపు దనర. 36

సీ. పదపడి నరసరావుపట్టణస్థుల కోర్కి
నక్కడి కేగి శతావధాన
మాచరించియు గౌరవాతిశయము గాంచి
వచ్చుత్రోవను జగద్వంద్యుఁడైన
మంగళగిరి దేవులిం గని యప్పు డా
స్వామిసన్నిధియందు జరుగుచున్న
యల శేషగిరిరాయఁడను శిష్యుపెండిలి
కనులారఁ గనియు దీవనల నిడియు

తే. గీ. వానితోడ బందరుపురవరము గూడఁ
జని గృహప్రవేశమ్మున జరుగు వేడు
కలను దిలకించి యతఁడు మున్ సలిపినట్టి
యుపకృతికి నిష్కృతి నొనర్చె నొగి నితండు. 37

క. ఆతఁ డేమిచేసె నుపకృతి
నితనికి నన సంతులేనియెడ దత్తుఁగొనన్
మతి నెంచునెడల వలదని
యితఁడు వారించి మందులిచ్చెన్ భక్తిన్. 38

క. జ్యోతిష్కుల జ్యోతిషమున
కీతని వైద్యప్రభావ మెలమిం దోడై
స్వాతికతన ముత్యమువలె
నీతనికిఁ గలిగెఁ గొమరుఁ డెసకంబెసఁగన్. 39

ఆ. వె. అదియు మొదలు వాని నాత్మయసుతునితోఁ
బాటు చూచు నితఁడు బహుళకృపను
నతఁడు వీరిఁ జూచు నాత్మయజననీజ
నకులఁ బోలె భక్తినమ్రుఁ డగుచు. 40

సీ. రాజమహేంద్రవరమ్మునఁ గృష్ణభా
రతముపైఁ గొంద ఱోర్వంగలేమి
గడుఁ జొప్పదఁటుశంకలుపేయమొదలిడ
నవ్వారి వాదంబు నడఁచుటకయి
గురుఁడైన కవిరాజుగూర్చిన సభ కితఁ
డగ్రాసనాధిపత్యము వహించి
గురువిపక్షుల వాదసరణిని ఖండించి
గురువకు మోదవిస్తరత గూర్చి

తే. గీ. గురువరువి యాశిషముగొని మఱియు శిష్యు
లైన రామకృష్ణులు చేసినట్టి పూర్వ
సుకవిదూషణనుమ గవి సకలజనులు
తన్నుఁ బ్రశ్నింప నంత వీతండు గడఁగి. 41

క. మాకు విరుద్ధులు శిష్యులు
చేకొని యొనరించినట్టి చెట్టకు నికృతిన్

వాకొను భారము మాపై
నేకతమునస్నైననేమి, యిడితిరి మీరల్. 42

తే. గీ. కాన వినుఁడని విజ్ఞలోకమ్ముఁగుఱిచి
యొగి "క్షమాపణ" యను వ్యాస మొకఁడు వ్రాసి
కొంత శాంతి లోకమ్మునఁ గూర్చెఁగాని
శిష్యు లటఁ జేరమిని బనిసేయదయ్యె. 43

క. అటు రగిలి రగిలి తుద క
చ్చట నచ్చట సభలు సలిపి సత్కవిభక్తుల్
పెటిలిపడ సారెకున్ ది
ట్టుటకున్ మొదలిడిరి కటుఁగడున్ రుషయెసఁగన్. 44

తే. గీ. రహిని రాజమహేంద్రివరమున జరుగు
సభకు నీతఁ డధ్యక్షుఁడై చనియె, నందు
నెందఱో పూర్వకవుల నక్షేపించుటకును
నేవపడి రీతఁడుం గూడ నేవపడియె. 45

క. ఆయావిధమున శుభసం
ధాయకమై తఱచు గురునిదశ గురునంత
శ్రీ యెసఁగెఁ బిమ్మటన్ శని
నాయకుఁడై యంతరమ్మునకు నింపెసఁగెన్. 46

కాళయుక్తి సం॥ భాద్రపద బ౹౩ మొ౹ రౌద్రి సం॥ ఫాల్గున బ౹౧౪ వ౹౹

—• గురుమహాదశలో శన్యంతరము •—

తే. గీ. ఇతఁడు వచ్చినవెంటనే యేగఁజేనెఁ
దోట్లవల్లూరినృపుని సుతునకు జరుగు
బారసాలకు, నచట ద్వీపమ్ము నెక్కు
టాదియగు గౌరవమ్ముల ననుభవించె. 47

సీ. ఆత్రోవ నూజివీ డరిగి శ్రీరామచం
ద్రాప్పరాయనిసుతు సనఘచరితు

నారయప్పారావు ధీరు సింహాద్ర్యప్ప
రావు గోపాలాప్పరావుఁ గాంచి
ప్రతివత్సరముఁబోలెఁ గుతుకమ్ముమైఁగొన్ని
నాళ్ళు విద్యాగోష్ఠి నడిపి పిదప
వార్షికమ్మను గొనివచ్చుచో నేలూర
జ్వరము ప్రారంభించెఁజయ్యనగృహ

తే. గీ. మరుగునంతట నది యతిభరము నెనసె
మఱియు వెనువెంట జనకుఁడు జ్వరితుఁడయ్యెఁ
గొమరుఁడును గూడ జ్వరమునఁ గొంతడప్పెఁ
బలుపలుకు లేల ? గృహమెల్ల జ్వరమయంబ. 48

క. అపు "డిన్ఫ్లూయింజా" జ్వర
విపరీతపుఁ గాలమగుట వీడెల్ల జ్వరా
తిపరీతము వీడననే
లపడియె దేశంబ జ్వరవిలయమునఁ బెలుచన్. 49

క. ఎనుబదిమూఁడేడులపైఁ
జను వృద్ధుఁడు దక్కఁ దక్క సకలకుటుంబం
బును జ్వరమును నిర్జించి సు
ఖనియతి నలరారెఁ దండ్రి గనె స్వర్గంబున్. 50

తే. గీ. ఆసమయమందె శ్రీనారయప్పరావు
గారిరువదెన్మిదేఁడులు గడచుప్రాయ
మలరు ధీశాలి విద్వాంసుఁ డనఘకీర్తి
స్వఃపురికి నేగి యితనికి వంతగూర్చె. 51

తే. గీ. ప్రాణమిత్రుండు శ్రీ పోలవరపు ఱేఁడు
గూడ స్వర్గతుఁడై వంతఁగూర్చెఁ బిదప
జనకు మృతికారణమున స్వసదనము విడి
పొరుగుటింట నుంటయుఁ గూడఁ బొసఁగె నపుడు. 52

క. పౌరుగింట నున్నయప్పుడె
జరిగెన్ మఱికొన్ని యిట్టి సందర్భమ్ముల్
మరల గృహ మ్మరుదెంచిన
మఱునాఁడుదయించెనొక కొమరుఁడుజ్జ్వలుఁడై. 53

తే. గీ. మఱియు గుంటూరిసీమలోఁ గరము పేరు
గలుగు చేబ్రోలు పురమున నెలమి నల్లె
పేరుకలపూడి నవధానకారణమునఁ
గలిగె ధనయశోలాభముల్ కడిమి మెఱయ. 54

తే. గీ. అపుడె కృష్ణానదీతీరమందు వెలయు
నగ్రహారం బనంతవరాఖ్య మరిగి
యచటి వారలచే గౌరవాతిశయము
లొరసి వెలసిరి వెంకన తిరుపతియును. 55

సీ. శిష్యసాలగ్రామ చింతామణి కుమారు
పెండ్లికి నేగి యప్పెండ్లిలోన
మండపేటపురాన నిండారు సభ నవ
ధానంబు సల్పుట ధన్యతముఁడు
చెలికాని లచ్చరాశ్శేఖరుఁ డెలమిమైఁ
జితాడ్రిడలోఁ జేయు శ్రీకరంపు
సభ నుపన్యాసంబు సల్పుట, వేట్లపా
లెము తాళ్ళపూడి గ్రామమును నేగి

తే గీ. పుస్తకంపుభాండాగారముల సభలకు
నాధిపత్యంబు సల్పుట యాదిగాఁగఁ
దఱచు విద్యావినోదముల్ తారసించి
యచటి కిచటికిఁ దిరుగుట యనుఘటించె. 56

ఆ. వె. పైని చంటిపిల్లవానికి బారసా
లను నొనర్ప నెమ్మదిని దలంచు

నంత దైవనియతి నాకస్థ్రుఁడు మహూచి
చే గతించె మనసు చెడియె దాన. 57

తే. గీ. పిదప దేహమ్ము రుజకు నాస్పదమునయ్యె;
నట్టితఱి మున్నె వత్తు నన్నట్టికతన
నల సికిందరాబాదున కరుగవలసె
నాత్మశిష్యుని కొమిరె కళ్యాణమునకు. 58

క. సతితో సుతుతో శిష్యవి
తతితో నట కేగ నచటఁ దత్కళ్యాణ
స్థితికతనఁ గొంత హృదయపు
వెత దొలఁగె శరీరరుజయు వెనుకంజయిడెన్. 59

తే. గీ. కొన్నినాళ్లుండి దేశానకుఁ జనుదెంచు
త్రోవ శ్రీనూజివీ డేగి దొరకుటుంబ
మును బరామరిసించి యా పోలియందుఁ
గొన్నినాళ్లుండి గ్రామానకుఁ జనుదెంచె. 60

క. ఆరోగ్య మప్పటప్పట
ధారాళము గాక తప్పుదాయలు ద్రొక్కం
గా రోజు లెట్లొ గడుపం
గా రహి నేర్పడియె సౌఖ్యగరిమం బవలన్. 61

ఆ. వె. అంతఁ గొమరుఁ డొక్కఁ డావిర్భవంబందె
విజయవాడ దుర్గ వేఁడి మున్ను
తల్లి మ్రొక్కునక్కతమున దుర్గాభిఖ్య
వాని కుంచఁబడె నహీనగరిమ. 62

క. ఇలువేలుపు కామేశ్వరి
యలయంబికపేరు పెద్ద యతని, దితనిదో
యల యంబనామములయం
దలిదే యిర్వురును దేవినామమువారే. 63

తే. గీ. అవల మంత్రిప్రగడ భుజంగావనీశు
కొమిరె పెండ్లికి నేగు పెక్కు_డు ముదమ్ము
గదియ సంగీతసాహిత్యకవనగోష్ఠి
కతనఁ గాలమ్ము హేలగాఁ గడపు టొాదవె. 64

ఆ. వె. కాని పెద్దపిల్లవాని కష్టప్పుడు
తనుసుఖమ్ము చెడుకతమున మదికిఁ
దగినయంత స్వస్థతయు లేకపోవుట
యును ఘటించె దైవయుక్తిఁజేసి. 65

ఆ. వె. అంతఁ బ్రాణమిత్రుఁడైన శ్రీ తిరుపతి
శాస్త్రి స్వర్గ మేగె; సగము దాన
బుద్ధిబలము దేహమున బలంబును గూడఁ
దగ్గె దైవనియతి దాఁట వశమె! 66

క. ధనభూసంపాదనమును
దనయావాప్తియును హితసదనశుభసంద
ర్శనమును నృపసమ్మానన
మును శని ఘటియించె మొత్తముననెసకమునన్. 67

రౌద్రి సం॥ ఫాల్గున బ ౧౪ మొ॥ రుధిరోద్గారి సం॥ ఆషాఢ శు ౫ వ॥

—• గురుమహాదశలో బుధాంతరము •—

తే. గీ. అంత బుధునంతరము వచ్చె నాత్మదేహ
మునకు నారోగ్యము నయత్నమున నృపాలు
రాణివాసంబు కతమున ద్రవ్యలబ్ధి
మొట్టమొదటనె ఘటియించె నెట్టులనిన. 68

సీ. చిత్రాడవాసి ప్రసిద్ధుఁడు కవితకై
సర్వస్వదానంబు సలిపి స్వల్ప
కాలమ్ములోన నఖండభూమండలా
ఖండలు లార్జింపఁగాననిి యశ

మార్జించినట్టివాఁ డంతొ యింతొ కవిత్వ
మల్లెడివాఁడు గానాభిరతుఁడు
పోలవరంపు భూపాలుపిమ్మటఁ దిరు
పతిశాస్త్రి నేలిన భవ్యగుణుఁడు

తే. గీ. రమణఁ జెలికాని శ్రీలచ్చరావు తఱచు
వార్తలంపఁదొడంగెఁ దప్ప కొకసారి
"దర్శన మొసంగుఁ" డనుచు నెంతయును నాద
రంబు భయభక్తులును సంభ్రమంబు మిగుల. 69

ఆ. వె. ఇల్లు గదలుటన్న నెంతొ యత్నముమీఁదఁ
గాని గలుగనట్టి కాల మప్ప
టికి నొకింత మున్నె సుకవి వేంకటశాస్త్రి
కబ్బుకతన నరుగు టబ్బదయ్యె. 70

తే. గీ. అంతలో వచ్చె నన్నవరాధిదైవ
మైన శ్రీ సత్యదేవు కళ్యాణమహము
అచట సంస్థానపండితుఁ డౌటఁజేసి
యరుగుచును ద్రోవఁ జిత్రాడ కరిగె నితఁడు. 71

క. అరుగుడు లచ్చారాయం
డఱిముఱిఁ జెప్పంగరానియంత ముదమ్మున్
బొరసి కడు గౌరవించియు
మరల నరుగువేళఁ బలికె మంతనమందున్. 72

క. మా తోఁబుట్టువు రామాం
బా తరుణీతిలక మిట్లు మన్నన యెసఁగన్
మీతోడఁ జెప్పుమనియె య
థాతాత్పర్యముగ వినుఁడు తద్వచనములన్. 73

చ. ఇరువదియైదు రూపికల నేనెల కానెల మీకుఁ బంపుచున్
గరము బహూకరించెద మొకానొక యప్పుడు గాని మీకు మా

పురి కరుదేరు నన్నియమమున్ గొనఁగాఁ బనిలేద, మీర లు
త్తరపు వయస్సునందునికిఁ దద్దయు నే విటు చేయనెంచితిన్. 74

క. ఇది మీకు "నౌకరీ" గా
దెదియేఁ బనివడినయప్పు డేమే మిమ్ముఁ గో
రుదు మెవరినేని బంపి న
హృదయులు మిము గౌరవింపరే భూమీశుల్ ? 75

తే. గీ. అంత రాఁ బనివడినప్పు డదనముగను
రాకపోకల వ్యయమిడి రమణ ననుపు
నట్టి యేర్పాటు చేసితి మనుచుఁ జెప్పి
యిమ్మనియె దీని నని జీత మిచ్చె నెలకు. 76

క. కలి నిట్టి వదాన్యత్వము !
కలిమాత్రమ కాద పైని గలికి గదా ! యీ
బలవంతపు గౌరవ మి
మ్ముల నలిపెడి ప్రభ్వి కడు నపూర్వం బిదియున్. 77

క. అని యిది సర్వమ్మును వీ
యనఘుని ప్రోద్బలమ కాని యన్యము గా దీ
యన కవితాదరుఁడౌటను
మనతోఁ బనివడుచునుండు మాటికి నెపుడున్. 78

తే. గీ. దాని కిట్టి యుపాయమ్ము దగ నొనర్చి
యుండునని దానిఁ గైకొని యోలి నన్ను
వరమునకు నేగి కళ్యాణవైభవంబు
గాంచి స్వగ్రామమునకు వెంకనయు నరిగె. 79

ఉ. బందరు ప్రాంతమందుఁ జలపల్లిజమీన్విభుఁ డంకినీఁడ్ బి. యే.
యందుఁ గృతార్థుఁ డీయనకు నయ్యె ననర్ఘమహాభిషేక మా
నందడి కానృపాలకుఁడు సత్కవి వెంకనఁ బిల్వనంపె నా
నందముమై బహూకృతి ఘనంబుగఁ దా నొసఁగెన్ యథోచితిన్. 80

ఆ. వె. కాచమేని జేయఁగాఁబోవి నీచశా
త్రవుల కారణమున రచ్చ కరిగి
యందు విజయమందు టట్లుండఁ గడుయోగ్యు
లైన ఘనుల మైత్రి నందె నెలమి. 81

క. "వా రెవ్వ" రవిన విస్వా
ప్పారావును సోమెనాన్వవాయుఁడు కడుగం
భీరుఁడు కామేశ్వరరా
వారయ నల పద్మనాభ మల్లచయనులున్. 82

క. ఆనందం బలరఁగ ఛా
త్రాసీకము బలసి కొలువ నాత్రమవణమునం
దే నెలల కొలఁది విడియుట
వానప్రిస్థాశ్రమంపు వైభవ మబ్బెన్. 83

సీ. మురుమండ వెంకటగిరి యువరాజు రా
నయ్యనఘాత్ముని నారయుటయు
స్వగ్రామమునఁ బాఠశాల నొకఁడు నిల్పి
విద్యాభివృద్ధి గావించుటయును
మిత్రుల గృహముల మేల్మిమై జరుగు శు
భాదికమ్ములు చూడ నరుగుటయును
తన పెద్దకొమరున కనుకూల మగురీతి
వేడ్కమై వడుగు గావించుటయును

తే. గీ. నలిఁ బ్రిభావతీప్రిద్యుమ్న నాటకంబు,
నెలమి నారోగ్యమిడెడి కామేశ్వరినుతి,
హేయులను మందలించు మల్లేశువినుతి
యును రచించుట బుధునంద యనుఘటించె. 84

రుధిరోద్గారి సం॥ ఆషాఢ శు ౫ మొ॥ రక్తాక్షి సం॥ జ్యేష్ఠ శు ౧౧ వ॥

—• గురుమహాదశలో కేత్వంతరము •—

తే. గీ. అంతఁ గేత్వంతరమ్మున, జయంతి రామ
యార్య గృహమునందు నుపనయన మహోత్స
వమున కరుగుట యట బహుపండితప్రి
కాండమండలిచే మెప్పుగనుట మఱియు. 85

తే. గీ. ఆగృహస్థు సమ్మానంబు నందుటయును,
ద్రోవ ముమ్మిడివరమునందున సదస్సు
నం దుపన్యాస మిచ్చుట యచట వారి
గౌరవము గాంచు టాదిగాఁ గలిగె దీన. 86

క. వేంకటసుబ్రహ్మణ్యా
ఖ్యాంకితుఁడగు బంధుముఖ్యు యాగము జూడఁ
వెంకనకుఁ దటస్థించె న
లంకృతవిప్రమగు నింజరగ్రామమునన్. 87

తే. గీ. మఱియు సకుటుంబముగ నన్నవరము దేవు
దర్శనమ్మున కరిగి వ్రతమ్ము సలిపి
స్వపురిత్రోవ లక్ష్మీనరసపురి రాణి
గా రిడిన నూఱులార్లు వెంకన గ్రహించె. 88

రక్తాక్షి సం॥ జ్యేష్ఠ శు ౧౧ మొ॥ క్షయ సం॥ మాఘ శు ౧౧ వ॥

—• గురుమహాదశలో శుక్రాంతరము •—

క. భృగునంతర్దశయందున
భృగువిదశన్ గొమిరెపుట్టి పెంపొందె ముద
మ్ము గలిగె మిత్రగృహమ్ముల
నగు శుభకార్యములకరుగు నక్కారణమై. 89

ఆ. వె. ఆత్మకూరి శేని యనుఁగు నిల్లాలు పి
ల్పించెఁ బీసపాటి వేంకటరమ

ణాఖ్యు ద్వారమునను హైదరాబాదుకు
గౌరవం బొనర్పఁగాఁ దలంచి. 90

తే. గీ. ఆపురిని నిడకనుం గొన్ని యయ్యె సభలు
నూఱులార్లు సేలువులు విస్తారముగ ల
భించె; నాయె నెన్నెన్నియో పెద్ద విందు;
లాత్మకూర్ నృపసుతుఁడు నత్యాదరమున. 91

క. మును తన జనకుం డిడు భూ
మిని గైకొనఁ దన నగరికి మేకొని రమ్మం
చును గోరెఁ గాని చనకయె
తన గ్రామమ్మున కరిగె నితండు కడంకన్. 92

ఆ. వె. దండనాధికారి దైవతభక్తియు
క్తుండు లింగమన్వయుండు కవిత
యన్నఁ బ్రీణమిడు జగన్నాధరాట్పుత్రు
పెండ్లి కరిగి గౌరవింపఁబడియె. 93

క. శ్రీరాజితంబు విస్సా
ప్పారాయని కూఁతు పెండ్లివైభవము మనం
బారం గాంచుటయును స
త్కారమ్మల నలరుటయును గలిగెం బిదపన్. 94

తే. గీ. కాటరావులపల్లె భూకాంతుఁ గలిసి
కొనుట, లక్ష్మినరసపురి ననుకొననివి
మూఁడు నూఱార్లు చెల్లాంబ మొగిని రామ
యాంబయు నొసంగఁ జేకొను టబ్బె నిందు. 95

తే. గీ. అంత నించుక రుజచేసి యది శమించె;
నప్రయత్నమ్ముగాఁగ ముక్త్యాల వాసి
రెడ్డి చంద్రమౌళీశ్వరనృపతివరుఁడు
పిలువఁగానంపి కడు గౌరవించె నెలమి. 96

క. అది యెక్కడి దాతృత్వమొ!
యెదియు నిమిత్తమ్ము లేకయే నూఱాఱుల్
ముదమున మూఁడును బట్టునఁ
బొదలెడి వస్త్రములు మౌళిభూపతియొసఁగెన్. 97

తే. గీ. వల్లమూర్గ్రామమునకు శివప్రతిష్ఠ
కరుగుటయు నట బహుమాన మందికొనుట,
వంగవో లేగి యట గౌరవంబు మిగుల
నూఱులా ర్లందికొనుటయును దగె దీన. 98

క. హంసలదీవికి నరిగి ప్ర
శంసాపాత్రమగు క్షేత్రసంగతిఁబాప
ధ్వంసకమగు గృష్ణానది
హూంసలమగు భక్తిఁ దానమాడెఁగడంకన్. 99

తే. గీ. ఆంధ్రపత్రికావ్యాపకుఁ డతివదాన్యుఁ
డెలమి శ్రీకాశినాథ నాగేశరావు
పిలువఁ జెన్నపురికి నేగి పెద్దసభలు
చేసి గౌరవముంగొనె వాసి మిగుల. 100

తే. గీ. మఱియు నల్లాడి కృష్ణసామయ్య పిలువ
నంపి యాత్మీయసౌధమునందు గొంత
గోష్ఠి కెడమిచ్చి నూఱార్లు గొప్ప గౌర
వముగ నాగేశ్వరుఁడువోలె వాసి నొసఁగె. 101

తే. గీ. ఆసభకు వేంకటగిరీశుఁ డరుగుదెంచి
తమ విడిది కొక్కసారి రాఁగ మొగిఁ గోరెఁ
గాని యదియేమొ యచటి కేగకయమున్న
తలఁపనితలంపుగా రుజ దారసించె. 102

క. వెనువెంటనె స్వగ్రామ
మ్మునకుం జనుదెంచె; వ్యాధి ముమ్మరమై పి

డనుగొల్పి యెట్టకేలకుఁ
దన దుర్దర్పమ్ము విడిచి తను సుఖమిడియెన్. 103

ఆ. వె. అంతఁ గొమిరె యొకతె యావిర్భవంబందె
సంతసముగ బారసాల జరిగెఁ
బెద్దకొమరు పెండ్లిబేరమ్ములకుఁ గన్య
కల జనకులు వచ్చి కలిమి బలిసె. 104

తే. గీ. అంత బందరుపురికి సభార్థమరుగ
వలసె నయ్యెడ సమ్మానవై భవంబు
జరిగి యింటికి వచ్చియు శరదృతు నవ
రాత్రిపూజల నల్ల శర్వాణిఁ దనిపి. 105

క. సుకముండునంత దేహము
నకు మరలన్ వ్యాధిపీడనము ద్విగుణంబై
తిక మకలు పెట్టఁదొడఁగి య
పకృతిన్ గావించుటకును బ్రారంభించెన్. 106

తే. గీ. అట్టి సమయమ్మునంద "దేశాంతరముల
నెంతయో గౌరవము సేయు నిక్కవీంద్రు
మనముగూడఁ జేయఁగరాదె" యనుచుఁ బౌరు
లెలమి నూరేగఁగాఁజేసి రితనిఁ బేర్మి. 107

ఆ. వె. శుక్రనంతరమ్ము సురుఁగునంతటిదాఁక
పీడగొల్పి వ్యాధి వెనుకఁబట్టె;
నంత రవియు వచ్చె నంతర్దశానాయ
కత్వమునకు, నవలి కత వచింతు. 108

క్షయ సం॥ మాఖ శు ౧౧ మొ॥ ప్రభవ సం॥ కార్తిక బ ౧౪ వ॥

—• గురుమహాదశలో రవ్యంతర్దశ •—

సీ. అన్నవరంపుఁ గళ్యాణానకరుగుట,
మురుమండ దేవుని పరిణయమున

కరుగుట యిటనటజరుగు నుత్సవములఁ
గనులారఁ గాంచి యొక్కటఁబ్రికాశ
రాయఁ డింకొకట సూర్యారాయఁ డిడెడి స
త్కారములందె సకంబుకనుట,
వ్యాఘ్రేశ్వరపు వివాహమ్మున కరిగి య
య్యెడ నెందతెందఱో యిద్ధపాండి

తే. గీ. తీకులగువారి దర్శించి తేఁకువమెయి
వారి మెప్పును గనియు గవరయ మంగి
పూడికులుఁ డిడు గౌరవమును గొనుటయు
నమలపురమున మర్యాదనందుటయును. 109

ఆ. వె. అపలఁబాలకొల్లుకరిగి శ్రీకృష్ణభా
రతము కృతినొసంగు రమ్యసభను
మఱియు నొక్కసభను మంచి యుపన్యాస
ముల నొసంగి యంతఁ బోక మఱియు. 110

క. నరసాపుర పౌరుల యా
దరమున నట సభయు జరిపి తజ్ఞు లటనిటన్
విరివిగ నిడు నూఱాఱుల
నఱిముఱి నేలువులఁ గొనియు నలరుట యొదవెన్. 111

తే. గీ. మఱియు "యునివర్శిటీ బోర్డు" మండలమున
మెంబరగుట విజయవాడ మేల్మి నఱుగ
నచట నున్న బందరు శిష్యు లపరిపత్తి
సత్కరించిరి నూఱార్లు సాలుజోడు. 112

క. గుడివాడపురమునం దొ
క్కెడ బందరు శిష్యవర్గ మిట్టులె సభ నొ
క్కఁడు గూర్చి నూఱులాఱులు
నిడి సత్కారంబొనర్చి రెంతయు భక్తిన్. 113

క. ఇట నొక్క శంక, రవి యే
మిటికిన్ యోగింపవలయు మేలుగ మన వేం
కటశాస్త్రిజాతకమున కొ
కటియు నిమిత్తంబు గానఁగారా దనుచున్. 114

తే. గీ. జాతకజ్ఞు లనేకులు శంకగొందు
రక్కతమ్మనె నే మారకాఖ్యశాస్త్రి
గూడ యోగింపఁడని వ్రాసెఁ గొంకు దక్క
యైనయోగించుటకు హేతు వరయుఁడయ్య. 115

తే. గీ. కుసుమరాజయోగగ్రహకూటమందు
రవి యొకరుఁ డౌటఁజేసి, తా రాజయోగ
కర్తగా నుండె వేఱొక్క కారణంబు
గానఁగారాదు కనుఁడు విజ్ఞాను లిట్లు. 116

క. మారకశాస్త్రులు కడు వి
స్తారపు రుజ గొల్పు ననియుఁ దా వ్రాసెను గా
నీ రుజ నైతము కొంచెం
బే రగిలి శమించె నింత యెఱుఁగుఁడు తజ్ఞుల్. 117

తే. గీ. యోగ మెక్కుడుగా, నవయోగము గడుఁ
దక్కువగఁ జేసి సూర్యునంతరము తరలె;
నవుల నరుదెంచెఁ జంద్రుని యంతరంబు
శుభపరంపర లెల్లెడ సొబగు గొలుప. 118

ప్రభవ సం॥ కార్తిక బ ౧౪ మొ॥ విభవ సం॥ ఫాల్గున బ ౧౪ వ॥

—• గురుమహాదశలో చంద్రాంతరము •—

తే. గీ. శ్రీకరంబుగఁ బట్టాభిషేక మనుచు
వార్తనంపించె బొబ్బిలి పార్థివుండు
కొమరు నుపనయనంపు మూర్తము సమీప
మగుట రానని వ్రాసె వెంకన నృపతికి. 119

చ. పదపడి పార్థివుండు "చనవచ్చు ముహూర్తము కన్న మున్న మీ
రెద నిట సందియంపడకుఁ డేర్పఱ మి మ్మతివేగ మంపితీ
రెద" మని వ్రాయఁజేయుటయు ఱేని ముదంబున కన్యథాత్వ మొ
ప్పదనుచు నేగె బొబ్బిలికి వారక శిష్యగణంబు గొల్వఁగన్. 120

చ. చని యట నుత్సవంబుల పసందు సమస్తము కన్నులారఁ గ
న్గొని తన కైతచేత నలకుంభినిభర్తకు నింపు నింపి యా
జనపతివల్ల మేల్మిపని సాలువు లర్ధసహస్రరూప్యముల్
కనకమయంబు గంకణయుగమ్మును సత్కృతిగాంచి చెచ్చెరన్. 121

చ. స్వపురికి నేగుదెంచి తనుజన్ముని రెండవవానిఁ బేర్మిమై
నుపనయసంస్కృతున్ జలిపి యుచ్చతరంబుగ బంధువర్గ మీ
నెపమున సత్కరించి, పయి నెట్టన నాల్గవ మాసమందు పెం
డ్లి పొనరిచెం దటాల్న నవలీలగ జ్యేష్ఠనకున్ ముదంబునన్. 122

తే. గీ. ఇట్టు లుత్సవములపైని నెపుడు నుత్స
వములతో సగమేగెఁ జంద్రముని యంత
రంబు, మఱి యట్టితఱిఁ 'గలరా' స్వపత్ని
కనుఘటించియు మరలె నయ్యంబ దయను. 123

తే. గీ. నూజివీటికి వార్షికం బోజఁ గొనఁగ
నేగి సింహాద్రి యప్రాయనృపునిచేత
నెమ్మిమీఱ యథాపూర్వకమ్ముగాఁగ
గౌరవము నొంది వెంకన కడియ మరిగె. 124

క. ఇఁక నొక్కటి; పెద్దకుమా
రకుని వివాహమ్మున కల రామాంబిక యూ
పిక లైదునూఱు లంపి త
నకుఁ గల తాత్పర్యమును గనంబడఁజేసెన్. 125

తే. గీ. మఱియు ముక్త్యాల శ్రీచంద్రమౌళినృపుఁడు
నూటపదియాఱు లంపెను; నూఱులార్లు

గాక వస్త్రాదులంపెఁ బ్రకాశవిభుఁడు
అన్నపరసత్యదేవుధర్మాధికారి. 126

క. ఒక కొమరునకున్ వడుగిం
కొక కొమరునకున్ వివాహ మొగిఁజేసియుఁ ద
క్కక యుత్తమర్ణుఁడై యీ
సుకవియెసంగెన్ ఋణమ్ముసుంతయుఁగొనమిన్. 127

తే. గీ. ఉత్తమర్ణపదంబున నోలి పిల్చి
సకలవిధముల శుభములు సంతరించి
తనదు చల్లదనంపుఁ జందమ్ము నెల్ల
వెంకనకు శీతరుచి చూపి వెడలె నవుల.

128

విభవ సం॥ ఫాల్గున బ ౧౪ మొ॥ శుక్ల సం॥ ఫాల్గున శు ౧౫ వఱకు

—• గురుమహాదశలో కుజాంతరము •—

క. మంగళుఁ డరుదెంచెఁ గడున్
మంగళసంధాయకుఁడయి మఱువఁదగద ప
త్సంగతుఁ డితఁ డిచ్చిన స
న్మంగళముల నితని పేరు మంగళుఁడె కదా. 129

క. కుజమంగళనామమ్ముల
నజుఁ డీతని కిడియె; రెంటియం దాద్యాఖ్యన్
గజిబిజి, రెండవదానన్
బ్రజకున్ ముదమబ్బుటయును బ్రకృతిగతంబుల్. 130

ఆ. వె. ఏను మొదల నితనిదైన యాద్యాభిఖ్యఁ
బట్టి తప్ప దితఁడు భంగమేది
యో ఘటించితీఱు యుక్తి మిప్పట్ల జా
గ్రత్త యనుచు నెంచి కడు రయమున. 131

తే. గీ. గృహిణిచే నొక్క "విల్లు" వ్రాయించి యాపె
పేర నున్న సొత్తెల్లఁ గుమారకులకుఁ

జెల్లు నట్లందు నేర్పాటుచేసి మఱియుఁ
జేయఁగల సదుపాయముల్ చేసికొంటి. 132

ఆ. వె. కాని కుజుఁడు మొదట గడబిడ యొక్కింత
కలుగఁజేయునట్లు గానఁబడియు
సకలగతులఁ దుదకు సన్మంగళావాప్తి
సలిపి యెంతయేని గొలిపె ముదము. 133

క. మోకాలియొద్దఁ గురుపై
యేకొంచెమొ పీడపెట్టె; నిది తక్కిన నిం
కేకష్టము నితఁ డిడలే
దేకడ శుభలాభజయము లెసఁగంజేసెన్. 134

క. ఒక కొమరుం డుదయించె, మ
తొకకొమరునిపెండ్లియున్ మహోన్నతగతిఁ బు
త్రికల కిరువురకుఁ బెండిలి
యిఁక నెన్నియొ శోభనమ్ము లితఁ డెసఁగించెన్. 135

క. విరివిగ లక్ష్మీనరసా
పురపు జమీందారురాలు పూర్వమువలె ను
త్తరమగుగతి ద్రవ్యంబిడి
మరియాదనొనర్చె రామమ పొరింబొరిగన్. 136

తే. గీ. తేలప్రోలి జమీందారు, ధీరసుకవి
యల్లయయ్యారి ఱేఁడు, చెల్లాంబ గన్న
వరపుఁబేలిక, ముక్త్యాల వల్లభుండు
వలసినంత ధనంబు సొంపలర నిడిరి. 137

చ. వెనుక నుదాహరింపఁబడె విశ్రుతుఁడౌ చలపల్లి ఱేఁడు; త
జ్జనపతి కూర్మిపుత్త్రికకు సత్కవిగేయున కయ్యెఁ బెండ్లి, మిం
చినగతి నీనృపాలునభిషేకము గూడ నెసంగెఁ బెండ్లి వెం
టనె; పిలుపబ్బి వెంకన హుటాహుటి నేగెను జల్లపల్లెకున్. 138

చ. కసమొకొ ! మున్ను భూపతుల కాన్పుల పెండిలు లెన్నియో, యొన
ర్చిన యభిషేకముల్ గనమొ ! శ్రీయుతమౌ చలపల్లెలో నొన
ర్చిన యభిషేకమేమి, యటఁ జెన్నలరారిన పెండ్లియేమి క
న్గొనవలెఁ గాని యేకవులకున్ వివరింప నశక్య మాగతుల్. 139

ఉ. ఎందఱు వచ్చిరో సుకవు ! లెందఱు గాయకు లేగుదెంచిరో !
విందుగ నాటకమ్ము లవి వెంబడి వెంబడి నెన్ని యైనవో !
యందును గోటచుట్టు నల యామిని భాగవతంబు లెన్ని పెం
పొందినవో ! వచింప నెవఁ డోపెడిఁ! జూచియె తీరఁగావలెన్. 140

తే. గీ. పెండ్లి మొదల లభిషేకంబు పెంపుదనుక
నొక్క నెల పట్టె దాదాపు సిక్క మిన్ని
నాళ్ళు విందులు మఱియు విన్నాణమైన
సభలు జరుగుచునుండె నిశ్శంకగరిమ. 141

క. పదికిన్ దక్కువ, వేయికి
నదనమ్మను గాని ఫక్కి నందఱకున్ మె
ప్పొదవఁగ బహూకృతుల నిడి
యదియుం గాక పయి నిడి రనర్ఘపువలువల్. 142

తే. గీ. ఎవ్వనికిఁగాని ముట్టలే దిం దటన్న
యపయశము లేశమును లేద, యహహ ! యిట్టు
లేనృపున కయ్యెఁ బెండిలి ! యే ధరాధి
పతికిఁ బట్టాభిషేకంబు పరిఢవిల్లె ! 143

తే. గీ. నోరుగలయట్టి కొందఱు కేరికేని
నెక్కుడుగ నిచ్చి పంపుట, యితరులకును
శుద్ధశూన్యంబగుట యెందుఁ జూచుచుంటి;
మిచట సర్వంకషం బీవి యింత నిజము. 144

క. ఇఁక నొకటి యర్హునకుము
ట్టకపోవుట లేద, యొక్కఁడ ననర్హుఁడవా

నికిఁ గూడ ముట్టెనేమో
సకలం బిది నిజము, యిందు సాక్షు లనేకుల్. 145

ఉ. అమ్మహనీయసత్కృతులయం దధికారము వాసిరెడ్డివం
శమ్మునకున్ విభూషణము సద్గుణగణ్యుఁడు చంద్రమౌళి, రా
జ్య మ్మిపు డేలుచుండిన రసాపతిమౌళికి మేనమామ హ
స్తమ్మున నుంటఁజేసి యది తద్దయు శోభిలెఁ గీర్తిహేతువై. 146

తే. గీ. "ఐనవారల కాకులు కానివారి
కెల్లఁ గంచమ్ము" లను మాట యించుకేని
ప్రజలగోష్ఠులలో వినఁబడకయుండ
నఖిలమును నిర్వహించె ముక్త్యాలవిభుఁడు. 147

క. వేయున్నూటాఱుల నగ
మీయధిపతి యొసఁగె వేంకటేశున కిటులే
సాయము శుభకార్యములకు
నాయెడ లభియించె యత్నమది లేకుండన్. 148

తే. గీ మఱియు దొడ్డముపేట భూవరుఁడు వాడ
రేవు విశ్వసుందరరావు, నృపతి శ్రీ భు
జంగరావు గుటాలరస కధినేత్రి
యైన శ్రీ మహాలక్ష్మాంబ యదియుఁ గాక. 149

క. బాకురుపండాగృహ ను
శ్రీకుఁడు వేంకటరమణుఁడు చేసిరి సాయం
బీకార్యములకు, వీరల
నేకాలము మఱవరామి నిందు నొడివితిన్. 150

తే. గీ. రామచంద్రాప్పరావు పూర్వమునఁ జేయు
వార్షికము నిప్పటికి ననవద్యగరిమ
నతని రెండవసుతుఁడు సింహాద్రి యప్ప
రా విడుచునుండెఁ బరమాదరంబుతోడ. 151

క. ఏగినను నేగకున్నను
రాఁగల యావద్ధనము కరముపోల్కి మహా
భాగుఁడు రాసుతుఁ డంపెడి
నీగరిమయు వర్ణనీయ మిది యిటు లుండెన్. 152

శా. ఈసింహాద్రివిభుండు వెంకనకుఁ దా నిప్పట్లఁ గొంకం డొగిన్
జేసాపన్ మఱి యెంత ద్రవ్యమయినం జేయుంగదా ! సాయమున్
జేసాపన్ బనిలేద మానమయినంజేకొన్న వెంకన్నకున్
దా సర్వస్వము ధారవోయుననుటల్ తథ్యంబు ముమ్మాటికిన్. 153

తే. గీ. అట్టితఱి వెంకనకుఁ దోచె నాత్మ నింత
వింతదాత మనయెడల వేఱొకరుఁడు
లేఁడుగాని ద్రవ్యంబంత లే దితనికిఁ
బ్రికృత మిట్లౌట నిటఁ గొనఁ బాడిగాదు. 154

క. ధనమదియెందఱొయిచ్చిరి
ఘనముగశుభకార్యముల కిఁకన్ గొనుటదియున్
జనః దీద్రవ్యము నిలువకుఁ
గొను టుచితముగాద యిట్లగుంగా కనుచున్. 155

ఆ. వె. నృపునితోడఁ బలికె "నెపుడు మీ రిడెడి వా
ర్షికము చాలు నాకు రేపు వచ్చు
వత్సరమును గలిపి యుత్సాహమున నిప్పు
డిండు వేలు యిడిన నే గ్రహింప. 156

తే. గీ. ఎంత యిమ్మన నంతయు నీ వొసఁగుదు
వే నెఱుంగుదు నాయెడ నెట్టి పేర్మి
మీకుఁ గలదొ ? యట్లౌటనే మిమ్ము నిట్టు
లేను యాచింతు నాకోర్కి యిదియె నిజము." 157

క. అనఁ గవియెడ గురుభావం
బునఁజేసియు నప్పు డట్లె పొంపిరివోవం

జనుపేర్మి నొసఁగె సింహా
ద్రి నరేశుం; డతనిఁ జెప్పి చెప్ప నితరులన్. 158

మ. అవిభాజ్యమ్ముగ నూజివీడ్విపులరాజ్యంబున్న సింహాద్రిరా
డవనీభర్తకె యేకచక్రిముగఁ బాల్యంబౌట నిక్కంబ, యే
యవయోగమ్ములు దైవకల్పితములై యావిర్భవంబందకు
న్నవిభుం డీకృతిభర్త పీఠపురపు న్నాణెంపురాజ్యానకున్. 159

చ. గతమునకేమి, యిప్పుడు నఖండవదాన్యత యోగ్యతాపయో
గ్యతల నెఱింగి యీవి వినయంబు నయంబు మొదల్ గుణమ్ము లీ
ద్వితయమునందు మిక్కిలిగఁ దేజరిలున్. సుకులోద్భవుల్ కవి
ప్రతతికి వర్ణనీయు లను భావమునన్ లిఖియింతు నింతగన్. 160

తే. గీ. షష్ఠలాభాధిపతి యయ్యు సహజముగను
గ్రూరుఁడయ్యుఁ గుజుం డాత్మగుణము విడిచి
విపులముగ నీతనికి నెట్టు లుపకరించె
ననెడి యంశ మిచట విచార్యంబు సుంత. 161

క. శుభులం గూడిన పాపులు
శుభమును, బాపులను గూడు శుభు లశుభంబున్
బ్రభవింతు రనుట నాకు న
నుభవమునకు వచ్చె నిదియు నూనం బరయన్. 162

తే. గీ. మఱియుఁ గొన్ని కారణములు మహిసుతునెడఁ
గలవు గురుదశ నింత యోగము నొనర్చ
పొంచె, నితఁ డాత్మదశఁ గూడఁ బూర్ణతరము
గాఁగ యోగించె భిద సుంత గలదు దాన. 163

తే. గీ. ఎంత యోగంబొ రోగంబు నంతఁ జేసె
వెనుక నిపు డట్లుకాక యార్జనము, దేహ
మున ననామయభాగ్యమ్ము నొనరఁగూర్చెఁ
గాన నింతగఁ జర్చింపఁగడఁగవలసె. 164

క. యావత్కాలము శుభదం
బై వెలయఁగఁ గుజుఁడు తనదు నధికారంపుం
బ్రావీణ్యము నెఱపి చనియె
నావెనుకన్ వచ్చె రాహునంతర్దశయున్. 165

శుక్ల సం॥ ఫాల్గున శు ౨ మొ॥ ఆంగీరస సం॥ ఆషాఢ బ ౧౪ వ॥

—• గురుమహాదశలో రాహ్వంతర్దశ •—

క. తన కొమరెల పెండ్లిండ్లకు
ననుబంధములైన శుభము, లనఁగా మఱియున్
మనుగుడుపులు లోనగు శుభ
వననిధి నీఁదంగ శిఖి యవారణఁ జేసెన్. 166

తే. గీ. ఘనుఁడు శ్రీ యినుగంటి ప్రకాశరావు
షష్టిపూర్త్యుత్సవమ్మును సలుపఁదలఁచెఁ
గాని యది సఫలత్వము గాంచదయ్యె
ననుగుణమ్మగు నారోగ్యమందకునికి. 167

క. మోతేవంశ్యుఁడు కడుఁ బ్ర
ఖ్యాతుండగు గంగరాజు ఘనముగ నూఱా
ర్లీతని కిడె నేలూర్పురి
నీతం డిడె నిట్లు మునుపు నెన్నియొ సాయల్. 168

తే. గీ. అంత నవరాత్రములు వచ్చె నమ్మహమున
కేగుదెంచిరి యల్లుండ్రు నెసకమెసఁగ
జరిగె నయ్యుత్సవంబు ప్రశస్తగరిమ
యంతలో దేహమున కార్తి యనువుపడియె. 169

తే. గీ. స్వల్పకాలమ్మునన యది శాంతిఁజెందె;
నవుల బొబ్బిలిఱేఁడు మున్నడిగినట్టి
యాత్మపట్టాభిషేకకావ్యమ్ము పూర్తి
చేయ మొదలిడె వెంకన శ్రీదలిర్ప. 170

తే. గీ. ఇట్టితఱిఁ బెద్దకొమరున కెంతయేని
జ్వరము మొదలిడి యది దేవికరుణకతనఁ
దుదకు శాంతించె, నంతట నదనువచ్చె
బొబ్బిలికి నేగి కృతి యిచ్చుపొంటె నవుల. 171

క. వెంకనకు దేహమునఁ గడుఁ
బెంకెతనపువ్యాధి పొడమి బింకమ్మెసఁగన్
శంకాసంకులుఁ జేయుడుఁ
బంకజహితుఁ గవితఁదనిపె భాస్కరదేవున్. 172

ఆ. వె. ఆదినేశుకరుణ నారోగ్య మేర్పడె;
నంత శిష్యవర్గ మాత్మజులును
బలిసి కొలిచి రాఁగఁ బయనంబు సాఁగించె
బొబ్బిలికిని బొత్తము వినిపింప. 173

సీ. ఈకృతినాథుఁడై యెసకమ్మెసంగు గం
గాధరరామరాట్కాంతు రెండ
వ కుమారునకు నప్డు పరిణయంబగుచున్న
సమయ. మ్మదియుఁ గాక జనవిభుండు
బొబ్బిలిరాజన్యు నబ్బురంపు సహోద
రీమణికిని నప్పుడే మహోద
యంబుమైఁ బెండిలి యలరారుచుండె ని
ట్లెంతయు శుభముల నేపుమీఱు

తే. గీ. నట్టి తఱి బొబ్బిలిని గొన్ని యహము లుండి
పైని సమయంబొసఁగి ధరాపతియు రాజ
బంధువులతోడ వినఁ గావ్యబంధమును మ
నోహరముగ వెంకన్నయును వినిపించె. 174

తే. గీ. వేయిపై నూఱునాఱును విలువ మిగులు
సేలుజోడును భూపాలశేఖరుండు

గౌరవమొనర్చి యేఁ బేటఁ గవికి నూఱు
లార్లు ప-పించు నేరుపా టమరఁజేసె. 175

ఆ. వె. అంతఁ బోక శిష్యులందఱకొక్క నూ
ఱౌ తొసంగి యిట్టు లఖిలగతుల
నాదరించి పంపె నవనీశ్వరుం డాత్మ
వితరణంబు సుకవివితతి వొగడ. 176

క. అటు గౌరవింపఁబడి వేం
కటకవి తనగ్రామమునకుఁ గడియమ్మన కు
త్కటముదముతోడఁజనెమి
కృుటముగ నరపాలు మెచ్చికొనుచున్ బేర్మిన్. 177

తే. గీ. ఆంధ్ర "యునివరిసిటీఁ" బరీక్షాధికార
మున్న హేతువునంజేసి యొక్కకొంత
ధనము లభియించె నీగతిఁ దద్ద శుభవి
ధాయకంబుగ రాహునంతర మెసంగె. 178

క. స్థిరవసతియుఁ జరవసతియు
మఱికొంత లభించెఁ, గొంత మాతామహాను
స్థిరయుఁ గలిసె; నీగతిఁ దా
మరతంపరగా ధనాప్తి మఱిమఱి యొనరెన్. 179

క. రెండవ కొమరునకుం గడు
గండుమిగులు జ్వరము వచ్చి కడ కది యెంతో
గండముగఁ బరిణమించియు
బెండుగతిన్ సురిఁగె నింటివేలుపుకరుణన్. 180

ఆ. వె. అమితధనము కుజుని యంతరమ్మన లభి
యించుఁగాక యంత కెచ్చుగాఁగ
వ్యయము నయ్యె; వీని యంతరం బటుగాక
వ్యయము తగ్గు, లాభ మధిక మిడియె. 181

చ. అఱువది యేఁడు లాయువని యల్ల ద్విభాషికులుండు వేంకటే
శ్వరబుధుఁ డప్పు వ్రాసె, నది జాతకమం దపు దేగుదెంచె, నీ
శ్వరకృపఁ దల్లికడ్పుచలువన్ మరణంబు ఘటింపకుండుఁగా
కటిముటి గండగండముగ నత్తఱి వెంకన కేగె నెట్టులో. 182

క. ధనభూసంపాదనము లి
తనకి ఘటించుటయ కాక ధనభూదానం
బున నీతఁ డొరులఁ దన్పుట
యును జేకుఱె రాహునం దనూనప్రీతిన్. 183

తే. గీ. ఒక్క రాహ్వాంతరమునఁ గా దిక్కవీశు
జాతకమునకు గురుదశ సంఘటిల్లె
నది మొద లెసంగె సంతతం బన్నదాన
మన్నపూర్ణామహాదేవియతులకరుణ. 184

తే. గీ. తాను నూఱార్లు గైకొను తజ్జుఁడగుట
నొరుల కప్పడ్డ నూఱాఱు లొసఁగు భాగ్య
మితనికి ఘటించె గురుదశ యిదియ కాదు
రాహుదశ గూడ నీ యుదారత ఘటించె. 185

క. ఈయీవి తనకుఁ గొమరుల
కాయత మారోగ్య మిడిన యాయుర్వేద
శ్రీయుతుఁడు వేంకటేశున
కా యలఘుఁడు రామమూర్తి కని యెఱుఁగఁదగున్. 186

తే. గీ. బహుమతికిఁ గాని పద్ధతి బహుళధనము
గురునిలోఁ జందురుఁడు రాహు గూడ వైద్య
మునకుఁ గర్చువెట్టించెను; బూర్వపు దశ
లేవియును గర్చువెట్టింప విట్లు ధనము. 187

తే. గీ. నూజివీటి వార్షికమున కోజఁ జని క
రంబు సింహాద్రి శ్రీ యప్పరావుచేత

గౌరవింపఁగఁబడి యింటి కరుగుదెంచు
నంతఁ జీరాలపురవాసు లటకు వచ్చి. 188

ఆ. వె. స్వపురమునకు గౌరవపురస్సరమ్ముగాఁ
దీసికొనుచుఁ జవియు దీపమహోత్స
వంబుఁ జేసి రట్టి వైభవంబున మించి
యింటి కేగుదెంచె నితఁడు పిదప. 189

ఉ. శాఁకరపర్తి బంధుజనకైరవబంధుల కోర్కిమీఁదఁ దా
నీకవి ధాత్రిపుత్రికసమేతముగాఁ జనె; నేగినంత వా
రేకముఖమ్ముగాఁగ నెదురేగియు నూరున నేగఁజేసి ర
స్తోకపు మేళతాళములతో ననవద్యతరాదరంబుతో. 190

తే. గీ. ఆత్మశాఖీయులగువారి యాదరమున
నప్పురమ్మున సభ నుపన్యాసము లొక
రెండు మూఁడిడి తగ నలరించి వారి
నింటి కేతెంచె నీకవి యెసక మెసఁగ. 191

ఆ. వె. సోమెనాన్వవాయజుండు శ్రీకామేశ
రా వొనర్చెఁ బెండ్లి రాణ్మహేంద్ర
వరమునందు మేటి వైభవం బలరార
నతని పేర్మిఁజేసి యరిగె నటకు. 192

క. సకుటుంబమ్ముగ నిటు పెం
డ్లికిఁ జని యట జరుగు నక్కడింది మహము త
క్కక గని యా గే స్తొసఁగిన
ప్రకటతరపు గౌరవమ్ము వడసియుఁ బిదపన్. 193

క. మురుమండ దేవుకళ్యా
ణరమకుఁ దత్పురవరంపు నరనాధుని యా
దరముకతనఁ బూర్వమువలె
నరిగి యచటి యుత్సవమ్ములరసియుఁ బిదపన్. 194

తే. గీ. అన్నవరమున సత్యనారాయణునకు
జరుగు పెండ్లికిఁ జని యట సకలగతుల
నుత్సవమ్ములఁ బాల్గొని యొగిఁ బ్రకాశ
రావుతోఁ గాలయాపన రహి నొనర్చె. 195

తే. గీ. బంధులవియును స్నేహసంబంధులవియు
నుత్సవము లట్టు లెన్నెన్నియో కనంగఁ
జేయుటయ కాక తనయింటఁ జేయఁజేసె
రాహువు శుభమ్ములను గడురాణ యెసఁగ. 196

తే. గీ. అరుగుదెంచుచు రాహు తా నల్ల లక్ష్మి
నరసపురపుజమీందారు గరిమ నొసఁగు
నూఱులాఱులు మఱియు ననూనమైన
యయ్యధిపు నాదృతియును సొంపారఁ గూర్చె. 197

తే. గీ. బంధుసంబంధమైన యాపత్తు, లింట
నప్పుడప్పుడు దూరుజ లలము, టాత్మ
దేహమున వార్ధకత్వప్రదీప్తి తక్క
సకలవిధముల రాహు వొసంగె సుఖము. 198

తే. గీ. రాహునంతర మొకటి మాత్రంబ కాక
గురుమహాదశ సర్వ మిక్కరణి నెగడె;
ధన మొసఁగె, ధాన్యవృద్ధి సంతానవృద్ధి
నొసఁగె, భూవృద్ధి గోవృద్ధి నొసఁగె నెలమి. 199

క. అపయోగము గడుఁ దక్కువ
సవిశేషంబుగ సుయోగసంఘటనంబున్
దవిలించి గురుమహాదశ
కవి వెంకన జాతకమునఁ గడచె శుభగతిన్. 200

ఆ. వె. సమయమునకు జ్ఞప్తిచాలక యీగురు
దశను జేర్పఁదగిన తత్తదంశ

ము లవి యెన్నియేని గల వందులో ముఖ్య
ములగువానిఁ గొన్ని దెలియ వినుతు. 201

ఆ. వె. అన్నవరపుదేవు నంతికమ్మున నిను
గంటివంశ్యుఁ డల పర్కాశరావు
కొమిరె పెండ్లియుత్సవము కడు వైభవ
మలర జరిగె దాని కరిగె నితఁడు. 202

తే. గీ. అతఁడు నూటార్లు నేలువు లితని కిడి బ
హూకరించె; నిది యిటుండ నొకట నరస
పురమునందు శాకుంతల పుస్తకమును
గూర్చి జరిగెఁ గొండొక సభ కుతుక మలర. 203

క. దానికి నితఁ డధ్యక్షుం
డై నరసాపురపు సభ్యు లానందింపం
గా నది కృతిగొను పొనపలి
శ్రీనిలయుఁడు సోమయాజిచేఁ గొనెఁబూజల్. 204

ఆ. వె. తణుకులోన నొకటఁ దగె నాంధ్రభాషాప
రిషద మా సభకు నరిగె నితఁడు
అపుడు మండపాకయందలి వైదికుల్
పిలిచి సత్కృతులను సలిపి రెలమి. 205

క. శ్రీరుచిర మోతె వంశ్యుఁడు
నారాయణరావు పిలిచి నాటకపుమిషన్
దా నొసఁగె నూటులాటులు
శ్రీనెగడన్ మృచ్ఛకటి రచించినకతనన్. 206

తే. గీ. మఱియుఁ బాండవవిజయమ్ముఁ దఱచు నాడు
బందరు పురీనటకు లొక్కపరిఁ బ్రదర్శ
నమున కాహ్వానమును బంపి ప్రమదమెసఁగ
నూటులాటు లొసంగిరి గౌరవముగ. 207

తే. గీ. పాలకొల్లున మును పొక భారతంపుఁ
గృతిసభకు నేగి కొనె బహూకృతు లితండు
వెండి శ్రీకృష్ణభారతం బొండొకండు
కృతిగొనుచు నీతనికి బహూకృతు లొసంగె. 208

తే. గీ. మఱియు గుంటూరిసీమను గరము పేరు
గల్గు శ్రీ వేటపాలెపు గ్రామమున నె
సంగు పౌరు లొండొకపరి సభకుఁ బిలిచి
గారవించిరి పేరిమి గడలుకొనఁగ. 209

సీ. సుప్రసిద్ధుండు పూర్ణప్రజ్ఞకవివరుం
డాంధ్రీకరించె బాణాభిధాన
కవికృతంబౌ నల కాదంబరీగ్రంథ
మద్దానిఁ దన మామయైన కాశి
కృష్ణార్యసుకవి కంకితమిడెఁ దత్సభ
కీతఁ డధ్యక్షుఁడై యేగె నప్పు
డాసభగూర్చిన యనఘుఁడు రత్తయ్య
పంతు లీతని కిచ్చె బహుమతులను.

తే. గీ. మొగి నటకు వచ్చి జాగర్లమూడి కమ్మ
వంశ్యు లెంతయు భక్తిప్రపత్తు లలరఁ
దమదు నూరికి రప్పించి తగినభంగి
సత్కరించిరి కొండొక సభ నొనర్చి. 210

ఆ. వె. ఆప్రయాణమందె యనఘశిష్టాకుల
జుండు హనుమదాఖ్యపండితుండు
బహుమతిగను రాంకవప్రదానంబున
సత్కరించె భక్తియుత్కటముగ. 211

క. ఏఁ చేఁట గణపతికి నొక
నాఁటన్ శ్రీరాణ్మహేంద్రనగరకళాశా

లాటకులగు విద్యార్థులు
పాటించి యొనర్తు రుత్సవము భక్తిమెయిన్. 212

తే. గీ. బందరును వీడి కడియము వచ్చుటాది
యింతదనుకఁ దత్సభ కీతఁడే యధీశుఁ
డగుచు నేఁటేఁట నట నుపన్యాస మిచ్చు
ఘనుఁడు విస్సాప్పరాయని కారణమున. 213

ఆ. వె. మఱియు రాజమహేంద్రవరమున శ్రీ చల్ల
పల్లి యారువేలవారి యింటఁ
బరిణయమున నొకట జరిగె నెక్కుడు సభ
తిరుపతియుఁ గలండ దీనియందు. 214

తే. గీ. గుండ్లపలె సాంబమూర్తియుఁ గొమిరెపెండ్లి
చేసెఁ దూరుపునుండి విచ్చేసెఁ బెండ్లి
కొమరుఁ డగ్రహారికుఁడును భమిడిపాటి
కులుఁడు, వీ రవధానంబు సలిపి రపుడు. 215

తే. గీ. ఆంధ్రభాషాపరిషదాఖ్యమైన సభ యొ
కంట నేలూరిలో జరుగంగ దాని
కీతఁ డధ్యక్షపదవికి నేగె సభ్యు
లట్టు లెన్నుకొనుటఁజేసి యాదరమున. 216

క. నాళము కృష్ణారాట్కవి
శ్రీలలరఁగఁ గూఁతుపెండ్లిఁ జేసి పిలిచి యు
ద్వేలగతి సత్కరించెన్
హేలగ వెంకనను రాజమహేంద్రపురమునన్. 217

తే. గీ. విజయనగరపురమునుండి విట్కులజులు
తరలి వచ్చిరి రాజమహేంద్రవరమొకట
నప్పు డాహ్వానమంపి వెంకనకు సభనొ
నర్చి రెక్కుడు సత్కార మర్చ యొలయ. 218

తే. గీ. మొల్లమగు పేర్మి గెద్దనాపల్లెలోని
సుప్రసిద్ధుఁడు పంతముసుకులజుండు
శ్రీమఁ బోలెడి కాపు విశిష్టగుణుఁడు
సూర్యరావు బహూకరించుటకుఁ బిలిచి. 219

క. "మీ రెప్పుడో పెండ్లికి నిట
నూరేగితిరంట! పుట్టకుంటిని నే నె
ట్లారయఁగల్గుదు నది? యిపు
డూరేగింతు"నని చెప్పి యూరేగించెన్. 220

తే. గీ. పర్తిపాడు 'మేజస్ట్రీటు' పదవి నలరు
నల జగన్నాధరావు లింగాన్వయజుఁడు
కొమరుసుపనీతికయి గౌరవముగఁ బిలిచి
సత్కరించె సభను భక్తియుత్కటముగ. 221

తే. గీ. ఉండిలో భీమవరములో నెండు సభలు
జరిగె; గుడివాడ మునుపటి సభయ కాక
మరలఁ దుమ్మలపలె పేరఁ బరఁగు శిష్య
నింటి పెండిలి కేగెను నీతఁ డెలమి. 222

తే. గీ. పెండిలికి నేగుటయ కాక భీమనాధ
దేవుకళ్యాణమునకు నంతేవసత్పురి
యత్నమునఁ జాలసా ర్లీతఁ డరిగి ధర్మ
కర్తయౌ శిష్యుఁ డిడు పూజగనె నితండు. 223

ఆ. వె. ఇంక నెందఱెందఱేనియు నిటు లాచ
రించు గౌరవములు మించి యెన్ని
యేని గలవు జ్ఞప్తి కెలమిమైఁ దవిలిన
వట్టు సంగ్రహముగ వ్రాయఁబడియె. 224

క. ఏవిషయము సంగ్రహముగ
నే వ్రాయంబడియె నిం; దిచే కాకున్నన్

బోగ్రీవులు పోగ్రీవులు గాఁగన్
దైవారు నెఱుంగుఁ డీకథాకథనంబున్.  225

తే. గీ. ఒకటి మచ్చునకై యిందు నొక్కకొంత
విస్తరించి వచించెదఁ; బెండ్లి తనదు
కొమిరెలకు వెంకన యొనర్చెఁ బ్రమద మెసఁగ
ననుచు వ్రాసితి నట నెంతయైనఁ బెరుఁగు.  226

క. ఎటులందు రేని మన వెం
కటకవి కొమిరెలకుఁ బెండ్లి గావించుటకై
స్ఫుటముగ నిర్ణ్వరకును నొ
క్కటిగా సుముహూర్త ముంచఁగా నప్పట్లన్.  227

తే. గీ. ఏమిచెప్పుదు దైవేచ్ఛ! యింకఁ బెండ్లి
యాఱు రోజులలో నున్నయపుడు రెండ
వ కొమిరె వరుండు మోటారువలని బల్ ప్ర
మాదమునకు లోనయి ప్రాణ మూఁదియుండె.  228

తే. గీ. ప్రాణభయము లేకున్నను నంగభంగ
మబ్బునో యేమొ 'హాస్పట'లందుఁ గట్టు
గట్టుచున్న యవ్వానికిఁ గన్నె నొసఁగ
నీతఁ డొప్పిన నొప్పుట యెట్లితరులు.  229

తే. గీ. మునిఁగిపోయినదేమి, యాతనికి నిచ్చు
కన్నె పెండ్లి యప్పటి కాపి చిన్నివరుఁడు
దుస్థితికిఁ దప్పుపిదప నెందుల కొనర్ప
రా దనుచుఁ బ్రాజ్ఞులైనవారలు వచింతుర్.  230

తే. గీ. కాని యది "శారదాబిల్లు" కాలమగుటఁ
గన్యకలఁ దల్లిదండ్రులు కాళ్లుగడిగి
ధారవోసెడి కాలము దాఁటిపోవు
ననెడి భయమునఁ దొందర గొనఁగవలసె.  231

క. కన్నియకు నాలుగవయేఁ
డెన్నఁగ వరునకుఁ బదేఁడు లీబిల్లే-లే
కున్నన్ దొందరయే లే
దున్న నితం డేల దీని కొడఁబడె నన్నన్. 232

తే. గీ. ఇతఁడు "శారదాబిల్లున" కించుకేని
జంకఁ డది యేమటన్న. సంస్కర్తృపక్ష
పాతి గాఁ డితఁ డీతని భావ మిచట
విస్తరించెదఁ బాఠ్యిజ్ఞులు విందుఠిగాక. 233

తే. గీ. దేవునాజ్ఞయు రాజునాదేశ మివియు
రెండెకద తప్పకే యాచరింపఁదగినవి;
వందు రాజాజ్ఞఁ దప్పి యిహమున, దేవు
నాజ్ఞఁ దప్పి పరంబున నందు ఫలము. 234

క. పరదండనమ్ము కన్నను
బరమభయావహ మిహంబువట్టున నగు న
న్నరక, మ్మక్కతమున ని
న్నరు లెంతయు జంకుదురు జనవరున కెందున్. 235

తే. గీ. ప్రౌఢయగు కన్నియకు వివాహంబు సేఁత
నరకహేతువె యగుఁగాక ధరణినాథు
శాసనమ్మున నందుకు సమ్మతించు
నరులు తత్పాపఫలమును బొరయఁబోరు. 236

క. ఏమన్న, రాజశాసన
మేమానవుఁడేని దాఁట నెటు శక్తుండౌ?
నీమెయిఁ బాపం బది యా
భూమీశుఁడె పొందు నంతఁ బొందవలసినన్. 237

తే. గీ. ఇట్టి దృఢనిశ్చయం బున్న యితఁడు పెండ్లి
బిల్లునకు జంకు ననుకొంట పిచ్చిమాట

ఐనచోఁ "గొంతకాల మెట్లాఁగఁడయ్యో"
ననెడి మాటకు నుత్తరం బవసరంబు. 238

క. తనకు నిరువురే కూఁతులు
కనుక నిపుడు పెండ్లిచేసి గఁడమ్మది దాఁ
టినచో బిల్లువలని యా
తన తన కుండదని యితఁ డెదం దలపూనెన్. 239

తే. గీ. దాని కంతరాయ మ్మిటు తారసించె
వ్యవధి లేదని యెంచి యావరుని తాత
గారు సోమయాజులఁ బిల్చి ఖండితముగ
వేంకటేశ్వరకవి మదిఁ గొంకు దక్క. 240

క. పలికె నిటు, "లే వచించెడి
పలుకుల యర్థంబు మీరు బాగుగ నెలమిన్
దలకెక్కించుక యుత్తర
మొలసినగతి నొసఁగ మిమ్ము నొగిఁబ్రార్థింతున్. 241

తే. గీ. మొదట మా పెద్దకుఱ్ఱ కిమ్మగను మీరు
మనుమరాలిని జేసికొ మ్మనుచు వాని
వడుగునకు వచ్చినప్పుడు కడుఁగడుఁ బ్ర
యత్నపూర్వకముగ మీర లంటిరెలమి. 242

క. అంతటి యదృష్ట మది భగ
వంతుకరుణ మాకుఁ గలుగుపట్టున నెంతో
సంతోషమ్ముగ మీహృ
చ్చింతితకార్యప్రసిద్ధి చేకురుత మొగిన్. 243

క. అని చెప్పియు నటుజరుపక
తనయున కిఁకొకరి కన్యఁ దగఁ బెండిలిచే
యను సిద్ధమైన తఱి మీ
ర్నను గట్టిగఁ బట్టు పట్టినారు కడంకన్. 244

తే. గీ. అపుడు నేనంటి "మీకు వియ్యమ్ము నెట్టు
లేని మాతోడ నందుచే యిచ్చయేని
నాకొమారిత మీదు మన్మనికి నిత్తు
నెవ్వనికినేనిఁ జేసికొం డెలమి ననుడు. 245

తే. గీ. మంచివని పెద్దకొడుకు కుమారునకు ఘ
టింపనెంచితి రట్లె ఘటింప నేను
సమ్మతించితి దానికి సమయమునకు
నంతరాయ మ్మొదవె దైవ మట్టిదగుట. 246

క. మంగళసూత్రి మ్మే చే
తం గట్టన్వలెనొ యదియె తద్దయు నిపు డుం
డెం గట్టుఁబడిని, సెటు లి
త్తుం గన్యక నతని కేను దొంటరపడుచున్. 247

ఆ. వె. ఆఁగి చేతమన్న నధిపుశాసన మది
పెద్దపులియుఁ బోలె వేచియున్న
దక్కతమున నిట్టు లాచరింపుఁ డుపాయ
మొకటి నాకుఁ దోఁచె నుల్లమందు. 248

తే. గీ. మీకుఁ గొమరులు నల్వు రమ్మేటు లంద
ఱికిని గలరు కుమారు లర్మిలిని వారి
యం దొకనిఁ బెండ్లికొమరుఁ జేయంగ మీకు
సమ్మతమయేని నే నట్లు సమ్మతింతు. 249

తే. గీ. ఆదియందు నే నాడినయట్టి మాట
మన్మలని మాత్రమేకదా : మాట కిపుడు
నన్యథాత్వంబు గలుగమి నవుల నాకు
నంతగా నపయశ మబ్బ దనియుఁ దలఁతు." 250

తే. గీ. అనవుడును సోమయాజులు నట్లె సోమి
దమ్మయును సమ్మతించి త త్తనయులందు

"రెండవ కుమారుకౌమరున కిం" డటంచుఁ
బలికి రట్లనె యని యొప్పఁబలికె నితఁడు. 251

క. జరిగె వివాహము పిమ్మట
సురుచిరగతి, నిట్లె యన్నిచోటుల వ్రాయం
బెరుఁగుఁ గ్రంథము కావున
నటిమటిఁ గ్లుప్తముగ సకల మల్లితి నిందుఁ. 252

తే. గీ. పిదప మోఁటరునం బడ్డ పెండ్లికొమరు
నకును బెండిలి తనకూఁతు నాకబలిమ
హమ్మునాఁడె యెటో నిశ్చయంబొనర్చి
జరుగునటు చేసె వేంకటేశ్వరుఁడు పేర్మి. 253

ఆ. వె. అవులఁ గొన్ని నాళ్ళ కా గాయములు మాని
చక్కనుండె మొదల సంశయమునఁ
జిక్కికొన్న వరుఁడు, చేయఁగమాసఁగ
నొరుఁ డెవండు దైవ మొకఁడు దక్క! 254

క. ఇందలి సూత్రములకు వృ
త్తిం దెలియంగోరువారు తేఁకువ నలరా
ట్సందర్శనమ్ము చదివిన
సందేహనివృత్తి కొంత జరుగఁగవచ్చున్. 255

తే. గీ. పుక్కిటిపురాణకల్పనముల నొనర్చు
వారు గాక యెల్లెడలను వాస్తవప్ర
చారము వచించు శిష్యులు సారమతులు
గలరు వారలు సందర్భములు వచింతురు. 256

క. అని యెంచి కడుంగడుఁ గ్లు
ప్తనియతి నిదికూర్చఁబడియె బహుళశుభములెం
చు నొసఁగి గురుఁడేగుటయున్
శనిదశ ప్రారంభమయ్యె సంతసమెసఁగన్. 257

ఆంగీరస సం॥ ఆషాఢ బ ౧౪ మో॥ ఖర సం॥ ఆషాఢ బ ౧౪ వ॥ శనిమహాదశ
ఈ శనిమహాదశాప్రారంభమునకు వయస్సు
౬౧ వత్సరము పైని ౧౧ మాసముల ౧౭ రోజులు.
యువ సం॥ శ్రావణ శు ౨ వ॥
—• శనిమహాదశలో శన్యంతరము •—
ఆంగీరస సం॥ ఆషాఢ బ ౧౪ మో॥ పుష్య బ ౫ వ॥
—• శన్యంతరములో శనివిదశ •—

ఉ. శ్రావణభౌమవారపుమిషన్ భగవత్యవతారమైన శ్రీ
దేవి ననామయంబు సిరి దీప్తియు నాయువు కీర్తి నిచ్చు బిల్
పావనిఁ గొల్చు నాత్మజులభార్యలుఁ గూఁతులు సంతసంబిడన్
దైవతభక్తియుక్తిని ముదంబునఁ గొండొకరోజు లేగుడున్. 258

ఆ. వె. ఇంట జ్వరపుఁబీడ లేర్పడెఁ గాని భ
గవతికరుణ శీఘ్రి మవియుఁ దగ్గె
నంత బంద రీతఁ డరుగఁగావలసె న
గ్రాసనాధిపత్య మధికరింప. 259

ఆ. వె. అరుగు మార్గముునన నారోగ్య మేర్పడెఁ
గాని యదియుఁ గొంత కష్టపెట్టి
నను గ్రమక్రమమున వెనుకదగ్గుటఁజేసి
సభ జయప్రదముగ జరిపె నితఁడు. 260

క. పింగళి లక్ష్మీకాంతున
కుం గలిగినయట్టి వృద్ధిగూరిచి సభలో
సంగతముగఁ జర్చించి యొ
సంగి రతని కెలమి నొక విజయపత్రమ్మున్. 261

తే. గీ. అతని వృద్ధికి నితని శిష్యతయె ముఖ్య
హేతు వని చెప్పి యీతని నెంతయేని
గౌరవించిరి వస్త్రాదిక మ్మొసంగి
జరిగె మఱికొన్ని సభలు సచ్చటను బిదప. 262

క. హేరంబచతుర్థికి నితఁ
డారన్ స్వగ్రామమునకు నరుదెంచె శరీ
రారోగ్యము మరలఁ జెడియు
నారోగ్యముగలిగెఁ గొన్నియహములకోనన్. 263

ఆ. వె. అంతఁ జిన్ని కొమిరె యారోగ్య మది చెడి
మిగులఁ జిక్కువెట్టి భగవతీకృ
పాకటాక్షమున నభయమబ్బె నది గల్గ
నెట్టి రోగమేని యేమి సేయు. 264

క. పదపడి దేవీపూజా
స్పదములు నవరాత్రములు శుభప్రదములు స
మ్మదమిడుచు వచ్చె శక్తికొ
లఁదిగ సపర్యంబొనర్చె లలితాంబికకున్. 265

తే. గీ. సన్నిహితబంధుమృతిఁజేసి కొన్నినాళ్ళు
మది ముదము దక్కినను దన సదనమందు
నెపుడు బంధుజనులు నిండి యెలమిగొల్ప
కతన నక్కాలమును సుఖకరమె యయ్యె. 266

తే. గీ. అవులఁ బ్రద్యుమ్నభూమీశుఁ డంపె వార్త
"బొబ్బిలినృపాలకుఁడు తన పోలి కేగు
దెంచుఁ గావున రాకున్నఁదీర" దనుచు
నరిగె లక్ష్మీనరసపురి కంత నితఁడు. 267

క. అనుకొన్నయట్టు లపు డా
జనపతి చనుదేరలేద, చయ్యనఁ బిలిపిం
చిన ప్రద్యుమ్నమహీపతి
యనిపెన్ సత్కృతి నొనర్చి యాదృతిమెఱయన్. 268

ఉ. బందరు కేగినప్పుడె సభన్ ''దమ కేఁటికిముందు షష్టిపూ
ర్తిం దమి నెవ్వరో నృపవరేణ్యుఁడు చేయఁదలంచినట్టుగాఁ

గొందఱు చెప్ప వింటి, మది కొంచెపుఁగార్యము గాద, యైనచో
నిందఱిలోనఁ గొందఱమ యేనియు వచ్చియయుండు మందుకున్.269

క. కాన జరుగలేదనియే
మానమ్మిక'' యనుచు నడుగు మాటకుఁ ''గాలే
దేనే కారణ మందుల
కై నే వెనుకంజయిడితి నసమర్థతచే. 270

తే. గీ. దాని కెన్నియొ మంత్రతంత్రములును జప
హోమములు నుపోషణములు నుండు టట్టు
లుండ నఱువది యేఁడులు నిండునపుడ
కావలయునన్న నియమంబు గలదు గూడ. 271

ఆ. వె అట్టి నియమములకు నాబాల్య మే నెప్డు
కట్టువడుచునుండు కార్యములకుఁ
బూనఁజాల నిఁక నిపుడు వృద్ధదశ యౌట
మఱియుఁ బూనలేనిమాట నిజము. 272

తే. గీ. ఇంతకును షష్టిపూర్తికి నేమి ఫలమొ
యనియుఁ గూడ విచారింప నాయు వధిక
మగుట కనియు నక్కల్పమ యానతిచ్చె
నందుకు యతించుటయుఁ గడు నజ్ఞమతము. 273

తే. గీ. అదియుఁగా కట్టి కామ్యకర్మాచరణము
జరుపుటన్న యథావిధి జరుపవలయుఁ
గానిచోఁ దత్ఫలంబును గాంచు టరిది
యందుకు మహాధనాఢ్యులే యర్హు లెందు. 274

తే. గీ. కల్పమునఁ జెప్పఁబడిన తత్క్రమమునకు శ
తాంశ మేని గావింప ననర్హులైన
వార లిట్టి కృతులు సేయువారలేని
యంతకన్నను నపహాస్య మన్య మేది ? 275

తే. గీ. సస్యగర్భభూదానంబు సలిపెనంట
వెనుక నొక యాపె యది మీరు వినఁగలేదె ?
యిందుఁ బదియాఱు దానమ్ము లిడుటగూడ
విధి యదియు లేమి సర్వ మవిధియ యగును. 276

క. అకరణతఁ బ్రిత్యవాయజ
నకములు సంధ్యాభివందనము లోనౌ బల్
సుకరపుఁ గర్మము లవియె మ
నకు జరుగవు షష్టిపూర్తి నగుఁబాటేమో. 277

తే. గీ. ఇంత కాసమయమ్మున కేను దగిన
యంత యారోగ్యమున లేమి నాతరుణము
దాఁటె" నన నప్పుడైన పదస్సులోని
శిష్యులుఁ బ్రశిష్యు లిట్లు వచించి రెలమి. 278

క. "మీ రనినది వైదిక మిపు
డారయఁగా వారివారి కగుచుండిన యా
తీరు సమస్తము లౌకిక
మీరహినే షష్టిపూర్తికృతి మీ కెలమిఁన్. 279

తే. గీ. జరుపనెంచెతి మపు డిట్లు జరుగు" ననుచుఁ
గొన్ని యంశములను నందుఁ గొంద రెలమి
ముచ్చటించి రాసమయపు ముచ్చటలను
బలపఱచి కృష్ణ పత్రికటించె భాసురముగ. 280

తే. గీ. అప్పటప్పటఁ బత్రికలందుఁ దఱచు
షష్టిపూర్తిని గుఱిచి ప్రసంగ మెత్తి
కొని దిగంతములందలి కొంద ఱేమొ
వ్రాయుచుండిరి యత్నము సేయుచుండ్రి. 281

క. ఇది యిట్టులుండె మఱి శ్రీ
పద శ్రీయుత కృష్ణమూర్తి భారతకృతిసం

పద కలరి యాంధ్రలోకము
ముదమున సత్కృతి యొనర్పఁబూనెఁగడంకన్. 282

తే. గీ. మఱియు విక్రమ దేవవర్మ మహిపాలుఁ
డల్ల సత్కారసభకు నధ్యక్షుఁడగుచు
నెలమి దయసేయుననుచును నెల్ల పత్రి
కలను బ్రకటితమయ్యె నఖండరీతి. 283

క. ఆనృపు డేకారణమో
గాని యటకువచ్చు భాగ్యగరిమమ్మునకున్
దా నోఁచఁడయ్యె నప్పనిఁ
బూనె నితఁడు రాణ్మహేంద్రపుర మడుగుటచే. 284

ఆ. వె. అట్లు పూని గురుని యంఘ్రికి గండపెం
డరము దొడిగి గురునెడంద నున్న
సందియమ్ము దీర్చి జగముసన్నుతికి నీ
తండు పాత్రుఁడును గృతజ్ఞుఁ డయ్యె. 285

క. గురునెడఁద నున్న యయ్యది
మర యెట్టిదటన్నఁ గొంతమంది గురువరు
న్నిరసించి వ్రాసి యం దె
త్తిరి వెంకనపేరుదానితెఱఁగిట నిడుదున్. 286

శుక్ల సం॥ మాఘ శు ౧ శనివారమునాఁటి కృష్ణాపత్రికనుండి.

—• కవిసార్వభౌమ సమ్మానము •—

"............కవిసార్వభౌమ బిరుదము శ్రేష్ఠార్థవాచకమా ? అట్లే యైనచో కవిరాజపదమునకు మాఱు సార్వభౌమపద మేల ? లేక "సర్వ భూములందును కవి" యను నర్థమా ? అటులైనచో బ్రి॥ శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి ప్రభృతులకుఁ గల స్థాన మెయ్యది........ఒకవేళ భారతాంధ్రీకరణవ్యాజమునఁ గాకున్నను, కేవల సాహితీపరముగనైనను కృష్ణమూర్తిశాస్త్రి గారు ప్రస్తుత కవిసార్వభౌమ బిరుదమునకు ఎంతవఱకు

అర్హులు కాఁగలరా అని యోజింపఁ బూనినను కృష్ణమూర్తిశాస్త్రి గారు సంస్కృతభాషావిశారదు లనఁబడు ప్రసిద్ధపురుషులలోఁ జేర్పఁదగిన వారుగఁ గన్పట్టరు. ఏయొక్క శాస్త్రమునందుఁగాని పారీణులైనవారు గనైనను భావించుట కవకాశము గన్పట్టదు. అదిగాక సుప్రసిద్ధ శతావధానులైన బ్ర॥ శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారి యందున్నంత కవితా లాలిత్యము గాని వ్యంగ్యప్రాగల్భ్యము గాని రామణీయకత గాని వీరి యందంతగాఁ గానరా వని చెప్పనగును. ఇంతకును చెళ్ళపిళ్ళ వెంకటకవి గారి కీయన యెప్పుడో యే మేఘసందేశస్థశ్లోకద్వితయమో చెప్పినందున వారికృతజ్ఞతాస్వభావమునకు పాత్రుఁడగుచున్న గురుత్వమే వీరివి గాపాడి కొనివచ్చు చున్నది. కాని యంతకంటె వీరి ప్రతిభావిశేషము కాదని నేను జెప్పఁగలను." బ్రహ్మశ్రీ పరిమి నరసింహశాస్త్రులు గారు మాతో నిట్లు చెప్పిరి. "అయ్యా శ్రీ శిష్టా నరసింహశాస్త్రులు గారు కవిసార్వభౌమ స్వర్ణాభిషేకవిషయమునఁ జెప్పిన వాక్యము లన్నియు నాకును నభిమతము లయినవియే. ఈయూరిలో జరిగిన సభకు నన్నెవ్వరును పిలిచియుండ లేదు కావున నానాఁటి సభలో నాయభిప్రాయమును వెలువరించుట కవకాశము కలుగలేదు."

క. ఇది యొండును "వైకర్తన"
పదార్థమును నిర్వచించుపట్టునఁ "జింత్య"
మ్మది యని గురునుడి నంటయు
నదియు నిట నుదాహరింప నతివిస్తృతమౌ. 287

(1922 సం॥ మార్చి 24 తేదీ కృష్ణాపత్రికలోని జలతాడనము చూడుఁడు.)

తే. గీ. ఇదియునుం గాక గురువుగా రెవరి ప్రయోగములనో యెదో కోపమూని యెవర్కి
పేరనో తప్పులని వ్రాయ వారు వచ్చి
యితనిఁ గోరిరి "సత్య మిం దెంత" యనుచు. 288

తే. గీ. దానిపై నున్నవట్టు యథార్థ మితఁడు
వ్రాసియిచ్చెను నద్దాని వారు ముద్రి

తంబొనర్చిరి తక్కు విద్వద్వరేణ్యు
లిడినవానితోఁబాటుగః నిది యొకండు. 289

క. కలిసి గురుమానసమ్మును
గలఁకపఱుప నచ్చటచటఁ గడుఁ బరుషంబుల్
వలుకుటయ కాక యూరక
విలఖింపఁదొడంగి రదియు వివరింప నిటన్. 290

(దురుద్ధరదోషశృంఖలము అను శ్రీవారి పుస్తకపుఁ బీఠికలో చూడుఁడు)

క. శ్రీవారి యక్కరము లవి
దై వారఁగ నున్నచోటు తగఁ దెల్పితి నిం
కా వారి యనుచరులవౌ
నా వాక్కులు గూడ నిందు నతుకక విడుతున్. 291

(హైదరాబాదు డక్కన్ ఓగిరాల సుబ్బారావుగారి యుత్తరములో చూడుడు)

క. అతి విస్తర మెందుల కి
ట్లతితరకోపమున దేశికాగ్రణి మదిలో
నితి కర్తవ్యం బరయక
కృత మెఱిఁగిన శిష్యుపై వికృతిఁ జూపింపన్. 292

క. వెంకనకు దీనికతనఁ గ
ళంకము రాకుండుఁగాక; లాఁతులు గురుపైఁ
గొంకక తిరుగఁబడెడి య
ప్పంకము నైఁచు టది తనకుఁ బాపమ యనుచున్. 293

క. చేయునది లేక శాంతికి
నై యొక వ్యాసంబు సంగ్రహమ్మను బుద్ధిన్
బాయక లిఖించి పత్రిక
కై యిడెఁ బ్రకటింప నదియు నతివిస్తృతమౌ. 294

(11 ఏప్రియల్ 1931 సం॥ కృష్ణా పత్రిక చూడుఁడు)

తే. గీ. పనివడినయట్లు సుగుణసంపదను జెప్పి
తీరవలె నతఁ డొక్కట వైరియేని,

గురువరుండేని దోషవిస్ఫురణ మున్నఁ
జెప్పియేతీరవలె నిది శిష్టమతము. 295

క. సూనృతమగు నిది గన్గొని
పై నెది వ్రాసినను నంత బాగుండమి నే
మేనియు వ్రాయుకయే యా
పై నొకకొన్నాళ్ళు జరుపుపట్టున నెలమిన్. 296

ఆ. వె. అన్నవరపుఁ గొండయం దిర్వురునుగూడఁ
గలిసికొనిరి యప్డు కడుఁ గఠినము
గాఁగ మనవిసేయఁగాఁ గల సంగతుల్
మనవిచేసె నితఁడు మఱియు మఱియు. 297

ఆ. వె. అట్లు మనవిచేసినట్టి పిమ్మటఁ గూడఁ
బూర్ణశాంతి మదికిఁ బొడమదయ్యె
నాఁటి వ్రాఁత తమ గుణంబులు మాత్రమే
తెలిపెనేని యనుమతింత్రు వారు. 298

క. అని యూహింపఁగనయ్యెడి
వినువారల కట్లు వ్రాయువిధ మెటు నచ్చున్
గొనమును దోసము న్యాయము
గను జూపి విమర్శ సలుపఁగాఁదగు నెందున్. 299

తే. గీ. వ్రాయ నవకాశమా లేదు, వ్రాయుకున్న
మదికి నూఱటయును లేద, వెదకి వెదకి
మీఁద మూఁడు మాసమ్ముల కేదొ కొంత
ప్రస్తుతంబైనఁ గాకున్న వ్రాసి రెట్లొ. 300

(1931 సం॥ జూన్ 25 తేదీ ఆంధ్రపత్రికలోని శాంతివ్యాసచర్చచూ డుఁడు)

ఆ. వె. విస్తరంబిఁకేల "విపుల యలుకయుఁ
దృణహుతాశనమ్ము దీర్ఘమగునె?"

అన్నమాట కస్మదాచార్యవర్యుండె
ప్రథమమగు నుదాహరణము తెలియ. 301

ఆ. వె. ఇట్టి గురునిపాద మెలమి సభావేదిఁ
బట్టి తొడిగెఁ బరమభక్తియుక్తి
నెలమి వెంకటేశుఁ డెల్ల రామోదింప
గండపెండరమ్ము కనకమయము. 302

క. మనసున నఱమఱ దీఱం
గను బెండర మపుడు దొడిగెఁ గవి వెంకన; దీ
నినిగూర్చి యెల్లపత్రిక
లనుమోదము నెఱపి యిట్టు లానందించెన్. 303

(అంగిరస సం॥ అశ్వయుజ బ 30 శనివారము కృష్ణాపత్రిక, 1932 సం॥
నవంబరు 12 తేదీ ఆంధ్రపత్రిక, ఆంగిరస సం॥ భారతిలోని
కవిపూజ చూడుఁడు.)

తే. గీ. అంత కొక్కింత పూర్వమం దల్ల రాణ్మ
హేంద్రవరమున వసురాట్కవీంద్రునకును
జరిగె సమ్మాన మప్పటి సభకుఁ గూడ
నరిగి వెంకన తగు నుపన్యాస మిచ్చె. 304

తే. గీ. పిదప బందరుపురమునఁ బేరువెలయు
గాయకాగ్రణి పండితశ్రీయుఁ గల్గు
నల్ల హరి నాగభూషణు నెల్లవారు
గూడి మానించి రందులకుఁ జనె నితఁడు. 305

క. ఇటు పది పదేను నా ళ్ళె
చ్చటఁ జూచినఁ గవులకేమి చర్చింప మహో
ద్భటులైన గాయకులకే
మటు జరిగెన్ గౌరవమ్ము లతివర్ణ్యములై. 306

తే. గీ. షష్టిపూర్తికి నాటి బీజమ్ము నాఁడు
నాఁటి కభివృద్ధి చెంది యత్నము నొనర్పఁ

బత్రికలలోన వ్రాఁతలు ప్రబలఁజొచ్చెఁ
దద్విధము కొంత యిందు నుదాహరింతు. 307

(ఆంగీరస సం॥ భాద్రపద శు॥ ౩ శనివారము కృష్ణనుండి సంపాదకీయము)
శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి
షష్టిపూర్తిమహోత్సవము

బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారికి షష్టిపూర్తి మహోత్సవమును జరిపి బందరు పౌరులు శ్రీవారికిఁ జిరకాలముగఁ బడియున్న విద్యాఋణమును దీర్చుకొనవలయునను సంకల్ప ముదయించినది. శ్రీ వెంకటశాస్త్రిగా రొక బందరునకే గాదు. ఒక విధముగ జూచినచో నాంధ్రదేశ మంతటికినిగూడ కవితాగురువులు. శాస్త్రిగా రొక యభినవకవితాసంప్రదాయమునకుఁ గూటస్థులు. శ్రీమూరురాయరగండ కృష్ణదేవరాయలవారి యాస్థానమున కవితాసతి యష్టదిగ్గజములపైఁ బరిఢవిల్లిననాటినుండి యీనాఁటివఱకును గవితాసతి కింత మహాప్రతిభ గడించిపెట్టినది తిరుపతి వేంకటేశ్వరులుదక్క మఱియొకరు కానరారు, దైవదుర్విపాకముచే నాపు మాకార సరస్వతీయుగములో నేఁడు మనకొక్కరే మిగిలినారు ఆంధ్రకవితాప్రియులు వారి నొక్కరినైనఁ బూజించి ధన్యులయ్యెదరుగాక.

"అభినవరామలింగబిరుదాంకుఁడ నాకవనమ్మునందు నీ
యభణపుగాండ్రు తప్పులిడ నర్హులె"

ఇత్యాదిగా గర్జిల్లిన యీకవిసింహము నేఁడు వార్ధకమునఁ జిక్కియు పూర్వతపఃఫలతేజస్స్ఫారముచేఁ జేవచెడకయున్నది. వ్రాయవలసివచ్చుచో శ్రీశాస్త్రులుగారి కవితావిశేషములనుగూర్చి మఱియొక భారత మగును. కాని యిది సమయము గాదు, స్థలమును లేదు. కవితాభిషేచనము గనక యెండి బీడువారియున్న కేదారభూములలో నీమహాకవిమేఘము కాళీపాదమంజీరనాదా దేశంబున గర్జిల్లుచు నమృత వర్షధారలు గుఱిపించి సారస్వతజననీశరీరమును నిలువెల్లఁ బులకితమొనర్చి నవ్యకవిజనాంకురముల నపారముగ వర్ధిల్లఁజేసి నేఁటికి పూవులతో పిందెలతో కాయలతో తన

వారున ట్లొనర్చినది. నేఁడీనవాంకూరము లన్నియుఁ బెరిగి పుష్కలావర్త సన్నిభమైన యీ కూటస్థమేఘమూర్తికి పుష్పాంజలు లీయవలదా ! శాస్త్రుల వారి షష్టిపూర్తిమహోత్సవమునాఁటికి వారి కావ్యనాటకము లన్నిటిని సంపూర్ణసంపుటములుగా నచ్చొత్తించి శ్రీవారికి పాదపూజగా సమర్పించుటకు సంకల్పించిరి. ఇది సామాన్యముగ షష్టిపూర్తి జరిగినవారి కెల్ల నిదివఱకు చేసిన సన్మానమే. శాస్త్రులుగారి విషయమున విశేష మేమైనఁ జేయఁదగు నేమో శిష్యలోక మూహింతురుగాక. ఇట్టి షష్టిపూర్తి మహోత్సవములలో ప్రాచీనసంప్రదాయము నెఱిఁగి ప్రవర్తింతురుగాక—

—• అంగీరస సం॥ కార్తిక శు ౮ శనివారము నాఁటి కృష్ణనుండి షష్టిపూర్తి •—

బ్రి॥ శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారు—ఆధునికాంధ్రకవిపుంగవులలో శ్రీ తిరుపతివేంకటకవు లగ్రస్థానమున కర్హులను విషయము నిర్వివాదాంశము. దురదృష్టవశమున నీజంటకవుల నిరువుర నొకటిగా గౌరవింప గలిగిన అదృష్ట మాంధ్రులకు కలిగినది కాదు.... ఈ మహాకార్యమునకై పూనుకొనిన బందరు పౌరుల కాంధ్రు లెల్లరును తోడ్పడఁగలరు. ఈ సన్మాన సభవారి యుద్దేశము లెవ్వియో ముందుగా పత్రికాముఖమున తగుతడవొసంగి ప్రకటింపఁ గలుగుచో వివిధ ప్రాంతముల వారును వారివారి శక్త్యనుసారము తోడ్పడుట కవకాశ ముండఁ గలదు. ఇందు నాదొకమనవికూడఁ గలదు. ఇవ్వఁగలిగిన బిరుదు లన్నిటిని ఈవఱకే తగువారి కిచ్చివైచిరి. ఇప్పు డట్టి బిరుదములనే వీరికిఁగూడ తగిల్చి గౌరవింపఁజూచుట బిరుదముల నిచ్చువారికిని పొందువారికిని గూడ విలువ యుండఁజాలదు. మ తేదేని తగు రీతిని నూతన ఫక్కి నవలంబించుట కర్తవ్యము. ఆంధ్రలోకమున వీరి శిష్యులు, వీరిపై నభిమానముచే వీరి శిష్యులమని చెప్పికొనువారును వేనవేలు వివిధప్రాంతములఁ గలరు. వీరందఱును తప్పక ఈ మహాకార్యమునకు తోడ్పడఁగలరు. ఈ ప్రాంతములఁ గూడ పెక్కురు విద్యాభిమాను లుత్సాహమును జూపుచున్నారు....

........ఇట్టి వాటి కన్నిటికిని తగువ్యవధి యుంచి యేర్పాట్లు గావించిన బాగుండునని కమిటీవారికి నేఁ జేయు మనవి.

పిశుపాటి వెంకటరమణయ్య,
హైదరాబాదు. (అనియున్నది.)

(అంగీరస సం॥ మాఘమాస సంచిక భారతినుండి)

బ్రహ్మశ్రీ శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారి

—• షష్టిపూర్తి మహోత్సవము •—

పందొమ్మిదవశతాబ్ది చివరపాదమున జీర్ణప్రాయముగా నుండిన యాంధ్ర కవితాసామ్రాజ్యము నుద్ధరించి దేశమునం దంతటను విజయ పతాకములను నెలకొల్పిన పండితకవిసార్వభౌములు శతావధానులు శ్రీ తిరుపతివేంకటకవులు. వీరిసరసశిల్పనైపుణిచే కవితాలతాంగి నవ్యాలంకార భూషితయు నూతనోత్సాహ భరితయునై క్రొత్తపోకడలతో సహృదయ హృదయరంగముల కెక్కి నర్తనము చేయఁదొడఁగినది, ఆంధ్రదేశమున పలువురీమహామహులకు వరివస్యసలిపి తదనుగ్రహమున కవులు పండితులునై పేరునకెక్కిరి. నేఁ డీనాఁట శ్రీశతావధానులశిష్యులు, ప్రశిష్యులునసంఖ్యాకులుగలరు. ఇట్లాంధ్రవాణికి పుష్టిని గూర్చి, యాంధ్రులకు సాహిత్య కవిత్వసంపదల ననుగ్రహించి శకపురుషులన మించిన శ్రీ తిరుపతివేంకట కవులపవిత్రనామములు ఆంధ్రులకెల్లరకును నిరంతరస్మరణమననయోగ్యములు....ప్రకృతము బందరు పౌరులు శ్రీ వేంకటశాస్త్రి గారికి షష్టిపూర్తి మహోత్సవమును సంకల్పించియుండుట హర్షింపఁదగినది. సకలాంధ్ర ప్రపంచమును నీయెడ తత్సంకల్పమునకు దోహదమును గూర్చి దానిని సర్వలక్షణ సంపన్నముగా నిర్వహించి కృతకృత్యతను గాంచవలసియున్నది. ఈ మహోత్సవముతోపాటు ఆంధ్రవిశ్వవిద్యాలయములో శ్రీ వేంకటశాస్త్రి గారి పేర నొక పతకమును నెలకొల్పుటకును, వారిగ్రంథములను సంపుటములుగా ప్రకటించుటకును, గొందఱు సూచనలుగలవు. ఈసూచనల సామఁజస్యమును జెప్పఁ బనియుండదు శతావధానులు తమ కొనరించిన

మహోపకృతికిని తమకు వారియందు గల యనూనగురుభక్తికిని అర్హమగు శాశ్వతజ్ఞాపక చిహ్నము నీరీతి నెలకొల్పుట సముచితము ధర్మము. కాని ఈ షష్టిపూర్తిమహోత్సవము దక్కఁ దక్కిన యే స్మృతిచిహ్నమైనను తిరుపతివేంకటకవు లిరువుర పేరను వెలయవలయుఁ గాని యొకరి పేర మాత్రము వెలయుట సముచితము గాఁజాలదు. తిరుపతివేంకటకవుల యవినాభావ మాంధ్రవిద్వల్లోకము గుర్తింపనిది కాదు. "బాణోచ్ఛిష్టం జగత్సర్వమ్" అన్న రీతిని ఆంధ్రలోక మంతయు తిరుపతివేంకటకవిద్వయోచ్ఛిష్ట మనఁదగును. శిష్యులను ప్రశిష్యులను తత్పరంపరలోని వారము అనువారు నేఁ డాంధ్రలోకమున వందలాదిగాఁ గలరు. వారిలో పలువురు శ్రీమంతులును శతావధానులవలన సాహిత్యకవిత్వసంపదలను కొల్లఁగొనినవారు. కేవలము వారిపేర నొక పతకమును నెలకొల్పుట పుస్తకముల నచ్చొత్తించి యిచ్చుట అనునది అల్పమాత్రాభ్యర్హణము కాఁగలదు. మీఁదుమిక్కిలి ఉభయుల తాహతునకును చాలునది కాఁజాలదు. కనీస మేఁటేఁట, రెండు విద్యార్థివేతనములనైనను నెలకొల్పుట సముచితము. ఇది యిరువురు విద్యార్థులకు ఒకటి ఉభయభాషాప్రవీణునకు, మఱియొకటి తెలుఁగు బీ. ఏ. కు ఆంధ్రసాహిత్యకవిత్వతత్త్వపరిశీలనమునకై యుద్దేశింపఁ బడవలయును. దీన నేఁటేఁట, నిరువురు విద్యార్థులను సాహిత్యకవిత్వతత్త్వ పరిశీలనమున తయారుచేయుట సమకూరును, ఆంధ్రవాఙ్మయమును మఱింత యభివృద్ధినిగాంచుట కవకాశము లేర్పడఁగలవు. తిరుపతివేంకటకవిశతావధాని ద్వయము నామమును దేశము, వాఙ్మయము నున్నంతకాలము నిలిచియుండఁ గలదు; ఇట్టిది శతావధానులు వాఙ్మయమున కొనరించిన సేవకు తగిన ఫలము. ఇట్టిది తచ్ఛిష్యప్రశిష్యపరంపర కావింపఁదగిన గురుపూజనము."

తే. గీ. ఎంత తగ్గించి కైకొని యిం దుదాహ
రించినను నిప్పటికె విస్తరించెఁ గాన
నాంధ్రపత్రిక లోనగునవి యుదాహ
రింపలేదని చదువరు లెఱుఁగవలయు. 308

చ. ఇది యిటులుండ నెయ్యదియొ యెక్కుడు లాభము కల్గునంచుఁ దా
మొద లనుకొన్నదే తుదకు ముప్పున కియ్యది హేతువౌ నటం
చెద భయమందఁదగ్గదయి యెట్లొ భవానికృపన్ లవంబు నా
పద గలిగింపకే సురిఁగెఁ బై శనిలో బుధుఁ డేగుదెంచుడున్. 309

ఆంగీరస సం॥ పుష్య బ॥ ౫ మొ॥ శ్రీముఖ సం॥ జ్యేష్ఠ బ॥ ౭ వ॥

—• శన్యంతరములో బుధవిదశ •—

మ. ఒగిఁ దా నీబుధుఁ డేగుదెంచుటయుఁ గానూరగ్రహారంబు పే
ర్మిగ శిష్యుం డొకరుండు "పుత్రునకు నెమ్మిన్ బారసా" లంచు నొ
ప్పుగ వెంకన్నను వెంటఁబెట్టికొని సమ్మోదమ్ముమై నేగ నూ
రఁ గలా రెల్ల బహుప్రహర్ష మలరారన్ సత్సభాసీనులై. 310

తే. గీ. ఇతనిఁ గోరంగ వారల కెల్లరకును
హర్ష ముప్పొంగ నొక యుపన్యాస మొసఁగి
యందుఁ బెద్దల యాశీస్సు, లట్లె పిన్న
లైనవారి నమస్కృతు లంది పిదప. 311

తే. గీ. శిష్యుఁ డొసఁగు బహుకృతి చేకొని కడి
యమున కేతెంచు మార్గమ్మునందు నిడద
వోల్పురిని రామమూర్తి ననల్పవైద్యు
బొమ్మగంటికులుని గాంచి సమ్మదమున. 312

తే. గీ. అతఁ డొసఁగినట్టి మధురపాయసము స్వీక
రించి సుఖముగ నింటి కేతెంచుపిదప
రామచంద్రపురము సభార్థముగ నేగ
వలసెఁ "బ్రసిడెంటు" గూర్చి యుపన్యసింప. 313

క. కాకర్లపూడివంశజు
శ్రీకరుగోపాలరాజుఁ జెన్నొందఁ గవి
త్వాకలితుఁ జేసి పౌరుల
దౌ కోరిక మఱుచటి దిన మం దెసకమునన్. 314

క. వేఱొక్క యుపన్యాస ము
దారగతి నొసంగి యచటి తజ్ఞు లిడు నమ
స్కారములకుఁ బాత్రుండై
చేరెన్ గడియమ్మ సుఖము చెన్నలరారన్. 315

క. మంత్రిపరిగ్గడవంశ్యుఁ డ
నంతాపరిపాలనమ్మునం దధికృతులౌ
మంతిరుల నొక్కరుఁడు శ్రీ
మంతుఁడు నరసింహుఁ డెలమిమైఁ బిలువంగన్. 316

తే. గీ. రాజరాజనరేంద్రపురమునన్నైన
యతని కౌమరువివాహార్థ మరిగి యచటి
సభలు దిలకించి తా నొక సభ నుపన్య
సించి సత్కృతిగాంచి విచ్చేసె గృహము. 317

ఆ. వె. అర్థవరమునుండి యరుదెంచి యొక రాజు
తన కుమారు పెండ్లి తఱియుఁ గాన
రాకతప్పదని భరముమెయిఁ గోరంగ
మాట తీయరామి మంచి దనియె. 318

ఆ. వె. జీడిగుంటనుండి చెచ్చెర వెలమగే
స్తొకరుఁ డేగుదెంచి ప్రకటభక్తిఁ
గొమరుపెండ్లిగానఁ దమరు రావలెనని
కోరెఁ గోరుటయును గొంకు మిగుల. 319

క. "మీ రతిభక్తిం గోరితి
రారోగ్యము తక్కువౌట నరుదెంతునొ, 'తే
దో; రహి యత్నించెద మన
యారంభము నెగ్గు దైవ మది తోడ్పడినన్." 320

వ. అని సందియమ్ముగాఁ బలుకుటయు

తే. గీ. అర్థవరపురాజన్యున కన్లై జీడి
గుంట వెలమగేస్తునకు నన్గుసఖు డౌటఁ

బాదముకులుండు బుచ్చయ పట్టుపట్టి
రాకతీరద టనియె మర్యాద మిగుల. 321

ఆ. వె. అంతె కాక తనదు నను(గు( దమ్ముండు శ్రీ
రాము నంపి తుదకు రమణ రెండు
పెండిలులకు( గూడ( బేర్మిమై( బయనంబు
సాగ(జేసె నచట సఖ్య లలర. 322

క. ఆ రెండు గ్రామములం బెం
పార సభలు చేసి వారి యత్యాదృతి స
త్కారములంగై కొని యిలు
సేరెన్ వెంకనయు సుతులు శిష్యులు గొలువన్. 323

క. ఈ పెండిలులకు( బూర్వమ
యీపొత్తము కృతినిగొనెడి నృపుసత్కృతియున్
బ్రాపించె( దత్ప్రసంగ
వ్యాపృతి కృత్యాదియంద వర్ణింప(బడెన్. 324

క. కాన నిట విస్తరింపక
మానితి నట( జూచికొన సమస్తము దెలియున్
శ్రీనెగడ నింటి కేగిన
యానా(డే పయనమబ్బె నది యెట్లన్నన్. 325

క. శ్రీ లక్ష్మనర్సాపుర
పాలు(డు ప్రద్యుమ్నభూమిపాలు(డు పట్టం
బోలిం గట్టికొనుచు( గవి
తాలోలుం డసుట వార్త దా నంపె వెసన్. 326

ఆ. వె. అటకు వేంకటగిరి యాదిగా( గలుగు భూ
పతులు పెక్కుమంది వచ్చిరెలమి
జరిగె నుత్సవంబు శాస్త్రోక్తరీతిగా
నచట నుండె( గొన్ని యహము లిత(డు. 327

క. నూఱాఱులు నేలవు లిడి
యారాజన్యుండు పంప హర్ష మెసఁగ సు
శ్రీ రంజిలఁ గొమరులతోఁ
జేరెన్ గడియమ్మఁ గవియు శిష్యగణముతో. 328

తే. గీ. బుధవిదశ వచ్చుటాది యీకథను మున్ను
వ్రాసియుంచినదాని సవరణయుఁ దరు
వాయి వ్రాయుట పీఠిక వ్రాయుటయును
జరిగెఁ దత్త్వంబు దైవజ్ఞు లరయఁగలరు. 329

తే. గీ. రాహుదశలోన రాహ్వంతరమ్ములోన
బుధవిదశయందు దీనిని మొదలువెట్టి
ముప్పదాఱేండ్ల కథను సంపూర్తిగ లిఖి
యించి యిన్నాళ్ళవఱ కట్టెయుంచి దీని. 330

క. శనిదశలో శన్యంతర
మునఁ గూడన్ బుధవిదశనె పునరారంభం
బొనరించుట యొగి వ్రాయుట
యనుఘటియించుటకు హేతువూహింపవలెన్. 331

ఆ. వె. 'సాపు' వ్రాసి కడమ సంపూర్తిఁజేసి పై
నెప్పు డేది జరుగు నప్పుడదియె
వ్రాయ వీలటంచుఁ బలుసారు లనుకొంటి
కాని పట్టలేద కలము నెపుడు. 332

క. ఓపికలేకయొ శ్రద్ధా
లోపమొ స్వకృతి యిది యాట లోకముతో పా
టీపురుషునకు ననాస్థయొ
యాపాదింపుటయొ యుక్తమగు నటులైనన్. 333

తే. గీ. వేఱు కారణ ముండియేతీరవలయు
బుధునియం దిట్టి సందర్భమునకుఁ గొన్ని

కారకత్వాదు లూహింపఁగనగుఁ గాని
యవియుఁ గన్పట్టు శుక్రగ్రహమునఁ గూడ. 334

క. ఇఁక నొకటి శుక్రుఁ డెంతయుఁ
బ్రకటించున్ గాని కవిత వైరంబొదవిం
పకమానఁడు తుదకు జయం
బు కలుగునట్లును ఘటించుఁ బోరిఁబోరినెందున్. 335

క. ఆ యీ సూక్ష్మాంశంబుల
నే యయ్యలో కాని యెల్ల రెఱుఁగరు తాదృ
గ్ధీయుతులగు దైవజ్ఞుల
కై యీ సందియము లివి యుదాహృతము లిటన్. 336

క. పలువురు శిష్యులుఁ గొమరులు
సలలితముగఁ బాఠములను జదువఁగ శ్రీమ
ల్లలితాంబయు నారోగ్యం
బెలమిన్ గరుణింప వేంకటేశ్వరుఁ డిట్టుల్. 337

క. కాలక్షేప మొనర్చుచు
హేలఁ దెలుఁగుఁ బరిషదమున కేగి యచట స
చ్ఛీలు రిడు నుపన్యాసము
లాలించె స్వయముగ మాటలాడెం బిదపన్. 338

తే. గీ. అందు ముఖ్యాంశ మియ్యది యల్ల పూస
పాటి దేవేంద్రు విప్పటి పలువురు కవు
లలఁతిగా బొబ్బిలినిబట్టి యాడు టదియుఁ
గూడదను వాదు సభలోనఁ గొంత జరిగె. 339

చ. అది కవులందు లేదనియు నమ్మహాసీయుచరిత్రమందయు
న్నదనియుఁ జెప్పి బొబ్బిలికి నాయన మాత్రమ కాక 'ఫ్రెంచి బూ
సి' దొరను బై నిజాంప్రభుని సేనను దోడుగఁ గొంచుఁ బోవుచే
విదితముచేసె వాన్నృపుఁడు భీరువటం చితఁ డావె నేడ్తెఱన్. 340

తే. గీ. అవలఁ గొన్ని దినములకు నన్నవరపు
దేవుకళ్యాణమహ మరుదెంచె; నవటి
కరిగి మునుపోలెఁ గొన్నినాళ్ళచట నుండి
యింటి కరుదెంచె నూఱాఱు లెలమిఁ గొనుచు. 341

క. ఆరోగ్యలోప మొండాక
తీరునఁ బొడసూప దానిదెస లక్ష్యము లే
కే రహిఁ గాలక్షేపం
బారంగ నొనర్చుచున్న యవసరమందున్. 342

తే. గీ. కీర్తిశేషుండు శిష్యుండు కేవల సుగు
ణఖని సుకవియు వడ్లమన్నాఁటికులుఁడు
నైన నరసింహశర్మ జ్యేష్ఠాత్మజాత
పెండిలికి నేగుదెంచెను బిలుపు పేర్మి. 343

చ. పలువురు శిష్యు లుండినను బందరు పట్టణమందు వీనికిం
దుల యొకరుండు గామిఁ దఱితో నల శిష్యుని కూఁతు మేల్మి పెం
డిలి కొగి బంద రేగి కడునెమ్మి దలిర్పఁగఁ బెండ్లికూఁతుఁ బెం
డిలి కొమరున్ గడుంగడుఁ గడిందిగ దీవనలన్ బొనర్చియుఞ్. 344

క. హరి నాగభూషణుం డఱి
ముఱి మార్దంగికుఁడు రామమూర్తియు రసమున్
గుఱియ నొనర్చిన సభ న
య్యిరువుర నాశీర్వదించి యెలమి మిగులఁగన్. 345

ఆ. వె. పెండ్లివారు మఱియుఁ బెఱశిష్యులు నొనర్చు
సత్కృతుల గ్రహించి సంతసమున
నింటి కరుగుదెంచె నీ బుధవిదశనె
భూమి కొంత కొనుట పొసఁగె నెలమి. 346

శ్రీముఖ సం॥ జ్యేష్ఠ బ ౮ మొ॥ శ్రావణ బ ౧౨ వ॥ శనిలో

—• శన్యంతరములో కేతువిదశ •—

ఆ. వె. అంతఁ గేతువిదశ యారంభమయ్యె వీఁ
డరుగుదెంచినట్టి యల్పకాల
మునకె గేహమందు మొనసె జ్వరపు బాధ
వెంబడిగ నరోగవిభవ మొదవె. 347

తే. గీ. హాని వాటింపకున్నను నప్పుడప్పు
డింటిలోనేమి వంటిలోనేమి వీఁడు
కొంత యస్వస్థతకుఁ గారకుఁడుగ నుండి
వెడలుచు శుభాప్తి సూచింపఁదొడఁగెఁ గడఁక. 348

శ్రీముఖ సం॥ శ్రావణ బ ౧౨ మొ॥ మాఘ బ ౧౨ వ॥

—• శనిలో శన్యంతరములో శుక్రవిదశ •—

తే. గీ. ఇంటిలో కన్న వంటిలో సీతఁ డెక్కు
డుగను గల్పించెఁ బీడ యట్లు గలిగించి
యును జనుచుఁ జాలభాగ మత్తనువుపీడ
కిచ్చెను బ్రిశాంతి భృగువు పై నేగుదెంచె. 349

క. ఇతఁ డరుదెంచినదాదిగ
సతమై యారోగ్య మెసఁగె సకలమ్మగు దు
స్థ్సితియుఁ గ్రమక్రమముగ సడ
లి తనూబలమొదవె ధనపులేమియుఁ దొలఁగెన్. 350

క. తనకు నితరు లీవలసిన
ధనము 'వసూ' లగుచె కాకుదారుండును శ్రీ
ఖనియు నగు బొబ్బిలి విభుం
డనిపెఁ బ్రితిశుభ్రిత మొనర్చినట్టి ధనమ్మున్. 351

తే. గీ. ఇతఁడు పట్టాభిషేకంబు కృతిని గొని యొ
సంగె వేయి నూటాఋలు సత్కృతిగను

మఱియు నేఁ జేఁట నూఱాఱ్లు దరిసెనమున
కరుగకున్న నొసఁగునట్టు లానతిచ్చె. 352

ఆ. వె. ఆనతిచ్చెఁ గాని యావార్షికము పంపఁ
డయ్యె వత్సరద్వయమ్ము నాఱు
నెలలు జరుగుమీఁదనేని వేంకటకవి
మదిని దలఁచుచుండె మఱచె ననుచు. 353

ఆ. వె. అట్టితఱిని బంపె నా చెన్నపురరాష్ట్ర
మంత్రి యైన నృపతిమానసమున
నెంత జ్ఞప్తి కవులయెడ నున్నదో చదు
వరు లెఱుంగ నిందు వ్రాసినాఁడ. 354

ఆ. వె. అట్లు శుక్రవిదశ యారంభమై షష్టి
పూర్తి కేగుపాటి యార్తిశాంతి
సిడఁగ బంద రీతఁడేగె సతీసుతుల్
బంధుశిష్యగణము బలిసి కొలువ. 355

క. జరిగె నట షష్టిపూర్తి వి
వరముగ నది యిచట నెత్తివ్రాసినచో వి
స్తర మగును గానఁ బత్రిక
లరయుటకై చదువరులను బ్రార్థింతుఁ గడున్. 356

తే. గీ. అందుఁ గొన్నిటిలోఁ గొన్నియంశములను
వ్రాయుచున్నాఁడ నిటు, లిట వ్రాయకున్నఁ
బత్రికల పేళ్ళు మన చదువరుల కెట్లు
తెలియనయ్యెడినని మదిఁ దలఁచితలఁచి. 357

క. కడుఁ బెద్దయుపన్యాసము
లిడి రలవారలకు నతుల నిడుచున్ మఱి నా
యెడ గురుత నెఱపువారల
కిడుదున్ దీవనలు సర్వకృతిసమ్మతిగన్. 358

(శ్రీముఖ సం॥ ఆశ్వయుజమాసపు భారతినుండి)

ధ న్య వా ద ము.

ధన్యమైనది, ఆంధ్రదేశము ధన్యమైనది, జీర్ణప్రాయముగనుండిన యాంధ్రకవితాసామ్రాజ్యము నుద్ధరించి దేశమునందు నలుకెలంకుల విజయ పతాకలను ప్రతిష్ఠించి యాంధ్రికవితకు శకపురుషులన మించిన నిక్కపు కవిసార్వభౌమునకు సంకల్పించిన షష్టిపూర్తి మహోత్సవాభ్యర్హణను సర్వలక్షణసంపన్నముగ మహావైభవముతో నిర్వహించి సకలాంధ్రిప్రపంచము కృతకృత్య మైనది. శతావధాను లొనరించిన మహోప కృతికిని, వారియందుఁగల అనూనగురుభక్తికిని, ఆంధ్రుల యీయభ్యర్హణ అర్హమైవెలసినది. ఆంధ్రపంచ మీ తెఱఁగున తన కర్తవ్యమును నిర్వహించి ధన్యతగన్నందుకు విశ్వభారతి సంతసించినది, కామితప్రదాయిని దేవి కామేశ్వరి ఈ మహనీయునకు, ఇతోధికాయురారోగ్యముల నొసంగి, తెలుఁగు కవితకు మఱింత సొంపు పెంపుల నొసంగునట్లు, అనుగ్రహించుఁగాత మని యాశంసనము. ఈ షష్టిపూర్తి మహోత్సవముతో పాటుగనే శ్రీవేంకటశాస్త్రిగారి - కాదు కాదు తిరుపతివేంకటకవుల, మా యానేత్రములకు వీరొక్కరే సాక్షాత్కరించుచున్నారు, శాశ్వతస్మృతి చిహ్నముగ వీరి రచనలన్నింటిని సంపుటములుగ ప్రచురించుటకును ఆంధ్రివిశ్వకళాపరిషత్తున బహుమతిపతకము నేర్పాటుచేయుటకును నిర్ణయింపబడినది. ఇవి రెండును, అచిరకాలములోనే వారిశిష్యులు ప్రశిష్యులు తత్పరంపరలోనివారు, అభిమానులు ఈవరుసకు రానివారు నున్న - అందఱి యాదరమున రూపుగొని తిరుపతివేంకటకవుల శాశ్వతస్మృతి చిహ్నమై వెలయఁగలదు, ఆంధ్రభారతికి ఈడురాని సేవ సల్పి శాస్త్రిగారు ధన్యులైనారు, అట్టిమహనీయునకు ఉడుతభక్తిగ పూజగావించి తెలుఁగు మాగాణమును ధన్యమైనది.

శ్రీముఖ సం॥ ఆశ్వయుజమాసపు అభినవసరస్వతినుండి షష్టిపూర్తిమహోత్సవము

ఈ యుత్సవము బ్ర॥ వెంకటశాస్త్రిగారి శిష్యులగు పింగళి లక్ష్మీ కాంతము మున్నగు బుద్ధిమంతులచే రెండుదినము లొక వివాహమహో

త్సవమువలె నాచరితము. శాస్త్రులుగారు పుత్రపుత్రికాకళత్రసహితులయియే గాక యల్లుండ్రతోడను గోడండ్రతోడను వారి జననీజనకులతోడను స్వబంధులతోడను వివాహోమునకుఁ బోలెఁ దరలివచ్చిరి. తత్కుటుంబమునంతయు మోటారు కారుపై నధిరోహింపఁజేసి ప్రథమము బందరు పట్టణము నంతయు నూరేగించిరి. అనంతర మక్కుటుంబ మభినవాంబర భూషణాలంకృతిపురస్సరంబుగా నాసీనంబై యనేకశతవైదికబ్రాహ్మణ వర్యుల మహదాశీర్వచనమునకుఁ బాత్రమయ్యెను. ఆ బ్రాహ్మణులకు యత్కించిత్సంభావనము సల్పఁబడియె. ఉత్సవ ద్రష్టల కుచితాతిథ్య మొసంగఁబడియె. ఈయది శాస్త్రీయమైన షష్టిపూర్తి గాకున్నను కవితాలోలురయిన నవనాగరికులకే గాక విద్వత్కవులకును వేడుక కలిగించె ననుట విశేషోక్తి గానేరదు........... యువకవులు పెక్కండ్రు తదుత్సవ సందర్భమునఁ దమపద్యములను సభన్ బఠించి యుత్సవకర్తలకు సమర్పించిరి. పఠనావకాశము లభింపకపోయినను మఱికొందరు తమపద్యంబుల తత్సభవారి కిచ్చివేసిరి. నేనును గొన్నిపద్యముల వ్రాసితిని, వాటి నీదిగువ తిలకింతురుగాక.

శా. విద్వత్కవ్యవధానిసత్కృతికరుల్, వేయింటికిన్ మించి శ్రీ
మద్వారంబున సిద్ధమైరనుట సామాన్యోక్తి; వేయేల ! భూ
భృద్వర్యుండగు భోజులాగున మిమున్ వీక్షించు మాత్రిం గవి
త్వోద్వేగం బది కల్గుగాదె సుకవీ ! యో వేంకటేశ ప్రభూ !

సీ. త్వద్గ్రంథములపైని తమ సదభిప్రాయ
ములనిచ్చి బుధజనుల్ ముదితులైరి
బాలసరస్వతీ ప్రభృతి సద్బిరుదాళి
గై సేసి సత్ప్రభుల్ దాసులైరి
గండపెండేరమున్ గాలికిన్ దొడిగి యీ
బందరు జనులు సానందులైరి
షష్టిపూర్తిమహంబు సాగించి ప్రస్తుతం
బందఱుఁగూడఁ గృతార్థులైరి

ఆ. వె. అడిగినారె మీరు యత్నించినారె స
మాశ్రయించినారె యందుకొరకు
తావకీనసుకవితాచంద్రికాతృ ప్త
మైన జనమెహేతు వంతటికిని.

(శ్రీముఖ సం॥ ఆశ్వయుజ బ॥ ౪ శనివారము కృష్ణాపత్రికలోని
గిడుగు వెంకటరామమూ_ర్తి పంతులుగారి వ్యాసమునుండి)

"శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల ప్రశంస"

శ్రీవెంకటశాస్త్రిగారి షష్టిపూ_ర్తిమహోత్సవ సందర్భమునఁ బ్రకటించుటకుఁగా నలుగురితోపాటు ఒకటిరెండుమాటలు వ్రాసి పంపుటకు సాహసించినాను. శ్రీశాస్త్రిగారియెడల నాకుఁ గల గౌరవమునకు సూచకముగా ఈలేఖ వ్రాయడమునకు అవకాశము నాకు దొరికినందుకు మిక్కిలి సంతోషిస్తున్నాను. ధన్యుఁడను. నేటి తెలుగు కవులను ఎవరెన్నినా, చిటికెనవేలి మీదికి ఎక్కేవారు మన తిరుపతివేంకటేశ్వరులే. యీ ఐకమత్యమునకు కారణము వారికావ్యములలో అందఱికీ స్పష్టముగా కనపడే గుణసంపదగాక మఱేమిటి? .................మన తిరుపతివేంకటేశ్వరులకు దేశభాష యెడల అభిమానము మెండుగా ఉన్నది. వీరు కావ్యములలో గ్రామ్యము వాడరు. "కేవల గ్రామ్యపదముల నేవగించి జనులు వాడెడి పదములు సమ్మతములు" అని స్పష్టముగా తెలియజెప్పినారు.

క. కేవల సంస్కృతమర్యా
దావిదులును గేవలాంధ్రతత్పరులునుగా
కేవార లుభయభాషా
కోవిదులవ్వారు దీని గురువులు జగతిన్.

అని మనతిరుపతి వేంకటేశ్వరులు ప్రకటించినారు........ఆయుస్సు ఆరోగ్యము ఐశ్వర్యము గలవారై మన వెంకటశాస్త్రిగారు ఆంధ్రసారస్వతాభివృద్ధి కొరకు ఆయుశ్శేషము గడిపి ఆంధ్రుల కందరికి ఆంధ్రకావ్యామృతము దొరకేటట్టు చేతురుగాత అని కోరుచున్నాను.

( శ్రీముఖ సం॥ సదర్ తేదీనాటి కృష్ణాపత్రికనుండియేసంపాదకీయవ్యాసమునుండి. )

సరస్వతీపూజ.

మాపురమున క్రిందటిశని, ఆదివారములందు శ్రీచెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారికి షష్టిపూర్త్యుత్సవములను వేడుక నామమిడి ఆంధ్రకవికోకిలములు కావ్యగీతికానిస్వనములతో వాగ్దేవినారాధించినవి. షష్టిపూర్త్యుత్సవమనునది కేవలము నాకబలివంటి తంతుకాదు. అఱువదిమూఁడు వత్సరములు దాఁటిన యీ కవిసార్వభౌమునకు షష్టిపూర్త్యుత్సవము జరుపుట కొందఱికి వింతగఁ దోఁచవచ్చును! వేంకటశాస్త్రిగారి శిష్యసమూహము ఒక భారతసైన్యము "ధైర్యపరిభామేరువై" ఆంధ్రకవితాసామ్రాజ్యమున "గోణము కట్టుటాది బుధకోటి నుతింపఁగ'' ఏలినట్టి యీ కవిసమ్రాట్టును, ఆయురారోగ్యముల నిచ్చి వేఱొక్క షష్టి వర్షములు కాపాడుమని ఆదిశక్తి నారాధింపకుందురా! తిరుపతి లేనిది వేంకటేశ్వరుఁడు లేఁడు, వేంకటేశ్వరుండు లేనిది తిరుపతి లేఁడుగదా? తిరుపతిశాస్త్రిలేని కొఱంతకై సభికుల మనస్సు కొట్టుకొనినది! తిరుపతిశాస్త్రిగారి కుమారులు పితృదత్తమైన కవితామాధుర్యముతో ''వేంకటేశ్వరు రూపమ్మున నున్న తండ్రికి నమోవాకమ్ము'' లర్పించుచు కరములు ముకుళించి అశ్రువులతో ఆరాధించినంతనే తిరుపతిశాస్త్రిగారు వేదికపై ప్రత్యక్షమైనట్లయ్యెను. వెంకటశాస్త్రిగారు తిరుపతిశాస్త్రిగారికి కవితాగురువట! శిష్యకోటి మొన్న వెంకటశాస్త్రిగారి కర్పించిన ముత్యాలసరమునందు తిరుపతిశాస్త్రిగారు శిష్యస్వరూపమున వెనుక సమర్పించిన యీ మౌక్తికము నాయక మణియై వెలుంగుఁ గాక?

మ. వితతాత్మీయశతావధానకవితావిద్యాపయోరాశిసం
భృతశిష్యాంబుదవాఙ్మయామృతరస ప్రీతాఖిలాంధ్రక్షమా
ధృతరజ్యద్రసికావతంసకృతవందిస్తోత్రమాలావిభూ
షితు మా వెంకటశాస్త్రినేఁ బొగడెదన్ శిష్యస్వరూపమ్మునన్.

తిరుపతివేంకటేశ్వరులు పొందని గౌరవములేదు! నూతనముగ పొందఁ దగినదియు లేదు?

"అనుభవించితిమి దివ్యభోగములను రాజాధిరాజులకన్న నధికముగను"

"ఏనుఁగు నెక్కినాము ధరణీశులు మ్రొక్కఁగ నిక్కినాము"

అని చెప్పికొనిన వెంకటశాస్త్రిగారికి నేఁడు ఆంధ్రలోకము నూతనముగఁ జేయఁదగిన సత్కారము లేదు! భాషాప్రపంచమున నెక్కడఁ జూచినను తిరుపతి వేంకటేశ్వరుల సాక్షాత్కారము తప్పదు. వీరికవిత్వము ప్రాచీన కవిత్వమునకు భరతవాక్యము నవీన కవిత్వమునకు నాంది. విద్యావివాదములందు వీరి వీరాధివీరత్వము అల భోజ కృష్ణరాయలనాఁటి వాణీవిజయమును స్మృతికిఁ దెచ్చును. తిరుపతివేంకటకవులు వారి నిశిత కరవాలములను తాండవింపఁజేసి ధరణీశ్వరుల యౌదలలను ధారుణి నంటింపఁ జేసిరి. వీరి గాంగనిర్ఝరధార కవితాకన్యకు నూత్న విలాసము నొనఁగూర్చినది! తిరుపతి వెంకటకవుల కవిత్వము ఆధునిక కవిత్వమునకును ప్రాచీన కవిత్వమునకును సేతువు వంటిది? ప్రాచీన కవిత్వమందలి దీప్తి గోచరించును. నవీన కవిత్వమందలి ప్రసాదము సౌలభ్యము పొడసూపును; వీరి రచనలు చిరకాలము వర్ధిల్లుననుటకు సందియములేదు.

(సదరుతేదీ కృష్ణాపత్రికనుండియే, కొందఱు కవుల పద్యములనుండి కొన్నిమాత్రము.)

— కు సు మాం జ లి —

పువ్వాడ శేషగిరిరావుగారు, చోడవరపు జానకిరామయ్యగారు.

చ. తిరుపతిలేక ఆసనము తీర్చి వసింతునె షష్టిపూర్తి కొ
క్కరుఁడనటంచు వెత్తిగొనఁగాదగదార్య! నిలింపులెల్లఁ దా
మరదము వట్ట నింద్రుఁడనుయాయిగ బ్రహ్మపురోగముండుగా
తిరుపతిదివ్యరూప మరుదేరెను మీదగు షష్టిపూర్తికిన్........

సీ. తీయనేరెడు గుజ్జు తిని తేన్చుకొను బాల
కులకు దోయిళ్ల దెల్గురస మునిచి

కోరితికొమ్మచ్చు దూఁకులనాటితేటిన
దుడుకుబొజ్జలఁ దెల్గు నుడులు పోసి
వగరు క్రొమ్మావి పిందెగమి మెక్కినకోడి
గవు గున్నలకుఁ దెల్గుకైత గఱపి
చెడుగుడుగ్రుక్కవచ్చియు రాని మొఱకుట
య్యాల నోళ్ళఁబాండితి వెలయఁజేసి

తే. గీ. తాలుగరఁగించి యిసుములోఁ బాలు దీసి
హైందవ కళాలయమునఁ దామాంధ్రభిక్ష
యిడిన తొలినాఁటి కతలు నేఁడెన్నికొనినఁ
గలఁగనినవయ్యె స్మరణయోగ్యతను గాంచి.

దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు

చ. పలికిన పల్కులెల్ల రసబంధురసుందరపద్యపంక్తులై
యలఘుతరప్రబంధములునై రసవత్తరనాటకంబులై
నలువగు చాటువుల్ ప్రహసనంబులునై యలరార నొప్పు ధీ
లలితుని వేంకటేశ్వరు విలక్షణలక్షణు బ్రస్తుతించెదన్........

చ. గురువులఁ గొల్చి పాండితిని గొందఱుగందురు దానికేమి? మా
తిరుపతివేంకటేశకవిధీరుల పాదసరోజయుగ్మసం
స్మరణముచేతనే మధురమంజులవాక్యము లల్లనేర్చి యెం
దఱొ కవులైరి యెందుగలదా! మఱి యిట్టి మహత్త్వ మొజ్జలన్....

జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు.

సీ. తలమీఁది వెండ్రుకల్ పలుచఁబడ్డవిగాని
పలుకు కమ్మదనంబు పలుచఁబడదు
నడలలోఁ దడబాటు పొడసూపెనే గాని
నుడులలోఁ దడబాటు నుడువరాదు
శారీర పటిమంబు జాఱుచున్నదిగాని
ధారణాపటిమంబు జాఱలేదు

ఒడలిపై ముడుతలు పొడముచున్నవిగాని
కవితలో ముడుతలు గానఁబడవు

తే. గీ. పరఁగ నొక్కొక్క యేఁడు పైఁబడ్డకొలఁది
నీవు వృద్ధగుచుండఁగా నీదు కవిత
యంతకంతకు వయసుపిల్లగుచు నుండెఁ
జిత్రి మిది యౌర! సుకవితాచిత్రికార!........

వేమూరి సీతారామశాస్త్రి గారు.

చ. చదువుటయందె యున్నదొ? రసప్లుతి భావము దోఁచు దాననే
పొదలును చిత్త మాదకత మూర్తియె, లోకవిమోహశక్తియో
యిది యది యంచుఁ దేల్చి వచియింపఁగ నోపముగాని యెవ్వరున్
గడలఁగలేరు మాగురులు గల్గు సభాస్థలి జిత్రవైఖరిన్.

సామవేదము జానకీరామ శర్మగారు.

ఉ. గ్రంథము చేతఁ బట్టి సరిగాపదినాళ్ళ భవత్సకాశసం
బంధము గల్గఁజేసికొన బాపురె! సత్కవితాలతాంగి ని
ర్బంధముఁ బెట్టి యాత్మ ననురాగము గూర్చి విడంగరాని సం
బంధము గల్గఁ జేయు నినుఁ బట్టిన శిష్యుల కెల్లఁజిత్రిమౌ.

మల్లంపల్లి భైరవమూర్తిగారు.

ఉ. రాజుల లెక్కసేయ వతి రాజసవృత్తి జరించి దేశవి
భ్రాజితకీర్తిచంద్రికలు పర్వఁగ సర్వదిగంతరంబులన్
భూజను లిచ్చు కాన్కలను బొందుచు వారికిఁ దుష్టి గూర్చునీ
తేజమె యాంధ్రిలోకకవిధీరశరణ్యము వెంకటేశ్వరా.

వేలూరి శివరామశాస్త్రిగారు.

చ. జయజయ షష్టిపూర్తిపరిషత్పరమేశ్వర! వేంకటేశ్వరా!
జయజయ భారతీవదన పద్మదివాకర! వేంకటేశ్వరా!
జయజయ భావనావిభవ సాగర(శ్రీ)కర! వేంకటేశ్వరా!
జయజయ పూర్వనవ్యకవిసంఘకృతాదర! వేంకటేశ్వరా!

ఉ. మోయఁగరాని వేదనను మూఁడు శతాబ్దులనుండి మూఁగమై
పోయిన యాంధ్రి భారతిని బుట్టినతోనె వసంతమాసపున్
గోయిలఁ జేసి యెల్లెడలఁ గుర్రిమ్మరఁ జేసిన మేటి చెళ్లపి
త్రాయఁడు వేంకటేశకవిరాజు గ్రహించుత మా నమస్కృతుల్.

ఉ. ఎక్కడఁ జూచినన్ గవులె యెక్కడఁ జూడ శతావధానులే
యెక్కడఁ జూడ నాటకపు లెక్కడఁ జూడఁ బ్రబంధకర్తలే
దిక్కరులంచుఁ బేర్పడిన తిర్పతి వెంకటసూరులేఁగు నా
పక్కల నెల్ల నీకడుపు పండినదమ్మ ! తెలుంగుదేశమా !

మ. నుదుటన్ కుంకుమబొట్టు వెట్టి పొడుమున్ దోరంబుగాఁ బట్టియె
ట్టెదుటన్ బొల్చు మహేంద్రునిన్ గనక బ్రాహ్మీభావనాలోకపా
ర్షదులై తిర్పతి వేంకటేశు లవతారంబెత్తిరో నాఁగ బ
ల్లిదులౌ బాలకవీశశేఖరులు తల్లీ ! యెందఱో చెప్పుమా.

సీ. శ్రుతివేసినారు మీ శుభగానములకెల్ల
యాంధ్రులు మగవార లాఁడువారు
తలదాల్చినారు మీ పలుకులు రసికులౌ
కవులెల్ల రాజాజ్ఞకన్న మిన్న
చెవులొగ్గినారు మీ కవితలోఁజవులకై
మకుటంబు లల్లాడ మనుజపతులు
పచ్చకప్పురముగా భావించినారు మీ
మాటలు విజ్ఞానమహితులెల్ల

తే. గీ. వచ్చియున్నారు స్వాగత మిచ్చుకొఱకు
నోలిఁ బండ్రెండు తెలుఁగు జిల్లాలవారు
వారి యనురక్తచిత్తభండారమెల్ల
చూఱఁగొనితయ్య ! వెంకట సుకవివర్య !

"పిసుపాటి వెంకటరమణయ్యగారు"

సీ. రాజనరేంద్రుడు రాట్సభాంతరముల
నన్నయ్యభట్టుతో వన్నెకెక్కె

తిక్కయజ్వప్రభాదీప్తి కాకరమయ్యె
మనుమసిద్ధి సభాధి మంటపంబు
పెద్దనార్యుఁడు సామి గద్దెనెక్కెను నాఁగఁ
గృష్ణరాయని సభఁగీర్తిఁ బొందె
శ్రీనాథుఁ డొక కొంత పీమసీమల కేగి
రాట్ప్రభాంతరముల రాణకెక్కె

తే. గీ. నంతియేకాని మీవలె నాంధ్రదేశ
సకలభూపాలమస్తక మకుటరత్న
వరసమర్చితపాదసౌభాగ్యగరిమ
నందఁగల్గిరె ? వారెవ్వరైన మున్ను.

సీ. గద్వాలపురి కేగి కైతఁ జెప్పించితి
ఛాందసప్రవర వైష్ణవులచేత
ఆత్మకూరికి నేగ నందు గోడలుఁ గూడఁ
గవితకుఁ దలలూఁచఁ గలిగెనండ్రు
వనపర్తిలో 'నహి' పలుకున కొకకొంత
విలువ గల్గింపఁగాఁ గలిగితీవు
గుంటూరి కారంబు కొండొక తగ్గింప
నుప్పు గల్పితి వింత మెప్పుఁ బొంద

తే. గీ. శిష్యులేరేని రిత్త దేశికుల దూఱు
ఫలము నీలోకమునఁ బొంద గలుగునటులు
సాటి చెప్పితివయ్య ! విశాల దృష్టి
లేని యయ్యలు కినుక మీపైని బూన.

శ్రీముఖ సం॥ ఆశ్వయుజమాసభారతిమండి
వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

పూజ్యపాదులగు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవము మచిలీపట్టణమున నేడు జరుగుట మహానంద విషయము.

సీ. మోహనమ్మున జగన్మోహనంబుగఁ బద్య
పఠనమ్ము నిచ్చోటఁ బాదుకొలిపె
మాదృశాంతేవాసి మండలమ్ముల కెల్ల
వేడ్కమై నిచ్చోట విద్యనేర్పె
తేటతేటగఁ దీయఁదీయఁగా సత్కావ్య
నిర్మాణ మిచ్చోట నిర్వహించె
ఉల్లాసవారాశి నోలార్చు నల్లారు
బెల్లంబు నిచ్చోటఁ బేర్మిగనియె

తే. గీ. నెన్నటికి వీడరానట్టి యిట్టి యిట్టి
శాశ్వతానుబంధంబు లెసంగియుండ
నెట్టు నిబ్బరించెనో కదే ! యిట్టిపురము
వీడనాడంగ మా కవివీరవరుఁడు........

ఇర్వదియైదేండ్లకుఁ బూర్వము నేను వేంకటశాస్త్రిగారి దగ్గఱ చదువుకొన నఱిగిన నాఁడు,

"అలపంతజలికృతంబై నభాష్యమునకే పరిఢవిల్లును మహాభాష్యపదము."

ఇత్యాదిపద్యమును మోహనరాగరసమును పద్యభావమున జీర్ణింపఁ జేసి వారు చదువగా తన్మయతచెందితిని. రసస్ఫూర్తితోఁ దెలుఁగు పద్యములు చదువు చాతురికి నేఁడాంధ్రదేశమున శ్రీశాస్త్రులుగారే ఆచార్యపీఠము. ఆనాఁట నుండి ప్రతివిద్యార్థియు శ్రీశాస్త్రులుగారిన్ బోలి పద్యములు చదువుటకు బ్రయత్నించువాఁడే. ఎందఱో వారి పద్యపఠనానుకరణద్వారమున నాంధ్రభాషాపండితులైరి.

ఉ. కొంకులువోని సత్కవనగుంభన మంతకు మించి బింకమున్
బొంకము గల్గఁగాఁ జవులు పొంపిరివోఁ బఠియించు నేర్పు మా
వెంకటశాస్త్రిపండితకవిప్రభు చక్కటిఁ దక్కఁదక్క వి
ద్యాంకుల యందు నెందుఁ గలదా ? సకలాంధ్రమహామహీస్థలిన్....

ఆనాడు బందరులో శ్రీశాస్త్రిగారి యుపన్యాస సంపర్కములేని పౌర సభలుండెడివిగావు. వారి యుపన్యాస మన్ననే శ్రోతలు సభలోఁ గ్రిక్కి

జేయ నిండెడివారు. వారి యుపన్యాసమునకు ముందు సందర్భము చక్కఁగఁజూచుకొనుట మొదలైన జాగ్రత్త లక్కఱలేదు. జాగ్రత్తపడి వచ్చి చెప్పినవారి యుపన్యాసముకంటె శ్రీశాస్త్రులవారి యుపన్యాసమునకే సంగతులు చమత్కారములు హెచ్చుగనుండెడివి. పూర్వము భోజరాజు ముఖదర్శనమాత్రముననే పలువురు విద్వాంసులయిరని ప్రతీతి. నేడు శ్రీశాస్త్రులవారి ముఖదర్శనమున నది ప్రత్యక్షమైనది. స్కూలులో శ్రీశాస్త్రులవారు పాఠములు చెప్పకుండనే తాముగు పాఠములు చదువకుండనే పరీక్షలలో కృతార్థులగుచుండిరి. అంతేకాదు, కవులగుచుండిరి, మన లక్ష్మీకాంతకవి ప్రభృతులట్టి స్కూలు విద్యార్థులలో నాఱితేఱిన జగజెట్టులే! యిది వింతగాదు శ్రీశాస్త్రులవారిచే నెన్నఁడును చూడఁబడనివారును శ్రీశాస్త్రులవారి నెన్నడును చూడనివారును గూడ వారి శిష్యులై యెందఱో నేఁడు సరసకవితారచనము నేర్చి సర్వాంధ్రదేశమునఁ బ్రఖ్యాతి గనుచున్న వారున్నారు. ఈ విధముగా శ్రీశాస్త్రులవారు విద్యావంశవృక్షమును తొలుత బందరు పురముననే ఆ నాఁ డంటుదొక్కిరి. అది యిప్పు డాంధ్రదేశమున సర్వత్ర బ్రిబలి చెట్లు గట్టుచున్నది. శ్రీశాస్త్రిగారు నివసించి బహువర్ష ములు కవితామృతప్రపను సాగించిన భైరవపెద్దిస్సు ప్రక్కయింటి పట్టు ధనాఢ్యపపత్తు లనుకూలించెనేని వారిపేర విద్యాస్థానముగా వెలయించుట యుక్తమని నా యెన్నిక. సభ్యులిది సమాలోచింతురుగాక. నాకీ సంద ర్భమున...........

చ. పరిణతపాండితీబల మభంగురధారణ మాశుకీపరి
స్ఫురితకవిత్వమున్ గలిగి శుభ్ర యశంబు గడించుకొన్న మా
తిరుపతిశాస్త్రి సత్కవి గతించెనె యాంధ్రవచోవధూటికిన్
స్థిరతరకావ్యభూషణవిశేషపరిష్కృతి తీరిపోయెనే.......

అని విచారము కొంత తొట్రు గల్గించినది. కాని వెంకటశాస్త్రిగారి కవితాగంగాస్రవంతిలో తిరుపతిశాస్త్రిగారి కవితా సరస్వతి యంతర్వా హినిగా నున్నది.

క. నుతకవితామృతవాహిని
సతిలోకయశశ్శరీర మగపడుచుండన్
మృతియబె తిరుపతికవికిన్
జతయగు వేంకటకవీంద్రు డాటయి యుండెన్.

అని యూరడిల్లితిని. తిరుపతివేంకటకవులు ఎక్కడేని యవధానము చేసిరనఁగా నా చుట్టుపట్టుల వా రనేకులు ప్రతిభాసౌధమున పదిమెట్లు లెక్కిరన్నమాటే! మెదడు కమలిపోవునో, నరముల బిగువు సడలి శరీరము నకనక లాడునో యని సాధారణ బుద్ధిమంతులు సందేహించునట్లు పగలు శతావధానతంత్రము జరపి రాత్రి పదిగంటల దాక పరిపరి వినోదములఁ బాల్గొని తరువాత నిమ్మకు నీరెత్తినటులు నిశ్చలముగా నిద్రిపోయి మఱునాఁటి పొద్దుట మఱల మందహాసవదనముతో, అల్పాహారమునైన నారగింపక, అవధాన శేషములు పూరింప నారంభించు నీజంటకవుల యంతఃకరణములు శ్రుతి కలసి ఒకే మనము అయ్యెడివి. అది యొక వింత తీరు. ఆ సమయములందు వెంకటశాస్త్రిగారు విశ్వమూర్తులు. సభ్యులు వెంటాడు భక్తులు, తిరుపతివేంకటేశ్వరుల కవితాధార ప్రాచీన సంప్రదాయ ఘట్టములు త్రవ్వి త్రవ్వి ఊటయూరిచి చేదిచేది పాటించినది కాదు. స్వయము ఉద్బుద్ధమైన బుగ్గధార. వారు ప్రాచీన గ్రంథముల కంటె హెచ్చుగా ప్రస్తుతపరిసర పరికరములనే చదివిరి. కావుననే సంప్రదాయమాత్రపరిజ్ఞాతలు కొందఱు వారి కవితను సంప్రదాయదూరమైన దానినిగా, క్రొత్తతీరు గలదానినిగాఁ దలఁతురు. నేఁటి యువకవులు వారి కవితను నవకవితామార్గోపదేశకమునుగా నారాధింతురు.

తిరుపతి వెంకటకవులు ప్రౌఢపండితప్రభు సభలలోనేగాదు, బాలపామరజారచోరాదుల గోష్ఠులలోఁగూడ కవితాచమత్కారములను గల్పించి సత్కారములను బడయగలరు. వెంకటశాస్త్రిగారికి లల్లాయపదములు పాడ వేడుక, కొల్లాయగుడ్డలఁ వాడ వేడుక, వారికి, భాషాడంబరము గిట్టదు. అట్లే వేషాడంబరమును గిట్టదు. కనుకనే వారి కవితాకన్య జనముద్దుగా

వెలసినది. సమయస్ఫూర్తి, హాస్య యుక్తి ప్రియుక్తిచమత్కారము వెంకటశాస్త్రిగారికి ఆజానజమగు నలవాటు. ఇట్టివారు నూఱేండ్లకు ముందు నడిమింటి మంగశేశ్వరశాస్త్రిగా రొకరని వింటిని. బ్రహ్మశ్రీ కళాప్రపూర్ణ వేదము వెంకటరాయశాస్త్రిగారి నింకొకరిని గంటిని. వెంకటశాస్త్రిగారి చమత్కారములనేకములు, అవియెల్ల సేకరింపఁ దగినవి, ప్రాచీనాంధ్ర కవులలో, ప్రబంధముల కంటె శాశ్వతములగునట్లు చాటు రచనలను సాగించినవాడు శ్రీనాథుడు. ఆతని చాటురచనలు నేఁటికిని నాంధ్రరసికుల నాలుకలపై నాట్యమాడుచున్నవి. వర్తమానాంధ్ర కవులలో నట్టివారు మన తిరుపతి వెంకటేశ్వర కవీశ్వరులు. పదునైదేండ్లకు బూర్వము విశాఖ పట్టణమండలమున రాత్రి వేళ బండిమీఁద నేనేగుచుంటిని. ప్రక్కబండిలో నొక పట్నాయకుడు "ఇంజరంబొకసాక్షి, యేనామువాసాక్షి పల్లెపాలెంబుదా నెల్లసాక్షి" ఇత్యాది పద్యము బాడుచు నడుమ "శంకరుండాతని సానిసాక్షి" అను పట్టున నాఁగి, యొక నవ్వు నవ్వి, మఱల నారంభించి పద్యము ముగియఁ జదువుట వింటిని. తిరుపతివెంకటకవుల చాటుధారలు మలయమారుతపున్ బింజెలు, అవి యాహ్లాద జనకములై సర్వాంధ్ర ప్రపంచము నలముకొన్నవి. లక్షల కొలది గ్రంథసంఖ్య యుండునట్లు (ముప్పదిరెండక్షరముల రచనమునకు గ్రంథమనిపేరు) బహు గ్రంథముల రచించు కవీశ్వరులు పలువు రిప్పుడున్నారు గాని వారిపద్యములు గొన్నియేని హాయి మని పండితులుగాని, పామరులుగాని, పలువురుపలుమాఱులు పఠించునవిగా నున్నవా? యన్న ప్రశ్నకు సమాధానము సభ్యులారా! మీరే సమాలోచింప దగుదురు.

శ్రీవెంకటశాస్త్రిగారికి, అన్నవస్త్రములకు గొఱతలేని స్థితి యేర్పడెను. వెంకటశాస్త్రిగారు గృహారామధనకనకవస్తువాహనసమృద్ధితోపాటు సత్సంతాన లాభమునుగూడఁ బడసిరి. ఆనందమయముగా జీవితయాత్రను గడపననువుపడెను. ఆ కాలమున నట్టి యానందసందర్భమున నేనొక జాబులో శ్రీశాస్త్రులుగారికి వ్రాసిన పద్యమిది.

సీ. గాటంపుఁ దమిఁ దోఁట నాటుకొన్నాఁడ నిం
డారఁ బండెనెజహాంగీరుమావి ?
అవధానములు సూడ నభ్యర్థితులు వేఁడ
నేగుచుందురె ? యిప్పు డెచటికేని ?
సత్కవితా రహస్యము లభ్యసింపగా
వచ్చుచున్నదె ? శిష్యవర్గ మిపుడు ?
భగవత్పరములైన పరమార్థ రచనముల్
కొ్రిత్తవి యేవేని కూర్చినారె ?
తే. గీ. కులుకుఁ గుత్తుల నునుదొక్కుఁ బలుకులందు
ప్రౌఢి మీఱిన సుకవితా ఫణితులందు
పరువుగల యంటుమామిడి పండులందు
చక్కగుఱితించు చుందురే చవులవాసి ?........

భగవదనుగ్రహమున శ్రీశాస్త్రిగారి కిదివఱకే యఱువది యేండ్లు నిండినవి. శ్రీశాస్త్రిగారి కిట్లే ఇంకొక షష్టిపూర్త్యుత్సవము గూడ నరుగునట్లు భగవానుఁ డనుగ్రహించుఁగాత.

వెంకటశాస్త్రిగారు విద్వద్రాజగోష్ఠు లందు వివిధ సత్కారముల బడసిరి విద్యావివాదములందు విజయము లందిరి, రసవత్కావ్యములఁ బెక్కింటి రచియించిరి, చాలమంది శిష్యులకుఁ జదువు చెప్పిరి, సంతాన సమృద్ధిని బడసిరి. సకల సంపదల బడసిరి, సమానులలో నుత్తమశ్లోకు లయిరి, ధర్మార్థకామములందు పరిపూర్ణమయిన పరితృప్తి వారికి దొరకినదనియే నా విశ్వాసము ఇఁకజీవిత శేషమున వారు పరమపురుషార్థ లాభమునకై పనిగొనుట బాగుగదా ! భగవత్కృప, యిట్లు పరఁగుఁగాక ! ఇదినాప్రార్థనము........

(శ్రీముఖ సం॥ ఆశ్వయుజ బ॥ ౧౦ శనివారమునాటి కృష్ణాపత్రికనుండి)

—• పుష్పవర్షము •—

బ్రహ్మశ్రీ వెంకటశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవ సందర్భమున గురిసిన
పద్య కుసుమములు

దివాకర్ల వెంకటావధానిగారు.
కీ॥ శే॥ బ్రహ్మశ్రీ తిరుపతిశాస్త్రిగారి కుమారులు.

సీ. తరతరంబులనుండి దాఁచి గోదావరి
కానుక వెట్టిన తేనెవాఁక
తొలిజన్మముల నాంధ్రి చెలిమి బంగరుపూల
సాగించుకొన్న పూజాఫలంబు
వాఙ్మయ సస్యమ్ము వర్ధిల్ల శిష్యుల
కమృత మ్మొసంగిన యంబురాశి
అన్యోన్య తేజంబు లలరించుకొని దివా
కరున కాలంబమై పరగిన శిఖి

తే. గీ. కుకవిమదమత్తవారణకుంభదళన
విక్రమ పటిష్ఠమై నుంత విశ్రమించు
వృద్ధ కవిసింహ మియ్యది వేళయయ్యె
నంఘ్రిలకు మ్రొక్కి యిపుడు ధన్యతను గాంతు.........

చ. ఇది తగు వేళ గావున నహీనచరిత్రుని బ్రహ్మపండితున్
మది నొకసారి యెంచుట సమంజసకార్యము కాకపోదు స
ర్వదురితనాశకం బతని పావననామము సద్యశోరమా
భ్యుదయ మొసంగఁ జాలునదియున్ గద భక్తి భజించు వారికిన్.

ఉ. ధన్యుడనైతి నాంధ్రకవితాగురుపీఠ మలంకరించు మూ
ర్ధన్యులు శిష్యులై పలు విధంబుల జెంతనుజేరి కొల్వ రా
జన్యుని పోల్కి నున్న కవి చంద్రుని గాంచి నమస్కరించి; యే
యన్యుల కింత వాఙ్మయమహత్తరమైన కుటుంబ మబ్బెడిన్!

మ. భవదాశీర్వచనం బమోఘమగుచున్ బ్రాపించె నొక్కింత యీ
కవితావాసన నేఁడు త్వచ్చరణ సాంగత్యంబు సిద్ధించుటన్
భవసాఫల్య మెలర్చె నింక నధికప్రాచుర్యమున్ గాంచి వై
భవ మార్జింపఁగ నీ మహత్తరమనోభావమ్మె తోడయ్యెడున్.

శా. ఈ సంతోషమహావకాశమున నా కేహేతువో గాని శం
సాంసర్గము లేని చింత యొకఁడుచ్ఛందంబుగాఁ బర్వుచున్
గాసిన్ గూర్చెడి మానసమ్మునకు, సంకల్ప ప్రభావంబొ ? లే
దా, సాజమ్మగు భక్తిమూలకమొ ? క్షంతవ్యంబు మీ బోంట్లకున్.

మ. స్మరణీయుండగుఁగాక, స్వీయకవితాసామ్రాజ్యవిస్ఫూర్తికిన్
గురుతాస్ఫీతి వహించి తోడివచ్చుగై కూలంకషంబైన ది
క్తరుణీసేవితసద్యశోరమకు భాగస్వామియౌ వేంకటే
శ్వరు రూపమ్మున నున్న తండ్రికి నమోవాకమ్ము లర్పించెదన్.

ఉ. అంకిలి లేని దేహబల మవ్యయమైన మనోబలమ్మునా
తంకము లేని శాసనము దాల్చి కవిత్వజగమ్ము నందు న
ల్వంకల నీకుమారుల విలాసములన్ గమనించు చుండఁగా
నింకొక షష్టిపూర్తి ఘటియించుత శాంకరినీకుఁ బేర్మిమై.

శ్రీకృష్ణ గాన చటుకా భాగవతులు.
అల్లమరాజు పేట్రాజు శర్మగారు

శ్లో. శ్రీచెళ్ళపిళ్ళకులశేఖర సార్వభౌమ
శ్రీషష్టికీర్తివిభవాయురుదారాపుత్ర
శ్రీకృష్ణగానచటుకార్భటికావినోద
శ్రీవేంకటేశ్వర కవీంద్ర నమోనమస్తే.

ఉ. ఏగురుపాదమూలరజ మెద్దు సుపుత్రధనాది సంపదల్
వేగిర మిచ్చి నావ్యసన వేదన లెల్లను బాఱఁద్రోలునో
జేగురుపాడు తుల్యదరిఁజెందిన యా కడియాన వాసమౌ
నా గురు నాశ్రయింతు మహితాత్మ శుభమ్ము సుఖమ్ము నొందగన్.

గేయము ఆనందభైరవి — ఆదితాళం

ఆనందభైరవి ఆవేశితరూపా అపర్ణాంబా కామేశ్వరీ
నా డెందమునను నిత్యానందవశతను ధ్యానము చేసెనిన్ ?
గానమునభజియింతు.

గాన నీ వఖిలార్థముల నిడుదానవై నా ప్రాణసుఖ మవసానము దనుక
వెనుక ముసు సంతాన గురు సఖుల దయ నేలుమి॥ ఆనందభైరవి॥
చెళ్ళపిళ్ళకుల శేఖర వెంకటశాస్త్రి భావుకాదరమె జీవనమై యెల్లవేళల
కృష్ణ చిటుకలను నుల్లమునను భజియించుచుండెడి అల్లమరాజు పేరి
శర్మను చల్లని కరుణ జూచి ప్రోవుమి॥ ఆనందభైరవి॥

మారువా — అది.

శ్రీచెళ్ళపిళ్ళ వెంకటకవి గురువర శాశ్వతాయుస్సుపుత్రిధనబల॥
ఇల్లు, పొళ్లు, బంగారు, శిష్యులకు, బళ్ళునోడలైన రీతినొసఁగితి॥
షష్టిపూర్తిసందర్శనమే మా షష్టితాపముల దీర్చెనహో॥
ఇష్టదేవతా స్వరూప గురువర ఈప్సితార్థశుభదా సుఖదా॥ శ్రీ చె॥

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

తే. గీ. వీరి శుశ్రూష చేసిన కారణమున
గౌరవమున గద్వా లాత్మకూరు ముఖ్య
రాజసభలందు లాతి పురంబులందుఁ
బడసితి వధానకవితావిభవము వలన.

తే. గీ శతావధానంబులను వెదఁజల్లినారు
శిష్యులకు సంస్కృతాంధ్రముల్ సెప్పినారు
సులభమౌ తెల్గు కవితను జూపినారు
పావనంబు మా గురువుల జీవనంబు.

జి. జాషువకవిగారు.

ఉ. గంటలు కొట్టి మీ మధుర కావ్యము లాంధ్రుల మేలుకొల్పి యిం
టింటను నాటుకొన్నవి కవీశ్వర! కోతకువచ్చియున్న మీ
పంటను గోసికొమ్మ తిరుపత్యభిధానుడు లేఁడు భాగమున్
గొంటకు నీ విచారమున గుందెద మింతకు వెంకటేశ్వరా.

చ, తెలుగు జగాన నేఁడు గడిదేరిన బాలకవీంద్రు లెల్ల మీ
పలుకుల పందిటన్ జిగురు బట్టిన మొగ్గలు మీ వధానకౌ

శలమున నూగిపోయిన దిశావలయమ్ము ప్రసన్నబుద్ధిమై
వలగొని మీకొసంగెడు నుపాయనముల్ గొనుమయ్య సత్కవీ.

శా. 'రారయ్యా' యవధానశక్తిఁ గని యారాధింపఁగా' నంచు మీ
రే రాజన్యుని రాజసంబు మెఱయన్ బ్రార్థింప, రే రాజు మి
మ్మ్మారేగింపఁడు కొమ్ము కేనుఁగులపై, సుర్వోష్ఠలింగల్గు స
త్కారంబుల్ మఱియాదలన్నియును మీకై పుట్టి వర్ధిల్లెనో.

శా. నీవున్ దిర్పతియుఁ సభాంతరములన్ నేర్పున్ బ్రదర్శించి వి
ద్యావైశద్యము గల్గు పండితకవీంద్రశ్రేణితోడన్ "సవాల్"
గావింపన్ గని పుల్కరించిన విశాలంబైన యాంధ్రోర్వి మీ
శ్రీవృత్తంబు పఠించి చెప్పుకొనఁ జొచ్చెన్ దేశదేశాలతో.

సీ. ఇలు దాఁటి నీవు రావలెఁగాని నీ పదం
బులు నమస్కృతులలో మునిఁగితేలు
చే సాచి నీవు యాచింపఁగావలెఁ గాని
మణులతో నీ యిల్లు దొణకిపోవు
తలఁపూని నీ చేఁత గల మందవలెఁగాని
సిసలైన కవనంబు చెంగలించు
మన్నించి నీవు సమ్మతిఁ జూపవలెఁగాని
బిరుదాళి నీతొమ్ము తొఱఁగలించు

ఆ. వె. నీకు షష్టిపూర్తి నెఱపి మా బందరు
నిఖిల దిశలఁ బూజనీయుయయ్యె
వార్ధకమున గౌరవకిరీటమును బూని
సంచరింపుమయ్య ! సత్కవీంద్ర !

కృత్తివెంటి వెంకటసుబ్బారావుగారు.

సీ. ఇతఁడెకా ! పింగళివర్తితతీసుమముల బం
దరువీధి నమ్మ బాతరితకుఁ దెచ్చె
ఇతఁడెకా ! తెల్గుభారతికిఁ గ్రొంగొ్రత్త పో
కడల గీరతముమేల్ నుడులఁజాటె

ఇతఁడెకా ! మనకెల్ల శతవధానకవిత్వ
షడ్రిస్నానంబు బిచ్చంబు వెట్టె
ఇతఁడెకా ! రాజరాజతతిన్ సమీపించి
యేనుఁగు నెక్కి సన్మానమందె

తే. గీ. కయ్యమన వెనుదీయక కాలుదువ్వి
కవివిజయ భేరిరవము నల్గడలఁ గ్రాల
నితఁడెకా ! జంట మ్రోయించె నిద్ధగురుఁడు
వెరసి తిరుపతివేంకటేశ్వరుల నొకఁడు.

శా. కెంగేలన్ గల ఘంటికావలయమున్ గీర్త్యంగనాసేవ వీఁ
కం గాల్వట్టిన గండపెండెర మరీట్కాండంబు టుద్దండతన్
భంగం బొందఁగఁ జల్పెనీ తమదు దీవ్యత్ సజ్జనశ్లాఘ్యమౌ
మాంగల్యమ్మన కేది లోటు కవితామాద్యన్మహావిక్రమా.

పొన్నాడ కృష్ణమూర్తిగారు.

ఆ. వె. ఏకలవ్యు లటు లనేకులు శిష్యులు
సవ్యసాచులట్టి ఛాత్రు లొప్ప
నస్త్రగురునిలీల నరుల కజయ్యుడు
శాస్త్రగురుడు హితుడు చతురు డితడు.

చెళ్ళపిళ్ళ దుర్గేశ్వరశాస్త్రిగారు.

తే. గీ. పుత్రిలను మాడ్కి శిష్యులఁ బూర్ణమైన
కరుణతోడను విద్యలఁ, గరపుచుండు
నిట్టి కవిచంద్రు సేవించునట్టి వట్టి
శుంఠయైనను సుకవియై, శోభ గనడె !

వడ్డాది సీతారామాంజనేయులుగారు.

శా. తాతాజీ ! తమ షష్టిపూర్తిమహ ముద్యత్ప్రీతిగా మేశ్వరీ
మాతృ శ్రీకరుణాకటాక్ష గరిమన్ మాకిట్టు లీక్షించు శో

ఖాతారణ్యసమృద్ధి శ్రీముఖ మహాబ్దంబందుఁ జేకూరె మీ
ఖ్యాతిజ్యోత్స్నవిజాంతరంగమలమంగానద్ది దీపించెడిన్.

చెరుకూరి కాళహస్తీశ్వరశర్మగారు

సీ. ఆంధ్రుల శుష్కచేతోంతరంబుల నూత్న
చైతన్యభావ ముద్భూత మయ్యె
ఆంధ్రభాషయె భాషలందు లెస్సయటన్న
దివ్యోక్తికిఁ బునః ప్రతిష్ఠయొదవె
ఆంధ్రభూమీపాల కాస్థానముల మాతృ
భాషాభిమానంబు పాదుకొనియె
ఆంధ్రుల ప్రతి పల్లె నాత్మీయభాషావి
లాసానుభూతి వికాసమెనసె

తే. గీ. చారు భవదీయ కవితా విహారకలన
నభినవాంధ్రోదయమ్మన కాది కార
ణమనిస్మరియింతు రాంధ్ర సంతతులు నిన్ను
వెంకటకవీంద్ర సారసంవిత్ఫణీంద్ర.

కొండపల్లి గోపాలరావు. హరి రామలింగశాస్త్రిగార్లు.

ఉ. అన్నము వెట్టి శిష్యులకు నాదట విద్యలఁ జెప్పువారిలో
మున్నుగ మిమ్ము నెన్నవలెఁ బో యెటులన్నను ? మీ గృహంబులోఁ
దిన్న దినాలనుండియు నదేపనిగా మఱి నేఁటిదన్క నా
కన్నము పుట్టుచున్నది మహాకవిసత్తమ వేంకటేశ్వరా.

పండితారాధ్యుల నాగభూషణముగారు.

సీ. ఎవ్వారిపద్యంబు లెన్నిమార్లు పఠించి
నను గ్రిమ్మఱ పఠింప మనసు వుట్టు
ఎవ్వారి గ్రంథమ్ము లెలమి పఠించినం
తనె కవిత్వముఁ జెప్ప ననువుపడును
ఎవ్వారిపే రాలకించినంతటనె కా
కవుల గుండియలు గ్రక్కదలిపోవు

ఎవ్వారి శిష్యుండ నేనంచు దెల్పిన
మాత్రి లోకమున సమ్మానమొదవు

తే. గీ. ఎవరిమూర్తులు చంద్రదినేంద్రులట్లు
బ్రకృతకవిలోకగగనమార్గమున వెలుఁగు
నట్టి తిరుపతివేంకటాఖ్యాకకవులు
గౌరవార్హులు గారె యెవ్వారికైన.

సదరు కృష్ణాపత్రికాను బంధమునుండి
శ్రీ కింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి బాలసరస్వతీ
శతావధాని.

బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రులుగారి
—• షష్టిపూర్తి మహోత్సవము •—

ఆంధ్రమహాజను లనేక దినముల నుండి మహోత్కంఠతో నెదురుచూచుచున్న బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవము కడచిన శని ఆదివారములయందు నిర్విఘ్నముగ జరిగినది. శాస్త్రిలుగారి ప్రఖ్యాతికి తావలమై వారిమూలమున ప్రఖ్యాతి గాంచిన బృన్దావనపురము తనకు ప్రేమాస్పద మగు మూర్తికి జరుగు సన్మానమును గాంచి మురిసినది. ఆంధ్రావని వివిధ ప్రాంతముల నుండి పండితులు కవులు, శిష్యులు, ప్రశిష్యులు, మిత్రులు, అభిమానులు, విచ్చేసి ఉత్సవమునందు పాల్గొనిరి. శనివారమునాఁటి యుదయమున 8 గం॥ ధర్మపత్నీ సమేతముగ శాస్త్రిలవారిని మోటారులో నూరేగించిరి. శ్రీరామాహైస్కూలు భవనములో సభ జరిగెను. ఆహ్వాన సంఘము తరఫున రావు బహదూరు శెడింబి హనుమంతరావు పంతులు గారు సన్మానపత్రము చదివిరి. విలువగల సేలువు, ఖద్దరు ధోవతులు, చీర, వెండిపొడుము డబ్బీ, వెండిపాందాను, వెండిసిరాబుడ్డి, కలము. చదరంగపు బరిణె, మొదలగునవి శాస్త్రిలుగారికి సమర్పింపఁబడెను. వేదహితముగ బ్రాహ్మణులు, దంపతుల నాశీర్వదించిరి. శాస్త్రిలవారి యల్లుఁడగు వెంకటసుబ్రహ్మణ్యదీక్షితులుగారు ( 11 సం॥ బాలుఁడు )

ఆశీర్వచనపనస యొకటి ఘనజటలతో చెప్పి సభాసదుల కానందముగూర్చెను. కంచి ప్రాంతమునందలి తెన్నాంగూరుగ్రామ నివాసులగు ఘనాపాఠీ, వా॥ సుబ్బరామశాస్త్రిగారు ఆశీర్వదించుచు "శతాయుః" అను పదమునకు శిక్షా నిరుక్తాదుల ననుసరించి అర్థము విశదీకరించిరి.

సాయంకాలము నాలుగుగంటలకు శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి యధ్యక్షతక్రింద మహాసభ జరిగినది. పంతులుగారు ఆంధ్రలోకమునకు శాస్త్రులువారివలన గలిగిన మహోపకృతిని వివరించుచు శ్రీకృష్ణ దేవరాయలకాలమునకు తరువాత మాఱుమూలల దాఁగియున్న తెలుఁగు కవితను ప్రచారమునకు గొనివచ్చి శాస్త్రులుగారు నవీనాంధ్ర సారస్వతమునకు సృష్టికర్తయయ్యెననియు అట్టి మహాపురుషు ననువర్తించుట ఆంధ్రయువకుల కర్తవ్యమనియు నుపన్యసించిరి. ఉత్సవమునకు రాజాలని మిత్రులును శిష్యులును తాము వచ్చుటకవకాశము లేనందులకు చింతిల్లుచు జయప్రదముగ నుత్సవపరిసమాప్తి నభిలషించుచు జాబులు వ్రాసిరి. తరువాత పద్యరూపముగను గద్యరూపముగను అనేకులు శాస్త్రులుగారి నభినందించిరి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ యభినందన పద్యములతో వజ్రపు టుంగరమును కానుకగా బంపుకొనిరి. శ్రీయుత కొల్లిపర వెంకటరమణయ్య నాయుడుగారు, రు. 116. లను, పిఠుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఒక నేలువును సమర్పించిరి.

మఱునాఁటి యుదయమున మహాసభ బ్రహ్మశ్రీ ప్రభల లక్ష్మీనరసింహము పంతులుగారి యధ్యక్షత క్రింద జరిగెను. పంతులుగారు తమ పాండితి కనుగుణముగ గంభీరోపన్యాసమునిచ్చిరి. శ్రీ శాస్త్రిగారి శిష్యులగు ప్రతాపకృష్ణమూర్తిగారు రు 50 లను గురుదక్షిణగా సమర్పించిరి.

సాయంకాలము శాస్త్రులుగారి యుపన్యాసమగుటచే జనముమిక్కుటముగ వచ్చెను. శాస్త్రులుగారు తమకీయుత్సవము జరిపినందులకు కొన్ని పద్యములు జదివి ఉపన్యాసము గావించిరి.

సాయంకాల మాఱుగంటలకు శ్రీ శాస్త్రిగారి గౌరవార్థము బ్రహ్మశ్రీ హరి నాగభూషణముగారు గానసభజరిపిరి. శ్రీయుత అశ్వధాటి రామ

మూ_ర్తిగారు మృదంగము వాయించిరి. కార్యక్రమము జయప్రదముగ ముగిసినది.

—• గు రు ద క్షి ణ •—

బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ళ వెంకటశాస్త్రివారు తమ షష్టిపూ_ర్తి మహోత్సవ సందర్భమున నందుకొనిన కానుకలలో వారిశిష్యవర్యులగు బ్రహ్మశ్రీ పింగళి లక్ష్మీకాంతము కాటూరి వేంకటేశ్వరరావుగార్లు తమ కృతియగు 'సౌందరనంద' రూపమున సమర్పించిన గురుదక్షిణ సర్వో_త్తమము. యీక్రింది పద్యములు ఆసందర్భమునఁ జెప్పఁబడినవి.)

క. శ్రీమ_త్తిర్పతికవిసు
త్రామసుహృ_త్త్వాభిరామ ! రసవత్కవితో
ద్దామా ! వేంకటశాస్త్రీ !
స్వామీ ! గురుదేవ ! కొనుము సాష్టాంగనతుల్.

మ. జగదాశ్చర్యకరావధానకవితాసంప_త్తికిన్ మ్రొక్కి మీ
యుగళస్నేహముఁ బ్రస్తుతించి భవదీయోదారభావప్రసా
దగుణోత్ఫుల్లకృతిప్రసూనవిగళన్మారందధారాసురా
పగనోలాడి రచించి తెచ్చితిమి దేవా ! మీకు నీదక్షిణన్.

మ. వసుధాధీశులు కాన్కలంప సుకవుల్ పద్యోపహారమ్ములం
ప సుధీశాళి శుభాభినందనమొనర్పన్ సంస్కృతాంధ్రాంగనల్
కుసుమోపాయన మీయఁగా నొదవె నీకున్ షష్టిపూర్త్యుత్సవం
బసదే ! శిష్యులు కావ్యదక్షిణల నీకర్పించుటల్ దేశికా !

ఉ. కేతనతోడి పొత్తునకుఁ గేల్గలుపన్ దలపోసికాదు నీ
చేతము మెచ్చఁగాఁ గవిత చెప్పఁగనే_ర్తు మటంచుఁ గాదు వి
ఖ్యాతికిఁ గా;దిఁకేమనిన, నద్యతనాంధ్రకవిప్రపంచని
ర్మాతకు భ_క్తిమై నుడుగఁఅల్ ఘటియించెడి పూన్కియే సుమీ !

చ. గురుతరకావ్య మీర్గురునకున్ గృతియిచ్చి గడించినారు బల్
సిరినని యానుమాయితికిఁ జేకుతె నీచిఱుకబ్బమొండెఁ, ద్వ

చ్చిరసుకృతంబు నేఁడు ఫలసిద్ధి వహింపఁగఁబోలు నొందె నా
దరమున మాయొసంగు గురుదక్షిణ ప్రీతిఁబరిగ్రహింపవే.

ఉ. సంచితపుణ్యకర్మము లొసంగు ఫలమ్ములువోలె వాసనల్
ముంచుకొనన్ నవప్రసవముల్ విరఁబూయుచున్న దీవు క
ల్పించిన పాదులందుఁ బ్రభవించిన నూత్నకవిత్వవల్లి యీ
కొంచెపుఁ బూలమాల కయికొమ్ము గళాభరణమ్ముగా గురూ!

ఉ. భావవిశుద్ధి తోఁపఁగ భవత్పదముల్ భజియించునాటి మా
సేవలుమెచ్చి యాదరవిశేష మెలర్పఁగ నిచ్చినట్టి మీ
దీవెన నిక్కమై యొసఁగెఁ దీయని కావ్యఫలమ్ము నేటికిన్
నీ విడినట్టి భిక్ష యిదె నీకె యొసంగెద మిప్డు విందుగాన్.

సీ. పుడమి ఱేఁడులు తల లఱుగులు మోవంగ
నర్పించు కాన్కల నందువాఁడు
అత్యద్భుతంబైన యవధాన విద్యకుఁ
బ్రభవకారణమైన ప్రతిభవాఁడు
వీనుదోయికి తేనెసోనలు వర్షించు
వాఙ్మాధురికిఁ బేరువడినవాఁడు
చిననాఁడె వలచివచ్చిన కవితాకన్య
నేకపత్నిగొనర్చి యేలువాఁడు

తే. గీ. పూర్ణకాముఁడు త్యాగియు భోగియైన
గురుని బుణ మీఁగుపొంటె నీ చిఱుత కబ్బ
మర్హత గడించుకొనుఁగాక యాంధ్రవాణి
కడకనుల జాల్గొను ప్రసాద కణలవాప్తి

—, శశికళా స్వయంవరం ,—

( బ్ర॥ శ్రీ సర్వా వేంకటశేషయ్యగారు శాస్త్రిగారికి కావ్యకన్యక నీకిచ్చింది గద్యపద్యములతో నప్పగించిరి)

సుదర్శనోపాఖ్యానమను నామాంతరము గల శశికళాస్వయంవర మైదాశ్వాసముల పద్యకావ్యము షష్టిపూర్తిమహోత్సవసమయమున నీకావ్య కన్యకను మద్గురూత్తముల పాదసేవసేయుటకు భక్తిపూర్వకముగా సమ ర్పించుకొనుచున్నాఁడను

క. గురు షష్టిపూర్తిమహమున
కరుదెంచిన యగ్రజాత నాయమ పాత్రిణే
శ్వరుని గని మా "సుదర్శన"
సరగున చనుదెంచి పల్కె సంభ్రమమొప్పన్.

చ. జనక! మదగ్రజాత సురసత్తము శ్రీపతి వేంకటేశ్వరున్
దన పతిగా వరించి సముదార యశంబు గణించె మున్ను నా
కును దయమీఱ నాధునిగఁ గూర్పవె శ్రీపతివేంకటేశ్వరా
ఖ్యునిఁ గుకవీంద్రమత్తగజకోటిసటాంకుని దేశికేంద్రునిన్.

ఆ పలుకుల కానందముఁ జెందియు నామె చిత్తశుద్ధి నెఱుఁగ దలచి యామె నుద్దేశించి.

క. కల్లయుఁ గపటమెఱుంగక
తల్లీ యుద్వాహ మాడఁ దలచెదె? వయసుఁ
జెల్లిన యా బహుపత్నీ
వల్లభునిన్ దతకుటుంబ భారార్దితునిన్.

తే. గీ. అనిన నామాట విని యామె కినుక దోఁపఁ
బూర్వపక్షమ్ము చేయంగఁ బూని పలికె
నీవెఱుంగని ధర్మము ల్లేవుగాని
తండ్రి! వినుమయ్య నా సమాధానములను.

ఆ. వె. షష్టిపూర్తియయ్యె సత్కవీశ్వరునకు
షష్టిపూర్తినాకు జరుగనుండె
స్వల్పభేదమంత పరిగణనీయంబు
కాదు గాన వంత గాంచవలదు.

అదియును గాక రాజాధిరాజుల చెట్టవట్టిన వనితల కెన్నఁడును సవతిపోరు తప్పలేదు. కవిరాజు నపేక్షించు నాకు మాత్రమట్టి దేల కలుగ కుండును. గలుగును గాక.

తే. గీ. అగజ కర్ధాంగ మర్పించి యాదరించి
నట్టి శివుఁ డంతకన్న నాకధిక మేమి
యొసఁగ గలఁడని శంకించు చున్న గంగ
నెలమిఁ దలఁ దాల్పలేదె మహేశ్వరుండు!

నాయం దుత్తమగుణంబులు లేవని నన్నాతండు నిగ్రహించు నేమో యని సంశయింపవలదు.

తే. గీ. ఏను శశికల నాతండు నిందుశేఖ
రుండు మాకెట్టి సంబంధ ముండె నదియు
ప్రాజ్ఞులగు లోకులకును సర్వజ్ఞుఁడైన
తత్కవీంద్రునకును విశదంబ కాదె!

ఇదియే నా మనోనిశ్చయము. అతని సేవ చేయుటొండె యోగినినై చరించుటొండె, ప్రాణత్యాగంబు చేసికొనుటొండె, యీ మూఁడు పద్ధతుల కన్న నాల్గవది లేదు లేదు. అని ఖండితమ్ముగాఁ బలుకు నామెఁ గాదన లేక, ఆపె యభీష్టంబు పసమకూర్చుట కే నమ్మతించితి.

ఓ క వి రా జ శే ఖ రా!

శ్రీమంతు లనేకులు దివ్యసుందరవిగ్రహలైన కన్యకారత్నములను నవరత్నములతోఁ గూడ నర్పింప నున్నప్పుడు, అలంకార శూన్యయు, ఐశ్వర్య హీనయు, ప్రాకృతవంశసంజాతయు, సకలంకయు, సంస్కారా పేక్షయు నగు నీమెను గ్రహించి మేమేమి లాభము పొందఁగలమని తిర స్కరింపఁ బోకుఁడు. భాగ్యవంతుల తనయల కన్న నిర్ధనుల పుత్రికలే పతి సేవ చేయుట యందు మిన్నలను విషయమ్ము జగద్విదితము కదా? నీ యీ వయస్సున నిట్టి నిరాడంబర, స్వార్థరహిత, వినయవిధేయతాసమ న్విత, వాంఛనీయయని వేఱె నొక్కి వక్కాణింప నవసరము లేదుకదా?

తే. గీ. పోయివచ్చెదనయ్య నాపుత్రి ముక్క
పచ్చ లారని బాల యపాజ్ఞురాలు
ఔను గా దననేర దీ వాదరించి
యెట్లు బ్రోతువొ? నీ కప్పగించినాడ.

సర్వా వేంకటశేషయ్య (అని యున్నది)
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

నేను బందరునకు రావలయునని మహాప్రయత్నము చేసితిని, కాని, కొన్నికారణములచేత రాజాలనందుకు మిక్కిలి చింతించుచున్నాను. ఇది చె॥ వేం॥ శాస్త్రిగారికి చేసిన బహూకృతి గాక, ఆంధ్రలోకమున కంతకును చేసినదిగా విద్వల్లోక మంగీకరించెడు మని నా యభిప్రాయము. భగవంతుడు మనల ననుగ్రహించుగాక.

వడ్డాది సుబ్బారాయుఁడుగారు.

చ. జరుగగ సర్వదేండ్లు పరుసన్ బ్రభవాదులు వచ్చునట్లుగా
బురుషుఁడు షష్టిపూర్తి మహమున్ బొనరించుకొనంగ వానికిన్
మరల గిశోరతాదులగు మంత్రబలంబునందుప్రి; వేంకటే
శ్వరకవి చెళ్ళపిళ్ళకులవార్ధికళానిధి వానిఁ గాంచుతన్.

మ. రచియించెఁ బహుకావ్యనాటకముఖగ్రంథంబు లాంధ్రంబునం
దుచితప్రక్రియఁ బెక్కు రాజసభలన్ దొందెన్ సుసత్కారముల్
మచిలీపట్నపుఁ బాఠశాల జిరకాలం బొజ్జయై తెల్గునన్
రుచిగల్గించెను వెంకటార్యుఁ, డదె, అందున్ గూర్చె నీపండుగున్.

మ. కవియేగాక శతావధాని యయి ప్రఖ్యాతిన్ బ్రకాశించుఁ గిం
కవిఘంటాలఘటానటాంకబిరుదోద్ధంబూని వర్తించు, హా
స్యవచోధాటి నలర్చు సభ్యుల నుపన్యాసంబులన్, బ్రజ్ఞఁ బు
ట్టువు ధన్యంబొనరించుకోఁగలిగె నిట్టుల్ వెంకటార్యుం డహో!

విశ్వనాథ సత్యనారాయణగారు.

ఉ. లంపులమారి ధూర్తకవులన్ గికురింతలు సేయు నేర్పు సె
ల్లింపులు మీక దక్కినవి తే! తొలుకారు మెరుంగు టందపున్

మం పెసలారు గొజ్జగి సుమాళపు మీ కవనంపు సీటులో
జంపుల పల్లెకాపు నెఱజాణల యయ్యల లూఁపు లూగెఁబో.

సీ. సొగసు మీ మేనఁ గస్తూరికావాసనా
శ్రేణిక పరిమళించినది తెలుఁగు
మీ ముఖాంభోజాతరామణీయకములో
దాఁగుకొన్నది శారదాహసితము
విద్యానగరరాజవీధులలో బడి
కదలి వచ్చినది మీ కడకుఁ గవిత
ఆంధ్రిమాతృక మీదు నల్లికలందున
మురిసికొన్నది స్వీయ మూ_ర్తి చూచి
తే. గీ. ప్రికృతి సంపెఁగయైనది భవ దమోఘ
చాతురీవాగ్వనంబున శత్రుమధుప
బాలురకు, శిష్యకోటి భావమ్ము తావి
యయ్యె దాన నంతర్లీనమగుచు బుధులు.

ఉ. పుడమిని బెక్కుసత్కవులు బుట్టిరి మిట్టిరి సత్కవిత్వపున్
దొడిమలు, చెళ్ళపిళ్ళకవితోఁ దులఁదూఁగెడువారె : వానలోఁ
దడియనివారు మద్గురు వధానమృదూ_క్తి మరంద ధారలోఁ
గడుగని వారు మాకెచటఁ గానఁగరా రిలఁ దెల్గునాఁడునన్.

నందివాడ వెంకటరత్నముగారు.

(బ్రి॥ శ్రీ॥ వెంకటశాస్త్రులవారి విశాలహృదయమునకును, శిష్య వాత్సల్యమునకును; ఉదాహరణముగా, ఈ క్రిందిపద్యములుచెప్పిన కవిని బేర్కొన వచ్చును. ఇతఁడు వడ్డెవాఁడు, అంధప్రాయుఁడు, వికార రూపి, అనేకు లితని నసహ్యించుకొన్నను వాగ్దేవి ప్రేమతో నితని నోట నివాసమేర్పఱచు కొన్నది. ఈపద్దెము లితని నోటనే వినదగినవి.)

చ. అనృతము వల్కనేల, నిజమాడెద మద్గురువర్యుఁ బోలు ప్రే
మనిధి మఱొక్కఁ డుండునని మాత్రిము నేను వచింపఁజాల; నం

భునకు గుపత్వమొందుటయె దొడ్డగుణంబుగ నెంచుకొన్న స
జ్జనుని దయామృతంబును విశాలమతుల్ కొనియాడ పంచురే.

తే. గీ. "ఏ నసలుకవినయ్య, మీకితఁడు వడ్డి
కవియగు" నటంచు నన్నొక్క యవనినేత
కే మహాత్ముండు చూపెనో యా మహాత్మ
నస్మదీయ గురూత్తము నాశ్రియింతు.

సీ. ఇంచుక సాహిత్య మెట్టులో కరుణించె
కైతయం దొక కొంత కలిమి నిచ్చె
గానంబుపైసుంత కాంక్షనాకొనఁగూర్చె
ఘటవాద్యమునకొంత పటిమనిడియె
నిఁక గృష్ణగాన చిటికె లను వాద్యమ్మ
లో నింత శక్తుని గానొనర్చె
నవనీశ్వరుల చెల్మి కాధారములు సూపి
వారిచే జీవించు భాగ్యమిడియె

తే. గీ. నన్నమింటనె పెట్టి నన్ గన్నతండ్రి
కరణిఁ గాపాడినట్టి నా గురుఁడితండు
మద్గురూత్తముఁ గొల్చిన మద్విమృగము
వంటివాఁడైన జ్ఞానియై వన్నెకెక్కు.

హరి నాగభూషణముగారు.

ఉ. ద్వేషములేనివాఁడవు విధేయుఁడవౌదువు బెద్దలందు స
ద్భాషలు నేతువెప్పుడును దాల్మి వహింతువు శత్రులందు ని
ర్భీషణవృత్తి దాల్తువు నిరీహుఁడువోలెఁ జరింతు వేమృషా
వేషము వేయఁబోవు నిను విష్ణుడు బ్రోచుత వెంకటేశ్వరా.

—• సన్మానపత్రము •—

కింకవీంద్రఘటాపంచాననా.

మీ షష్టిపూర్తిసందర్భమున భవదీయ కవితావిహారసీమయగు నీ బందరు పురమున మీకు స్వాగతమొసంగు భాగ్యము మా కబ్బినందుల

కెంతయు గర్వించుచున్నాము. యీ యిరువదవ శతాబ్దమున మూలమూలల నున్న కవితావిలాసినిని రంగస్థలమున నాట్యమొనర్పింప సాగించిన మహనీయులు మీరేకదా !

బాలకలానిధీ ! అద్వితీయప్రతిభాశాలురౌ తిరుపతిశాస్త్రిగారి సేతు జోడుగా గూర్చుకొని దిగ్దేశరాజన్యసభాంతరాళంబులందు వివిధావధానంబుల నిర్వహించి బిరుదంబు లందఁజాలిన మహనీయుల మిమ్ముల నధిక సన్మానంబులందింపఁ జాలువారము కాము.

విద్వత్కవిశేఖరా :

మీ యాంధ్రీకరణంబు లందెల్ల నగ్రగణ్యము దేవీభాగవత మహాకావ్యంబును మీగురూత్తములగు చర్లబ్రహ్మసుధేంద్రుల కర్పించిన మీ ధన్యత మాకెన్నఁదరమే !

బాలసరస్వతీ :

పంచమవేదమగు మహాభారతమును దృశ్యప్రబంధ రూపమునందించి సుబోధముగావించిన మీ భాషాసేవ కాంధ్రలోకమెల్ల మీయెడఁ గృతజ్ఞతఁ జూపఁదగియున్నది.

శతావధాని శిరోమణీ :

ఈ బందరుపురమందలి హైందవోన్నత పాఠశాలలో నాంధ్రదేశిక పీఠము నధిష్ఠించిన పండితులందెల్ల మీ రగ్రగణ్యులనక తీరదు. ఇచ్చో మీరు నాఁటిన కవితా బీజములు మొలకలెత్తి పుష్పించిన తెలుంగును జూడ వచ్చిన మీ శిష్యవాత్సల్య మెంతయుఁ బ్రశంసార్హము.

దిగంతవిశ్రాంతయశో విశారదా :

శ్రీ కామేశ్వరీ మహాదేవి మీకు సంపూర్ణాయురారోగ్యైశ్వర్యాహ్లాదంబు లొసంగి వృద్ధి నొందించుగావుతమని యాంధ్రలోక మెల్ల నర్థించుచున్నది.

ఇట్లు ఆహ్వానసంఘము.

మంచావఝ్ఝల సీతారామయ్యగారు.

చ. నొసటం గుంకుమబొట్టు, కేల నొక పొన్నుంగఱ్ఱ, పాదమ్ములన్
మెసపాపోసుల దాల్చి, మే ముతుకుటన్ వెల్లైన గుండంచు మేల్
వసన మ్మంచులుజారఁ గట్టుకొని క్రేవన్ మేము రాఁ దోఁటకున్
బసపున్‌సంజల నేగు మాగురుని రూపం బెప్డు భావించెదన్.

గీ. ఎవని ఎయ్యది మాముగ్ధహృదయసీమ
నడఁగి కాన్పించు నంధకారార్చి నార్చె
అట్టిజ్యోతిస్తమోఽతీతమైన యమృత
మస్మదాచార్యవీక్షణ మాత్మనెంతు.

స్నేహలతా కవితాసంఘము కొల్లాపురం.

సీ. భారతి యెందాక వ్యాపించియున్నదో
యందాక మీదు రాజ్యంపుహద్దు
హరిణశాబకచిత్ర వరముద్రితంబగు
చంద్రబింబంబె మీజయపతాక
పండితుల్ లక్షణపారీణులును భవ
దీయరాజ్యంబునఁ దిరుగు ప్రజలు
పారితోషికముగాఁ బడయుధనంబె మీ
ప్రజమండిగానెడు కప్పంపుసొమ్ము

తే. గీ. ధరను దిరుపతి వేంకటేశ్వరులకెవరు
నీడు రారన్న సత్కీర్తి నెసఁగునట్లు
ఈకవీశ్వరలోకంబుఁ బ్రకటముగ
నేలుఁ డాచంద్రతారార్క మెనయునట్లు.

భారా అప్పయ్యశాస్త్రిగారు.

సీ. లలితగీర్వాణాంధ్ర లలనలఁ జేపట్టి
బడుగుఁదనమ్ము వోనడపినావు

ఇలమిత్థమంచు నే రెఱుఁగని యవధాన
పక్రియఁ జాటించి పఱిబలినావు
సార్వభౌముని బలె సకలాంధ్ర రాజుల స
భల దిగ్విజయంబు సలిపినావు
విస్తృతంబైన కవిత్వ సామ్రాజ్యమ్ము
నృపతులమాడ్కిఁ బాలించినావు

తే. గీ. వయసు ముదురుకతానఁ దత్పాలనంబుఁ
బ్రాజ్ఞతములగు శిష్యుల వశమొనర్చి
సతత మవ్వారి మేల్గోరి జపమొనర్చు
వృద్ధ కవిరాజ! నినుఁగొల్తు వేంకటేశ!

వెంకటశాస్త్రిగారి ప్రత్యభినందనము.

ఉ. బందరుపట్టణంబు ననుఁ బంపె బహూకృతిఁ జేసి మున్న, యా
మ్ముం దొకసారి నెక్కుడుగఁ బూజితులన్ బొనరించె నిప్పరన్;
విందొనరించె నాకిపుడు వేవురు గల్గు సభాస్థలిన్ మహా
నందము గల్గె నీపురి కనంతసుఖమ్ములరారుఁ గావుతన్.

శా. నా సేమమ్మును గోరి నాకిపు డనన్యాదృక్షమౌ సత్కృతిన్
శ్రీ సంపన్నముగా నొనర్చెడి నినున్ శ్రేయస్సు లెల్లప్పుడున్
భాసిల్లన్ నెగడించుగావుత! సదభ్యాసమ్ముచే నీప్రజల్
వాసిన్ గాంతురుగాత! బందరుపురీ! భాస్వద్యశోవైఖరీ.

చ. అఱువదియేండ్లు నిండె నను టట్టులె యున్నను బైనిమూఁడు వ
త్సరములు దాఁటి నాలుగవదానను మాసము లొక్క రెండొగిన్
జరిగెను నాకు నేఁటి, కిది సర్వము సత్యమయౌట నేఁడిటన్
జరిగెడి షష్టిపూర్తియను సత్కృతికేఁ దగియుంటి నెంతయున్.

తే. గీ. ఎన్నియో పత్రికల లోన నెందఱెంద
ఱో లిఖించిన యంశమ్ములున్న వెన్నొ
గ్రంథవిస్తరభీతిచేఁ గైకొనంగఁ
జాలక త్యజించుటకు వారు సైఁపవలయు. 361

క. కృతిగయికొన్న నరపతికిఁ
గృతికర్త కుమేశుకరుణఁ గృతకృత్యత సం
తత మారోగ్యం బాయువు
సతీసుతుల సుఖముసిరియు సంగతమగుతన్. 362

క. ఎవరో వ్రాసిన రీతిని
స్వవిషయమును జాతకపుమిషన్ వ్రాసెనుదాఁ
గవియగుట వేంక టేశ్వరుఁ
డవు నిదియు సశేష ము త్తరార్థంబందున్. 363

— గ ద్య —

ఇది శ్రీ కింకవీంద్రఘటాపంచానన బాలసరస్వతి బాలకళావిధి
విద్వత్కవి శతావధానీత్యాది బిరుదాంకితులగు
తిరుపతివేంకటేశ్వర కవి ప్రణీతం
బగు జాతకచర్య
సంపూర్ణము

—

శ్రీమత్పరదేవతాయైనమః

# ఇటీవలిచర్య

(వెం॥ శా॥ జీవితచరిత్ర)

## శ్రీ తిరుపతి వేంకటకవి ప్రణీతము...



ప్రకాశకులు:

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు

వేంకటేశ్వర పబ్లికేషన్సు

కడియం P. O.

తూర్పుగోదావరిజిల్లా.

# పరిశీలకుని సూచన

"ఇటీవలిచర్య" అనగా తిరుపతి వేంకటకవులలో నొకరగు వేంకటశాస్త్రి శతావధాని పితృపాదుల షష్టిపూర్తి వఱకు గల జీవితము "జాతకచర్య" లో చరితార్థమైనందున షష్టిపూర్తి కిటీవలినుండి ఆరంభించి జీవితాంతమువఱకు సాగిన వెం॥ శా॥ జీవితచరిత్రియే యని పాఠకలోకమునకు నా విన్నపము. ఈగ్రంథమున చివరిభాగము మాత్రము - ఏకొంచెమో గ్రంథకర్త మరణానంతరమున నాచేకూర్పుచేయబడెను - వ్రాతప్రతి నుండి సరాసరి తొలిముద్రణకు నేనే పరిశీలకుడనగుటచే నేమేని దొసగులు పొసగిన పొసగవచ్చును-అట్టివి సూచించు పండితలోకమునకు కృతజ్ఞుడను.

పరిశీలకుడు

"విద్వాన్" చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రి

మొదటికూర్పు
వెయ్యిప్రతులు
1957

ముద్రణ:
వేంకటేశ్వర ప్రింటింగ్ ప్రెస్
ఆలమూరు.
తూర్పు గోదావరి జిల్లా.

శ్రీమత్పరదేవతాయైనమః

# ఉపోద్ఘాతము

ఇటీవలిచర్య, అను నీ నా జీవితచరిత్ర, లోఁగడఁ బ్రచురించిన

## జాతకచర్య

అనుదాని కనుబంధము. 63 వత్సరములలో నడచిన విశేషములు కుంచించి కుంచించి వివరించిన నెంత గ్రంథ మయినదో అదిమొదలు 74 వత్సరములలో నడచిన విశేషములు సంగ్రహించి లిఖించినను నంతకు నైదాఱురెట్లు పెరిఁగినది. చేదస్తముగా నుండు నని దానిని వడ పోసి అయిదువందలకును నాఱువందలకును మధ్యనుండునట్లు తగ్గింప నెంచితిని గాని తుదకు వేయిదాదాపులోఁ గాని యిముడు నని తోఁచదు. మొత్తము దీనిలో సుమా రిరువదియేండ్లదాదాపుచరిత్రములోని ముఖ్య ఘట్టము లుండును. వదలిన గ్రంథభాగమునకు ..........ఈమాదిరి గుఱుతు లుంచితిని. జాతకచర్యలోవలెనే దీనియందును నన్నుఁగూర్చి ప్రథమపురుషప్రయోగము లచ్చటచ్చట నుండును. చదువరులు వానిని గమనించి సమన్వయించుకొందురుగాక. ఇది యింత పెరుఁగుటకుఁ గార ణము బాల్యగురువులు తఱచుగా నొనర్చు నన్మృతప్రసంగము. అందులో– ఓలేటి వేంకటరామశాస్త్రికిని నాకును గల శైష్యోపాధ్యాయికనుగూర్చి బొంకిన బొంకు మహాదారుణము, ఘోరము. ఆఘట్టమునఁ గొన్ని వందలు వ్రాసితిని గాని పిదపఁ జాలవఱకు వడపోయుటలో తగ్గించితిని. ఆయనకు నేను దమరున్నకాలములోనే యుండుట బొత్తిగా నైఁపక యెట్లో నన్నధః కరింపవలయు నని యేమేమో వ్రాయుట సహజ మైనది. ఆ వ్రాయు వ్రాఁతలలో నేవిధమైన యుక్తియు నుండదు – "అరణ్యారోదన" మనుపేర వ్రాసిన పొత్తము నన్నేమో విష్ణుచక్రము చేయు నని వారి తలఁపు. ఆ పొత్తము సర్వవిధములను కూచిమంచి జగ్గకవి కృతమగు చంద్రరేఖా విలాపమునకు నకలు. దాని కెంత యౌచిత్య మున్నదో? దీనికి నంతే!

లింగం జగన్నాథరావుగారు మోమోటము విడిచి ప్రశ్నించిరి. ఎందఱో మన కెందు కని చాటున సేవగించుకొనుటయే గాని ముఖాముఖీ సంభాషణము జరపినవారు లేకపోయిరి. అంతటితోనేని వారు విరమించినచోఁ గొంత యుక్తముగా నుండెడిది. కాని జగన్నాథరావుగారు "అసూయ" అనుపేరున వారికిని తమకును జరిగిన యుత్తర ప్రత్యుత్తరములను బ్రకటించినపిమ్మటఁ గూడ వారి ధైర్య మేమో ? అసందర్భపువ్రాఁతలు మాననే లేదు.నన్ను నేదో వ్యాజము కల్పించి కోర్టులవెంటఁ ద్రిప్పుదు రని నేను మిక్కిలి భయపడితిని.నేను దమకు నజయ్యుఁడ నని గురువుగా రెఱఁగి "లీగలు"చర్య కుపక్రమించిరి గాని నేను నా యసమర్థత్వమును గమనించి కొని చల్లగా క్షమాపణము చెప్పి కోర్టుబాధనుండి విముక్తిఁ జెందితిని. కోర్టులోని విజయము కూడఁ గవులకు యశస్సంపాదకమేననియుఁ బాండిత్యస్ఫోరకమేయనియు గురువుగారి తాత్పర్యము.ఇంతకన్న వేఱొకయమాయికత్వముండు నని నే ననుకోను.

విశ్వామిత్రసృష్టిం దలపించు సన్మానములు నాకు రుచింపవు. అట్టి సన్మానములకు యత్నించుట నాకు లజ్జాకరము.ఒరు లట్టివి చేయఁ దలఁచినను నేను వాని నంగీకరింపను.ఇట్టి మతభేదములు నాకును వారికిని గలవు. నావలన వారి కీర్తికి భంగ మున్న దని వారు నన్ను ద్వేషించి లేనిపోని యసత్యములు ప్రచురించుటచే నీకబ్బము కొంత పెరిఁగినది. వడపోసి తగ్గించితిని.ఇంతే కథనీయాంశము. 80 వత్సరములునుమా రాయువు పెరుఁగునెడల నీ పొత్తమును బెరుగును— "యావత్తైలం తావద్వ్యాఖ్య"

క్షీరసాగరం బిల్డింగ్సు
**బెజవాడ**
***8.1.44***

ఇతి సర్వం శివమ్.
**చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి**
శతావధాని.

శ్రీ మత్పరదేవతాయైనమః

శుభమస్తు - అవిఘ్నమస్తు

# ఇటీవలిచర్య - ముఖ్యఘట్టములు

## కృత్యవతరణము

క. సిరి గల రత్నగిరీంద్రో
పరిభాగమునందు వెలసి భక్తుల దరితో
త్కర మణఁచు సత్యదేవుఁడు
కరము శుభము లొసఁగు మా ప్రకాశనృపతికిన్. 1

## వంశావతరణము

క. ఇనుగంటి సత్కులంబున
ఘనుఁ డగు వేంకటనృసింహకమలాప్తుఁడు తా
జనియించె వర్ణనీయపు
గొనముల కిక్క యయి యతఁ డకుంఠితుఁ డెంచన్. 2

తే. గీ. అతని కేగురు కొమరు లం దగ్రజుండు
పెద్దసూరయ్యగా రల పెద్దసూర
యావనీభర్తకును నేగు రాత్మభవులు
జననమందిరి కల్పవృక్షము లనంగ. 3

తే. గీ. అందుఁ బెదచిన్నరావుగా రగ్రజుండు
కొమరు లిరువురు గల్గి రా కువలయాధి
నేతకుఁ బ్రకాశరా వన ఖ్యాతియుతులు
సూరయ యనంగ దాతృతాశ్రీరుచిరులు. 4

తే. గీ. అగ్రజుండు ప్రకాశరాయనికిఁ గలిగె
రమ్యగుణుఁడు వేంకటరామరాయనృపతి

మూఁగురు కుమారు లీ నృపముఖ్యునకు జ
నించిరి యనర్ఘసద్గుణనికరఖనులు. 5

క. కౌముదుల యదృష్టమో? తం
డ్రి మహాత్ముఁడు రామనృపు సుకృతమో? శ్రీమ
త్కమలాపతి సత్యాహ్వాయు
డమలుం డల ఘనుల కొండయందున వెలసెన్. 6

ఆ. వె. అన్నవరపుఁగొండయం దగ్రభాగమం
దవతరించి యుంటి ననియుఁ దనకుఁ
బూజ సేసి పుణ్యములు పొంది తరియింపుఁ
డనియుఁ దెలుపఁ దొడఁగె నతఁడు స్వయము. 7

ఆ. వె. కొండ లెన్ని లేవు గుహ లెన్ని లేవు తీ
ర్థమ్ము లెన్ని లేవు ధరణియందు
నన్నవరపుఁగొండ యాచరించిన పుణ్య
మెట్టి దొక్కొ? తెలియ నెవరి తరము. 8

క. ఈరంకిపర్రికాశాహ్వయ
ధారుణిదేవునకు భక్తితత్పరునకు శ్రీ
నారాయణుఁడు కలం గన
నై రహిఁ దన రాక దెల్పె నవహితమతికిన్. 9

తే. గీ. అతఁడు తన స్వప్నవృత్తాంత మాప్తజనుల
తోడఁ జెప్పి యవ్వారలతోడఁ గొండ
కేగి త్రవ్విప స్వామియుం దేరుపాటు
గాఁగఁ బ్రత్యక్ష మయ్యె నక్కజము గాఁగ. 10

తే. గీ. రామనృపు కాలమందు నీరంకివారె
స్వామికైంకర్య మఖిలము జరుపుచుండి
రవల రామనృపాలకు నగ్రసుతుఁడు
శ్రీపర్రికాశరాయఁడు స్వామిసేవ కమరె. 11

తే. గీ. లలిఁ దనదు పత్ని వెంకటరాజ్యలక్ష్మి
తనయు లిర్వురు ననుజులు ననుజసుతులు
దోసతోఁటవిధమ్మున భాసిలంగఁ
గడు ముదంబున నెసఁగెఁ బ్రకాశరావు. 12

క. ఇరువురు కొమరులు గుణబం
ధురులే అం దవరుఁ డగు తనూజుని జినరా
డ్వరుని నుతిసేయుటకు స
ర్వరాజును నశక్తుఁ డనిన వశ మెవరి కనన్. 13

ఆ. వె. పేరు చిన్నరాయఁ డారయ నీతని
కెంత పెద్దరాయ లెనకు రారు
రాముఁ డనఁగ వచ్చు రహి నీతని గొనమ్ము
తెలిఁగి చెప్పుచుంటి నిది నిజంబు. 14

వ. మఱియుఁ గృతినాయకుం డగు నల యినుగంటి ప్రకాశరాయుండు.

తే. గీ. స్వామి యేనాఁడు తనదు వశమున కరుగు
డెంచె నానాఁడు నన్ను మా తిరుపతికవిఁ
దగఁ బిలువ నంపి,యిచ్చె నాస్థానపండి
తత్వ మేఁటేట నూఱార్లు ధన మొసఁగుచు. 16

తే. గీ. ఏగఁ గల యన్ని నాళ్ళు నే నేగినాఁడ
పూని యాఱేఁడు లాయె నిమ్మహిపుఁ డిచ్చు
వార్షికము నింటికడకె తాఁ బంపుచుండె
నేను ఋణపడవలసె నా యీ నృపతికి 17

షరా:— వార్షిక మింటికిఁ బంపుట కొన్ని వత్సరములే జరిగినది.పిమ్మట నట్లు జరుగలేదు అందులకుఁ గారణము నిట వివరింపను.కృతిపతియగు ప్రకాశరావుగారి లోపము లేదని మాత్రమెఱుఁగుదును. వెం॥ శా॥

ఆ. వె. అక్కతాన దీని నంకితం బిచ్చితి
షష్టిపూర్తిపిదప జరిగినట్టి
నాడు జాతకపువినోదము లిద్దాన
సంగ్రహమ్ముగా నెసంగు సొరిది. 18

# ఆశీర్వచనము

ఉ. మానవమాత్రుఁ డెంత మతిమత్తకుఁ డావల మైన నేమి? యా
వానరసేనతోడ నిటు వచ్చునె? వ్రచ్చునె? యన్న రావణున్
బూని జయించినట్టి రఘుపుంగవుఁ డేలు యశఃప్రకాశునిన్
జ్ఞానిఁ బ్రకాశరావు నినుగంటికులీను, నిలీనశాత్రవున్. 19

ఉ. ఏను రథస్థుఁడన్ మఱియు నెన్నియొ శీర్షము లుండె నాకు నా
పై నెటు లప్పుదాతిశరపాత మొనర్చెడి నంచు నెంచు దు
ర్మానిని రావణున్ బిలుకుమార్చినరాఘవుఁ డేలుఁ గాక వి
జ్ఞానిఁ బ్రకాశరావు నినుగంటికులీను, నిలీనశాత్రవున్. 20

ఉ. కాన వసించి నారలను గట్టుచుఁ గూరలు మెక్కి స్రుక్కు న
మ్మానవుఁ డెంతయేని ధృతిమంతుఁడె యందముగాక వానికిన్
దానవనాథుపే ర్వినిన ధైర్యము నిల్చునె? చూత మన్న దు
ర్మానిని రావణున్ గెలుచుమానవుఁ డేలుఁ బ్రకాశరాయనిన్. 21

ఉ. నే నివసించుచోటనిన నీరధిమధ్యగతంబు రాఁగ నె
వ్వానికి శక్యమౌ? ననుచు వారనిధైర్యమునన్ బరాక్రమ
స్థానము రాము లేశము నెదన్ గణియింపనిమేటిరావణున్
బూని జయించు రాఘవుఁడు బ్రోచు యశస్విఁ బ్రకాశరాయనిన్. 22

ఉ. ఈ నరుఁ డేమి లెక్క? దనుజేంద్రు నను న్వినినంతమాత్ర వై
శ్వానరుఁడేని భీతిమెయిఁ జల్లఁబడున్ ధ్రువ మంచు నెంచు దు
ర్మానిని రావణున్ గెలుచురాఘవుఁ డేలెడు నెల్లవేళ వి
జ్ఞానిఁ బ్రకాశరావు నినుగంటికులీనుఁ బ్రకాశరాయనిన్. 23

వ. ఇట్లు వినుతిపాత్రుండును శ్రీసత్యనారాయణభక్తుండును సుదారుండును సదారుండును, సపుత్రుండును జితాంతర్బహిశ్శత్రుండును బూర్వరాజన్య మర్యాదాబద్ధచిత్తుండును నప్రమత్తుండును మన్మిత్రుండును నగు శ్రీమదినుగంటిప్రకాశరాయని నాశీర్వదించుచు నయ్యలఘున కంకితంబుగా విరచించు నస్మజ్జీవితచరిత్ర జాతకచర్య కనుబంధం బైన యిటీవలిచర్యకుఁ గదారంభంబెట్టి దనిన:— 24

# గ్రంథారంభము

తే. గీ. సంపదభివృద్ధికరముగా షష్టిపూర్తి
జరిగెఁదత్కథ సర్వము సంగ్రహముగ
మున్న వివరింపఁబడియెఁదత్పూర్తిపిదప
నడిచిన విశేషములు దీన నుడువువాఁడ. 25

క. శనిలో శన్యంతరమున
మొనసినయలశుక్రవిదశ మునుకొనెఁ జంద్రుం
డనఘుఁడు సూక్ష్మదశకుఁ దా
నినుఁడై తగ షష్టిపూర్తి యితఁడే జరిపెన్. 26

తే. గీ. షష్టిపూర్తి బందరుపురి జరుగుపిదప
స్వపురమున కేగుతఱి బెజవాడలోనఁ
బెద్ద సభ లోకమూఁడయ్యె,వేంకటేశుఁ
డిచ్చె మూఁ డుపన్యాసము లెల్ల రలర. 27

వ. ఆసభలకుఁ గారకుఁడు ఘంటసాల సీతారామశర్మ,సభ్యులు నూఱాఱు లొసఁగి సన్మానించి రని యెఱుఁగఁ దగు. 28

షరా:— షష్టిపూర్తి63వత్సరములరెండుమాసములవయస్సునాఁడు బందరులో మహావైభవముగా జరిగినది.అంతవఱకు జరిగినసంగతులు, జాతకచర్యయనుజీవితచరిత్రయందుసంగ్రహించి వివరింపఁబడినవి.28లోని సన్మానములో విశేషించి కలిగించుకొన్న శిష్యుఁడు కాకరపర్తిభావనారాయణ యను వైశ్యసత్తముఁ డని యెఱుఁగ నగు. వెం॥శా॥

షరా:— శ్రీముఖసం॥మాఖబ౧౨ వఱకును శనిమహాదశలో,శన్యంతర్దశలో శుక్రవిదశాశేషము.షష్టిపూర్తినాఁటికి నా వయః పరిమితి ౬౩వత్సరములరెండుమాసము లని యెఱుఁగ నగు.

తే. గీ. అవలఁ గుజసూక్ష్మదశమొద లల్ల శుక్ర
విదశ సర్వము విషమపుగదము చోర
మూలమున ధననష్టియు మొదలుగాఁగ
నెన్నియో చిక్కులు ఘటించె నిందుఁ గుజుఁడు. 29

షరా:— విశాఖపట్టణమునకు నేత్రవైద్యమున కేసుటయు నయ్యేడ పింగళి లక్ష్మీకాంతము స్కూలుశిష్యుఁడు సకలవిధముల నాదరించుటయు నేత్రచికిత్స లోనైనవి యీ శుక్రవిదశయందే ఘటించె నని యెఱుంగఁ దగు—పిమ్మట శ్రీముఖసం॥మాఖబ౧౨మొదలుభావసం॥చైత్ర బ౬వఱకును.శనిమహాదశలో—శన్యంతరములో

—• రవివిదశ •—

క. ఈ రవియు ననారోగ్యపు
భారమ్మునఁ జిక్కువఱచెఁ బలికించెం ద
ద్భారమ్ము దెలుపు కవితన్
వారక మృత్యుంజయస్తవం బది నొడువున్. 30

భావ సం॥ చైత్ర బ౬మొదలు ఆషాఢబ౬వఱకును

—• చంద్రవిదశ •—

క. శ్రీముఖము శ్రీముఖంబై
శ్రీముఖముం గూడ నయ్యె, నేమం బాపై
శ్రీమానిని తమ్ముం డిడె
నేమేనియు భావవర్ష మించుక జరుగన్. 31

(శ్రీముఖము = విషము ముఖమునఁ గలది)

భావ సం॥ చైత్ర బ౬మొదలు భాద్రపదబ౧౦ వఱకును

—• కుజవిదశ •—

క. ఈ కుజవిదశయు హెచ్చుగఁ
గాక కడుఁ దొచ్చు గాక కలిగించె సుఖ
శ్రీ కమలారిన్ బలెనే
ప్రాకటగతి రాహువిదశ వచ్చెం బిదపన్. 32

భావసం॥భాద్రపద బ౧౦మొదలు ఫాల్గునశు౭ వఱకును

—• రాహువిదశ •—

ఉ. వచ్చినమాసమే గుపిదపన్ మును సౌందరనంద మంకితం
బిచ్చిన శిష్యులం దొకరుఁ డెంతయు భక్తుఁడు వేంకటేశ్వరుం

డప్పుడుఁబేర్మి రావలయు నంచును బందరునుండి వ్రాయఁగాఁ
గొ౦పెచ్చె శరీరపుఁ౯రుజను శోధనుఁ జేసి సుఖంబు గూర్చఁగన్. 33

తే. గీ. తనదు రెండవకొమరుతోఁ దాను నచట
నొక్కనెల వేంకటేశ్వరు నుదవసితము
నందు వసియించె సభలకు నప్పు డప్పు
డరుగుచు నుపన్యసింపుచు హాళి యలర. 34

తే. గీ. జ్యేష్ఠపుత్రు నౌపాసనశ్రీ తటస్థ
మయ్యె నయ్యుత్సవ మ్మగునంత రాహు
విదశ సంపూర్ణ మయ్యె నా పిదప గురుని
దశ మొదలు వెట్టెఁ గడు శుభోదర్క మగుచు. 35

భావసం॥ఫాల్గునశు౨మొదలు యువసం॥శ్రావణబ౨ వఱకును

—• గు రు వి ద శ •—

క. కొంత ధనవ్యయమును మఱి
కొంత ధనాగమము మిత్రకులగతశుభముల్
సంతసమున వీక్షించుట
సంతతమున్ గురువిదశ నెసంగఁ దొడంగెన్. 36

తే. గీ. కొంత యారోగ్యమును నొనఁగూర్చుఁ గాక
వార్ధకం బగుకతన లాభంబు గానఁ
బడకపోయె నేమైనను భాగ్యనేత
గూడ నేటను శని మంచి కొంత చేసె. 37

యువ సం॥ శ్రావణశు ౨ మొదలు, బహుధాన్యసం॥ చైత్రశు ౧౧ వఱకును శనిమహా
దశలో బుధాంతరము అందు బుధాంతరములో

—• బు ధ వి ద శ •—

తే. గీ. అవల బుధుని యంతరమున నతని విదశ
దొరకొనియె గేహమందు బందుగులు తఱచు
నిండుకతన శోభాస్ఫూర్తి మెండుకొనియె
సర్వవిధముల ననుకూలసరణి దోఁచె. 38

క. రెండవకొమరుఁడు సఫలన్
గండు మిగిలి తా వధానిగౌరవబిరుదున్
మెండుగ గడించి యాత్మకు
గొండొకసంతసము నిడె నకుంఠప్రతిభన్. 39

మ. ఘనుఁ డవ్వారికులుం డశేషసుగుణాగారంబు మచ్ఛిష్యుఁ డె
వ్వని నామంబు ప్రసిద్ధ మెల్లెడల సుబ్రహ్మణ్యుఁ డంచున్ మహా
మునులం దేనియు మృగ్యుఁ డిట్టిఁ డనుచుం బూజ్యుల్ వచింపంగ నే
విని నాఁడన్ గని నాఁడ వాని వినయావిర్భావసద్భావముల్. 40

వ. అట్టి గుణఖని యకాలమరణంబుకతన మనంబునకు ఖేదంబు దొడరె.

క. కొవ్వారికళాశాలకు
నవ్వారికులుండు తెచ్చె నవ్వారియశం
బవ్వారికులునితోడనె
యవ్వారింగలిసె దాని యశ మకటకటా!........ 42

తే. గీ. అవుల నంపించె శుభవార్త యలఘుఁడు జయ
పురమహారాజు సుకవి సంపూర్ణ పాఁడి
తీగరిష్ఠుండు విక్రమదేవవర్మ
అది యుదాహృత మయ్యె గ్రంథాంతరమున. 43

[గ్రంథాంతరము-విక్రమచెళ్ళపిళ్ళ అనెడిపొత్తము]

క. ప్రకృతపృథుఁ డోఢ్రనృపా
లకులోద్భవుఁ డవుట విద్యలయెడల మిగులన్
బ్రకటప్రజ్ఞుఁ డవుట జా
తకవిషయమునందుఁ జాలఁ దజ్ఞుం డగుటన్. 44

తే. గీ. జాతకపుఁజక్రమును బంపి సకలభార
మయ్యలఘునంద యిడితి నా కరుగుశక్తి
కడుఁ గడుఁ గడమవడినట్టి కారణమున
నంత నవరాత్రిమహము దా నందికొనియె. 45

వ. యథాశక్తి నంబికాపూజ నెఱవేర్చితిఁ గాని వెనువెంట నెగ రొప్పు జబ్బొకటి తారసించె నయ్యది శ్రీసోమినకామేశ్వరరావుగారి హోమో పతిమాత్రిలకతన నతివిచిత్రమ్ముగ నివర్తించె.................. 46

తే. గీ. అంతవఱకు నా జాతక మాగు టరయ
జాతకగ్రహబలమ నిస్సంశయంబ
ఈ యిటీవలిచర్య కామేశరావు
"హోమొపతి" వైద్య మని చెప్ప నొప్పు నిజము. 47

వ. ఆయీసమయమ్మునందు మద్బాల్యగురువులలో రెండవ గురువు లు శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులవారికి నాపై నలుక పొడమి వారు తోఁచినట్లెల్ల నన్ను నిందింపం దొరకొనిరి. అందులకు ముఖ్యకార ణము శ్రీవారు కొల్లాపురపుసంస్థాన పండితుఁడు తనప్రభువువివాహ సమయమం దాశీర్వదించి ప్రచురించిన పద్యపంచకమున నసూయా గ్రస్తులై వారు పట్టిన తప్పులు పలువురు పండితులతోపాటుగా నే నొప్పు లనుటయే యని యెఱుంగునది. అది పురస్కరించికొని వారు నాయెడల మిక్కిలి నాగ్రహము నెఱప మొదలిడిరి. లోకములో నెందఱో నన్నెదిర్చినవారు గలరు. ఆక్షేపించి యోడినవారునుం గలరు గాని వీరియంత తొందరపాటుకల ప్రతిపక్షులను నే నింతవఱకుఁ జూడనే లేదు. వీరి యాక్షేపణలలో నూటి కొకటి కూడ నిలుచునది యుండదు. ఈ యంశము పలువు రెఱుఁగుదురు గాని కొంద రెఱుఁ గనివారును గలరు. వీరి యాక్షేపణలకును వీరి బిరుదములకును సంబంధమే లేదు. అత్ర భగవతీ సరస్వతీ ప్రమాణమ్॥ ఈవిష యము ముందు ముందుఁ గొంత వ్యాకరింపఁబడుచునే యుండును. కాన స్పృశించి విడువంబడియె. 48

క. కుడిక న్నదరంగా మొద
లిడె నంతట, ఫలము దీని కెక్కడు గీర్తిన్
గొడు కవధానం బొనరిచి
గడియించుటె యింతకన్నఁ గలదే? ముదమున్. 49

క. నా కౌమరుం డేమాత్రి
మ్మో కవియై నా కొసంగుమోదమ్మును శ్రీ
"హైకోర్టుఛీఫుజడ్జీ"
యై కూడ నొసంగఁజాలఁ దనుకొందు మదిన్. 50

తే. గీ. "సరసతిరుపతివేంకటేశ్వరుల యింటఁ
బీఁటవెట్టుక గూర్చుండెఁ బృథులహావ
భావరసపేటి సత్కవితావధూటి"
అనియెఁ జివుకుల శ్రీవేంకటాచలకవి. 51

చ. తిరుపతిశాస్త్రి కొడ్కొకఁడు దీనివి నిల్పెఁ గవిత్వవైఖరీ
పరిచితిఁ గాంచి నేఁడు మదపత్యము తత్కవివాక్యముం బరి
స్ఫురణకుఁ దెచ్చె నిక్కతనఁ బొంపిరివోవుముదంబునన్ యశ
స్కర మగు నా కవీంద్రునివచస్సున కేను నమస్సొనర్చెదన్. 52

క. నాకున్ మూఁగురకొమరుల
శ్రీకాంతుం డిచ్చె నందుఁ జిన్నకు వ్రాలన్
గై కొనుప్రాయం బిప్పుడు
పైకుఱ్ఱలు సంస్కృతంబె పఠియించి రెటో. 53

తే. గీ. చిన్నకుఱ్ఱకు నక్షరస్వీకృతిమొద
లెలమి రామశబ్దమె పఠియింపఁ జేయు
చుంటి నింగ్లీషు చదివి యుద్యోగ మాచ
రించుకాల మ్మదియు వంతరించెఁ గాదె. 54

తే. గీ. వ్రతము చెడినను ఫలము సంప్రాప్త మయ్యె
వెనుక; నిపు డాంగ్లమును జదివించువారి
కుభయతో భ్రష్టతయె తక్క నుండ దించు
కేనియు ఫలం బనుచు నెల్ల రెఱిఁగినదియె. 55

క. పడమటిగాలికి లోకము
కడుఁజెడి శుష్కించుఁ గాని కాంచదు పుష్టిన్

జడమతు లెఱింగియు దానం
బడి చెడుచురు గొంద ఱెట్టి ప్రారబ్ధంబో ? 56

తే. గీ. ఇపుడు సంతానవంతుల కెంతయేని
చిక్కు పడమటిగాడుపుచేఁత మూఁడె
దీనిఁ దప్పించికొనియెడి ధీరు లెక్క
డేని యున్నారొ ? లేరొ ? యజ్ఞాన మరరె ? 57

తే. గీ. అల్లి కాదంబరీకావ్య మాత్మజనకు
రచనకున్ దీసిపోని వాగ్రచన యలరఁ
బూర్తి గావించెఁ దాదృశపుత్త్రుఁ గన్న
బాణున కొనర్తు నే నమోవాకశతము. 58

క. పిమ్మట "సీధై నకవి
త్వ మ్మెల్లన్ దప్పటంచుఁ ద త్తజుపువిమ
ర్శ మ్మొకటి వ్రాసెఁ జెరలా
ట"మ్మని కని సుకవు లక్కటా ? యన గుపఁడుఁన్. 59

తే. గీ. దానిఖండన మది నాకుఁ దప్ప దయ్యె
వ్యాసములు గొన్ని వ్రాసితిఁ బద్యకావ్య
మవుల వ్రాసితి దాని జయంతిరామ
యార్యునకు నిచ్చినాఁడ "జయంతి" యనుట. 60

తే. గీ. పాప మైనను దొందరపడిన గుపుని
వాద మనుచిత మని తెల్పవలసివచ్చె
నాదు ఖండన మీఁద శ్రీపాదగురుని
కేదియు సదుక్తి దోఁపక యూను పెరిఁగె. 61

యువ సం॥ మార్గశీర్ష బ ౪ మొదలు మాఖ బ ౨ వఱకును
శనిలో బుధాంతరములో

—• కే తు వి ద శ •—

తే. గీ. అరుగుదెంచె నెపుడు కేతు వా దినమ్మె
నందె జయపురశుభవార్త యనువుపడియె

నింటివేలుపుపయి భార మెల్ల నునిచి
యనిచె వెంకన వచ్చెద ననుచు జాబు. 62

క. మఱునాఁడు "హవామహలు" న
జరిగెన్ సభ పెక్కుఘనులు చనుదెంచిరి శ్రీ
కరుఁడు నరేంద్రుఁడు తనదు కొ
మరుతోఁ గొలువుండె నయ్యమరపతివోలెన్. 63

తే. గీ. ఏడ కేగెనొ? వార్ధక్య మెటకుఁ బాఱి
పోయెనో? వ్యాధిపీడ యప్పుడమితేని
సభ నుపన్యాస మిచ్చెడి సమయమందు
వెంకనకు యౌవనస్ఫూర్తి యంకురించె. 64

తే. గీ. సభపిదప మూఁడవదినమ్ము జనవరేణ్యుఁ
డంపె బహుమతి బసకు వేయార్లు మంచి
విలువ గల పట్టుఁబుట్టముల్ వేయినూఱు
నార్లు గాక కర్చులకు నూ అధిక మెలమి............ 65

తే. గీ. అల్ల "యాముక్తమాల్యద" యందుఁ గృష్ణ
దేవరాయలు నొడివిన తీవి యెల్ల
నెట్టయెదుటఁ బ్రత్యక్షమై యుట్టిపడఁగ
సత్కృతిని బ్రభునావతి జరిపి మఱియు. 66

ఆ. వె. *సెట్టిలక్ష్మినారసింహుఁ డిట్లనియె మీఁ
కిపుడు జరిగినట్టి యెల్లబహుమ
తులకుఁ గారకుండు ధూర్వహుం డీ మహా
పీయుఁ డింత నిజము నిజము నిజము. 67

---

* ఈ సెట్టిలక్ష్మనరసింహకవి మహారాజునకు బాల్యమిత్రుఁడు. హూణభాష
లోఁ గాక ఆంధ్రమునఁ గూడ నిష్ణాతుఁడు.

వ. అని పర్రిభలలక్ష్మీనృసింహపంతులం జూపి.

క. మన సంస్థానమునకు వెం
కన శ్రీమచ్చెళ్ళపిళ్ళకవి రాకున్నన్
మనజనపతికీరితికిన్
గనుపడు నెంతేని లోటు కావున నెట్లో. 69

తే. గీ. అలఘు నాయన రప్పించు టవసరంబు
వృద్ధుఁ రుగ్ణుఁడు నిప్పుడా వేంకటకవి
జనపతికిఁ గూడఁ గోరిక చాలఁ గల ద
టంచు నన్నుఁ బ్రేరేచె నీ యనఘు మీరు. 70

తే. గీ. ఎఱిఁగియే యుండు రని చూపె నెసక మెసఁగఁ
బర్రిభలశ్రీలక్ష్మినరసింహపంతునెదుటఁ
గూరుచున్నకళారాశి నారసికవి
వేంకటేశుం డనియె ముదావిష్టుఁడగుచు. 71

క. "యంబ్రహ్మల"మే మీతఁ డి
దం బ్రాహ్మం క్షాత్ర మనెడి తరగతికిం జెం
దుంబారగుఁ డెన్నిటనో?
పంబెడి నీ యలఘుఁ జూడ బహుసుకృతంబుల్. 72

తే. గీ. వేదమా? శాస్త్రమా? పురాణవిద్యయందుఁ
బట్టభద్రత్వమా? న్యాయవాదితనమ?
ఇంక నెన్నియో భాషల నెఱిఁగియుండు
టా? యెవరుసాటి? యీ జగద్గేయుతోడ. 73

ఆ. వె. నాదు షష్టిపూర్తినాఁ డీతఁ డగ్రాస
నాధిపతియె చూచినాఁడ నాఁడు
తేనియెడల నీ మహానుభావున కున్న
పక్ష మదియు నెఱుఁగువాఁడ నేను. 74

తే. గీ. స్వయముగా జేఁడు సువివేకి, సన్నిధాన
వర్తులా? మంచియోగ్యు లవారియశము

మీ నృపాలకునకుఁ గాక మేదినీశు
నెవని వరియింప నావలి కేగు నింక. 75

వ. అనుటయు.

తే. గీ. పశ్రిభలపంతులుగా రంతవఱకుఁ బ్రజ్ఞ
నాకు లే దని సహజవినయము మెఱయ
ననియె మీచేత మా జేనియన్వయచరి
తమును గావ్యమ్ము చేయింపఁ దలఁతు ననుచు. 77

తే. గీ. మీ గురువులందునొక్కరు మేటికవులు
నైన శ్రీపాదవారు రాజాన్వయమును
దదభిషేకమ్మునుంగూర్చి విదితముగను
వ్రాసినా రీరు వ్రాయ మా వాంఛితంబు. 78

ఆ. వె. "భవతు" దాని కేమి? భగవదనుగ్రహం
బున్న నదియు జరుగు నొకటి గాని
దనుచుఁ గలదె? దేవు ననుకంప గల్గుచో
ననియె వేంకటేశుఁ డాతఁ డరిగె. 79

క. విక్రమనృపాలుజాతక
చక్రిపుఁబాండిత్య మది ప్రశంసార్హము భూ
శక్రుం డయ్యును నాతఁడు
శక్రగురుఁడు జాతకపువిషయములపట్లన్. 80

క. ఆ యనఘాత్ముని పాండితి
నేయెడఁద న్నమ్మి యిల్లు నేఁ గదలితి సు
శ్రీ యారోగ్యంబును ననుఁ
బాయక సేవింప నింటిపట్టుం గంటేన్. 81

తే. గీ. కృతయుగపుదాత గాని యీ నృపతివరుఁడు
నేఁటికాలపుదాతలపాటిగాఁడు

పిల్చి బలవంతపెట్టి రప్పించి సత్కృ
తుల నొనర్చు వదాన్యు లిక్కలిగలారె? 82

క. నా జీవితచరితమ్మున
నీ జనపతి పిల్పు మఱియు నీ జనపాలా
వ్యాజసపర్యయు సన్నుతి
భాజనములు గాన మెచ్చవలయుఁ గవీంద్రుల్. 83

క. కేతువిదశలోనన్ బుధుఁ
డేతెంచిననాఁడె కొమరు నెలమి నుపనయా
న్వీతుని గావించియు స
ర్వాతిశయం బైన మోద మబ్బఁగఁ జేసెన్. 84

తే. గీ. అపుడె కొమరిత నత్తింటి కంపునట్టి
మహము నెఱవేర్చి గృహము సమ్మదమయమ్ము
గా నొనర్చియు వేతాళ మూనఁ జేసి
చిన్నకోడలి నొక్కింత చిక్కవఱచె. 85

ఆ. వె. కొసకు నుపశమించె కోడలిపైశాచ
బాధ మంత్రతంత్రపాటవమున
నంతఁ గేతు వేగె నరుదెంచె శుక్రవి
దశయు మిశ్రఫలవిదాయి యగుచు. 86

యువ సం॥ మాఘ బ ౨ మొదలు ధాతృ సం॥ ఆషాడ బ ౧౩ వఱకును
శనిలో బుధాంతరములో

—• శు క్ర వి ద శ •—

తే. గీ. భార్గవుఁడు వచ్చుచే మొదల్ భార్యకు జ్వర
మట్లు జ్వరపడి తుదకు నయ్యనఘురాలు
స్వర్గతిని జెందె "యింతటి సాధ్వి యింత
భాగ్యవతి" లే దనుచు నెల్లవారు వొగడ. 87

వ. మఱియుం గొన్ని చిక్కులు గలిగి కలంచె.

తే. గీ. అన్ని చిక్కులు నుపశాంతి నందెఁ గాని
గురుఁడు శ్రీపాదకృష్ణధీవరునివలని
చిక్కు మాత్రము నానాఁటఁ జెందె వృద్ధి
దాని వారించుకొనుట నా తరము గాదు. 89

తే. గీ. ఎందులకుఁ గొఱగానట్టి వేవొ శంక
లెన్నియొ లిఖించుఁ బ్రచురించు నేను వాని
కు త్తరము లిచ్చుచోఁ గోర్టు కొగిఁ జనంగ
జతనము నొనర్చు నాదునశ క్తి నెఱిఁగి. 90

తే. గీ. అందుకు భయమ్ము గల్గియు నల్లవారి
శంకలకు ను త్తరమ్ము లొసంగుచుంటి
హృదయమందున మాత్రి మీ కృతికి నాకు
సమ్మతము లేదు నమ్ముఁడు సత్య మింత. 91

క. "లోయరు" తరగతిబాలురుఁ
జేయనిశంకలను నొజ్జ చేసెడి నఁట ? వీఁ,
డా యా శంకలు ఖండన
సేయం గడఁగు నఁట ? సిగ్గుచే టిది గాదే ? 92

తే. గీ. వారపత్రికలందును బక్షపత్రి
కలను నింపినవ్యాసముల్ గలవు పెక్కు
లవలఁ బద్యకావ్యములు *"జయంతి" యను క్ష
మాపణము నుండె నవి వాదురూపు దెల్పు. 93

తే. గీ. వాదమునఁ జేఁతఁగామి నేవలన నైన
వెంకనను బట్టి పాలార్చి వేయవలయు
ననుచు నీసు దేశికునకు నంకురించి
తగినయవకాశములను వెదకఁ దొడంగె.... ... .... 94

---

* 93 ఈ పద్యకావ్యములలో నొకటి సంస్కృతము వేఱొకటి తెలుఁగు. వెం॥శా॥

వ. అంతఁ గొన్ని మాసమ్ములకు శ్రీరావుగంగాధరరామారాయనిజలప
దాహ్వానంబున.

క. ఇరువురుకొమరులతోఁ జె
న్నరాజధాని కొగి వెంకన చనియె గంగా
ధరరామరాయ నృపతిన్
దరిసింపఁగ షష్టిపూర్తితత్పరు నలఘున్. 96

ఆ. వె. ఇంతవఱకు శుక్రుఁడే యుండె విదశాధి
నాథుఁ డగుచు వీనినాళ్ళయందెఁ
పెద్దకుఱ్ఱ కొక్క పిల్లఁడు మనుమఁడు
గలిగె వంగడమున కెలమి గూర్ప. 97

క. ఇటు మిశ్రఫలము లిడి యె
ప్పటివిధమున శుక్రుఁ డరిగెఁ బట్టణమున కే
గుట వీనియంద చొప్పడెఁ
దటుకున రవివిదశ యంతఁ దారస మయ్యెన్. 98

ధాతృ సం॥ ఆషాఢ బ ౧౩ మొదలు భాద్రపద బ ౭ వఱకును
శనిలో బుధునిలో

—• ర వి వి ద శ •—

ఆ. వె. జరిగె షష్టిపూర్తి సర్వోన్నతముగాఁగ
నింటికన్న మిగుల నెక్కుడు సమ
పాయములు ఘటించు పార్థివుకతన వెం
కనకు నచట హాయి గడు రహించె........... 99

తే. గీ. రెండు నూఱార్లు సేజ్జోడు నొండొక యధి
కపు విలువపట్టుఁబుట్టముల్ గాక కుఱ్ఱ
లకును సేలపుఁబుట్టముల్ లలి నొసంగి
ప్రేమఁ జూపె గంగాధరరామరావు. 100

తే. గీ. అంత మఱునాఁడు స్వగ్రామ మరుగుపూన్కి-
నున్నపట్టున దంబుకులోద్భవుండు
వైద్యరాజాంకుఁ డరుదెంచి పలికె నిట్టు
లాదరం బొప్ప సుకవిసుబ్బావధాని. 101

తే. గీ. పుష్కరము దాఁటె మీర లిప్పురికి వచ్చి
వచ్చినట్టులె యేఁగుట భావ్య మగునె?
ఒక్క సభఁ జేసి పౌరుల యుల్లములకు
శక్తికొలఁదిగ సంతుష్టి సల్పవలదె? 102

క. నావుడు వెంకన వల్కె ము
దావిర్భావంబు గొల్పు టట్లుండఁగ నే
వేవురు గల్గిన నల్ల స
భావేదిక నిల్చుటకును భయపడుదుఁ గదా? 103

తే. గీ. అట్టి నేను సభావేది నధిగమించి
యించుకేని యుపన్యాస మిచ్చు టెట్టు
లనుడు నవధాని మీర లీయ వల దురక
కూరుచుండినఁ జాలు మాకు ముద మొదవు. 104

ఆ. వె. అనుచుఁ జెప్పి మాన్యులందఱకును నాదు
రాక విశదపఱచి వీఁకనాంధ్ర
పత్రికామతల్లిఁ బ్రకటింపఁగాఁ జేసె
సభజరుగుదినంబు జగ మెఱుంగ. 105

సీ. "గార్నరు" సభ నగ్రగణ్యుఁ డౌ రామచం
ద్రారెడ్డి మేల్జమీదా రొకండు
మంత్రిప్రగడవంశమండనుం డుద్యోగి
మఱి నారసింహరాఁ డమాత్యుఁ డొకఁడు
"హైకోర్టులాయ"రుద్యద్ధీకుఁ డల వేమ
వరపుశ్రీరామదాస్పంతు లొకఁడు

అట నున్న యాంధ్ర "లాయరుల"నెక్కుడు పేరు
గన్న శ్రీగంటిలక్ష్మన్న యొకఁడు

తే. గీ. ఎల్లరకు మేరువైన నాగేశుఁ డొకఁడు
మఱియునుం గల మాన్యు లెల్లరును గలిసి
"పచ్చయప్పకళాశాల" భవనమందు
సభ యొనర్చిరి యొకనాఁడు ప్రభ వెలిర్ప. 106

ఆ. వె. అట్లు సభ నొనర్చి యానంద మలర స
న్మానపత్రములను మఱియు రజత
పేటికలును వేయినూటపదాఱులు
సత్కరించి రెల్ల జనులు మెచ్చ. 107

క. అపుడు "గవర్నరు" కూర్మె
పపదుఁడు రెడినాయ డంపె బహుమతి నూఱా
ర్లపరిమితగౌరవపుటీ
గి పలువిధమ్ములను ఘనులు గీర్తింపంగన్. 108

క. ఈరీతిన్ సన్మానము
లారన్ సమకూర్చెఁ గాని యా రవి యొజ్జల్
దూఱెడిదూఱులు మానువ
నేరఁడ! గ్రహశీల మెవఁడు నేరుచు మాన్పన్. 109

క. జాతకవిద్యావేత్తల
కీతత్త్వము గోచరించు నినసుతుఁ డిపుడీ
జాతకపుదశానాథుం
డాతం డరికుజుని యింటి నధ్యక్షించెన్............ 110

క. మఱునాఁడు చిరంజీవి కొ
మరుండు దుర్గేశ్వరుండు మాన్యు లలర స
ద్బురముగ నొక యవధానము
విరచించె న్వాని గౌరవించిరి సభ్యుల్. 111

చ. తిరుమల శ్రీనివాసునకు దేవున కొండొక పీఠ మంచి య
బ్బుర మగు భక్తి నిత్యమును బూజ లొనర్చెడి ధన్యురాలు ధీ
వరకవయిత్రి యాత్మకృతపద్యములన్ గనకాంబ వేంకటే
శ్వరకవి కిచ్చె విం దొకటి సల్పి సమంచితగౌరవంబుతో. 112

తే. గీ. దారి కించుక దూరపదమున నున్న
వేంకటేశు కొండకు నేగి వెంకన మఱి
మదనపల్లె నెల్లూరును ముదమునఁ జని
సఫలసత్కారములు గాంచెఁ బ్రభ దలిర్ప. 113

క. బందరుశిష్యులకోరిక
నందులకుం గూడ నరిగి యట సభ లటుపై
విందులు శ్రౌతవిధానము
నం దగు పూజలును గా మనం బలరారన్. 114

షరా:— 114 వ పద్యమునందలి శ్రౌతవిధానపూజలు ఆంధ్రజాతీయకళా
శాలలో శ్రీముట్నూరికృష్ణారావుగారు, కాలేజీప్రినిసిపల్ శ్రీఅడవి
బాపిరాజుగారు లోనగు వారొనర్చిన వని యెఱుంగునది.

తే. గీ. కొన్నినాళ్ళుండి యంతకు మున్నె కోరి
నట్టి వేమూరిరాముజీ యనెడి పెడన
"రైలుస్టేషనుమాస్టు"రారంగ నిడిన
కానుకలు గొని కవి తన గ్రామ మరిగె............ 115

క. నేమమునఁ బ్రతిదినము నా
నేమము గనుగొనెడి నృపతిశేఖరునకు సు
శ్రీమహితుఁడు గంగాధర
రామారాయనికి శుభపరంపర లగుతన్............ 116

ధాతృసం॥భాద్రపదబ॥మొదలు మార్గశీర్షశు॥౧వఱకునుశవిలో - బుధాంతరములో

—• చంద్రవిదశ •—

ఆ. వె. చంద్రమౌళిశాస్త్రి సామీరిభక్తుండు
కోరుకతన మాట మీఱ లేమి

నంబపూజ తద్గృహంబున జరిపికో
నెంచి పెద్దపాటి కేగినాఁడ............... 117

ఆ. వె. గురువుగారు మిమ్ముఁ గోర్టులో నిర్జింపఁ
దలఁచి రంచు నాకుఁ దెలిసె నంచు
శ్రీయుతుండు సోమశేఖరుం డేలూరు
పురిని జెప్ప భీతి వొడమె నాకు. 118

తే. గీ. పాండితీరి క్తతను జాటు పటహ మౌర?
అట్టి యభియోగమే గురుఁ డాచరించె
నేని యేను క్షమాపణ నిచ్చువాఁడ
ననుచుఁ గృతనిశ్చయుండనై యలరుచుంటి. 119

తే. గీ. తప్పులేనిక్షమాపణ తనకు మంచి
యశము గలిగించునంచు వెంకనకుఁ దోఁచె
నెవ్వ రెటు చెప్పినను విన కిట్లు చేయ
వలయు నను కోర్కి చెళపిళ్ళ కెలమిఁ బొడమె. 120

ఆ. వె. అంతఁ గాకినాఁడ కరిగె శ్రీకాశిభ
ట్లాన్వయుండు బ్రహ్మయబుధవరున
కచట జరుగు గౌరవార్థంపుసభకు న
ధ్యక్షుఁ డగుచుఁ గొమరు లంటి రాఁగ.. 121

క. మనుమనికిఁ జిరంజీవికిఁ
దనవిదశాకాలముననె తగ నన్నప్రా
శనమహము జరిపెఁ జంద్రుఁడు
ధననష్టియు వీనిలో నొదవెఁ జౌర్యమునన్......... 122

ధాతృ సం॥ మార్గశీర్ష శు ౧౨ మొదలు మాఘ శు ౮ వఱకును
శనిలో బుధునిలో

—• కు జ వి ద శ •—

తే. గీ. అంతటఁ గుజుండు వచ్చె నిం దంతగా లి
ఖింపఁ దగినది లేదు స్వకీయపురికి

సవిధమున నుండు ననప త్తిసభకుమాత్రి
మేగియందు నుపన్యాస మిచ్చె నెలమి. 123

ధాతృ సం॥ మాఖ శు ౧ా మొదలు ఈశ్వర సం॥ ఆషాఢ శు ౪ వఱకు
శనిలో బుధునిలో

—• రా హు వి ద శ •—

తే. గీ. రాజమూలకముగ సొమ్ము రాక కొంత
అన్యమూలకముగ ధనవ్యయము కొంత
ఆదినే కానఁబడె వివాదార్థకములు
వ్యాసములు వ్రాయు పని చాల నధిక మయ్యె. 124

క. శనిదశయే మొద లేదో
కనుఁగొనఁగా నేరఁ గాని కలిగెఁ గవిత్వం
బునకుఁ బని తఱచుగా న
ప్పని యొజ్జకతాన మిగులఁ బ్రబలం బయ్యెన్. 125

తే. గీ. నుంతె యగుఁ గాక యేను శిష్యుండ నమ్మ
నీషి యొజ్జ యగుటఁజేసి యెఱుక తప్పి
ఆయన లిఖించువ్రాఁత న్యాయమ్ము గాక
యుండినను ఖండనము సేయు టొప్ప రెవరు. 126

తే. గీ. నేను ఖండింపకున్నను "నిజము నిడివి
మీఁదఁ దేలక పో" దని నాదు మదికి
గోచరించెడి నిప్పుడు గురుని పరుష
వాక్యములు సైఁపరామిని వాదు గొంటి. 127

* క. దీనికిఁ బ్రాయశ్చిత్తము
గా నీశ్వరు సాక్షిఁ జేసి కట్టితిఁ గవనం
బే నఱిముఱి బాతక మది
దానం బాయు నని యెంచి తద్జ్ఞహితముగన్. 128

* 128 ఇందలి కవనమునకే క్షమాపణ యనిపేరు.

ఈశ్వర సం॥ ఆషాఢ శు ౪ మొదలుకొని కార్తీక శు ౧౩ వఱకును
శనిలో బుధునిలో

—• గు రు వి ద శ •—

తే. గీ. రాహువిదశ యేగకమున్న వ్రాసె నొజ్జ
"కేసు"పెట్టెద నంచుఁ బేరీసుకతన
నంత గురువిదశాభుక్తి యవతరించె
గురునితో మైత్రి జీవుండు కొంత గూర్చె. 129

తే. గీ. పాండితికి లోఁగనట్టినాపైని గురున
కీసు గల్గుటచేఁ గోర్టు కేగుఁ గాక
తగుదునని యేను గూడ సిద్ధపడుకన్నఁ
దప్పిదం బుండ దని మదిఁ దట్టెనాకు. 130

తే. గీ. వక్రిమార్గంబునం బడి వారు వీరు
నవ్వఁ గోర్టులవెంట జన్యమ్ము సలుపు
టించుకయు నచ్చక క్షమాపణేచ్ఛ వాదమి
ప్రాజ్ఞులగువారిమెచ్చును బడయఁ జేసె. 131

క. గురువిదశ యిట్లు శ్రేయ
స్కర మగు పనికిఁ బురికొల్పెఁ గాని గురుని యీ
సఱ దపుడు గూడ ననుఁ బొరిఁ
బొరి దూషించెడిని నేరు పోలదటన్నన్........... 132

క. పొన్నూరన్ బాపట్లన్
వన్నెయు వాసియును మిగుల బ్రాహ్మణకోడూ
రన్నెఱి బందరుపురిని మ
హోన్నతముగ గురునివిదశ యొదవించె సఫల్. 133

తే. గీ. కలిగె రెండవకొడుకుదుర్గయ్య కొక్క
కూఁతు రా చిరంజీవిని కాతతముగ
బారసాలమొదలుగాఁగ బహుశుభములు
గురునివిదశయె సమకూర్చెఁ గోర్కులలర......... 134

తే. గీ. అంబికాపూజ నవరాత్రులందు జరుగు
నపుడ సీమంతమహమును నయ్యెఁ బెద్ద
యాత్మజకుఁ జిరంజీవిని, కప్పు డపుడు
బంధుగేహమ్ములకుఁ గూడఁ బంపె గురుఁడు. 135

క. ధనలాభవ్యయములలో
ధనలాభ మొకింత వ్యయము తద్దయు హెచ్చెన్
పనుపడియె భూమి గొండొక
గొనుటయుఁ జేకూరె విదశగురుని దరుగుచో. 136

ఈశ్వర సం॥ కార్తీక శు ౧౩ మొదలు బహుధాన్య సం॥ చైత్రి బ ౨ వఱకును.
శనిలో బుధునిలో

—• శనివిదశ •—

తే. గీ. అప్ప టప్పట సభలకు నరుగుటయును
భాగవతవిచారమ్మును వ్యాసరచన
మనుమలను లాలనము సేఁత మాటి కింపుఁ
గలిగె నారోగ్య మొండొక గతిగ నుండె. 137

క. ఇలుదూరు కొలఁది నసుఁ గడు
నలుసుగఁ గని గురువుగారు వ్యాజముమైఁ గో
ర్టులవెంటఁ ద్రిప్పుటకునై
తలపోయుచు నుండి రెట్టి తత్త్వజ్ఞతయో! 138

క. ప్రతిష్ఠిదరుకు * "జయంతి"
స్థితపద్యమ్ములను వినిచి దీనన్ గేసు
న్నతెఱఁగు జెప్పం డన వా
ర్మతిమంతులు లే దటనిన మాట వినఁబడెన్. 139

---

* "జయంతి" ఇది గురువుగారి దూషణములకు ఖండనగ్రంథము. పద్యకావ్యము.

ఆ. వె. "కేసు" లేకయున్న నీసుమైఁ గోర్టులోఁ
గేసు పెట్టెనేని గృషి యొనర్చి
తప్పికొనఁగవలయు దానికి నొడలిదా
ర్ఢ్యంబు లేక నాకు నడలు దొడరె........ 140

తే. గీ. క్రొత్తరూల్సుప్రకారమ్ము కొన్ని వేలు
వీని విదళనె గోల్పోతి నేను మఱియు
నష్టధనలబ్ధియును సుంత నాకుఁ గలిగెఁ
దత్స్వరూపంబు వివరింతు దద్జ్ఞు లరర. 141

క. శ్రవణానందపుఁబొత్తము
గవర్నమెంటాంక్షసేసి కడ కది మాన్యం
బవు నని "ఆర్డరు" నిచ్చిరి
కవులకు నుపకృతి యొనర్చెఁ "గాంగ్రె" స్మిట్టుల్.... 142

తే. గీ. అంత దౌహిత్రుఁ డుదయించె నా నిసువుకు
బారసాలమహమ్మునఁ బ్రమద మలరెఁ
గాని యారోగ్యలోపమ్ముకతనఁ గొంత
చింత యిం కేదియో చింత వంత గొలిపె. 143

క. పరచింత దక్క నెట్టి యి
తరచింతయు లేక మనెడి ధన్యులు భువిలో
దొరకరు దొరకినచోఁ ద
చ్చరణారాధనము ముక్తిసాధన మరయన్........ 144

క. గుణములలో లోభం బవ
గుణ మని యెఱిఁగియును దానిఁ గుంచింప నను
క్షణము యతించియు నా దు
ర్గుణము విడువఁ జాల కేను గుందఁగవలసెన్........ 145

ఆ వె. గురువుగారు నన్నుఁ బొరిఁబొరి వంచింప
నెంచి సాధ్యపడక యెల్లయపుడు

తిట్టిపోయ పిన్నపీరులు వారింతు
రపుడుఁ గూడ వార లాఁగ రకట ! 146

క. ఏకాక్షరప్రదాతయు
నా కెంతయు మామ్యుఁ డయి కనంబడుట న్నే
నా కోవిదు దూషింపక
నా కవితన్ గుఱిచి మండనముఁ బ్రకటింతున్........ 147

తే. గీ. ఇట్లు కలగూరగంపగా నేగె శనిమ
హాదశను బుధునంతర మవలఁ గేతు
వేగుదెంచె నంతర్దశాభోగి యగుచు
వీని సువిశేషముల నిఁక వివృతిసేతు. 148

బహుధాన్య సం॥ చైత్ర బ ౨ మొదలు ప్రమాధి సం॥ వైశాఖ బ ౧౦ వఱకును శనిలో కేత్వంతరము- ఆ కేత్వంతరములో బహుధాన్య సం॥ చైత్ర బ ౨ మొదలు వైశాఖ శు ౧౦ వఱకును కేతువిదశ. ఈ కేతు విదశలో వ్రాయవలసిన విశేషము లంతగా లేవని యెఱుంగునది. పిమ్మట బహుధాన్య సం॥ వైశాఖ శు ౧౦ మొదలు ఆషాఢ బహుళ ౨ వఱకును.

కేత్వంతరములో

—• శుక్రవిదశ •—

తే. గీ. ఇందు మిశ్రఫలమ్ముగా నేగెఁ గాల
మింట శుభకార్యములు బంధుగృహములందు
నట్లె శుభకార్యములు. చిక్కు లాత్మగృహము
నందుఁ దొడఁగియు శాంతించె నంబకృపను. 149

బహుధాన్య సం॥ ఆషాఢ బ ౨ మొదలు శ్రావణ శు ౬ వఱకును

—• రవివిదశ •—

క. ఆరోగ్యలోప మొండొక
తీరుననే యుండె భగవతీకృప సౌఖ్యో
దారమ్ముగ దినములు కవి
తారచనకుఁ దావలముగఁ దరలెన్ దీనన్........ 150

బహుధాన్య సం॥ శ్రావణ శు ౬ మొదలు భాద్రపద శు ౬ వఱకును చంద్ర విదశ. ఈ చంద్రవిదశలోఁ గూడఁ గొత్తలు లేవు-ఆభాద్రపద శుద్ధనవమి మొదలు ఆశ్వయుజ శు ౨ వఱకును

—• కు జ వి ద శ •—

తే. గీ. గురువుగా రల చిలుకూరి కోవిదుఁడయిఁ
దెచ్చు నభియోగమున సాక్ష్య మిచ్చుపొంటె
గురువిపక్షులు వేంకటేశ్వరునకు "సమ"
నంపి రది మానసమునకు హాయిచెఱచె"………… 151

షరా:- ఈచిలుకూరి వీరభద్రరావుగారు కల్లూరి వేంకటరామశాస్త్రిగారి జీవితచరిత్ర వ్రాయుచు దానిలో గురువుగారింగూర్చి కొంచె వ్రాసిరి. అందు నా పేరు గూడ నెత్తికొనిరి. అది వీరికి నామీఁద మఱి కొంత అసూయకు కారణమైనది — కేసుమధ్యమున వీరభద్రరావు వృద్ధుఁ డగుకతన స్వర్గతుఁ డయ్యెను. — ఈయన యథార్థవాది — మొగమాటము లేనివాఁడు. అదియే కేసుకు కారణ మని యెఱుఁగ నగు.

తే. గీ. వాదిగా నుంట తప్పికోవచ్చు నెట్లొ
అట్లె ప్రతివాదిభావంబు నపనయింప
వచ్చు సాక్షిగాఁ బిల్చిన నిచ్చితీర
వలయు సాక్ష్యంబు లేకున్న వచ్చుఁ జిక్కు. 152

తే. గీ. దొసఁగు లేకుండియును గోర్టు దొ్రిక్క వెఱచి
యిచ్చితి క్షమాపణంబు న న్నెఱుఁగు జగము
తుదకు గురువరు కే సేదొ ద్రొక్కఁ జేసెఁ
గోరు టని చింతసేయుట గూడె నంత. 153

వ. కోరుటువారు నా యసమర్థత్వమును గమనించి నా శయన గృహమ్మున కె వచ్చి సాక్ష్యము పుచ్చుకో నంగీకరించిరి. గురువుగా రట్లు జరుగ కుండఁ బ్రయత్నించి కొంత చర్య జరిపిరి. గాని యది కార్యకారి గాదయ్యె నని తెలివిడి. 154

ఆశ్వయుజశు ౨ మొదలు మార్గశీర్ష శు ౨ వఱకును కేతువులో

—• రాహువిదశ •—

తే. గీ. అంబికాపూజ జరిగె నిరంతరాయ
ముగను నింట ననారోగ్యములు ఘటించి
యును దదంబికకృపఁజేసి యొదవె సుఖము
దేహసౌఖ్య మ్మొకించుక దీటుకొనియె. 155

తే. గీ. ఎంత యారోగ్య మబ్బిన నింట నెట్లొ
శివుని జపియించుకొనుచును సెజ్జతోడి
పొత్తుతక్కను నేడకుఁ బోవునిచ్చ
లేనితఱి మండపేట వెళ్ళితిని సభకు. 156

వ. ద్విభాషివెంకటరావను నేకలవ్యశిష్యుండు వైద్యవిద్యానిష్ణాతుండు సుకవి నాకు సన్మానం బొనర్ప నుంకించి యా సభ సమకూర్చె నని యెఱుంగునది. 157

తే. గీ. ఇటు ద్విభాషివేంకటరావు నిచ్చ కలిమి
మండపేటపురమున సన్మానమంది
యున్నతఱిఁ బిల్పువచ్చెను జెన్నపురము
నుండి త్రైలింగపీఠమ్మునుండి పేర్మి............... 158

ఆ. వె. బులుసుసాంబమూర్తి పుష్పకిరీటమ్ము
తల నలంకరించెఁ దత్సదస్సు
నందుఁ గనకమాంబ యర్పించె నూఱార్లు
స్వకృతపద్యమాల జత యొనర్చె. 159

వ. దీనికంతకును దంటుసుబ్బావధాని కారకుం డని యెఱుంగునది.

తే. గీ. "లంఘనముల మనుగుడుపు"లాగున నిటు
హెచ్చుసన్మానముల ఘటియింప నేమి
యయ్యె నారోగ్య మత్యంత మననుకూల
మగుటచే నెమ్మదికి లేదు హాయి సుంత............. 161

తే. గీ. తెలుఁగుపీఠసన్మానంబు నెలమిఁ గాంచి
మదరిపురగతపండితమండలి యిడు
నట్టి సన్మానపత్రంబు నందికొనిన
యంతఁ గేతువులో గురుఁ డపగు దెంచె. 162

బహుధాన్యసం॥ మార్గశీర్షశు౹౹మొదలు పుష్యబ౹౹౦వఱకును కేత్వంతరములో

—• గు రు వి ద శ •—

తే. గీ. అట్లు గురుఁడు ప్రవేశించినట్టినాఁడె
చెన్నపురినుండి నెల్లూరు చేరు టొదవె
రైలులోన నారోగ్యంబు చాలఁ జెడియుఁ
గలిగెఁ ద్వరలోన స్వాస్థ్యసంకలన మెలమి. 163

క. అల కామకోటిపీఠ
స్థులు స్వాములు దర్శనంబు తొలిజన్మమునం
దలి సుకృతమునకు నియ్యది
ఫలమోఃయను నట్టు లచటఁ బడయన్ గలిగెన్. 164

తే. గీ. ఏకలవ్యశిష్యుండుఁ గవీశ్వరుండుఁ
బరమగురుభక్తుఁ డైన దీపాలపిచ్చ
యాహ్వయునియింటఁ గొన్నినా ళ్ళధివసించి
యుండుకతన నారోగ్యము నొందు టొదవె. 165

క. ఆయుర్వేదాచార్యుఁడు
శ్రీయుతపురుగిండ్లకులనృసింహకవి కడున్
ప్రాయ మొనర్చెను గుర్జుకు
నాయుష్కర మైన మందు లర్పించి తగన్. 166

తే. గీ. ఇట్లు నెల్లూర నారోగ్యమెలమిఁ దనదు
కుట్టుతో నంది శ్రీ"కామకోటి"యిడిన
రాంకవము లంది బెజవాడ రాఁగ నచటఁ
బౌరు లొసఁగిరి సన్మానపత్రి మెలమి. 167

తే. గీ. అచట ఘంటసాలాన్వయుఁ డలఘుమతియు
సూ_లుశిష్యుండు సేవింపఁ గొన్నినాళ్ళు
నిలిచి సభలను మఱియుఁ గొన్నిటిని జేసి
స్వపురమున కేగె వేంకటేశ్వరుఁడు పిదప. 168

వ. పిమ్మట శ్రీమతిపెద్దకూఁతుకంటివైద్యమ్మునకు రాజమహేంద్రవరము నందలిఆస్పత్రికడ కేగుటయు నయ్యెడ శ్రీపాదగురువులుగూడ నేత్ర వైద్యమునకే వచ్చుకతనఁ దలఁచు కాకతాళీయముగ మాయిరువురకు సమావేశం బనివార్యం బయ్యె. 169

క. తప్పనిసరియై నాతో
నప్పరముఁడు మాటలాడు నంతియె హృదయం
బొప్పుటమాత్రము లే దని
యప్పటిధోరణి వచించు నయ్యెయెడలన్. 170

క. వాదమున నోడుకతమున
నాదెస నొజ్జకు మనంబునం బగ మిగులం
బాదుకొనుఁ గాక వృథగా
నే దూఱుం గాక మ్రొక్కుటే పని నాకున్. 171

వ. అట్లు నాకర్తవ్యంబు నే నెఱవేర్చికొని నేమం బడిగిన నెట్లో కటువుగ సమాధానంబు చెప్పుటఁ దత్రత్యులు పలువు రెఱింగి నట్టిద యగుట స్ఫురించి విడుచుచుంటి. 172

క. ననుఁ బట్టిన తప్పులకే
ననుమతిఁ జూపితినయేని ఆర్యున కెంతే
నిని నాపై ననురాగము
జనియించెడి నట్టిపనికిఁ జాలన యేనున్. 173

తే. గీ. తప్పు గానిది తప్పని యొప్పికొందుఁ
గాక బాల్యంపుగురు వను కారణమున

నొక్క నాతోనె యీ లోక మున్న దొక్కొ?
తక్కు కవివరు లెదిరింప దలఁపరొక్కొ? 174

క. వ్యాకరణ ముభయభాషల
నే కొంతేనియు నెఱింగి యెడఁద ససూయన్
బోకడఁచి లక్ష్యములు గని
యే కావ్యము వ్యాకరించు టేరికి నొప్పున్. 175

ఆ. వె. అట్లు గాక యరక యది గాద యిది గాద
యనుచు నేదొ మదిని నాగ్రహమ్ము
రగుల వాదమునకు దిగినచో నేరికి
నపజయంబు తప్ప దని వచింతు. 176

బహుధాన్యసం॥పుష్య బ౧౦ మొదలు ఫాల్గుణ బ౧౩ వఱకునుకేత్వంతరములో

—• శనివిదశ •—

తే. గీ. ఆవల జవాదికులుఁడు లక్ష్మయ్య తనదు
కొమరుపెండిలి యనుచు నాకు శుభలేఖ
నిచ్చి తన్నుఁ గృతీశ్వరు నెవఁడు చేసె
నతని నరసింహకవి నంపె నాదరమున. 177

తే. గీ. ఈ జవాదిలక్ష్మయ గూర్చి యించుకంత
యిచట వ్రాసెద భూస్వామి యాతఁ డంతె
కాక ధననాయకుండును గడు నుదార
వర్తనుఁడుఁ బేరు మ్రోఁగిన వర్తకుండు. 178

తే. గీ. బ్రాహ్మణద్వేష మెల్లెడఁ బ్రబలియున్న
కాలమునఁ గూడ నితనికిఁ జాల విప్ర
భక్తి గల దని వింటిఁ దద్భక్తిఁ జూడఁ
గంటి నీతని మెచ్చకయుంట తగునె? 179

తే. గీ. ఇచ్చె శ్రీపాదగురువరుఁ డితని కొండు
బిరుదు నైత మే నేదియు బిరుదు నీయ

లేదు గాని యిచ్చినగురునాదరమున
కేను( గూడ( గొండొక సాయ మిత్తు నెలమి. 180

(గురువుగా రిచ్చినబిరుదు - కవికులాలంకారుఁడు అనునది)

చ. ఎలమి జవాదిలక్ష్మయకు నెంతయు మిత్రుఁడు కావ్యకర్త ని
ర్మలహృదయుండు *లింగకవి మన్ననమై( దనయూరికి న్ననున్
బిలిచి బహూకరించె నట( బెక్కురు నన్ గనవచ్చి రల్లవా
రల నలరించితిన్ హృదయరంజక మైన వచఃప్రసంగతిన్. 181

తే. గీ. గోఁచి వెట్టినదాది గన్గొందు నెంద
ఱెందఱినో సంపదాఢ్యుల నెలమి నేఁడు
గాంచినజవాదిలక్ష్మయ మంచితనము
మృగ్య మని చెప్పుటకు సంశయింప నేను. 182

తే. గీ. వడుగు చేయించె ననెడి విప్రప్రవరులు
గృహము గట్టించె ననియెడి రిక్తులు మఱి
పెండ్లికి సహాయపడె నను బీదలును జ
వాదిలక్ష్మయ కీరితిగాదె లవుర !............... 183

క. వృద్ధుఁడనై దీర్ఘామయ
బద్ధుఁడనై యుండి కూడ( బయనంబై నే
నద్దీరుకొామరుపెండ్లికి
శ్రద్ధమెయిం బోయి కంటి సన్మానంబున్. 184

క. అడుగులకు మడుగులొత్తుచు(
గడు భక్తిశ్రద్ధ లలరఁగా లక్ష్మయ నా
యెడ( జూపినపేర్మికి నా
యెడఁదన్ సంతసముచెంది యిందు నొడివితిన్. 185

ఆ. వె. అంత నేగుదెంచె ననఘుండు ముదిగొండ
కులుఁడు నాగవీరకోవిదుండు

---

*ఈలింగకవి పూర్తిపేరు బుచ్చిలింగప్ప. ఊరిపేరు. ఒడలి.

స్వవిరచితముఁ బుణ్యసంపాదకము నగు
శివపురాణము వినిచెడిపప్రిస_క్తి. 186

తే. గీ. సేలువు లొసంగి సత్కృతిఁజేసి తనదు
గ్రంధమును గొంత వినిపించి కలుగఁ జేసె
నాగవీరేశ్వరుం డమంద మగు ముదము
శిష్యుఁ డీతండు నాకు విశిష్టగుణుఁడు... ....... 187

బహుధాన్య సం॥ ఫాల్గున బ ౧౩ మొదలు ప్రమాది సం॥ వైశాఖ బ ౧౧ వఱకును
శనిలో కేతువులో

——• బు ధ వి ద శ •——

షరా :- విదశలులిఖించునపుడు గడియలును విఘడియలును జేర్చకపోవుట
చేత కొంచెము హెచ్చుతగ్గు లుండును. ఈషద్వైషమ్య మవివక్షి
తముగా సరిపెట్టుకోవలసి యుండు నని తెలివిడి.

తే. గీ. బుధుఁడు కొండొక ధనలాభమును ఘటించి
దేహసౌఖ్యము పూర్వగతిగనె యుంచె
గురువుగా రప్పు డప్పుడు ''కోర్టు''భీతి
గలుగఁజేయుకతమ్మున నులుకవలసె. 188

వ. ఈ భీతికి ముఖ్యహేతువు స్వతంత్రముగా నింట నుండుటకుఁ దప్పఁ
గొన్ని నిమిషములేని పరతంత్రిములో నుండు దేహారోగ్యము
లేమియే యని యెఱుఁగ నగు. 189

క. "జరిమానాయో ? వేతో ?
త్వరగానే యొదవునేని తహతహపడ నేఁ
దిరుగవలెఁ గాళ లరుఁగఁగఁ
బొరిఁబొరి నని నాకు భీతి పుట్టెడి మదిలో. 190

షరా:- శనిభీతిని దైన్యమును గలిగించు నని శాస్త్రమునఁ గలదు.
గురువుగారు కోర్టులవెంబడి త్రిప్పుదురు కాఁబోలు నెట్లురా ?
భగవంతుఁడా ? అని నేను చాల భయపడితి నని యెఱుఁగఁ
దగు.

క. వేయేఁడులు వ్యాఖ్యేమునకు
నాయువు మనుజునకు నందు నగు దశమాంశం
బీ యంశ మ్మెఱిఁగిన యే
ధీయుక్తుఁడు కోర్టు కేగు ? దీనుం డగుచున్. 191

క. శ్రీపాదగురువుగా రాక
రీపట్లన్ గనరు గాక యేవము, మఱి యిం
కే పండితకవి దీనికి
నై పాండితి వమ్మొనర్చు నలఘులు నగరే ? 192

ఉ. పాండితి యన్నఁ బాండితిని బాండితిచేత జయించు టొప్పు నే
పండితు లెన్నఁడుం గోననివక్రిపథమ్మునఁ బోవ నేల ? ఆ
ఖండలపట్టణమ్ము నెడఁ గాలిడినప్పుడు తన్నియంత యీ
ఖండనచండిమంబును సెబా సని మెచ్చఁ డెఱింగి కా దనున్. 193

ఉ. డిండిమభట్టుతోఁ నొకట డీకొనె నైషధకర్త కోర్టులో
గం డడఁగించియే అతని కాంస్యపుఢక్కఁ బగిల్చె నేమి ? ఆ
గండరగండవిన్ దలఁపఁగా దగు నంతియ కాని యెందు కీ
పండితు లెల్ల నొచ్చికొనువక్రిపథమ్మునఁ గాలు వెట్టుటల్. 494

శా. యాతాయాతపరిశ్రమమ్మునకె కా కయ్యేయొ్ ? యే కోర్టు తాఁ
గైతం గల్గినవాదభేదములు వక్కాణించి తీర్పిచ్చు, నా
యీ తంటాలకు నగ్గ మౌ కవులఁ గోర్టే రీతి హర్షించునో ?
చేత మ్మించుక చొన్పి చూడ నదియే చెప్పున్ యథార్థాంశమున్. 195

ఉ. దేవుఁడు మెచ్చఁగావలె సుదీర్ఘయశస్కులు మెచ్చఁగావలెన్
రావలె నప్డు కీర్తి కవిరాజులకేనియు ఱేండ్లకేనియున్;
గోవిదు లెల్ల నవ్వికొనఁ గోర్టున వాదములాడు సూరులన్
భావుక మైన కీర్తిసతి "పక్కన" నవ్వి యనాదరించెడిన్. 196

చ. ధన మొకకొంత వమ్మగుట, తదజ్ఞులఁ గొందఱఁ గూడఁ గోర్టువెం
టను శ్రమపెట్టి త్రిప్పుట, కటా ? యని ప్రాజ్ఞులు నొచ్చికొంట, వి

ద్యాను మతియొక్కఁ పుంతఁ జనునట్లొనరించుట, పాండితీమహా
ఘనతకుఁ గందు గూర్చుటకె కాక మ ఱెందుల కిట్టి వ్యాజముల్. 197

మ. మొదల న్నన్నను నా కవిత్వమును దప్పుల్ వట్టి దూషించి "త
ప్పిదముల్ గా వవి తత్త్వ మిట్టి దని నే విజ్ఞోక్తులన్ జూప వా
క్కఁదనం బా పయి వీలు గామి నెటులో "కర్ణాటపుంబోరుగాఁ,
దుదకుం దానిని మార్చి గెల్పు గొనుచో దోషజ్ఞు లీక్షింపరే ? 198

షరా:- కర్ణాటపుంబోరు = కర్ణాటకలహము. (గిల్లికజ్జా) దీనినిగూర్చి
మృచ్ఛకటిక ప్రకరణము చూ శ నగు.

శా. *"ఛందోవ్యాకరణాదివి" త్తని కదా ? శాసించినా ర్పెద్ద లీ
సందర్భంబున లక్షణంబును డిటో; ఛంధఃపరిజ్ఞా నమా
త్రం దృప్తింగనునట్టి కేవలకవుల్ తన్మాత్రిలో నుండుచే
విం దౌఁగా కొరు దూఱి కోర్టు కనుగన్ విజ్ఞుల్ సభాజింతురే ? 199

శా. అందున్ వ్యాకరణంబు ముఖ్య మని కాదా ? దానిపై తెత్తె ము
న్మ్మందే శాసకుఁ డన్యశాస్త్రములయందో ? లేశమాత్రిపరిస
క్తిం దృప్తిం గనవచ్చు నంచు నదియే తెల్పున్ బ్రయోగమ్ములో ?
వందల్ వేలు నెఱుంగఁగావలయుఁ గావ్యజ్ఞాత నానాటికిన్. 200

మ. కవి లోకమ్మునకై జనించుఁ గవిరాట్కృష్టంబు సర్వమ్ము లో
క విభూత్యర్థమ లోకులన్న మతి యే "కశ్చన్న" లో కొరు మం
చివివేకుల్ గద ? వారు కావనినచో సి గ్గందుచే తప్ప వే
ఱెవియుం ద్రోవలులేవు కీర్తిఁ గొనఁగా నీ మాట సిద్ధాంత మా. 201

ఉ. పుట్టెఁడు తైల మంగమునఁ బూసుక పొర్లిన నెవ్వఁ డెంత డాఁ
బెట్టుక పుట్టు నంతె కొనుఁ బే; రధికానను ఖోక్త కాఁడు తా
కట్టువిభూషణం బిడెడి కాంతికి వ్యాజపుఁగీర్తికిన్ భువిన్
బుట్టదు శాశ్వతత్వ, మిది పూర్తిగ విజ్ఞు లెఱింగినట్టిదే. 202

---

శ్లో. *"సత్కులీన శ్శుచి ర్దక్ష చ్ఛందోవ్యాకరణాదివిత్"
(అహోబల పండితీయము)

క. "కోరుటు" కవులకుఁ "బేచీ
కోరు" లనెడిపేరు దెచ్చుఁ గోవిదులపుర
స్కారము కవులకు సాక్షా
త్కారులనెడి మంచిపేరు గలుగఁ జేయున్. 203

తే. గీ. పెద్దయుద్యోగి కవి వృద్ధు విజ్ఞతముఁడు
నగు జయంతిరామయ్య మెప్పందికొనియె
నా "జయంతి" పొత్తము కోర్టున విజయమ్ముఁ
గాంచుఁ గాని యోపిక లేమిఁ గొంతు భీతి........ 204

క. అం దొక్క పద్య మొక్కొక
వం దయినను జేయనేర్చు వరహా; లెన్నో
సందర్భమ్ములు మృదువుగ
నందిమిడెన్ ఖండనమున కది యెటు లోఁగుఁ జా. 205

తే. గీ. అరసి "తాళ్ళూరి విజయరామయ్య" యనెడి
న్యాయవాది "జయంతి"కిఁ బ్రాణమిచ్చు
నక్కతమ్మున మఱి కొంత యాగ్రహమ్ము
గలిగి కోర్టుకుఁ జనుటట్టికస్తి గూర్చె........ 206

క. అధికారియొద్దకున్ జను
నధికారం బొడల లేమి నాత్మభయం బ
త్యధికముగఁ గలప వెంకన
బుధసమ్మతమౌ జయంతి పొత్తము గాల్పన్. 207

వ. తలంచెఁ గాని పేరందినన్యాయవాదిమిత్రులు గొందఱు వారించుటం జేసి యట్టిపని జరుగ దయ్యె, ననంతరము కేత్వంతరము ముగిసి శనిలో శుక్రాంతరము వచ్చె................ 208

ప్రమాది సం॥ వైశాఖ బ ౧౧ మొదలు చిత్రభాను సం॥ ఆషాఢ బ౧౧ వఱకును శనిలో శుక్రాంతరము అందు శుక్రాంతరములో

—• శుక్రివిదశ •—

ప్రమాది సం॥ వైశాఖ బ ౧౧ మొదలు మార్గశీర్ష శుద్ధ ౬ వఱకును

తే. గీ. అంతట బ్రతాపకృష్ణమూర్త్యాఖ్యశిష్యుఁ
డరుగుదెంచె "చీరాల" యాహ్వాన మొకటి
పట్టికొని దాని నంపినవాఁడుఁ "దప్ప
జోస్యుల" కులుండు కృష్ణాఖ్యసూరివరుఁడు. 209

వ. ఆయన నావలన నేదేని కావ్యము కృతిగొనునిచ్ఛవొడమి దత్తపుత్రు నుపనయనవ్యాజమున నాహ్వానించె, నాకు నేగుశక్తి లేమింజేసి యేగ లేదు గాని పిమ్మట నయ్యాలఘుండును మద్గ్రామంబునకు వచ్చి కోరుటంజేసి అప్పటికి నా యొద్ద సిద్ధముగా నున్న శ్రీ సౌభాగ్య కామేశ్వరీస్తవము పూర్వార్థము కృతిగా నిచ్చి కృతార్థు నొనర్చితి నది యట్లుండె, నాహ్వానము తెచ్చిన శిష్యుఁడు ప్రతాపకృష్ణమూర్తి శాస్త్రి రాజమహేంద్రవరమున శ్రీపాదగురువుల సందర్శింప నేగు టయు వారు నన్నుఁ దిట్టరానితిట్లు తిట్టి తిట్టి యతనిచే జయంతి పొత్తముపైని "కేసు" దెత్తు నని కబురంపిరి. అంత మచ్ఛిష్యుండు.

తే. గీ. ఎవరు మెత్తురు మీచైది యేదొ ? కేసు
దెచ్చి విజయంబు గొనినను ధీరవరులు
సంతసింపరు మేల్మి "జయంతి" మీఁద
ఖండనము వ్రాయుఁ డది యశస్కరము తమకు. 211

క. అనరానిదూఱులను ముం
దని యొప్పులు తప్పు లనియు నాగ్రహమున మీ
రనిమిత్తమ్ముగ మానస
మునకున్ వెత గూర్చికొనుటిపుడు హిత మగునే ? 212

క. మీ రిట్లు దూఱుదురు నో
రారన్ మద్గురులు మిము రవంతయునేనిన్
దూఱరు మీ శంకలు తూ
ర్పాఱంబట్టుటదికూడ నఘ మంద్రుచుఁడీ. 213

తే. గీ. అనుచు శిష్యుఁడు కృష్ణాఖ్యుఁ డయ్యవారి
కెంత బోధించినను విన కెడఁద నాగ్రి
హము రగులఁగఁ గోర్టున కరుగువాఁడ
గేసులో సర్వమును దేలుఁ గీడుమేళ్ళు. 214

వ. అని యంతం దనివి చనక మఱికొందఱు గూడఁ దమ యశంబు
భంగించువారలు గల రని యిట్లేకరువెట్టి రఁట. 215

సీ. ముట్నూరికులుఁడు సౌమ్యుఁడె యయ్యు నాయెడ
నీసు మిక్కిలి గలాఁ డేకతంబొ ?
కాలూరికులుఁడు వేంకట "కైతగాని" శి
ష్యుండు నా యెడ విపక్షుండు మిగుల
పింగళికులుఁడు నా పేరువిన్నంతనే
లక్ష్మీకాంతుండు దుర్గలితుఁ డగును
వారు వీరననేల ? బందరుప్రాంతానఁ
గలవార లెల్ల వెంకననుబట్టి

తే. గీ. నాకు శతృవు లగుచు "గృష్ణా" ముఖమున
నేదొ ప్రకటించుచుంద్రు నే నెఱిఁగి యెఱిఁగి
యూరకుందునె; వెంకన నొడిసిపట్టి
కేసు వెట్టి జయించెద వాసి యణఁతు. 216

షరా:- కృష్ణాముఖమున = కృష్ణాపత్రికాద్వారమున, ఆ యా పత్రిక
గురువుగారి బిరుదులను కనకాభిషేకమును ఖండించినది యని
తెలియునది.

వ. ఇట్లు గురువుగారు నిందించుటయు.

క. ఆ యా ధోరణి సర్వ
మ్మాయన మది మదియుఁ గాని యటు లున్నట్టుల్
పాయక బోధించెడి నని
యా యలఘుఁడు నాకుఁ దెల్పె నక్కజపడుచున్. 218

తే. గీ. నన్ను నా యింటిపేరిని నాదు శాఖఁ
బట్టికొని వన్నెచిన్నెలు వెట్టి యొజ్జ
వ్యాకరించెడిధోరణి నాలకించి
యెందఱో ఖేదమును గాంచు చుందు రెందు. 219

తే. గీ. నా "జయంతి"ని మెచ్చిన నన్ను మెచ్చి
కొనిన నెక్కడలేనట్టికోపభరము
వొడమ శ్రీపాదగురునకుఁ బూర్వజన్మ
సుకృతమో ? దుష్కృతమ్మొ దీనికిఁగతంబు. 220

క. తుది యశ్లీలపుఁదిట్టనఁ
బదియాఱవకృతిని దెల్పెఁ బలుమఱు నసన
య్యది తిట్టు నంట ? యది కో
విదు లెఱిఁగిన దగుట నొడువ వెఱచెద నింకన్. 221

క. ఆయన తిట్టినకొలఁదిని
నాయు వధిక మగుచునుండె నా కట్లగుటన్
శ్రేయస్కరములు తిట్లని
దోయిలి యే నొగ్గుచుండుదున్ బొరిఁబొరిగన్. 222

తే. గీ. కాటికిం గాళ్ళు సాచెడికాల మగుటఁ
గోర్టులకుఁ ద్రిప్పు నేమొకో ? గురుఁ డటంచు
భయపడుదు నంతియే కాని బండతిట్టు
లెన్నితిట్టినఁ బడియెద నేను వగవ. 223

ఆ. వె. వెంకిగాఁ డటంచు వెంకం డటంచును
వెనుకఁ డంచు వెఱ్ఱివెంకటాయ
యనుచు నాదు పేరు వ్యాకరించెడియొజ్జ
కే నొనర్తు నెన్నియేని నతులు. 224

వ. నాయందున్నతప్పు నే నెఱుఁగుదు నయ్యది యాయన యితరులం గూర్చి గాని నన్నుఁగూర్చి గాని తెలిసీతెలియక పట్టినతప్పులను నే నంగీకరింపకుండుటయే.

తే. గీ. భారతము కృతినిచ్చుచుఁ బాలకొల్లు
నన్ను ర మ్మనె నేఁగితి నాఁటిసభకు
నేనె యధ్యక్షుఁడను దుది దానిఫలిత
మిట్టిదై విషమించె నే నేమి సేతు. 226

క. ఆసభకధ్యక్షుఁడనై
భాసిలుచున్నట్టినను సభాస్తారులు "మీ
రే సంస్థానము లరిగితి
రా సంస్థానములు దెల్పుఁ డని యడుగుటయున్. 227

వ. గురువుగారిభారతమునం వలివిశేషములు ప్రకృతంబగుకతన నుగ్గడించిన యనంతరంబున గద్వాలసంస్థానముంగూర్చి కొండొక యుపన్యసించితి. నయ్యది యపరికృతం బగుటంజేసి తప్పైనను నా కనివార్యం బయ్యె. 228

తే. గీ. అదియె యీకలహమ్మున కంకురార్ప
ణముగఁ బరిణామమును బొంది నాఁడునాఁటి
కెదిగి నన్నుఁ దిట్లు తినిపించు నెవరు గోరి
రేని యితరంబు సెప్పుటయే దోసంగు. 229

తే. గీ. ఎంత సేపు మాటాడిన నేను "కృష్ణ
భారతంబునుగూర్చిన పలుకు పలుక
వలయుఁ గాని తదన్యంబు పలుకరాదు
కొఱవితోడను దలఁ గోఁకికొంటి నేను. 230

తే. గీ. అడుగుదురుగాక సభ్యులా యడుగువార
లేరొ? బ్రహ్మాండనాయకులే యగుదురు
గాక నేఁ జెప్ప ననవలెఁ గాని గద్ద
వాలపద్యముల్ చదివి నేఁ బాపి నైతి. 231

ఉ. అంతకు మున్ను నా కవనమత్యమలం బతిపేశలంబు ది
గ్దంతిని నేను నాఁటఁగొలె దద్దమ నైతిని లోకు లాత్మలో

మంతనమందు నీ నుడులు మన్నన సేతురొ?యీసడింతురో?
సుంత వితర్కముల్ సలిపి చూచికొనన్వలదొక్కొ?యక్కటా ?

వ. అది యటులుండె నియ్యది వినుఁడు.

క. నన్నయ కృతి యిడు నృపమణి
కన్నను గురుని కృతిపతులె ఘను లనియు రసా
భ్యున్నతము గురునికవనమె
నన్నయకృతికన్న ననఁగ నాతర మగునే? 234

వ. నేను జేసినయపరాధంబులు సంగ్రహించి నొడివితి.నాయెడ నీసుతో
నొజ్జ విమర్శమిషంబున నన్నెంత దూఱినను నేను మిన్నకుండినట్లే
వ్యక్తిగతంబుగా నేమియు ననకున్నను గ్రాంధిక మైన శంకలను కూడ
నుపేక్షించినచో నా కిన్ని తిట్లు తగులకుండెడి వని యిటీవల నాకుఁ
దోఁచినది గాని మొదటఁ దోఁపమింజేసి సమాధానమ్ము లిచ్చితి.నదియు
నొక యపరాధంబ. 235

క. గాంగేయుఁడు శ్రీకృష్ణుని
యంగము కడు నొచ్చునట్టు లంపగములచే
తంగొట్టెఁ జక్రి మప్పుడు
కెంగేలం గొనియె దానఁ గీరితి సురిఁగెన్. 236

తే. గీ. సారధిగనున్న శ్రీకృష్ణు శాంతనవుఁడు
కొట్టి నొప్పించుటకు నొప్పికొనెడినాఁడి
అపధమునఁ గాలు వెట్టినయట్టికృష్ణు
శౌర్యమునకుమాత్రము కడు జాలిఁ జెందు. 237

తే. గీ. చక్రి మొక్కటి తేరగా శౌరి కుండె
దానిచే భీష్ము నిర్జింపఁ దలఁచెఁ గాని
అఖిలభూచక్రి మొక్కపై యతనిఁ బొగడి
తన్నుఁ దెగడుట కృష్ణుండు తలఁపఁబోఁడు. 238

క. ఎంతో యోజింపన్వలె
నెంతొ తిరుగవేయువలయు నెందును శూరుల్
సంతోసమె ? "యిల్లలికిన
యంతన్ బండు వగు" ఔందు నయినం గలదే. 239

తే. గీ. *కోడలా? భాగ్యవంతుఁడౌ కొడుకుఁ గనుము
శూరుఁ గనకుము కనకుము సూరినేని
అనెఁ గదా కుంతియేల యిట్లనఁగవలయు
నాపెకొడుకులకష్ట మిట్లనఁగఁ జేపె. 240

క. "అసిధారావ్రితముగ జీ
వనమాప్తిం బొందవలయుఁ బండితశూరుల్
కసరవలదొరుల.నొరుచేఁ
గసరులు పడవలవ దెంత కష్ట మ్మకటా ? 241

తే. గీ. తీరికూర్చుండి యొరులను దిట్టు చేల
వాదమున నోటమిం జెంది పండితులకుఁ
గాని కోర్టున జయ మందఁగాఁ దలంచు
చేల?యిది యేరు మెచ్చెడియెమ్మొ లొక్కొ?........ 242

క. గురుశిష్యుల కిరువురకుం
బరిపూర్ణాయు విడుఁ గాక భగవతి కామే
శ్వరి యటు లొసఁగిన సార్థక
పఱిచెద మద్దానిఁ గోర్టు వట్టి తిరుగుచున్. 243

మ. అవుఁగా?వింధ్యమ!నిన్నుఁ గూర్చిన పురాణాలాపముల్ సర్వమున్
గవిరాట్కల్పితముల్,యథార్థములుగాఁ గన్పట్ట వన్గొందు,వి

---

* శ్లో. భాగ్యవంతం ప్రసూయేమా శూరం - మా చపండితం శూరా శ్చ కృతవిద్యాశ్చమమ పుత్రావనంగతాః॥ ఇట్లు కుంతీదేవి కోడలి నాశీర్వదించినట్లు పండితులు చెప్పుదు రు.

ష్టు వివేకం బొదవెన్ యథార్థములగు న్ముమ్మాటికిన్ నమ్మితిన్
గవులం దెవ్వరొ గాని దబ్బఱలు వక్కాణింప రం చెంచెదన్. 244

తే. గీ. ఎన్నివిధములఁ జూచిన నేము కవిత
కవమతి ఘటింప జనియించి నట్టి తోఁచు
నాదు బుద్ధికి కోర్టుకన్నను జగంబె
కీరితికి నపకీర్తికి గీటురాయి. 245

ప్రమాదిసం॥మార్గశీర్షశు౬మొదలు మాఘశు౩వఱకునుశనిలోశుక్రునిలో

రవివిదశ •—

క. పింగళిలక్ష్మీకాంతుఁ డ
నంగాఁ బేర్గనినవాఁడు నాకున్ శిష్యుం
డుం గవి వాని దుహిత కో
తంగాఁ గళ్యాణ మయ్యె రవివిదశతతిన్.......... 246

వ. ఆ యీ వివాహమున కాహూతుఁడ నై విశాఖపట్టణమున కరిగితి.

ఆ. వె. అవలఁ గాకినాఁడ కాంధ్రాభ్యుదయసభ
కరుగు టబ్బె నచట నాంధ్రభార
తము రచించినట్టి ధన్యుండు నన్నయ్య
భట్టుఁగూర్చి యితఁ డుపన్యసించె. 248

ఉ. దేవులపల్లితమ్మకవిధీవరుఁశిష్యుఁడు కృష్ణశాస్త్రి వి
ద్యావినయాంకుఁ డయ్యలఘునంబిక లోనగు తత్కుటుంబ మా
త్మావసథమ్మునంద నను నత్యధికమ్ముగ గౌరవించి సం
భావితుఁ జేసి రప్పురినె పట్టిని శ్రీమతిఁ గూడఁ జూచితిన్. 249

ప్రమాది సం॥ మాఘ శు ౩ మొదలు విక్రమ సం॥ వైశాఖ శు ౬ వఱకును
శనిలో శుక్రునిలో

—• చంద్రవిదశ •—

తే. గీ. చంద్రుఁ డేతెంచుచే మొదల్ సాఁగఁదొడఁగె
గురువుగారియసూయయుఁ గొంత దక్కి

దానివిక్రృతులయందు నిద్దాన నొకటి
మచ్చు జూపెద నది యసామాన్య మగుట. 250

తే. గీ. అల్ల యోలేటిశిష్యునియంతరించు
సంగతినిగూర్చి యాత్మవిచారములను
దెల్పియున్నారు కొంద ఱాతెల్పువారి
సరణి న్యాయ్యేతరము గాదు సహజ మగుట. 251

క. పనిలేనిపాటగా గురుఁ
డనృతపుమార్గమ్ము ద్రొక్కి యాతనికిని నా
కును శైష్యోపాధ్యాయిక
తునిమి యెటో వ్రాసె నెంత ద్రోహ మ్మకటా ?.... 252

షరా:- గురువుగారువ్రాసిన ద్రోహపువ్రాఁతకు "ఆంధ్రియను మాసపత్రిక చూడనగు.

క. వేంకటరామయ్య యెవో
వంకరమార్గములు ద్రొక్కి వాదుసలుపుఁ గా
కంకం బిట్టిది యతఁడును
బొంకి తనకుఁ గూర్చికొనెనె ? బుధు లెఱుఁగరొకో ? 253

క. జంకి యెటో మూఁడేఁడులు
బొంకె న్మూఁడునెల లనుచుఁ బూ_ర్తిగ నొజ్జల్
బొంకిరి యొకయక్కరమును
వెంకటకవి దెఱుఁగఁ డనుచు విజ్ఞులు నవ్వన్. 254

తే. గీ. ఎవ్వ రెఱుఁగనిశుశ్రూష యిది జగంబు
సర్వ మెఱిఁగినదే గురుస్వాంత మెఱుఁగ
కట్లు వ్రాసె నటం చెట్లొ ఆత్మఁ దృప్తి
పఱచుకొంద మన్నను సరిపడద యకట ?........ 255

క. "కోకిలకాకం" బనుచు "న
వాకు చవాకులును" వదరి వ్రాసినపొ_త్తం

బేకడఁ జదివినఁ దేలెడి
నీకత, అది గూడఁ జదువ రేమొకొ? యొజ్జల్. 256

తే. గీ. చదివియేయున్న నింతటి సాహసంపు
వ్రాఁత కాడదు లేఖిని, వారు చదివి
వ్రాసియున్నను నేఁ జదువకయె వ్రాసి
రంచుఁ జెప్పెద దోసఁ గుండ దట్టులేని. 257

క. ఏవిధమున వంచింపఁగఁ
ద్రోవ కనంబడక మాటుత్రోవల నెట్లో
పోవున్ గురు నల లేఖిని
కోవిదు లెల్లరను నవ్వికొనకుందురొకో? 258

తే. గీ. అల్లగాధిజు "శుశ్రూష నవలఁ ద్రోసి
రామచరితమ్ము నెవ్వరు వ్రాయువారొ?
వారె "కింకవిగజసింహు" పేరు డాఁచి
పరిష్కృతరామచరిత్రంబు వ్రాయఁ గలరు. 259

తే. గీ. ఏకలవ్యశిష్యుఁడు గూడ నితఁడు గాఁ డ
టంచుఁ గసి దీర్చికొన్న మా యయ్యవారి
వ్రాఁత లోకులు మన్నింపవలయు ననుచు
సారెసారెఁ బ్రార్థింతు నంజలి ఘటించి. 260

క. భారతము తెలుం గొనరుచు
వారే యే స్వల్పఫలమొ వాంఛించుచుఁ గ
క్కూరితి వ్రాఁతలు వ్రాసినఁ
బే రితరులు గోలుపోయి పెంపఱుదురొకో? 261

ఉ. సీతయు లేదు రావణునిచెల్లెలు లేదల రాముఁ డబ్ధిలో
సేతువు గట్ట లేదతనిచే దివిజారులు చావ లేదు సా
కేతపురమ్ము లేదచటఁ గేకయపుత్రియు లేదు సర్వము
న్నూతనసృష్టియే యన జనుల్ విని నవ్వుదు రే మొగమ్మునన్. 262

క. వెంకనప్రతిష్ఠ కోలెటి
వేంకటరాముండె హేతువే ? అట్లగుచో
బొంకి కృతకృత్యతను గను
టంకెడిఁ గల రెండతేని యన్యులు శిష్యుల్. 263

తే. గీ. తమకు వెంకన దక్కలేఁడు మఱి శిష్యుఁ
డెల్లెడల వెంకనకుఁ గల దెచ్చుయోగ
మనుభవించుచునున్నశిష్యవర్గజంబు
బొంకి యొక్కని వెలిఁ జేయఁ బోయె నేమి ? 264

క. "ఒకలింగఁడు వోయిన న
ష్టికదా?యని రాయి గొఱుకు శ్రీవైష్ణవునిఁ=
సుకవులు స్మరించి నవ్వుదు
రకటా?గురుచైది యిప్పు డట్టిది యగుటన్......... 265

క. నాకఁట !గర్వం బఁట?నే
నే కవులకు గురుఁడ ననుచు,నెవఁడు కవిత్వం
బేకడఁ జెప్పిన వానిని
నాకడ శిష్యుఁ డనునంట?నానాల్క బళీ! 266

క. ఏకాలపుకర్మముననొ
యీకాలపుఁగొందఱు గురుఁ డీతం డనుచున్
వాకొందురు నను,నాకటు
వాకోకుండంగఁ జేయ వశ మెట్టు లగున్.................267

తే. గీ. ఎంచి శిష్యుం డటంచు ఘోషించి నేను
గీరతమ్ము సత్యేతరపూరితమ్ము
గాను వ్రాసితి నఁట !అటు లేని నాకు
గలుగుఁ గా కందులకుఁ దగుఫలము పిదప. 268

సీ. చెళ్ళపిళ్ళకులం బ దెల్ల బిచ్చ మ్మెత్తె
నని వ్రాసె నా కాగ్రహమ్ము రాదు

కవనం బెటో గిల్కు౯ గాని చప్పగ నుండు
నని దూఱె నా కాగ్రిహంబురాదు
నొప్పులే తప్పులం చొక పెద్దజాబితా
నల్లెను నా కాగ్రిహంబు రాదు
ఛాత్రి వేంకటరామశాస్త్రి ఛాత్రిఁడు గాఁ డ
టని బొంకె నా కాగ్రిహంబు రాదు

తే. గీ. రాదనినమాట కెట్టి యర్థం బటన్న
వచ్చినను దాని నే వెలిబుచ్చ ననియె
అట్లు వెలిబుచ్చునెడ నిట్టు లడఁగి మడఁగి
యుండునే నాదుశైలి పేర్కొండు బుధులు......... 269

ఉ. అల్లుదు రెందఱో కవన మల్లుదు నే నొక మాదిరి యల్లికన్
"గొల్లలు గొడ్లకాపరులు కొండొక మెత్తు రటంచు నొజ్జగా
రుల్లసమాడి రందులకు నొప్పితిఁ "గి" మ్మన,కప్పు దేనియున్
జల్లఁదనంబు గైకొనను శాంకరి? యాయన యీ స దెట్టిదో? 270

క. పడలే కపవాదలు నీ
యడుగుందమ్ములకు మ్రొక్కి యభ్యర్థింతున్
గడు జిక్కుగ నున్నది గురుఁ
డిడుయాతన యేమి నేయ నిది చల్లాఱున్. 271

తే. గీ. "ఒక్క యక్కర మేని నా యొద్దఁ జదువ
లే దని యతం డనం డపవాద మిదియుఁ
జచ్చి స్వర్గమ్మునం దున్న ఛాత్రి నిట్టు
లపవదించినయొజ్జ నే మనఁగనేర్తు. 272

సీ. "ఎందఱో కలరు నా కేకలవ్యు లటంచుఁ
దానే స్వయంలిఖితమునఁ దెలిపె
వార లట్లుండ నా వద్దఁ బొత్తము వట్టి
చదివినశిష్యులు చాలనుండి

రలవారు వీరు నా యభిమానమునుబట్టి
తమకుఁ బ్రిశిష్యవర్తనము నెఱపి
యనుసరింపఁగఁ బ్రజ్ఞ నార్జించికొన్నట్టి
సార్వభౌమపదంబు సకలదిశల

తే. గీ. సిష్కశంకచంద్రునిభాతి నీటు గులుక
నేను దొడిగినగండపెండెరముతోడ
నేలుకొనరాదె? కవిరాజ్య మెవఁడు తమ్ము
గా దనెడివాఁడు వెనుక వెంకన్న యుండ. 273

సీ. ఇంజరం బున్నది యేనాము నున్నది
వల్లెపాలెం బుండెఁ జల్లగాను
పీఠికాపురముండెఁ బృధ్వి నేలూరుండె
శిష్యునిమాతృష్వసేయుఁ డుండె
వల్లూరుగ్రామంబు వఱలు నిప్పుడు గూడ
నూజివీట నృపాలరాజి కలదు
మంజువాణీపెర్సుమానేజ రున్నాఁడు
నందిరాట్కులపతినామకుండు

తే. గీ. శంకరుఁడు సానితోఁ గూడి జగము లేలు
చున్నవాఁడె గదా? నేను మున్ను చూపు
సాక్షులం దెవ్వరో లేనిజాడ దెలిసి
బొంకి నంతన గురుమాట పొల్లు గాదె? 274

షరా:- శిష్యుని మాతృష్వసేయుఁడు = పెదతల్లికొడుకు. (ఆకొండిరామమూర్తిగారు) కవి, సుప్రసిద్ధాయుర్వేద వైద్యులు. ఈయన నాచేఁ బ్రశ్నింపఁబడి గురువుగారిగ్రాఁత ఘోర మను నంశమును పత్రికాముఖమున బ్రకటించిరి. (కృష్ణాపత్రిక చూ.)

క. ఉన్నా రసత్యరచనలు
పన్నంగలవారు బట్టబయట నెదురుగా

నున్నట్టివిషయములలోఁ
బన్నంగలవారు చెవులఁ బడకే దెంపన్. 275

తే. గీ. "గజము మిధ్య పలాయనగతియు మిధ్య"
అనుచు నద్వైతులంద్రు మా యయ్యవారు
భారతం బెల్లఁ దెలిఁగించి పడసియుండు
రట్టివిద్యావివాదరహస్యపటిమ. 276

తే. గీ. "నిత్యసత్యవచనుఁడనునే" నటంచు
నృపునితోఁ బల్కఁగల్గు నన్నియ రచించి
నట్టిభారతమే గురుఁ డనువదించి
యనృతమునకుఁ గొంకకపోవు టక్కజంబు. 277

మ. పడవచ్చున్ మఱి యెట్టితిట్టయిన నా ప్రాజ్ఞుం డన న్వచ్చు న
య్యెడ సందేహము లేదసత్యమునకే యే నింత శోకింతు నా
యెడఁదన్ సారెకు నెంత యూఁదడిలఁగా నే రీతి యత్నించినన్
బొడముఁ శోకమొ? కోపమో? మఱి యదేమో? దానిపే రేదియో?

ఉ. ఛాత్రుఁడుగానివానిపయి ఛాత్రతఁ బొల్పినవాఁడు రే పిఁకన్
బుత్రుఁడుగానివానిపయిఁ బుత్రతఁ బొల్పకపోఁడు నిక్క మీ
యత్రిపతాగుణం బతనియం దొకయొజ్జకె తోఁచెనో? మఱే
శత్రునకేని దోఁచినదొ? సర్వజగంబు పరీక్షసేయుతన్.

ఉ. ఎక్కడ శిష్యుఁ డన్న నుడి కెవ్వఁడు నొప్పకయుండు వాని కీ
ఫక్కిఁ గుతూహలంబు మది బట్టినఁ బట్టునుగాక, చాలఁ బెం
పెక్కినశిష్యవర్గ మది యెక్కడఁ జూచినఁ గానవచ్చు స
మ్యక్కవి కేల యిట్టి యవమానపుయత్న మొనర్పఁగావలెన్. 280

సీ. వనపర్తిసంస్థానమునఁ బూజ్యుఁడై యున్న
ధీరుఁడౌ నల "నెమలూరి" కన్న
ననఘుండు సుకవియు నవధాని యొజ్జయై
పేరుపొంపారు "నవ్వారి" కన్న

నుభయభాషలయందు నున్నతం బగుమంచి
పేరుచెల్వారు "వేటూరి" కన్న
బాలుఁడై యవధానపటిమఁ జూపి యశస్సు
చూఱఁగొన్నట్టి "వేలూరి" కన్న

తే. గీ. సూరి "పింగళి" కన్న "కాటూరి" కన్న
"విశ్వనాథుని" కన్న నిర్వేలకీర్తి
నిడెడి యితరులకన్న నా కీతఁ డిచ్చుఁ
బే రనుచు వీని శిష్యుఁగాఁ జూఱఁగొంటి. 281

తే. గీ. చదివి శిష్యుల మని చెప్ప ఛాత్రు లొకఁటఁ
జదువకయె చెప్పికొనియెడి ఛాత్రు లొకట
నాంధ్రదేశమ్మ నెల్లెడ నావరించి
చెళ్ళపిళ్ళకు నున్నవి శిష్యగణము. 282

మ. ఒకనాఁ డీ భవదీయగేహమునయం దున్నాఁడ మీ భార్యగా
రు కటాక్షించిన యన్నమున్ దినితిఁ బేరుంబెంపు నా కబ్బెఁ దా
వకశిష్యుండఁ గవిత్వమున్ సలిపితిన్ వత్తు౯ భవద్దర్శనా
నకు విన్పింపఁగ నంచు వ్రాయు ఘనులు న్నా కున్న వారెందఱో. 283

ఆ. వె. కఱవు లేదు శిష్యగణమునకై నాకు
శిష్యుఁడైన వాని శిష్యుఁ డంచుఁ
జెప్పికొన్నఁ జాలు శిష్యుఁడుగానట్టి
వానిఁ జెప్పికొనఁగవలయు నేమి? 284

క. కొడుకులు శిష్యులు,వారల
పడఁతులు కోడండ్రు గాఁగఁ బరిచర్య న్నేఁ
బడసితి నెఱుఁగు జగము శి
ష్యుఁడుగానిజనున్ వచింతునొకొ?శిష్యుఁడుగన్. 285

ఆ. వె. మొగముఁ జూచి కవనముం గొంటి మనువారు
కూటికతనఁ గైతఁ గొంటి మనెడి

వారు పెక్కు ఉన్నవానికిఁ జెళపిళ్ళ
వాని కొజ్జ యెట్టివాడు గప్పై. 286

వ. అది యటులుండె.

క. తిట్టు,లసత్యంబులు వెడ
యొట్టులుగా నుండుఁగాక యొజ్జప్రిసంగం
బట్టు లొరు దూఱి కోరుటు
కెట్టులొ చన నెంచు ధైర్య మెట్టిదియొ కదా ?. 288

తే. గీ. ఆ ప్రివృత్తికిఁ దగుఫలమంది కూడ
విరమణము గనుపట్టదు వేర మచట
దీర్చికో నెంచు నాబోఁటి తిరుగలేక
యిచ్చెడిక్షమాపణం బని యెఱుఁగు నొజ్జ. 289

ఆ. వె. ఫ్రెంచివారికత్తిరీతి దేశికువాచ
మిరువయిపుల వాడి నెనసి యుండు
విద్దెపట్ల నోడి విరమించు టుండదు
కోర్టువెంటఁ ద్రిప్పి గోకు గుడుపు............ 290

క. ఆఁగవలె నేను గోరుటు
లొ గురుతో గ్రుద్దులాడ లోకాంతరస
ద్భోగాన కేగఁ దప్పగుఁ
''జాఁగాఁ దీర దనునట్టి''సామెత యిదివో?........ 291

తే. గీ. ''త్రిదశకవివను గుండియల్ దిగ్గురనఁగ
నేగె శ్రీనాధకవినాక మేను భూమి
లోకకవిసార్వభౌముల ఢాక కొదిగి
ఆఁగవలసి యాఁగుచు నుంటి నార్యులార? 292

క. "ఆ"యన నపరాధం బగు
''నూ''యన నుపరోధ మెట్టులో?కద?యిఁక నా
రాయణ?యన బూతగుని
ష్పీ?యేడం గలవె?యిట్టి చిక్కులు ధరణిన్. 293

చ. తెలియక తప్పువట్టుటయు ధీరుల లక్ష్యము లిచ్చి "కావు త
ప్పు లవి యటన్న వెంబడిని బోలెఁడు కోపము తెచ్చికొంట తి
ట్టులు మఱి యొట్టు లావయిఁ గడున్ గడు మచ్చర మూవి కోర్టులో
పల జయ మందు యత్నము సెబాసు?గురూ?యశ మిచ్చు నిప్పనుల్.

తే. గీ. వేయివోళ్ళను బొగడిన వెలితి యుండు
నల్ల పెండ్యాలకోవిదు మల్లుతనము
"వీరభద్రిపళ్లెమునకు మాఱు" హనుమ
పళ్లెమును" జూపి గురుమెచ్చు వడసెనతఁడు. 295

షరా:— పెండ్యాలకోవిదుఁడు,ఈయనను మొదట నేదో విద్యావివాదసంద
ర్భమున గురువుగారు దూషించిరి. ఆయనదానిం గని యంతకన్నఁ
గొంత యధికముగా దూషించె దానిపై గురువుగారు కోర్టువ కరి
గిరి.ఆయనయుఁ గోర్టున కరిగె.అధికారి యిరువురకు చెరియిరువది
రూపికలును జరిమానా విధించి మందలించె నని యెఱుఁగునది.

క. కోరుటుమరగినవారికి
వారమునకు నధమ మొక్కపరియైనను నా
చేరువకు నేగకుండినఁ
దీర దనుచుఁ జెప్పికొంద్రు ధీరవరేణ్యుల్. 296

ఆ. వె. చెవులపిల్లికొమ్ము చేఁబూని గొ్రాలి
కొడుకు లొండొరువులఁ గొట్టుకొనుట
పొసఁగనేని యనృతమునకు జంకనిపాత్రికి
పరమువలన భీతి వడుట పొసఁగు. 297

తే. గీ. అక్షరం బొకటేని యందర్థ మేని
యెవఁ డెవరియొద్దఁ గొనువారికిరువురకును
గలుగు గురుశిష్యభావంబు కలఁత వారి
కంకురించుట తప్పిద మనుట నిజము. 298

క. "చెరలాటము"చాలదె గురు
వరుని యసూయ సకలమ్ము వ్రాక్రుమ్మఁగ నే
నెఱుఁగక "జయంతి"వ్రాసి పు
నరుక్తిపాలైతి,ఖండనకు రా దదియున్. 299

షరా:— చెరలాటము ఈపేరితో గురువుగారు తఱచు నన్ను నిందించి ప్రక
టించిన పొత్త మని యెఱుఁగునది.

ఆ. వె. గాజుటింటిలోనఁ గాపుర మ్మొండి యొ
రులగృహమున రాలు రువ్వ గురుని
సాహసమ్ముమట్టు సకలమ్ము దెల్పుఁబో
కోరు టయిన నాకుఁ గోర్కి లేదు. 300

ఉ. ఏ యధికారిదర్శనము నెన్నఁ డొనర్పక ఆత్మదర్శనం
బా యధికార్లె కోరఁగ నుపాయముమైఁ గవితారసంబు నా
ప్యాయము గాఁగఁ గ్రోలువిరపాయపుజీవన మొక్కటే కవి
ధ్యేయము కోరుటున్ దిరుగు దీనులునున్ గవులై రహింతురే. 301

క. "ఇత్యర్థలు కూరలుగా"
సత్య "మ్మితిభావ"లె మఱి చారుగ సత్సాం
గత్యమున మెలఁగుకవికే
కృత్యము సాధింపఁ గోర్టు కేగఁగవలయున్. 302

శా. ఏకాంతమ్మునఁ గూరుచుండి కవితాహేవాకజీవాతుమ
త్పాకంబుల్ విడఁజేసి శిష్యులకుఁ దత్త్వం బర్థి బోధించుచున్
"నాకేశం డరుదెంచె"నన్నఁ "గనఁగా నా కేమి"యన్నొకన్నవాఁ
డే కవ్యగ్రిణి, కోరు టీయఁ గలదేఃయీ వాసి యీ కీర్తియున్. 303

క. తొడిగితిని గండపెండెర
"మడియన్"దాసుండు వోలె నధ్యక్షుఁడనై
కడు నక్కజపడెఁ బత్రిక
లెడఁదన్ మఱి యొజ్జ కెందు కీసిఁక నకటా? 304

షరా:— పత్రికపడినఅక్కజమును దెలుపువ్యాసము భారతీపత్రిక వలన నెఱుఁగనగు.

తే. గీ. కవుల కందఱికిని మొనగాఁ డటన్న
యర్థ మిచ్చెడిబిరుదు నే నంఘ్రిఁ దొడిగి
యేను మిగిలితి నన నెవ్వరేని నగరె?
యెందుకో?యొజ్జ కింక నాయందు నీసు. 305

క. కవితావాదం బఁట !శివ?
శివ!కోరుటుజడ్జి వెట్టుచీవాట్లకు లో
నవు నఁట !యిదేమి కర్మము?
నవుఁబా టనుకొందు రనుచు నా మది వగతున్. 306

చ. కవి యనఁగా స్వతంత్రుఁ డొరుకంటఁ బడం డని పుట్టియే మహా
భవనము గాఁగ నెంచికొని వాస మొనర్చుచు రామసత్కథా
వివరము లెల్ల లోకులకు వించిన యమ్మని చాటి చెప్పెనే
కవులకు దేశికుం డతఁడు కా దనఁ డే కవిగూడ నాతనిన్. 307

శా. ఘోషాస్త్రీబలె నుండఁగాఁ దగు కవుల్ కో ర్టెక్కి యే వేవియో
భాషన్ వీలును బట్టి యాడునెడలన్ వాగ్దేవి దుఃఖించు సం
తోషం బందదు లోకమేనియును నే దోషజ్ఞుఁడుం గూడఁ దా
నీషన్మాత్రము సమ్మతింపఁ డనియే యే నెంతు స్వాంతమ్మునన్. 308

మ. యశ మార్జించుటకే కదా? గురుని యీ యత్నమ్ము సర్వమ్ము;తా
దృశు లీలాటిప్రయత్నముల్ సలిపిరే ?యెప్డేనియున్ ధీవరుల్
పశువాక్కో?యశ మన్నఁ గట్టిగొని "పప్పప్పచాచ్చో" యనన్
వశమై ముం దడు గేయునే?భయమె? యవ్వామాక్షికిన్ గోర్టనన్. 309

క. నను దూఱఁ గాక కోపం
బున నందుల కేను వగవఁ బూర్వకవుల వా
డినసుప్రయోగముల దూ
ఱ నుద్యమించుటకు మదిఁ గరంబు వనరుదున్. 310

తే. గీ. పాపము శమించుఁ గాక శుభ మగుఁ గాక
వాదములు కోర్టువయిపున కేదొ కపట
మూని చనకుండుఁ గాక విజ్ఞానులైన
పండితులద్వారమునఁ దీరి వఱలుఁ గాక. 311

వ. ఈ చంద్రవిదశయందే గుండులక్ష్మణశాస్త్రిగారి యానందరామాయణము విని సంస్కరించుట జరిగె.

క. ఘను లధికారులుఁ బ్లీడరు
లును జేంద్లును బండితకవులును దఱచుగ వెం
కనఁ జూడవచ్చుకారణ
మునఁ గవితాగోష్ఠి హెచ్చి ముద మొదవించెన్. 313

తే. గీ. ఏకకాలమ్మునన సర్వఋతువులలరు
నట్లు వాక్రుచ్చెఁ గాళిదాసాఖ్యసుకవి
అట్లె షష్టిపూర్తి జరిగినట్టిపిదప
నాదు జాతకచర్యయు నడచుచుండె. 314

వ. తెనాలివైశ్యులసన్మానంబును నేలూరివైశ్యులకోర్కికతన గోదేవి యను పొత్తంబు రచించి సన్మానింపఁబడుటయు, సుశీలారచనంబును సన్మానంబును నీ చంద్రునియంద సంఘటించె. సుశీలపైఁ గూడ నొజ్జ యేవియో యసూయాప్రియుక్తంబు లగు దూఱులు ప్రచురింపఁ దత్కృతిపతి శ్రీలింగంజగన్నాధరావుగా రెదుర్కొని యుత్తరప్రత్యుత్తరములు జరిపిరి. అసూయయను పేరితో నారావుగారవ్వానిం బ్రచురించిరి. ఆయనను మాత్రము కోర్టుకుఁ ద్రిప్పెద నని యొజ్జగారు భయపెట్టక విడిచి తామే జంకి మిన్నకుండిరి. కాని నన్నుమాత్రము వదలక భయపెట్టుచునే యుండి రనుటకు శివభక్తిం గూర్చి వ్రాసిన యసూయాప్రసంగంబు బోధకంబు. దానిం గని దత్కృతిపతి యేవగించుకొని జవా బీనక్కఱలే దని నన్ను మందలించె. 315

తే. గీ. వలవదు మనీషి తుద కొక్క "మనిషి" చాలు
మీ రౌనర్చెడిశంకలఘోరణి విని
సంతసించిన నేనును సమ్మతింతు
నంటి "గిడుగువ్యాసమ్మునయందు నేను. 316

షరా:- గిడుగువ్యాసము. దీనిపూర్తిపేరు గిడుగా? పిడుగా? అని. ఇది గిడుగు రామమూర్తిపంతులుగారినిగూర్చి నేనువ్రాసినది.

వ. ఆవ్యాసము కృష్ణాపత్రికలోఁ బ్రకటితం బయ్యె దానిం జూచియే నన్నుఁ గోర్టువెంటఁ ద్రిప్పుటకు యత్నించిరి. నేను క్షమాపణ నిడి యా ముప్పు దప్పించుకొంటిఁ గాని యొజ్జ యేవో యసంగతములు మాత్రము ప్రచురించుట మాననే లేదు. ఆ యసంగతములలోనిదే "అరణ్యరోదన" మని యెఱుంగ నగు. 317

క. కవియగువాఁ డెవ్వండును
శివదాయి ఋతంబు వీడి సీసీలును బె
ల్లవమానమును ఘటించెడి
యవిమర్శపువ్రాఁత వ్రాయఁ డని యే నందున్. 318

విక్రమ సం॥ వైశాఖ శు ౬ మొదలు ఆషాఢ శు ౧౨ వఱకును
శనిలో శుక్రునిలో
—• కుజవిదశ •—

ఆ. వె. ఇంటఁగొన్ని చిక్కు లేర్పడి భగవతి
కరుణ శాంతిఁ జెందె సురుచిరముగ
గవిత విస్తరించి కట్టుట యొనఁగూడెఁ
గుజునివిదశ దేహరుజయు గలిగె. 319

తే. గీ. కలిగి శాంతించె ధనలబ్ధి కలిగె సుంత
మఱియు రాజమండ్రీపురమాన్యు లెలమి
జన్మదినమహోత్సవమును సలుపఁబూని
యత్న మొనరించుటయు వీనియంద కలిగె. 320

విక్రమ సం॥ ఆషాఢ శు॥౧౨ మొదలు పుష్యశు౩వఱకును శనిలో శుక్రునిలో

—• రాహువిదశ •—

క. ఈదరవేంకటరావు స
మాదరమునఁ గడియమునకు నరుదెంచి మహా
మోదమున నూఱునా ఱిడె
నాదాతృత వర్ణనీయ మగుట లిఖింతున్. 321

షరా:— ఈదరవేంకటరావు ఈయన చాల యోగ్యుఁడు. సుఖజీవి యనుచిన్ని పొత్తమీయనంగూర్చి తెల్పును-గోదేవికూడఁ దెల్పును.

తే. గీ. పిదప రాజమంద్రీపురిఁ బొదలు పెద్ద
లెలమి జన్మదినోత్సవ మెచ్చువైభ
వంబుతోఁ జేసి కడు గౌరవంబు సల్పి
యాదృతిన్ జూపి, రిడి రుపన్యాసములను..............322

వ. పతివ్రత యను నొక కబ్బంబు రచించుటయు నయ్యది ప్రొఫెసరు శేఖరరావు జమీందారునకుఁ గృతి యిడుటయు నీ రాహువిదశయం దనుఘటించె కాటూరివేంకటేశ్వరరావుకొమరుని వివాహమ్మున కరుగుటయు నూజార్లు సమ్మానంబు గొనుటయు నిందే యొదవె నంత గురువిదశ ప్రారంభించె. 323

విక్రమ సం॥ పుష్యశు౩ మొదలు వృషసం॥ జ్యేష్ఠశు ౫ వఱకును శనిలో శుక్రునిలో

—• గురువిదశ •—

తే. గీ. ఎనిమిదేడులనుండి నే నేగలేక
అన్నవర మేగ మానితి నట్టిచోటి
కల్ల యినుగంటిశ్రీప్రకాశాఖ్యనృపతి
కతన నేగితి నట వార్షికంబు గొంటి. 324

క. కవిచక్రవర్తి కవిచ
క్రవర్తి యని నన్ను సారెఁ గవిసభలో గా

రవ మలరఁ బ్రేముడించెడి
సువివేకికి నబ్బుఁ గాక సుఖమున్ యశమున్. 325

వ. మఱియు విశ్వనాథసత్యనారాయణ కవిసామ్రాట్టు శిష్యునకు రాజమండ్రిలో జరిగినగౌరవార్థపుసభ కరుగుట. అట్లే నాళంకృష్ణరాయని గౌరవార్థపుసభ కరిగి ఆశీర్వచించుట,పీఠికాపురిని నిఘంటుకార్యస్థానము నందలిపండితులకు గురువుగారిపూర్వపక్షములు వినుచుటయు వారు పెదవి విఱుచుటయు నీ గురువిదశయందే ఘటించె. 326

వృషసం॥జ్యేష్ఠశు॥ మొదలు మార్గశీర్షశు॥ వఱకును శనిలో శుక్రునిలో

—• శనివిదశ •—

తే. గీ. ఏనిని.యు లోను గాఁగల యెల్ల సుప్రి
యోగముల నెల్ల గురుఁడు తా నోర్వలేకొ ?
భ్రాంతికల్మినొ దూఱి వికాంతి చూపి
తెచ్చికొన్నచిక్కె-ఱుఁగు సుధీకులంబు. 327

క. భారతమునఁ దిక్కన సొం
పారఁగఁ బ్రాసస్థలముల నతికించినయా
సారస్యం బెఱిఁగియు నీ
సాఱిపికోలేక వాద మాడు గురుఁ డెటో. 328

వ. దీనిం గూర్చి లింగంజగన్నాథరావుగారి "అసూయ" యను చిన్నిపొత్తములో విస్తరించి కలదు.మఱియు యజ్ఞయాగములు, లవలేశములులోనైన సుప్రియోగములంగూర్చియే కాక: "అరణ్యరోదన" మనియెడి యవ్యక్తపురచనం గూర్చి కూడ జగన్నాథరావు గట్టిగాఁ బ్రశ్నించి మందలించి చేయఁదగినంతయుఁ జేసి గాని విడువనే లేదు. 329

తే. గీ. ఎవరు గాని జగన్నాథుఁ డెట్టు లడిగె
నట్లు మోమోటమును వీడి యడిగినట్టి
ధీరుఁడే కానఁబడఁ డిల "దిట్టిపోయు
నెందులకు మన" కనుకొనుటే ఘటించె. 330

వ. జగన్నాథరావు మీ యాక్షేపణలు గాని మీ వాదము గాని పండితులకే కాదు పామరులకు నైతము కేవల మసూయాప్రయుక్త మని స్పష్టముగాఁ దోఁచుచున్న దిందుల కేమి ప్రత్యుత్తరం బీఁగలరు మీ రని నిర్బంధించిన నొజ్జ కేదియు నుత్తరంబు దోఁపక యెవ్వరో కొందఱు నిష్పక్షపాతులు పండితులు కల రనియు వా రేమో తమవాదమున కామోదంబు నెఱపుదు రనియు నొడివి బయలఁ బడ నెంచ, రావుగారు "అనిష్పక్షపాతు లగు పండితు లెవరో వారిం జేర్కొనుఁడు ప్రష్టవ్యాంశ మేదేని యున్నచో వారినే యడుగుదు నని యెదురుకొనునంత నిరుత్తరులై గురువుగా రప్పటికి విరమించిన ట్లగుపట్టిరి గాని. 331

తే. గీ. మరల "లోయరుతరగతి" వఱలుపిల్ల
కాయ లడిగెడిప్రశ్నలు కాగితంపుఁ
గఱపు గూడ గణింపక యతిముఱిగను
నింపుటది మాన రేమననేర్తు నొజ్జ. 332

క. మన ముడికి మాటిమాటికి
ననుఁ దిట్టెడి నొజ్జ,దీని నామదిలో నీ
శనికంటఁగట్టెదను,ద
జ్జనితమ యీ దోస,మిందు శంకయుఁ గలదే? 333

—• శ ని ప్రా ర్థ న •—

మ. శని! నిన్నొక్కటి నేను వేడెద నమస్కారమ్ము గావించి;ఆ
యన న న్నె చెడుతిట్లు తిట్టినను నా కాంతర్య మందేని నొ
ప్పిని గల్గింపకు,మంతొ యింతొ గురుఁ డా విజ్ఞుండు శిష్యుండ నే
ననుమాటన్ మఱవంగఁబోకు మిదియే ఆశాస్య మే మందువో? 334

ఉ. ఆయన "తప్పు"లన్నయపు "డౌ"నని యొప్పనితప్పునాది,యే
రో యెదిరించినట్టు లెమరొడ్డితిఁ జూపితి భారతాదికం
బీ యవివేక మిప్పటికి నిట్టిదిగాఁ బరిణామమందె,నీ
సాయ మికేని వాదునకు శాంతి ఘటించునటుల్ పొనర్చవే. 335

ఆయనతోడ వాదమున కందఱు భీతిలు చే నెఱింగియున్
జేయఁగఁ బూనితిన్, దుదకు శిష్యుఁడె గెల్చెనటన్న వా డుపా
ధ్యాయుఁడు సైఁప కేవియొ? యుపాయము లారయుచుండె నిందులోఁ
బోయిన దేమి? బొంకెదను బో? గురుఁడే ననుఁ గెల్చె నోడితిన్....

క. విప్రుండే శుచి అందుఁ గ
విప్రవరుఁడు శుచియటంచు వేదమున "శుచి
ర్విప్రి" యను నుడి వచించుఁ గ
దా? ప్రారబ్ధంబె? కవికి నన్నృత మదేలా? 337

మ. అన్నృతం బాడి గరుత్మదంబికకు నన్యాయమ్ముగా దాస్యవ
ర్తన శాసించినయల్లకద్రువకు నిందాదోషమే తప్ప నే
ఘనయోగంబు ఘటిల్లెఁ గన్నకొడుకుల్ "కష్టంబిసీ" యంచు నం
బను దూషింపరె? తల్లినేని యన్నృతవ్యాహారిణిన్ దూఱినా. 338

ఉ. కావునఁ గల్లలాడుటయుఁ గల్లల నాడెడిపట్లఁ దోడుగాఁ
బోవు, టుపేక్షసేయుటయు బుద్ధిమదగ్రిణు లొప్ప, రొప్పుచో
భావికి హాని గల్గు నని వార లెఱుంగుదు ర ట్లెఱింగియున్
ద్రోవకుఁ దప్పికొందఱు బుధుల్ చరియించుట శోచ్యమే యగున్.

క. నీ వేగి చెప్పు మాయన
తో వాదముచేయునట్టిదోషము నాదే
కావల మియ్యది సైఁపం
గావలె నని వేడికొందుఁ గడు వినయముతో. 340

క. కోరుటుకుమాత్రి మీద్వక
కారుణ్యముచూపునట్లుగా సారెకు నేఁ
గోరితి నని వచియింపుము
తీరినవార్ధకము నేను దిరుగఁగ నేరన్. 341

తే. గీ. వారు వట్టినతప్పులు వాస్తవములు
నేను వాదించువాద మ్మనృతమయమ్ము

ఇట్లు నిండుసభను జెప్పి యెఱుఁగువాఁడ
సంధి పొసఁగింపు మో శనైశ్చర ! యెఱేని. 342

సీ. ఏనుంగు నే నెక్కె నెంత నేరమ్మొకో ?
అయవారు "మదురుగో" డనిరి దాని
నెవ్వ రిచ్చిరో ? కుక్క నీనాకు బహుమాన
మిటు లొజ్జ లిఖియించె నెంత యాసొ ?
దాసరిగూడెమ్మదరి నొక్క దాసితో
వాదించి గెల్చుట వ్రాసినారు
ముదుసలినక్కతోఁ బోరాడి శాస్త్రిన
గెల్పు గొంటయును లిఖించినారు

తే. గీ. ఇన్నిటికిఁ గారణంబు నీవే కదయ్య
కోదుజాతితో వాదము గొంత సల్పి
నట్లుగూడ లిఖించిరి యయ్యవారు
సకలమును నీవు చేయించు చర్య లివియు. 343

షరా:- ఈపద్యమునందలి "మదురుగోడ" వగయిరా ప్రసంగము గురువుగారు నన్నుఁగూర్చి పేరుపెట్టి రచించిన "అరణ్యరోదన" మనెడి తిట్టుపొత్తమున నుండును. నేను వారు గాని మఱొకరు గాని యెంత తిట్టినను కోరు పెక్క నని వా రెఱుఁగుదురు.

తే. గీ. "చవట" వనిరంతఁ బోక "దుర్జాతి" వనిరి
అనిరి "పెద్దమ్మవా" రని, అన్నిటికిని
గొంగు వట్టితి నీవ చేకూర్చి తిన్ని
దొసఁగు లేఁక నేని యాఁగు మేదోవిధమున. 344

క. నాతో వాదించినప్ర
ఖ్యాతులకర్మమ్ము కాలి యలవా ర్నక్కల్
సీ ! తులువలు దాసికలై
చేతమ్మనఁ దోఁచి రెంత చెడుకాలంబో ? 345

తే. గీ. నాకు డెబ్బదిరెండేండ్లు నన్నుఁ దిట్టు
నయ్యవారికి డెబ్బదియాఱునేండ్లు
నవ్వఁజేయకు మిఁకనేని నవ్వలేక
పాఠ్జ్ఞలోకమ్ము సిగ్గునఁ బడి తొలంగు. 346

సీ. మీ విమర్శనము సమీచీన మనుము వెం
కనఖండనము లనర్హమ్ము లనుము
"కరుణానిరతు" లనుకవినన్నయార్యప
ద్యము చాల నీరస మనఘ ! యనుము
దానికి నెన్నిరెట్లేని "స్త్రీస్వాతంత్ర్య"
పద్యమ్ము మీయది హృద్య మనుము
అట్లు కా దనుచు వెంకన్నవ్రాసినవ్రాఁత
అజ్ఞానమూలక మార్య ! యనుము
తే. గీ. చచ్చినట్టులు మీరలు సవరణలను
జేసికొమ్మంటి రందుకు సిద్ధ మనుము
వేయు నేల జయంతిని "వేల్తు నగ్ని
యంద"నుచుఁ జెప్పు మాయన యాజ్ఞయేని. 347

తే. గీ. ఈవు తన్మనశ్శాంతికి నెట్టు లెట్లు
చెప్పినను నేను దానికి సిద్ధ మెఱుఁగు
మెట్టులో నాకుఁ దప్పింపు మెడకు నీకు
ద్రొక్కెదను నీవ పెట్టి తీపోకు ధ్రువము. 348

క. "స్త్రీస్వాతంత్ర్యపుఁ బద్యం
బాస్వాద్యము గాదటన్న నంతకె నాపై
నీ స్వారి తప్ప దయ్యెన్
సుస్వాంతుం డెవఁడు దానిఁ జూచి గణించున్. 349

క. కవన మన యతిప్రాసలు
సవసవగణములును గూర్పఁ జవి గలిగెడినే ?

శివ ! శివ ! లోకము మెచ్చని
కవనము రచియించి నన్నుఁ గసరిన నేమా. 350

వ. నీకు నాయందు నీసు గల దని యెఱుంగుము సందులకుఁ గతంబు గద్వాలసంస్థానంబునఁ బ్రిస_క్తికతన నీపై నొడివిననక్షత్రిమాలయే నీ వా కోపమ్ము మనంబునం బెట్టుకొనక సంధి వొసఁగింపు మని శనిని వేడుకొనుచుఁ గాలం బపనయించునంత బుధవిదశ తారసించె.

వృష సం॥ మార్గశీర్ష శు ౫ మొదలు చిత్రభాను సం॥వైశాఖ బ ౧ వఱకును
శనిలో శుక్రునిలో

—• బు ధ వి ద శ •—

తే. గీ. అంత "శివభ_క్తి" కృతి నందినట్టిమేటి
పట్టుపట్టి విజయవాడ పయనమును బొ
నర్పఁగాఁ జేసి విద్వద్గణంబు మెచ్చ
సభను వేయాఱుల నొసంగి సత్క_రించె. 352

తే. గీ. బుధుఁడు వైశ్యగ్రిహం బని బుధులు వల్క_
పల్క_ సత్యంబుగా వైశ్యవరుఁడు రెడ్డి
సర్వగతుల సభాజించి నిర్వహింప
నుంటి బెజవాడలోఁ గూతునింట నెలమి. 353

ఆ. వె. బేతపూడికులుఁడు వీరశరభయార్యుఁ
డెలమి భాగవతము నెపుడొ ముల్లు
పాపయార్యకృతము ప్రకటించుపనివెట్టి
కొని సహాయపడఁగఁ గోరుటయును. 354

షరా:- ఈ భాగవతము, దేవీభాగవతము. శరభయ్యగారికోరికంబట్టి నేను దానిని సంస్క_రించితిని.

ఆ. వె. వార్ధకమున మంచి వ్యాసంగ మబ్బిన
దంచు "మంచి" దంటి నక్క_తమున

దేవిభాగవతము దిద్దుచు దుర్గాక
టాక్షపాత్రి మగుచు నచట నుంటి. 355

తే. గీ. అట సుమాళమ్ముగ వసించునట్టికాల
మందుఁ జిన్నయల్లునికి జ్వరామయమ్ము
కడు భయంకర మౌచు నెక్కుడు శ్రమంబు
కలుగఁ జేసె భిషక్కులు కళవళింప. 356

సీ. గూడూరికులజుం డకుంఠితప్రజ్ఞ నా
యుర్వేదమునఁ గల యుత్తముండు
జంధ్యాలవంశ్యుం డసామాన్యధీమత్త
యాంగ్లవైద్యమునయం దలరుమేటి
వీర లిర్వురు జ్వరవేగం బుడిపిపర
స్పరసామరస్యసంపద రహింప
నల్లుని బ్రదికించినట్టిమే లీ జన్మ
మందుమాత్రిమ కాక యవలిజన్మ

తే. గీ. మందు సైతము మఱవరా దనుచు సతము
మననసేయుదు రెండవ మాన్యుపేరు
దక్షిణామూర్తి యితనిధీధారణాది
కము శతవధానికేని యక్కజము గొల్పు. 357

ఉ. ఆర్తిహరుండు వియ్యనగుణాఢ్యుఁడు తాదృశుఁడైనదక్షిణా
మూర్తియు నిర్వురున్ జ్వరసముద్రమునుండి తరింపఁ జేసి స
త్కీర్తికిఁ దావలంబు లయి దీర్ఘతరాయురుపేతులై శుభ
స్ఫూర్తికి నాకరంబు లయి పొల్చెడి దీవన లంది రమ్మెయిన్.... 358

తే. గీ. మఱియు బెజవాడ నుండుసమయమునంద
యజ్వ, శిష్యుఁడు నీలకంఠాహ్వయుండు
అమరవాదికులుఁడు వేంకటప్పయార్యు
నాత్మజుం డిడె నూఱార్లయందు సగము. 359

ఆ. వె. నీలకంఠయజ్వ బాలప్రియమునాఁడు
శిష్యుఁ డగుచుఁ గవిత చెప్ప నేర్చె
భారతమ్ము దృశ్యబంధమ్ము రచియించి
యిటకు వచ్చి వినిచె నెలమి వింటి. 360

ఆ. వె. ఒకమహమ్మదీయుఁ డొడయఁడై పాండవ
విజయ మాడఁ జేసి వెండి"కప్పు"
విలువగలది, సేలువులు నాట్యరంగమ్ము
నందు నా కొసంగి యాదరించె. 361

షరా:— ఈ పద్యమునందలిమహమ్మదీయుఁడు నాటకప్రదర్శనములు కంట్రాక్టుచేయుచుండును భగవద్భక్తుఁడు

వ. ఇట్లా యీ సన్మానము లందితణుకులో గాదెకామరాజుగారికూఁతు వివాహమ్మున జరుగుకవిపండితసభాహేతుకముగ బెజవాడ విడిచి యట కరిగి సత్కరింపఁబడి యటఁ గొన్ని యుపన్యాసములు శ్రీరామ మందిరమ్మున నొసఁగి పిమ్మట స్వగ్రామమ్మున కరిగితి. తణుకునందు నే నున్నదినములలో శ్రీబలిజేపల్లిసుబ్బారావుగారును తత్కుటుంబమును నాయెడఁ జూపినయాదరము వర్ణనాతీతము. 362

తే. గీ. ఇంటి కేగినమఱునాఁడ యేగవలసెఁ
గాకినాఁడ కాంధ్రసభలకారణమున
నచ్చటికి "నింజరపు, శిష్యు లరుగుదెంచి
వారియూరికి రాకున్నఁ దీర దనిరి.................. 363

క. ఊరేగించిరి యెక్కడు
గౌరవ మలరార మంచిగా సత్కారం
బారంగఁ జేసి రావల
నూరికిఁ గడియమున కేగె నొగి వెంకనయున్. 364

వ. ఈప్రయాణమ్మునందు శ్రీయాకొండిరామమూర్తిగారు కలిసికొని మూడవచిరంజీవికి వీరవెంకటసత్యనారాయణశాస్త్రికి తమప్రథమపుత్రు

చిన్నికూఁతు చి॥సౌ॥వతి విచ్చుట కేర్పఱచి రని యెఱుంగునది.ఆశ్రీ
మతిపేరు సూర్యకాంతము. 365

తే. గీ. అటుపయి జపానుయుద్ధపుటలజడి గడు
నెడరు గల్పించి జగమున కితనిచేతఁ
గవిత మఱికొంత చెప్పించెఁ గనుఁడు దాని
స్వస్తిదంబుకామేశ్వరీ స్తవమునందు. 366

తే. తఱచు పరదేశగమనంబు తఱచు మిత్రి
గృహములందలిశుభకార్యవీక్షణంబు
కవనరచన''జపా''న్యుద్ధకారణమున
బుధవిదశ భీతి గలిగించి వోవుదెంచె. 367

చిత్రభానుసం॥వైశాఖం మొదలు ఆషాఢ బ ౧౦ వఱకును శనిలో శుక్రునిలో

—• కేతువిదశ •—

తే. గీ. అంత శుక్రునిలోఁ గేతు వధికరించె
విదశ కధినాథుఁ డగుచుఁ బ్రవిష్టుఁ డైన
వెంటనే"అప్పజోసి"పంపించె ధనము
నూటపదియార్లు తాఁ గొన్ననూత్నకృతికి. 368

క. ఆరోగ్యపులోపమ్మున
భారమ్మగ జీవయాత్రివైఖరి యెదియో
తీరున నుండియు దేవీ
కారుణ్యముకతన లోటు కనఁబడ కుండెన్. 369

చ. బలము రవంత లేదు పసిపాపల కన్నను భుక్తి తగ్గనే
యలజడిరోగమో కలఁచుటన్నది యెప్పుడుఁ దప్ప దిట్టిచో
నల యిలువేలుపే శరణమై భరియింపకయున్న నాకు నె
ట్లెలమిని గాలమున్ గడచు పేర్పడు నంచుఁ దలంతు నెప్పుడున్. 370

క. ప్రారబ్ధ మనుభవమునం
దీరెడి వేఱొండుగతిని దీరదు నిక్కం

బారాధ్య మెఱిఁగి వర్తిలు
ధీరుల కయ్యదియుఁ గొంత తేలికయె యగున్.........371

తే. గీ. రావుకులుఁడు గంగాధరరామరావు
పౌత్రికక్షరాభ్యాసోత్సవంబొనర్చి
యిచ్చె నూఱార్లు సేలువు లింటనున్న
నెల్లరకుఁ బుట్టములు పేర్మి యెనక మెనఁగ. 372

షరా:- ఈ గంగాధరరామరావుగారు వేంకటగిరిమహారాజు కుటుంబము నుండి పిఠాపురపుమహారాజకుటుంబమునకు దత్తుగా వచ్చినవారి పుత్రులు. జాతకచర్య యీయనకే కృతి యిచ్చితిని, గోదేవికూడ డిటో. ఇట్టియోగ్యులు తఱచు దొరకరు.

చిత్రభాను సం॥ శ్రావణ శు ౧౦ మొదలు భాద్రపద శు ౭ వఱకును
శనిలో రవిలో

—• చంద్రవిదశ •—

క. మునుపే కృశించిమిగిలిన
తనువున మఱికొంత చేవ తగ్గెను గళమం
దున గద్గదభావంబును
వెనుకటికన్న మఱికొంత విస్తృత మయ్యెన్. 373

భాద్రపద శు ౭ మొదలు భాద్రపద బ ౧౪ వఱకును
రవ్యంతరములో

—• కుజవిదశ •—

తే. గీ. అంతఁ గుజుఁ డేగుదెంచె వీఁ డాదినుండి
యెడతెగకయున్న శ్రీపాదకృష్ణగురుని
యనుచితంపువిమర్శంబు నరయఁ జేసి
అక్కజం బెంతయో మది కబ్బఁ జేసె. 374

క. వ్యాకరణ మెఱుఁగకుంట స
రేకద ! కోశమును గూడ నీక్షించెడియో

ర్వకొంచెము లేక వృథా
దూఁకు నవికి నేమి సెప్పుదున్ గురుచెయిదిన్. 375

సీ. ''నడునెత్తి పగులఁగా నడిచి'' యన్నదిరెండు
తప్పులుగల దయ్యెఁ జెప్ప నేమి
గలదయ్యవారికిఁ గలయసూయాపిశా
చము నిఘంటువుగూడఁ జక్కఁ జదువ
నీక వెఱ్ఱెత్తించి లోకగర్హితములౌ
వ్రాఁతలు వ్రాయించి "పకపక" కవి
వరుల నవ్వఁగఁ జేయుఁ బలువురు వల దని
నొడివిన వినవీదు గడుసుఁదనము

తే. గీ. గాదు వెఱ్ఱితనముగాదు కడకు నేది
గూడఁ గా దిట్టివ్రాఁతలు "స్క్రూలు" కుఱ్ఱ
లేని గని యీసడించుట కృష్ణగురున
కేమిటికి గోచరింప దం చేను వగతు. 376

షరా:- ఇందలి "నడునెత్తి" వగయిరాసుప్రయోగములు. గురుభక్తియను పొత్తమునందలివి. శ-ర-నిఘంటు చక్కఁగాఁ జూచినను వాని సాధుత్వము తెలివియును. అది కూడ చూడక యేదో తోఁచి నట్లెల్ల వ్రాసి దూషించుట వారియాచారము.

తే. గీ. మీ ప్రవృత్తిని జగమున మెచ్చువాని
నొక్కనిని జూపుఁ డంచును నొక్కి పృచ్ఛఁ
జేసె "లింగము'' కులుఁడు విశిష్టబుద్ధి
శ్రీజగన్నాథరావొజ్జ చెప్పఁ డెవరి. 377

చిత్రభాను సం॥ భాద్రపద బ ౧౪ మొదలు కార్తీక బ ౫ వఱకును
శనిలో రవిలో

— రాహువిదశ —

వ. ఈ రాహువిదశ నేఁట రేపటఁ బ్రారంభము కానున్నప్పుడు మనఃక్లేశ కారకం బగు నశుభవార్త విన నయ్యె, నయ్యది పుత్రికకు సంతానమ్మ

కలిగి యది జాతిపోవుటయు నాపె విశేషించి జబ్బువడుటయు నని యెఱుంగునది. ఆయీహేతువుంజేసియు, మున్నుదాహరించిన బేతపూడి శరభయ్యగారి బలవదాహ్వానంబునంజేసియు, దేవీనవరాత్రిములకు బెజవాడకుఁ జనుట పొసంగె. 378

తే. గీ. వెండిదండంబు నొక్కండు వృద్ధదశకు
ననుగుణం బని శరభయ్య యాదృతిమెయి
సత్కరించెను నూఱార్లు సాలువులును
విలువగలపుట్టములు నిడి విజ్ఞులలర. 379

క. యావత్కుటుంబమును సం
భావించెన్ బిల్లజెల్లవరుసన్ బేర్మిన్
దేవీభక్తుఁడు శరభయ
దేవీపూజావిధాన దీక్షితుఁ డెలమిన్. 380

చిత్రభాను సం॥ కార్తిక బ ౧౫ మొదలు పుష్య శు ౧౫ వఱకును
శనిలో రవిగో

—• గు రు వి ద శ •—

తే. గీ. అంత గురువిదశాభుక్తి యనుసరించె
దీనిలో ముదిగొండకులీనుఁ డైన
వీరభద్రియారాధ్యుఁ డుదారగుణుఁడు
కవియు నాగమవేత్త నాకడకు వచ్చె. 381

తే. గీ. ఇతఁడు స్కాందంబునందలియీశులీల
లాంధ్రభాషను రచియింపుఁ డనుచుఁ గోరె
వార్ధకము సార్థకం బగు వ్యాపృతి యని
నాఁడె ప్రారంభ మొనరించినాఁడ రచన. 382

క. దేవా? "యావత్తైలం
తావ ద్వ్యాఖ్య" యగుఁ గాక తప్పే మనుచు
న్నా వార్ధకదశ సార్థక
తావైభవ మందునట్లు దయ నింపఁగదే? 383

వ. అని బెజవాడమల్లికేశ్వరస్వామిపై భారమ్ము వెట్టి శివకవచపారాయణంబు నియతమ్ముగఁ జేయుచు నత్యాశుధారగా శ్రీమదాంధ్రస్కాందం బనుపేర నా రచన సాఁగించుటకు వీరభద్రారాధ్యులు కడుంగడు సంతసించుచు నన్నుఁ బలువిధముల నాదరించుచుఁ గంటికి ఱెప్ప చందంబున నా నేమంబు నారయుచు నెప్పటి కప్పు డాయాయీ గాధలు నాకుఁ దెల్పి నా రచనకుఁ బ్రోత్సాహంబు గలిగించుచుండె. 384

ఉ. స్కాందముఁ జూడ నోపికయుఁ జాలదు చూడను లేదు వీరభ
ద్రేందుధరాంఘ్రిభక్తుఁ డెది యేగతిఁ జెప్పుచు వచ్చె వానినే
యిందు గ్రహించి దీని రచియించితి లక్షణలోప మెల్ల నా
యందును దక్కులోప మఱయా రెమలందును నుండు ధీవరుల్. 385

వ. వీరభద్రారాధ్యులు బహుగ్రంధములు దిలకించియుఁ బలువురు వృద్ధుల వలన నెఱిఁగియు నాయాయీగాధలు నాకు నొడివె. నేను శ్రీనాధుఁడు నైషధరచనయందున్ బలెఁ గొండొకస్వాతంత్ర్యంబు గైకొని రసానుగుణంబుగ నాయీస్కాందంబు విరచించితి. నిందు స్కాందంబున లేనివి గూడ రెండుమూడు గాధలు గలవు. కొన్ని యితరపురాణంబులనుండి గ్రహించినవియుం గల వని యెఱుంగునది. 386

క. శివుఁడే రచించెనో? నే
నువిరచనమును బొనరిచితినో? యెఱుఁగ నొగిన్
శివలీలాకావ్యం బా
శువులో సంసిద్ధమయ్యె సూరులు వొగడన్. 387

షరా:- శివలీలాకావ్యము-దీనికే నామాంతరము. ఆంధ్రస్కాంద మని తెల్పెడి.

చిత్రభాను సం॥ పుష్య శు ౨ మొదలు మాఖ బ ౧౪ వఱకును శనిలో రవిలో

—— శనివిదశ ——

క. తలపెట్టనిదే సుతుపెం
డిలి మన్మనివడుగుఁ గడుఁ గడిందిముదము పెం

పలర ! బెజవాడపట్టణ
మెలమిన్ జేయుంచె,దుర్గ యిట కలదు గదా? 388

క. నా యూ రెక్కడ? యిచ్చటి
కా యార్యాపూజ కెవరొ యాహ్వానింపన్
జేయఁ జనుదెంచు టెక్కడ!
యీ యూరన్ శుభము లలరుహేతు వదేమో?. 389

క. నూఱాఱు లంపుచు జమీం
దారు లుదారతను జూపి ననుఁ బ్రేమింపన్
వారలకన్నను నెక్కుడు
దారతఁ గనఁ జేసె భద్రియారాధ్యుండున్. 390

సీ. జయపూర్మహారాజు స్వల్పం బటంచు నూ
ఱార్లు పోస్టున నంపె నధికదాత
ఇనుగంటిశ్రీప్రకాశ నరేంద్రుఁ డట్టులే
పేరిమి నంపె నూఱాఱు లలరి
రావుగంగాధరరామరాయలు మంత్రి
నంపి నూఱా ర్లంపె నతనిచేత
భావనారాయణాహ్వయుఁడు స్కూల్ శిష్యుండు
వైశ్యుండు నూఱార్లు వచ్చియిచ్చె

తే. గీ. వీరభద్రియారాధ్యుండు వీరలబలె
నూఱునాఱును నిడి పరివారమునకు
బందుగులకును నాకును బట్టుఁబుట్ట
ములును గై సేసెఁ జూప అద్భుతము నంద. 391

షరా:- ఈశనివిదశలోనే లోఁగడ శనిలో శుక్రునిలో బుధవిదశలో సన్మా
నించిన మహమ్మదీయుఁడు మరల నక్లే రజితపాత్రి మిడి సన్మా
నించె నని యెఱుఁగ నగు.

వ. ఇట్లుశుభోదర్కంబుగశివలీలారచనావ్యాజమ్మునఁగాలమ్మునుమాళమ్ముగ
నపనయించునంతబుధవిదశతారసించె. 392

చిత్రభాను సం॥ మాఘ బ౧౪ మొదలు స్వభాను సం॥చైత్ర బ౨౨వఱకును శనిలోరవిలో

— బుధవిదశ —

తే. గీ. బుధుఁడు రాకపూర్వమె యొకవ్యథ మనమ్మ
నకు ననుఘటించె నది చెప్పుటకును జెప్ప
కుండుటకుఁ గూడ వీల్గాని యోజ నుండు
దైవసంకల్పమునకుఁ జింతపడ నేల. 393

క. జీవితచరిత్రి గావున
నీవిషయము వ్రాయుచుంటి నే నిచ్చటఁ దా
నేవాఁడు గాని యెందును
దైవమ్మను దాఁటలేమి తథ్య మ్మరయన్. 394

తే. గీ. నేను ఛాందసుఁడను గాను గాని కూఁతు
లకు వివాహమ్ములను వారలబలెఁ జేసి
యుంటి నిది గని ఛాందసుఁ డొక్కొ? యితఁ డ
టంచు లోకులు నన్ను నిందించవచ్చు. 395

తే. గీ. నే నెవనిపాదము గడిగి నీళ్ళ నెత్తి
జల్లికొని కూఁతు నిచ్చితి నల్ల యల్లు
వానితండ్రియు వాఁడును మానసమున
కెంతయో వంత గల్గించి రేమనందు. 396

వ. ఇయ్యెడఁ జాల వ్రాయవలయు,నల్లునకు నల్లునితండ్రికి నెడమొగంబు పెడమొగమే గాని సామరస్యంబు లేదు.వీరకాఁ డించుక చదివినవాఁడే యయ్యు నాస్తికుఁడు. మాతాపితృభక్తిమాత్రమ కాదుఏభక్తియు లేని వాఁడు పాపపుణ్యమ్ములు గణింపఁడు.కూఁతు నల్లుని వంచించి తాను బెండ్లినాఁడు పెట్టిన బంగరువే గాక అప్పుడపుడు నే నిడిన వెండిబంగారములును భూమియుఁ గూడ విక్రయించియా ధనము నపహరించె.

నియ్యది నాకుఁ గడుంగడు ఖేదంబు గల్గించె. సూత్రప్రాయమ్ముగ లిఖించితిం గాని యింకను వ్రాయవలసినది లేకపోలేదు. నాకు వృథా వాచాటకత్వంబు బొత్తిగాఁ గిట్టదు. ప్రస్తుతము వీరకాఁడును జామాత యును గడుంగడు వృథారటకు లగుకతన నా మనంబునకు విషాదం బనివార్యంబై చాలఁ బరితపించవలసె నని యెఱుంగునది. 397

క. ననుఁగూర్చి గాదు మఱి యె
వ్వనిఁగూర్చియుఁ గాని వృథగ వటవటవాగన్
వినఁ జాల నేను వియ్యం
కునినోరో? ఓటుచేదకున్ దీ టందున్. 398

క. సర్వజ్ఞత్వము బోలెఁడు
గర్వము దుర్వాదితనము గడుమూర్ఖత యం
తర్వాణ్యవిధేయతయును
దుర్వినయం బేమి సెప్పుదును దద్గుణముల్. 399

వ. ఇఁక నల్లునింగూర్చి.

క. సిగరెట్లు తఱచు గాల్చుట
తగనివిఱుగుఁబాటుతనము, ధార్ష్ట్యము మిగులన్
దెగనీలు గిట్టివానిన్
బగతుం డల్లునిగఁ గొన్న వగచెద నెడఁదన్........ 401

సీ. ఏమి వండు మటందు రీనాఁ డటని బిడ్డ
పలుసారు లడుగఁ జెప్పఁడు రవంత
నీ యిష్ట మనియె తా నెలఁతతో వాకుృచ్చు
మరల మరల బతిమాలి యడుగ
నించుకేనియు "నిద మిత్థ మ్మ"నఁడు కూఁతు
రవల వండును దోఁచినట్టి దానిఁ
దినువేళఁ బెట్టుఁ దంపిని బెద్ద లుండిన
వదరు నేవియొ విన్నవాఁడ నేను

తే. గీ. నాదుకూఁతు రటంచు నేనాఁడు మాట
గా దిది ప్రమాణముగ సాధ్వి గన్నకూఁతు
రన్నిటికిఁ దలయొగ్గు, నా కపుడు హెచ్చు
ఖేదమును గల్గు మోఁదమ్మ కెరలి పొరలు........... 402

క. ఎన్నఁడును విచారింపదు
త న్నిట్టి కుటుంబమునకుఁ దండ్రినయివనే
ము న్నెఱిఁగి యిచ్చినందుకు
గన్నియలం గనుటకన్నఁ గ ష్టియుఁ గలదే? 403

ఉ. మా మయి పుట్టుకన్నను బ్రమాదము వేఱొకఁ డుండఁబోదు సు
త్రాముఁడె యౌనుగా కొకసుతం గనుమాత్రముచేత మామయౌ
చో మశకమ్ముకన్నఁ గడుఁ జుల్కనయౌఁ బరితాప మంతగా
దోమకు నుండ, దన్నియును దుఃఖములే కద? మామగార్లకున్. 404

ఉ. మా మయి పుట్టుకన్నను బ్రమాదము వేఱొకఁ డుండ దెందు, నా
సోములమామ గొట్టె యయి చూపఱు నవ్వఁ జరింపఁ డే మఱే
మామకు గౌరవం బొదవు మానవు లెంతటి దక్షులైన సు
త్రామునికన్న మిన్న యగుదక్షునితోఁ దులఁదూఁగ నేర్తురే. 405

ఉ. మామ కొమార్తఁబట్టి తనమన్నన సర్వము గోలుపోవుచున్
దామసుఁడై నయల్లుని వృథాపరుషోక్తులు, పీరకాని, ని
స్సీమపుదూఱులుం జెవులచే వినుచున్ ధన మల్లవారికే
నేమముఁ గోరి యిచ్చు నఁట? సిగ్గని యున్నదె మామగార్లకున్. 406

ఉ. మామలు కూఁతులంగననిమానిసులందును నుండ్రుగాని, ఆ
మామలు వేఱు, కూఁతుఁగనుమామలు వేఱు హిమాద్రి సంద్ర మీ
మామలలోనివారె, యొకమామ హిమం బొకమామ నీరునై
నేమము గాంచి రె ట్లనినఁ జింత జడత్వము గప్పివచ్చెడిన్. 407

చ. ఇతరులగౌరవంబు గొనునేమనుజుండును గుండలందుఁ బాం
డితిఁ గనఁజేయఁ, డీదృశులు నింద్యులు మిన్నక కుండలందుఁ బాం

డితఁ బ్రకటించుసోమరి కనింద్యచరిత్రుసు గూఁతునిచ్చు పం
డితుఁ జెవి ముక్కు గోయఁడు మనీషియె? లక్ష్మణు డెంచిచూచినన్.

ఉ. "దారిక తండ్రికిన్ హృదయదారిక" యం చొకఁ డాడుఁగా, కెవో
దారికతల్లి అమ్మమయుదారిక, నాయనయమ్మయమ్మయున్
దారిక, వంశముంబెనుచుదారికలం గన కెట్లు నెగ్గు సం
సారికి; స్వర్గ మేగుటకు దారిక దారి కదా? తలంపఁగన్. 409

షరా:- శ్లో. దారికా హృదయదారికా పితుః, అని యభియుక్తోక్తి.

చ. అధమున కాలుగా నగుటకన్నను దాస్య మొకింత మెచ్చ నౌ
నధికునియింట నం చనె మహాత్ముఁడు పోతన యెంత చక్కనౌ
పథమును జూపె, నమ్మహితుప్రాజ్ఞత యెంతని సన్నుతింతు? నే
బుధుఁడు జగమ్మునం దతనిఁ బోలు జనుశ్శతముల్ దపించినన్. 410

ఉ. మా మయి పుట్టుకన్న నవమానము వేఱొకఁ డుండఁబోదు శ్రీ
ధాముఁడు పార్వతీపతియుఁ దామరచూలియు మామ లైరె? యే
పామరుపాదమో గడుగుపాతక మబ్బు నటంచుఁ గాదె? తా
మీ ముగురున్ సుతాజనకు లిప్పటికేనియుఁ గాక మానుటల్. 411

చ. అరయుఁడు విజ్ఞు లేను "విడియాకులచట్టు" మటన్న రోఁతగా
నరసెడివాఁడ నిప్పటికి నాత్మకు బుద్ధి జనించెఁ జట్టమం
దటికిని గాదు గాక తగుతల్లికిఁదండ్రికిఁబుట్టినట్టి య
గ్గటితల కుండుటే హితముగాఁ గనుపట్టు ననేకభంగులన్. 412

ఉ. అల్లురకున్ భయంపడుట అందఱికిం గలదే జగాన, నా
యుల్లము వీరకాఁ డనిన నుల్కిపడున్ గొమిరెన్ ధనానకై
యెల్లరఁ బోలె నమ్మికొన నే నెదియో యిడి కన్నె నిచ్చితిన్
గల్ల వచింప నా మదికిఁ గంపము పుట్టెడి వానిధాటికిన్. 413

షరా:- శ్లో. తజ్జామాతృపదాంకితో న కురుతే కిం నామ దుశ్చేష్టితమ్.
శ్లో. సదా వక్రగతి శ్చేతి జామాతా దశమో గ్రహః.

ఉ. ముక్కనునున్నపుడ్కయును బుద్ధియుఁ బూసయు నమ్మ యేదియో
యక్కఱయంట! వానిహృదయం బెటు లొప్పెనొ ? దాన నాధనం
బక్కట! బోలెఁ డున్నయది, అంతయుఁ గైకొని యాత్మసాత్కృతం
బెక్కరణిఁ బొనర్చెనొ ? యి దేమని సైఁతునొ ? యేమి సేతునో ?

ఆ. వె. ఎట్టిపాటులేని యింతులు సైరింతుర్రి
పుడమికన్న నోర్పు పొలఁతి కెచ్చు
భర్తసుంత తనదు వలపంతలోఁ బాలు
గలుగు జాలిగుండె గలఁడయేని. 415

ఉ. పోతన వాదు గాక పువుఁబోఁడివె నీ వనుకొందు, వాండ్రియ
య్యాతన లెల్ల నారసియె యాడితి వంతటిమాట, దానిలో
నీతి వినీతియున్ గలదు "నీచుని కాలుగ నుంటకన్న స్త్రీ
జాతికి దాస్యమే మెఱుఁగు సచ్చరితుల్ గలయోగ్యులిండ్లలో" 416

ఉ. పోతన వాదు గాక యొకబూతునుగూడ వచింతు గాక నీ
చేత మదెంత నొచ్చినదొ ? చెప్పఁగ నెవ్వఁ డెఱుంగు, నింతనే
బూతులబుంగ వాదువె ? పవిత్రమము నీ చరితంబు, చక్కనౌ
నీతిని జెప్పి తీవు గణనీయము నీనుడి పోతరాట్కవీ. 417

ఉ * పోతననోట వెల్వడినబూతగుఁగా కది నీతియే మహా
ఖ్యాతికిఁ దానకం బతనియానన, మయ్యెడ నుద్భవించునే
బూతును బూతటం చనరు పూతచరిత్రులు, నెత్తిఁ దాల్పఁగాఁ
జూతురు, దానిఁ గాదనెడిశూరులు సూరులయందు నుందురే ? 418

---

* ఆ. వె. అధముఁడైనవాని కాలగుకంటెన
త్యధికునింట దాసి యగుట మేలు
హీనుఁ బొంది యోని హింసింపఁగా నేల
యువతిజనుల కూరకుంట లెస్స.

[శ్రీమదాంధ్ర భాగవతము చూడుడు.]

ఉ. అత్త గయాళియై గుడుపునాఁడి కోర్వఁగవచ్చు నెట్టులో
బిత్తఱి; బిడ్డలం గనెడివేఁసయుంబలె; మామగారిదు
ర్వృత్తికి నైచమానవతు లెందుసు గానఁగరారు భర్తస
ద్వోత్తముఁ డైనచో నిడియు నోండొకదప్పెడి నన్యథా యెటుల్. 419

ఉ. అంగన యత్త కోడలును నంగన యైనకతాన, నెట్టులో
లొంగి చరించుఁ గోడ; లది లోకముతోఁ బరిపాటి, మామ యా
డంగిబొజుంగు, కుండలకడం దనబాండితిఁ జూపు నప్పు డో
యంగజభంగ; నీదుకరుణామృతమే శరణంబు సాధ్వికిన్. 420

ఆ. వె. న్యాయమెఱిఁగి నీవు నా యార్తి దప్పింపు
భర్త పట్టివెడఁగు పార్వతీశ
నేను గలుగఁజేసుకో నేరనిది యట్టి
పనియుఁ గాదు నీదె భార మభవ. 421

ఆ. వె. పుచ్చుకొనునుగాక పుత్రియు బూనయుఁ
బుట్టినిల్లొనఁగినయట్టిసొమ్ము
కొనెడియాస్తియెదియొ కోడలిపేరినే
కొనక తనదుపేరఁ గొను టదేల ? 422

ఆ. వె. నా ధనంబు నమ్మినాఁడు నా కేమియుఁ
దెలుపనేని లేదు దేవదేవ ?
అబ్బసొమ్మొ?తాతయాస్తియో కా దిది
దైవతంత్ర మెట్లు తప్పనేర్చు................. 423

ఆ. వె. పెండ్లినాఁడు నేను బెట్టించునగలు నే
"నడపదడప" యిచ్చినట్టిధనము
నమ్మి యిల్లు గొనియె నాత్మసాత్కృతముగ
దైవతంత్రి మెట్లు తప్పనేర్చు. 424

షరా:- తండ్రికొడుకులకు సామరస్యము లేదు.ఈలేమి చాలతరములనుండి
యీవంశమున విడువక వచ్చుచున్నది.వియ్యంకున కేకొంచెమో

భూమి కలదు గాని అది మాతామహుఁ డిచ్చినది.కొడుకు తనకు చెప్పినట్లు వినుట లేదు.నేఁడో రేపో గోడలి నవలకుఁ బొండనగల దురూహతో వియ్యఁకుఁ డున్నాఁడు.అందుచే తుదిదశలోనున్న నా కీవిషయము విషాదకారణ మయ్యెనని చదువరు లరయుదురుగాక.

ఆ. వె. ఇపుడు కోప మబ్బి యే నాడుమాట కా
దేమి కర్మ మొక్కొ?యీ జడాత్మ
మోరయందుఁ దోఁచు ఘోరపాతకములు
దైవతంత్రి మెట్లు తప్పనేర్చు................ 425

ఆ. వె. మున్ను పోతనకవిముఖ్యుఁడు చెప్పిన
"హీనుఁ బొంది"యన్న యిద్ధనీతి
సాధ్వు లనుసరించుశాసనం బగుఁగాక
యదియె వేదవాక్య మగును గాక. 426

ఉ. కూఁతునకున్ సుఖం బగుతఁ గొండికయల్లుడు బుద్ధిమంతుఁడై
"పాతకి తండ్రి యం చెఱిఁగి వర్తిలుతన్ మన మస్మదీయ మీ
రీతిని రోసి ని న్ననుసరించుత శంకర!త్వత్కృపన్ దనూ
జాతులు దీర్ఘజీవు లయి సౌఖ్యము గాంతురుగాక వీఁకమై......... 427

క. అల్లునియజ్ఞతకుం జిం
తిల్లుచు వియ్యంకుదుర్వినీతికిఁ గడు శో
షిల్లుచు బుధవిదళను జెళ
పిళ్ళ గడపె విజయవాడపేరిపురమునన్. 428

షరా:- అనాదిగా నీ కుటుఁబము దుర్వినీత మని యెఱిఁగియు నీ కుటుంబ మునకే నేనుగూఁతు నిచ్చుటకుఁ గల్గినసందర్భము జాతకచర్య186-51-52-53-54పుటములలోఁజూచిన సూత్రప్రాయముగగోచరించు- వియ్యంకునిదౌష్ట్యము నే నిందుపూర్తిగ వివరింపలేకపోతిని "అనుక్తమన్యతో గ్రాహ్యం"సర్వథా భగవతీ కామేశ్వరీ ప్రమాణమ్.

క. శివునిగుఱియించిచెప్పెడి
కవనమునం దెట్టి మహిమ గలదో? అది స

త్కవి వెంకన తెలిసికొనె
స్నవసియుఁ గృతి చెప్పుచున్ ఘనమతులు మెచ్చన్. 429

స్వభాను సం॥ చైత్ర బ ౧ మొదలు వైశాఖ శు ౭ వఱకును శనిలో రవిలో

—• కే తు వి ద శ •—

తే. గీ. అంతఁ గేతువిదశ వచ్చె నబ్జపుత్త్రు
విదశవలెనె హెచ్చుగను గవిత్వరచన
వీఁడు సాగించె ధనలబ్ధి విజ్ఞగోష్ఠి
జరిగెఁ బిమ్మట దానవగురుఁడు వచ్చె. 430

స్వభాను సం॥ వైశాఖ శు ౭ మొదలుకొని, ఆషాఢ శు ౫ వఱకును శనిలో రవిలో

—• శు క్ర వి ద శ •—

తే. గీ. అట్లు శుక్రవిదశ రాఁగ నర్కునందు
వచ్చువెంటనె యింట శుభంబు నెగడెఁ
బెదచిరంజీవికిఁ దనూజుఁడుదయమందె
నా స్థితి యథాప్రకారము నడచె నెలమి. 431

క. ఎంతేని ఎడరు మదిలో
సంతు కనారోగ్య మొదవి జనియించి, యుమా
కాంతునను గ్రహబలమున
సంతోషము ప్రబలె సంతు చక్కంబడుటన్. 432

క. నూటాఱు లొక్కశిష్యుఁడు
కూరిమిమైఁ దెచ్చి యిచ్చెఁగొండొకకవి బం
గారుగొలుసుతోఁగూర్చిన
గౌరీశంకరము దెచ్చి గళమున వైచెన్. 433

షరా:- నూటార్లిచ్చినవి త్రిపురనేనిసుబ్రహ్మణ్యం,డాక్టరు.కమ్మకులీనుఁడు శిష్యుఁడు. గౌరీశంకరము నిచ్చినది ముదిగొండ వీరభద్రారాధ్యులు.

క. గౌరీశంకరులను నే
నారాధించుటకుఁ దనిసి యయ్యది నా కా

గౌరీశంకరులే యిడి
నా రని ధరియింతు నే ననారత మదియున్. 434

క. నా కెవ్వఁడేనియును రుదు
రాకలు ధరియించుశంకరప్రీతిముఁడు గా
వీఁకఁ గనుపట్టు నాతఁడు
నాకుం గడుఁ బ్రియుఁడె కాఁడు నమ్ముండు నగున్. 435

క. వేమూరు "రాముజీ" కడు
ధీమంతుఁడు భక్తిగలవిధేయుఁడు శిష్యుం
డామెయి ననుఁ గృతిఁ గోరినఁ
గామేశ్వరిపద్యముల దగంగా నిడితిన్. 436

క. పొరుగూర వసించుట యొం
డరయఁగ దొసఁ గంతెకాని యఖిలమును యశ
స్కరముగ జరిగెను రవియం
తర మియ్యది వర్ణనీయతం గను టరుదే? 437

ఉ. ఆపొరుగూరుగూడ సుత,యల్లుఁడునుండుప్రిదేశ మౌటచే
గాపుర మింటనున్నటులె కన్పడెఁ బెండిలి వద్దు నచ్చటే
శ్రీపరమేశి తా సలుపఁ జేయుకతానఁ గుటుంబ మెల్ల నం
దే పొరి రాకపోక లొనరించిరి కొడుకులు మన్మలాప్తులున్. 438

స్వభాను సం॥ ఆషాఢ శు॥ ౫ మొదలు తారణ సం॥ మాఘ శు ౫ వఱకును
(19 మాసములు, శనిలో చంద్రాంతరము. అందు స్వభాను సం॥ శ్రావణ
బ ౬ షష్ఠివఱకును (నె 1, రో 16) చంద్రాంతరములో

—• చ ం ద్ర వి ద శ •—

క. రవియంతరమందున రా
హువిదశలో వచ్చినాఁ డనూరు విడిచి యా
రవియంతర మంతయు నిటఁ
గవితావ్యాజమునఁ గడచెఁ గనుఁడు మనీషుల్. 439

తే. గీ. వచ్చినదిమొద లేగెడివాంఛ గలదు
గాని యేగుసాహస మది గలుగ లేదు
బాహ్యకారణములు గవిత్వరచనాదు
లుండుఁ గా కేగలేకయే యుంటి నిచట. 440

క. వికలాంగులు నైత మ్ము
త్సుకులై రైలెక్కి యేగుచుర నా కేమో
అకటా ?కంపించు మనం
బెకసక్కెముగాఁ గఁ దోఁచు నిది యితరులకున్. ... 441

తే. గీ. చంద్రుఁ డేతెంచువెంటనే షాహుకారు
శైవభక్తుఁ "డాకార" వంశజుఁడు నన్నుఁ
జూడవచ్చె "నారంగలు" వాఁ డితండు
నాకు రుద్రాక్షమాల కాన్కగ నొసంగె. 442

వ. ఈతనిపేరు నరసింగగుప్త. యితనిభార్య యేఁబదిరూపిక లొసంగె. నింతియకాక యితండు స్కాందముద్రణమ్మునకుఁ దోడ్పడుటకు వాగ్దాన మొసంగె. 443

క. కలవాఁ డీతఁడు వితరణ
గలవాఁడును ధర్మబుద్ధిగలవాఁడును శ్రీ
గళునెడల భక్తి మిక్కిలి
గలవాఁ డెది సేయఁలేడు కళ గుదిరినచో. 444

వ. అది యటు లుండె నిఁక నే నీ బెజవాడయందే యుండుటంగూర్చి కొండొక లిఖింతు. 445

క. కూఁతురు, వియ్యపురాలున్ జా
మాతయు నన్నుపచరింప మఱచి యిలు శివున్
జేతమున నిలిపి శిష్యుల
జోతలు గైకొంచు నే నిచోట నుంటిఁ దగన్. 446

క. ఎచ్చటఁ బుట్టితిఁ బిమ్మట
నెచ్చట కేగితిని విద్య లెటు నేర్చితి ని
న్నెచ్చటఁ గట్టితిఁ బ్రస్తుత
మిచ్చటఁ గాపురముపెట్టు టిది యక్కజమౌ. 447

తే. గీ. ఎన్నియో పూర్తిచేసితి నే సమస్య
లీశురాణిరో? పూర్తిచేయింపు మమ్మ
యీ సమస్యను నాచేత నీవు నీకు
సాధ్యపడనిసమస్య లెచ్చట జనించు................ 448

క. శివమంత్రము పంచాక్షరి
కవితన్ మకుటంబుచేసికట్టితి, గౌరీ
ధవుఁడు తఱచు శైవులతో
నవినాభావమ్ముఁ గూర్చె నది కత మగుచున్. 449

క. "శివభక్తి" యనెడికబ్బం
పువిరచన ఘటించెఁ బిదపఁ బొరిఁబొరి విస్తే
శివలీలారచనాదు లొ
దవె శైవులతోడిపొం దొదవె సత మగుచున్........450

ఆ. వె. "ఈలకూర కేగి యిల్లటం బున్న" చం
దమున నిచట నుంటిఁ దల్లి! దుర్గ!
నీదునాజ్ఞ దాఁటరాదు బహ్మాదుల
కే నెవండఁ దృణమనేని గాను. 451

సీ. "పరదేశములు దివ్యతరదేశములటంచు
నేఁబదేఁడులకు మున్నేను వేంక
టగిరిరాజులఁగూర్చి యొగిఁ జెప్పినీసప
ద్యమున నాదగుజీవితమునుగూర్చి
దొరలె నేవియొ సదక్షరములు కొన్ని"యం
దలియర్థ మది నుంత దప్పకుండ

జరుగుచున్నది యది శాపమో?మఱి యేమొ?
కవి ఋషియంశమ్ము గల్గి పుట్టు
తే. గీ. ననిరి పెద్దలు ప్రకృత మయ్యది ధ్రువంబు
గాఁగఁ గనుపట్టుచున్న దొక్కయిది గాదు
బోలెఁ డిట్టివి దృష్టాంతములను నాదు
రచనఁ గనిపెట్టితిని సత్యరతు లెఱుఁగుఁడు. 452

షరా:- ఈవిషయము గీరతమునందలి గురుదక్షిణలో ఉ. ద్రావిడులందు మూఁగురుగదా?అనుపద్యమునందును, విగ్రహారాధనలో చ. అన దలటంచు మి మ్మెఱుఁగునంతకుమున్నె. అను పద్యమునందును, లోకాభిరామాయణములో, శా. ఓరీ! కృష్ణ? నికృష్ట? కష్ట గురు వైరో చ్చైర్మహా, అను పద్యముమాత్రమే కాక మఱికొన్ని పద్యములందును విజ్ఞులు పరిశీలింతురుగాక.

ఆ. వె. షష్టిగడియలందుఁ జాలభాగము శివు
కథలఁగూర్చి వ్రాయుగరిమ గలిగె
మస్కరియునుబోలె మనసు కుంచించి యే
కాంతముగ వసింపఁ గలుగు టబ్బె. 453

క. "నాఽన్యః పంథా" యని స
న్మాన్య మ్మగు శ్రుతి వచించె మజ్జని మిగులన్
ధన్య మని సంతసించెద
నన్య ముడిగి శివు నుతించు టది పైఁ గలదే? 454

తే. గీ. ఎందుకుం గొఱగానిది యీ వయస్సు
పనికిమాలినయీవయఃపాక మెల్ల
సార్థకం బగుమంచియుపాయ మబ్బఁ
జేసె వీరభద్రారాధ్య శేఖరుండు. 455

ఉ. ఎందఱు పెద్దలం గనిన నెన్ని శ్రుతుల్ స్మృతు లెన్ని యెన్ని క
ర్మందులబోధనల్ వినిన మంతనముల్ తలకిందు చేసినన్

మందు భవామయమ్మునకు మాధవు సంస్మరణంబ వేఱు లే
దందిన దెట్టులో యది పురార్జితభాగ్యము కల్మి నా కిటన్. 456

తే. గీ. నాకు సన్న్యాసమందుఁ జిన్నతన మాది
వాంఛ యున్నది దాని కీ వయసు తగిన
దైనను శరీరమునఁ దగినట్టిదార్ఢ్య
మించుకయు లేమిఁ గొనవైతి నేను దాని. 457

వ. ఇప్పటి నాజీవితము సన్న్యాసప్రాయంబుగనే కన్పట్టెడినని సంతసింతు.

తే. గీ. పుట్టి యే పదియేఁడులో పోవు దనుక
నాటపాటలతోఁ బోయె నవలవిద్య
యందు మెలఁగుట తప్ప నన్యం బెఱుంగఁ
జెడ్డ దుష్కృతులేనియుఁ జేసి యెఱుఁగ. 459

సీ. అనుభవించితిని దివ్యద్భోగములను రా
జాధిరాజులకన్న నతిశయముగ
సంచరించితిని రాజ్యస్థానములఁ బూర్వ
కవులకన్నను నిరాఘాటముగను
రచియించితిని వచోరమణితోడుగ రస
వంతమ్ములయిన ప్రబంధములను
ఆర్జించితిని నింత యతిథుల కిడి స్వయ
మనుభవింపఁగఁ జాలునట్టివృత్తి

తే. గీ. రాజమిత్రుఁడ నటుమీఁద రాజబంధు
వుఁడను బదిమందిగలుగు వంగడమువాఁడ
నగుచు శోభించుచుంటి నేఁ దగనె? సన్న్య
సించుటకు సంఘటింపద చేవ లేక............ 460

ఆ. వె. నాగరికత లేదు నా యూరుకడియాన
"నేన" మనెడియూరి కేగియున్న
కతన నాగరికతగలవాఁడ నైతి బా
ల్యమ్ము వోవుదెంచుపాఠియమంద. 461

ఉ. అప్పుడు వీధినాటకము లాడుట వాడుక, రామనాటకం
బొప్పుగ నాడఁ జూచి మఱియుం బఠియించియుఁ దెల్గునేర్చితిన్
జెప్పినవారు లే రెవరు, స్వీయమె సర్వము, ఫ్రెంచిస్కూలులోఁ
జెప్పెడితెల్గు నచ్చమిని జెచ్చెర నా బడి వీడి పిమ్మటన్. 462

క. కొలఁదిదినంబులు వీధిబ
డులలోఁ జదివితిని నిటు వడుగుబ్రాయమునన్
దలిదండ్రులు గలచోటనె
మెలఁగితి గానమ్ము వినికిమెయిఁ గయికొంటిన్. 463

తే. గీ. ఆవయసునంద నన్ను సారంగధరుని
పాత్రిగాసాత్తని యొకండు పాదుకొల్పెఁ
గాని తండ్రిగారిభయముకతన వేష
మూని నటియించుపనిఁ బూన నేను బిదప. 464

ఉ. ఎందుకు దీని వ్రాయు టనఃనీకృషి నాకు సహాయమై తెలుం
గందు నొకింత పాండితికి నాదరు వయ్యెఁ బదాలు జావళీ
లుం దొలఁదొల్తఁ గీర్తనములున్ రచియించితి నెన్నియేని యి
ప్డందలి దొక్కటేనియును నాదకు రా దెట రూపు మాసెనో? 465

వ. ఇట్లు కొండొక పదకవిత్వంబ కాక పద్యకవిత్వంబు కూడ నల్లుచుఁ జామర్లకోటలో మాధుకరంబు నెత్తికొనుచు భారవికావ్యము పఠించు వయస్సులో నప్పటినివాసగ్రామము (యేనాము,ఫ్రెంచిటవున్)నందు శాకుంతళనాటక మాడుటకుఁ గొందఱు యువకులు యత్నించి నాకుఁ గణ్వపాత్రి నటింప నిచ్చిరి.కాని తుద కానాటకము గారణాంతరమునఁ బ్రదర్శింపఁబడదయ్యె. 466

షరా:— నాటకప్రదర్శన మాఁగుటకుఁ గారణ మయ్యది ప్రజాప్రభుత్వంబు గలప్రెంచిటవు నగుటచే నంత్యజులకుఁ గూడఁ జూడ నధికార మీవలయు నను సమస్య గలిగి యందులకు గ్రామస్థులు పెద్దలు చాతుర్వర్ణ్యము వారంగీకరింపమి నది యసలే యాఁగె నని తెల్విడి.

తే. గీ. రంగుఁ జూయు తెఱుఁగని సారంగధరుఁడ
గడ్డమును గట్టు తెఱుఁగని కణ్వముని
నేనయితి బాస కొండొక నేర్చికొంట
కివి సహాయమ్ములై కైత కెసక మొసఁగె. 467

తే. గీ. ఇప్పటికి సర్వదేఁడులయప్పటిది చ
రిత్రి మియ్యది యిట నుదాహృత మగుటకు
గారణము నాకు బాల్యానఁ గవిత చెప్పఁ
గలుగుటకుఁ జిక్కుసామగ్రి దెలుపుకొఱకె. 468

తే. గీ. కలజగం బెల్ల నాట్యరంగముగఁ జేసి
జీవరాసులఁ బాత్రిముల్ నేసి తాను
సూత్రిధారుఁడుగా నుండు స్తోత్రపాత్రు
నాటకపుఁబాత్ర లంద్రు మానవుల నెలమి. ............ 469

తే. గీ. ఇంటి కేగుప్రియత్నమ్ము నెంతయేని
చేసినను సాఁగనే లేదు చేవ లేక
అంతఁ జంద్రునియంతరమందుఁ గుజుని
విదశ చనుదెంచెఁ దద్రీతి వివృతి సేతు. 470

స్వభాను సం॥ శ్రావణ బ ౬ మొదలు భాద్రిపద బ ౫ వఱకును శనిలో చంద్రునిలో

—• కుజవిదశ •—

తే. గీ. కుజవిదశ వచ్చుటాదిగాఁ గొంత కలహ
మంకురించెను వీరభద్రియ్యతోడ
వెంటనే శాంతి చేకూరె విస్తరిలక
తత్స్వరూపంబు వివరింతుఁ దద్జ్ఞు లలర. 471

క. ఆయన చేద స్తముగా
నేయదియో చనవుకలిమి నేకరువెట్టున్
రోయుదు నయ్యావి,యట్టుల్
నేయుదునేనియును రసము చెడుననుభీతిన్. 472

తే. గీ. "దక్షపుత్త్రిక తనమేను దగ్ధపఱచి
రూపఱుకతాన శోకంబు రుద్రునకు ఘ
టించె" నని వ్రాసితిని సంఘటించ దట్టు
లభవునకు దిద్దుఁ డన జొచ్చె నయ్యవారు. 473

తే. గీ. అతఁడు పరమాత్మ యగుఁగాక వ్యావహారి
కముగ గృహమేధిభావంబు గాంచుకతన
నస్మదాదులకున్ బలె నయ్యయి వికృ
తులకు నగ్గం బగుట కొప్పుదురు సుకవులు. 474

వ. ఇట్టు లెంత బోధించినను బరమేశ్వరుని కజ్ఞతాకళంకం బగుపట్టఁ గూడ దనియు నట్లగుపట్టినచో శైవసిద్ధాంతమ్మునకు వైరుధ్యం బాపాదించిన ట్లగు ననియు నాయన వాదము. వేఱొకవీరశైవారాధ్యం డాయనకుఁ దోడు అక్కతన నక్కడక్కడఁ గొన్ని మార్పులు స్థాందమ్మున నాయె ఱుక లేకయే పడె నని యిటీవలఁ దెలిసికోఁ గలిగితి. నందొకటి పాశుపతాస్త్రప్రదానఘట్టమ్మ 498వ పద్యమున నాల్గవచరణంబునందుఁ గలదు. మఱియు నా ఘట్టమ్మన నొకమత్తేభము — మ. అది గంగా ఝరి కాదు అనునది అసలే అచ్చులోఁ దొలగింపఁ బడియె. మఱియు గ్రంధారంభపద్యములలో ? నొక పద్యము — పదపడి యేగు చుం బలికె అనుఁదానిచతుర్ధపాదము నారచించినది కాదు. ఆరాధ్యులచేఁ గల్పితము. నా పాఠ మిట నుదాహరింతును. "చదువరు లాదరింప రసి స్వాంతము కొండొక సంశయించెడిన్. ఇట్టికూర్పు లచ్చటచ్చట నుండు నని చదువరు లెఱుంగ నగు. 475

ఉ. ఒక్కటి చెప్పుచుంటిఁ గల రుర్విని మత్కవితానురక్తిఁ బెం
పెక్కినవారు పల్వు రలయెల్లరఁ దార్సిసున నేరుపాటుగాఁ
బ్రిక్క నొకంట నింక నొకప్రిక్కను భద్రియ నుంచి తూఁప నీ
ప్రిక్కయె మ్రుల్లు సూపు నని భావము విప్పి వచింతు నే నిటన్. 476

తే. గీ. పచ్చిశైవుండె యయ్యును వైష్ణవమత
నింద కొప్పఁడు లేశమేనియు నితండు

స్వమతసంరక్షణమునకు జని సమస్త
మును వ్యయించుట కీతఁడు వెనుకఁబడఁడు.... ... 477

శా. సంతానంబు శివుం డొసంగఁ దనుచు స్వాంతమ్మునన్ లేశమున్
సంతాపింపఁడు మంచి చేసె ననియే సంతోషమున్ జూపు శ్రీ
కంతుద్వేషి సమర్చనంబునె సదా కాంక్షించు విజ్ఞాని యీ
యంతర్వాణికి వీరభద్రియకు నే నాశీస్సు లర్పించెదన్. 478

క. ఇతనికి నాకును మైత్రిని
సితికంఠుఁడె గూర్చె నంచుఁ జిత్తమునం దే
నతిగా ముద మందెద వృ
ద్ధత సార్థక మయ్యె శివుకతలు గూర్చుటచే. 479

తే. గీ. మొదట "శివలీల"లను పేర నిది రచింపఁ
దొరఁకొనుచె కాని లీలలవఱకె గాక
యిందులో వ్రితకల్పము లెన్నొ చేరె
వీరభద్రియారాధ్యులు గోరుకతన. 480

షరా:- ఇటీవల నీవ్రితకల్పములే "వ్రితకథలు" అను గ్రింథమైనదని యెఱుంగునది — (ప్రికాశకులు)

తే. గీ. శివుగుఱించిన దెదియేని శ్రేియ మిహము
నందుఁ బరమందుఁ గలిగించు ననుచు నాకు
భద్రియకుఁ గూడఁ గలదు విశ్వాస మక్క
తమున నియ్యది పెరిఁగె స్కాంద మనుపేర. 481

వ. దీనికి నాంధ్రిస్కాందం బనుపేరు వెట్టినను నియ్యది స్కాందమునం దలి పరమార్థమునే తెల్పును గాని మక్కికిమక్కి తెలుఁగు గాదు.సరి గదా౹మఱి యేవిధ మైన యనువాదమును గా దని విమర్శకులు గమనింప నగు కథలకుఁ గలపౌర్వాపర్యాదులు వీరభద్రియారాధ్యుల మీఁదనే యాధారపడియున్నవి. వేయేల౹ రచనమాత్రిమే నాది గాని తక్కినబాధ్యత యావత్తును వీరభద్రారాధ్యులమీఁదనే యాధారపడి

యున్నది. ఇందులకు ముఖ్యకారణమునా వార్ధక్యమును,ననారోగ్యము
నని తెల్విడి. 482

షరా:- యీ స్కాందరచన (శివలీలారచన) కుఁ గారకుఁడు పీరభద్రయ్య
గారికి నే నిచ్చిన చనవుకతనఁ గొంత అవ్యక్తత ఆయీకబ్బఁబునఁ
గానంబడియెడి.దానిని జదువరులు గమనింపకపోరు.నేను మొట్ట
మొదట నీయనను ఛాందసునిగా గుఱుతింపక ముద్రణభార మెల్ల
నీయనమీఁదనే యిడి మిన్నకుంటి నీ ఉపోద్ఘాతములో 9 పుటలు
వదలి తరువాయిపుటలు ముద్రింపించెను, అది కేవలము ఛాందస
మనక తప్పదు.ఏదో అవసర మున్న దని నాతోఁ జెప్పుచుండెడి
వాఁడు.తుద కాయన యూహ ఛాందసత్వప్రయుక్త మని తెలిసి
కొని ఆయనకు విపరీత మైన చనవు నొసఁగుట నాదే లోప మని
లజ్జింపవలసినవాఁడ నైతిని.

చ. ఇదివఱ కప్రయత్నముగ నే మొనరించినగ్రంథముల్ రసా
స్పదము లటంచుఁ బండితులు వల్కుదు రట్లనె మాకుఁ దోఁచు ని
య్యదియు నయత్నసిద్ధ మయినట్టిద,నిక్కమ దీనికిన్ రసా
భ్యుదయము కల్గునోఁ?కలుగవోఁ?యని డెంచము తందరించెడిన్. 483

వ. దీనింగూర్చి యింతగాఁ బ్రస్తావించుటకుఁ గతంబు నా జాతకంబునకు
సర్వదా శత్రుబాధ కలదు.ఎనుబదవవయస్సులో నున్న నామీసములకై
యసూయపడునొక యమాత్యయువకుఁడును వేఱొకయమాత్యవృద్ధుఁ
డును మాత్రమకాక బాల్యగురువులలో నొకరు గూడఁ జలము సాధిం
చుట జగమెఱింగినదే అందు వృద్ధామాత్యునింగూర్చి త్రిలింగపత్రికలో
42కాలములుదీర్ఘవ్యాసము(శుభస్యశీఘ్రం)వ్రాసి మందలించితి.సంతియ
కాక కృష్ణలోఁగూడ నన్నయ్యభట్టను పేరివ్యాసము కొన్నికాలములు
వ్రాసి మందలించితి.నా యీయమాత్యద్వితయములో యువకునియాగ్ర
హము కేవలము మీసములనుగూర్చినదియే.వృద్ధునిదోఁ?అట్లు కాదు.
వైదికశాఖవాఁడు కవిగా నుండనే రాదన్నంతలో నుండెడిని గుంటూరి

సభలో నాఁడు కొప్పరపుసోదరులకు మాతో సహాసన మీరా దని నే
నన్నందుల కీతనికి నాయందే కాక వైదికుఁ డనుకారణమునఁ గవికుల
గురు వగు వన్నయ్యభట్టునందును బోలెఁడు ద్వేషము. 484

చ. ముదుసలి,యెండతో కలరు పుత్రులు,మోఱకుగాఁడ,కొద్దిగాఁ
జదువరి,యేమి గుడ్డుటకొ?సత్యము దప్పి లిఖించుఁ డిట్టుఁ గో
విదులపథం బెఱుంగఁ డవివేకి కటా?గతకాలమంచుఁ దా
బ్రదికియె యుండి మాపయికి రాఁ డిపు డెందుకొ?లేచె వృద్ధుఁడై.485

వ. గుంటూరిసీమలోనికలహంబునాఁటి కీ వృద్ధుండు నలుబదియేండ్లవయ
స్సువాఁడై యుండెడిని.ఆ చరిత్రము దెల్పు కబ్బములో నెందఱివో పేర్లు దురభిమానుల వుదాహరింపఁబడియున్నను నీయనపే
రందు లేకపోవుటకుఁ గతం బితఁ డెందులకో!నాఁడు మూకీభావంబు
వహించుటయె.పలువు రీయన నిట్లు ప్రశ్నించి రనియు వింటి. 486

క. తనశాఖవాని నొక్కనిఁ
దనపక్షంం గూరుచుండఁదగఁ డంచున్ వెం
కన పట్టుపట్టె నని యీ
యనకున్ గోపంబు పుట్టి యనృతము లాడున్. 487

వ. యువకామాత్యునకు.వైదికునకు మీసంబు లేల యవియును ఆ మీస
ములుగూడఁ గవితాశూరతాప్రయుక్తంబులు కానేల యవియుం గోపము
మద్బాల్యగురువుగారికిఁ దమకవిత్వమును మెచ్చక పలువురు లోకులు
తిరుపతివేంకటేశ్వరకవులకవనము మెచ్చ నేల యని కోపము.తుట్ట
తుదివయస్సులోఁ గూడ ముగ్గురు ప్రబలశత్రు లున్నట్లు జూపితి గదా?
అక్కటతన వీరలకు భయపడవలయు నని యారాధ్యులకుఁ జెప్పినను
ఆయనకు నచ్చదు. నేనేమో? శిష్టాదిగురువు ననియు నక్కటతన నెవ్వ
రికి జంకవలసియుండ దనియు నాయననిశ్చయము. 488

తే. గీ. అసలుశత్రుల కవకాశ మావగింజ
యంత దొరకిన లోనున్నయయ్యసూయ

యేదియో గిల్కు౽ జేయుఁ బ్రిమావ మున్నఁ
జెప్పఁగా నేల? యరుల కుచేష్టలింక. 489

క. ఆరాధ్యులకు న్నాయెడఁ
గూరిమిమాత్రింబ కాదు గురుభావము నిం
డారం గల దక్కుతమున
వైరులకు న్నన్నుఁ జంకవల దనుఁ బెలుచన్. 490

ఆ. వె. "ధూళిపూడి"వైరి దురభిమానప్రపూ
రితుఁడు దెబ్బదేండ్ల వృద్ధు సేయు
ధూళిశంక లెఱుఁగుదురు ప్రాజ్ఞు లిచ్చట
విస్తరింప నేల?వెఱ్ఱిగోల ?. 491

తే. గీ. గురువుగారిశంకలు సరేసరి''కుబేరుఁ
డీశ్వరునకుఁ జీనాంబర మిచ్చె నన్న
"పోష్టు"ద్వారానఁ దెప్పింపఁ బోలు నన్న
నీరసపుశంక నెఱుఁగనివారు లేరు. 492

వ. శంక యెట్టిదైనను సమాధానము నపేక్షింపక పోదు.''గుడ్డిము గ్రుడ్డిదే యైనను గుగ్గిళ్ళ కర్చు తప్పదు గదా! శ్రీమదాంధ్రిభాగవతమునందలి దక్షునియాగముఁ జూడవచ్చినదేవతాస్త్రీలు చీనిచీనాంబరములు ధరించుట తెలిసినవారికి గురువుగారిశంకాతత్త్వము బోధపడియెడిని''అనాదిగా నిట్టి కుశంకలు చేయువా రుంటంజేసియే తిరుపతివేంకటేశ్వరుల పేరు పైకి వచ్చినదని పలువు రెఱుఁగుదురు. సీ. ఏమహాత్ములు గల్గ భూమీశసభలలో గవులకు బహుళవిఖ్యాతి గల్గె. అని నరసభూపాలీయగ్రంధకర్త యీ తెగవారిని మృదువుగా మందలించినాఁడు.... 493

క. కస్తూరిసుకవి విమతుల
మస్తకములు వాచునట్లు మహనీయుఁడు వి
ధ్వస్తజ్ఞానుల నెల్లర
స్వస్తికి దూరగుల దూఱి సద్యశ మందెన్........ 494

షరా:- ఈ "కస్తూరి సుకవిని'' గూర్చి గుంటూరిసీమలోఁ జూడనగు.

ఉ. ఎందఱ లేను గర్విమ్మి పయి కే ద్రైఱ దూఁకెడివారి చెయ్వులే
నిందు లిఖింతు నన్న వినుఁ డిప్పటికిం గల రేరా శాత్రవుల్
ముం దభియోక్తలై విజయముం గన కేదియొ రంధ్రమున్ గనం
గం దలఁపూనువార లటు గావున వారికి జంకు టొప్పగున్. 495

వ. అని మత్పరమమిత్రునకు వీరభద్రారాధ్యునకుఁ దెల్పుటకే యని యెఱుంగునది. 496

తే. గీ. మొదట లీలలరచన సొంపుగనె జరిగెఁ
గాని క్రమముగఁ జేదస్తమైన ఫక్కి
రచన కొండొక విధిలేక ప్రచుర మయ్యె
వీరభద్రయ దానికిఁ గారణంబు. 497

ఆ. వె. "ఎవనిపిచ్చి వాని కెలమి నిచ్చు'' నటన్న
ఫక్కి సుకవి తనదు పథముఁ బట్టె
రచన సల్పునెడల రుచియించు, రుచియింప
కుండు నొరులదోస ముండ దచట. 498

క. కురిసెడిపర్ణకుటీరము
పొరిఁబొరి నాకులను దోపి పొదిగినటు కవి
త్వరచన నతుకులు బొతుకులు
తఱచుగఁ జేర్చునెడ రసము తగ్గక యున్నే. 499

తే. గీ. కవికిఁ దోఁచినయట్టులు కలము నడుప
వలయు నొరులకుఁ జోటీయ వలనుపడదు
దీని నెఱిఁగియుఁ జనవుకతానఁ గొంత
చోటొసంగితి నెఱుఁగుఁడు సూరివరులు. 500

క. తపొప్పొ ? యొప్పొ ? పూర్వము
చెప్పిననాకైత స్వేచ్ఛచే నడచినదే
నిప్పుడు చెప్పిన దట్టులు
చొప్పడమిని శతృవులకుఁ జొరఁబడ వీలా. 501

చ. అతిశర మైన యాశవున నంబరొ ? లీలలు గాక కొన్ని స
ద్వ్రతములు చేర్చి నీ పతికి భక్తిప్రపత్తియుఁ గల్గఁ పేర్మి నం
కిత మిడినాఁడఁ జేవ చెడి కేవలదేహముతోడ నుంటి ము
ద్రిత మగుదన్క నాయెడల దీవన లిచ్చి బలంబు పెంపుమా ? 502

ఉ. తప్పులు నాదుకై తమెడఁ దట్టవు లోకుల, కొప్పులైనవే
తప్పు లటంచు భ్రాంతిపడి దైన్యము పొలగు టీ వెఱుంగు, దే
నిప్పుడు చెప్ప నేల ? పరమేశ్వరుఁడే యిట సాక్షి, యెందఱో
"పెప్పెపె మెమ్మెమే" యనెడిపెద్దలు సాక్షు లబద్ధ మున్నదే. 503

తే. గీ. వీరభద్రియారాధ్యులు వేవిధములఁ
నచ్చు సాఁగించుటకునై ప్రియత్నమును బొ
నర్చుచున్నాఁడు తల్లిరో ? నాదుసాయ
మతని కుండనిచోఁ దప్పు లడరు గొలుపు. 504

క. కను లున్నవి చూచుటకున్
గను నోపిక చాల సడలెఁ గావున నిన్నున్
బనిగొని వేడెద నెట్లో
జననీ ? యొసఁగఁ దగు నాకు సత్త్వం బోడలన్. 505

క. స్కాందం బాంధ్రిము నేఁత య
మందరయంబడర నెగ్గె మన్చితి శుభమున్.
సందర్భించితి విపుడీ
సందర్భము నెగ్గఁజేసి జయ మిడు మంబా ! 506

శా. ప్రారంభించినవేళఁ బట్టియొ ? భవత్ప్రాణేశనిర్వ్యాజపుం
గారుణ్యమ్మను బట్టియో ? దినము నే గండమ్మగా నుండియున్
సారస్యం బెటు లున్న గ్రంథము నెటో సంపూర్ణముం జేయఁగా
నారాధ్యుం డది గాంచి పొందెఁ బరమాహ్లాదంబు దుర్గాంబికా. 507

ఉ. ఎన్నఁడు గాని నేఁ గవన మేదియొ తోఁచినయట్లు చెప్పచే
విన్నను వొప్ప నుండినను వేఱొక రీతిగ నున్న మార్చుటల్

సున్న, ప్రపంచమం దితరసూరులసాయము గోరువారు వే
లున్నను నేను వారిబలె నొక్కపుడుం జరియింప నంబరో? 508

తే. గీ. ఎవ్వరికిఁ గాని పొత్తమ్ము నే నొసంగ
నడుగుచో నిత్తుఁ గా కభిప్రాయ మడుగ
నిట్టివ్రతము నా కుండుట యీ వెఱుంగు
దీ తుదివయస్సులో దాని నెట్లు మఱతు. 509

తే. గీ. నన్నయయుఁ బోతనయును శ్రీనాథభట్టు
మొదలుగాఁగల సుకవులు మున్ను విస్త
రించి కూర్చినవే భద్రకృతి యొసంగి
కబ్బమును గట్టు మనియె శక్య మగు టెట్లు. 510

ఉ. ఆయనకోరునట్టివి సమాదరణీయము లౌనొ? కావొ? నే
నీయెడఁ జర్చసేయఁ గలయింగిత మంతగ లేదు నాకు; నే
దో యొకనూత్నమార్గమున నూఁపిరియున్నకొలందికబ్బమున్
జేయఁగ నేర్చితిన్ సుకవిశేఖరు లెట్లు బహూకరింతురో? 511

తే. గీ. ఇందు నొకకైతయే కాక యితరసైత్య
ముండు నని నాకె తోఁచెడి నొక్కొకపుడు
వృద్ధదశయౌకతమ్మున నితరులపయి
భార ముంచితి వహియించుపటిమ లేక. 512

క. గతి గానక వార్ధక్యం
బతిగా మితిమీఱుకతన నారాధ్యులపై
నితికర్తవ్యభరంబు ని
డితిఁ బ్రేరకుఁడున్ హితుఁడు గడింది ఘనుండున్. 513

శ్లో. జ్యేష్ఠే సర్వగుణైః కనీయసి వయోమాత్రేణ పాత్రే ధియాం
గాత్రేణ స్మరగర్వఖర్వణపరే నిష్ఠాప్రతిష్ఠాశ్రియే
శ్రీహర్షే త్రిదివంగతే మయి మనోహీనే చక శ్శోధయే
దత్రాఽశుద్ధ మహో? మహత్సు విధినా భా రోఽయ మారోపితః. 514

అని శ్రీహర్షనియన్న గోవిందపండితుఁ డనియె.

చ. కవినయిపుట్టినందులకుఁ గాయము వృద్ధత కోర్చి యెట్టులో
చివికియు నిల్చినందులకు శ్రీగళసేవ లభించె వీరభ
ద్రవిబుధుకారణమ్మున ముదం బిఁక నింతకు నేమి కావలెన్
కవిత యెటేని యుండెడినిగాక శివుం డొసఁగున్ శివమ్ములన్. 115

స్వభాను సం॥ భాద్రపద బ ౭ మొదలు మార్గశీర్ష బ ౩ వఱకును శనిలో చంద్రునిలో

—• రా హు వి ద శ •—

తే. గీ. కుజవిదశ వోవుదెంచెడి కొండొకతఱి
నొక్కవిప్రుఁడు సంపన్నుఁ డురక నన్నుఁ
జూడవచ్చి కృతి యొకండు సొంపుమెయి ర
చించి యంకిత మిడఁగఁ బ్రార్థించి చనియె. 516

వ. చనునప్పుడు తనకుఁ బూర్వహరిశ్చంద్రచరిత్రమ్మునందు మిక్కుట మైనప్రీతి గల దనియు నయ్యది రచించి యంకిత మిచ్చిన సంతసింతు ననియుం జెప్పె. నేను దన్ముఖంబునన తచ్చరిత్రంబు విని కొలఁదిదిన మ్ములలోనన దాని రచించితి. నవ్విప్రసత్తముఁడు విని యానందించెఁ గాని సన్మానవిషయమున నేవియో బేరములు చేయుచున్నట్లు నాకుఁ దెలిసి యట్టివానికిఁ గృతి నిచ్చుట లజ్జాకరం బని నన్ను నేనే మంద లించికొని విరమించితి. విరమించినపిమ్మట మరల నా సంపన్నుఁడు నా కడకుఁ గొందఱుమిత్రులతో వచ్చి తాఁ గోరినకృతి తనకే యిచ్చి కృతార్థత కలిగింపవలయు ననియు నన్యథాకరింపవల దనియుం గడుం గడుఁ బ్రార్థించి వారముదినములలో వచ్చి సమ్మానింతు ననియుం జెప్పి చనెఁ గాని మరల రానే లేదు. ఆ యీ బ్రాహ్మణునితో నాకుఁ బరిచయము గల్గించినవాఁడు ప్రతాపరాఘవపాకయాజి, ఆయనం గూర్చి కొండొక యిటఁ బ్రస్తావించెద. 517

తే. గీ. అతనిభార్య నిక్కమ్మగ నన్నపూర్ణ
అతఁడు విశ్వేశ్వరునియంశ మని తలంతు

నిరత మాతనియింటను జరుగునన్న
దానమును జూచినం జాలు నేనమడఁగు. 518

క. ఏ యుద్యోగమ్మును లే
దే యాధారమును లేద యి ల్లెప్పుడు స్వా
ధ్యాయపరు లతిథులకు ని
క్కై యుండును నతని రిక్తుఁ డని యనఁ గలమే! 519

ఆ. వె. పిండివంట లేక పెట్టఁడు భోజనం
బిట్టికఅవునాళ్ళ నెందతేని
లేదు హొమ్మనం డళీక మియ్యది గాదు
స్వయముగాఁగ నరసి వ్రాయువాఁడ. 520

తే. గీ. పయికిఁ గన్పడు రిక్తునిపగిది నిక్క
మరసినను రిక్తుఁడే సందియంబు లేదు
చేయుసత్కారములపట్ల శ్రీకిఁ బుట్టి
నిండులు జమీనుదారులయొసక మలరు. 521

తే, గీ. సిగ్గుపడినాఁడ నాతఁడు సేయుసత్క్రి
తులను గై కొనుటకు నేను"వల"దటన్న
మానఁ డొకనూఱురూపికల్ మా నిమిత్త
మితఁడు వ్యయ పెట్టె నాదర మెసక మెసఁగ. 522

క. బలవంత పెట్టి న న్ని
యలఘుఁడు సకుటుంబముగను నాహ్వానించెన్
గొలిచె నిలువేల్పుగా,రా
జులు సేయర యీతఁ డగ్రజుఁడు సేయుగతిన్. 523

తే. గీ. ఏ నచట నున్నయప్పుడ వృద్ధవిప్రుఁ
డొక్కఁ డేతెంచె నన్నార్థి డొక్క లక్క
ళించికొని యుండె నన్నమ్మ లేమిఁ;బ్రొద్దు
గ్రుంకుతఱి,నన్న మిడి తుష్టి గొలిపె నితఁడు. 524

క. కల రన్నదాత లెందఱొ
కలిమిం దులఁదూఁగువారు కడు రిక్తుండై
యలఘుం డవ్వారలకున్
దలఁదాఁటున్,గాంచి సే ముదము గై కొంటిన్. 525

క. ఈ కఱవుకాలమున సు
శ్రీకులు బెజవాడలోనఁ జేయుచునున్నా
రాఁకలిగొనుబీదలకుఁ
శ్రీకిన్ సార్థక్య మలవరించుచుఁ దృప్తిన్. 526

క. చుండిరి వెంకటరెడ్డి య
ఖండుం డాఖండలుండు గని మెచ్చెడిశ్రీ
యుండినవాఁ డాతఁడు ది
జ్మండలమున కెక్కె ధర్మమర్మజ్ఞుండై. 527

తే. గీ. పదియుఁ గావు నూఱులు గావు పదియు నూర్లు
గావు లక్ష లతఁడు ధర్మకార్యములకు
కర్చు పొనరించుచుండె నీ కఱవుకాల
మతనికి భయంపడుచు నుండె నలమ లేక. 528

తే. గీ. అతనితోపాటుగాఁ గొంద ఱార్యవంశ్యు
లిప్పురమ్మున బీదల కెలమి నన్న
మొసఁగి తమ కల్మి సార్థక్య మొందునట్లు
వెలయుచున్నారు వారి దీవింతు నేను. 529

ఉ. చేయఁగ లేరు దానములు శ్రీగలవారలలోననెందఱో
చేయుతలంపుగల్గుఘనుఁ జెందుమనీషయె లేదు శ్రీకి;రెం
డీయెడఁ గొంతమందికడ నేర్పడి యుండుటఁ జేసి సంతసం
బై యలవారిఁగూర్చి హృదయం బిట వ్రాయఁగఁజేసె వేడుకన్. 530

షరా:- ఈ శనిమహాదశలోనిచంద్రాంతరములోనిరాహువిదశయందే తూర్పు
గో॥ డి॥ రామచంద్రపురంతాలూకాకోలంకగ్రామమునందు క్వెటు

రెంటుభూమి యెనిమిదియెకరముల పైచిల్లర కొనఁబడినది. అందు లకై సుమారు పదివేలు రొక్కము నిల్వయున్న బంగారువస్తువులు విక్రయించి పేకరింపఁబడిన దని యెఱుఁగ వగు.

వ. ఈవిధమ్మున నీ రాహువిదశ యతిక్రమించె కుజరాహువిదశలలో స్కాం దము చాలవఱకు నచ్చువడియె. భూశిపూడి శాఖాభిమానికతనఁ గొండొక కయ్యమున కవకాశము సంఘటించు ననుకొంటిం గాని యతని నెవ్వరు నాదరింపమింజేసి అదియును దప్పె. విరివిగాఁ గవితావ్యాసంగము జరిగెఁ గాని.

క. ఆరోజున కారోజాక
తీరున మా ర్పొదవుచుండె దేహమ్మునఁ బై
వారికిఁ జెప్పినఁ దెలియని
మాఱుపు మానసమునందు మసలఁ దొడంగెన్. 532

వ. ఆ మాఱుపు నీ పద్యములు దెలుపు గాన నుదాహరింతు.

తే. గీ. పుట్టు వందినమఱునాఁడు మొదలుగఁ బర
దేశములవెంట విద్యకో? దేనికో? తిరు
గంగఁ జేసితి బెజవాడ కట్టుఁగొయ్య
గాఁ బొనర్చితి వేల దుర్గా? భవాని. 534

క. ఓపిక తగ్గెను "రైలున"
వే పగిదిం గూరుచుందు నెటు లేగుదు? దు
ర్గా? పరమేశ్వరి? నీ దరిఁ
గాపుర మీ వార్ధకమునఁ గల్పిత మయ్యెన్. 535

ఆ. వె. ఏమిపనికి నిచటి కే వచ్చినాఁడఁ బై
వేటి కాఁగినాఁడ నిది సమస్త
మంబ! నీ విలాస మనుకొందు స్కాందపు
రచన వీరభద్రురాక యెదియు. 536

క. కల రుపచరించువారలు
పలువురు నా దేహయాత్ర పరులపరం బొ

విలయము గూర్పనిగతిగా
నిలుపుము కవనంబు గట్టి నిన్ను యజింతున్. 537

క. పలువురు విద్యార్థులు న
న్నెలమిన్ సేవించునప్పుడేనియుః దత్సే
వలు గైకొను టెఱుఁగ నెటో
బలి మిడు మొక్కింత లేచి పన్నుండుటకున్. 538

క. ఇరువదియేఁడులవయసునఁ
బరిరంభణ మాచరించెఁ బ్రాభవదశ యీ
వఱ కది సురుఁగదు తావక
కరుణ యిటే జరుపుఁగాక కలకాలమ్మున్. 539

షరా:- 539 వ, పద్యమునందలియంశమును జాతకజ్ఞులు కుసుమయోగ
ఫలిత మని నిర్ణయింతురు.

శ్లో. లగ్నా త్సప్తమగే చంద్రే చంద్రా దష్టమగే రవౌ
గురుణా సంయుతే లగ్నే యోగః కుసుమసంజ్ఞితః
కుసుమాఖ్యే తు సంజాతో భూపాలో బంధురక్షకః
వింశ త్యబ్దా త్పరం గ్రామపురకర్తా భవిష్యతి.

ఆ యీ కుసుమయోగము శతమంజరీయోగాలలో మొట్టమొదటిది.
సరిగా నిరువది వత్సరములప్రాయమునందే యోగ మారంభ మైన
దని జాతకజ్ఞులరయుదురుగాక.

తే. గీ. అంఘ్రిసంవాహనాదికృత్యములకు నల
వాటుపడలేదు శిష్యులు భక్తికతనఁ
జేయఁబూనిన నందుకుఁ జిత్త మొప్పి
కొనమి తల్లిరో? నీ వెఱుంగుదువు కాదె?. 540

తే. గీ. ఇట్టినాకు బరాధీనహీనదశను
దేకు మని నిన్నుఁ బ్రార్థింతు దేవదేవి ?

ఇంతకన్నను గోర్కి నా కెదియు లేదు
నీకు భక్తుఁడ ననుపేరు నిల్పు మంబ! 541

క. పరదేశమునందే శుభ
పరంపరలు నాకుఁ దఱచు ప్రాప్తించెను నీ
కరుణ నను బాల్యమాదిగఁ
బరదేశనివాసిఁ జేసి ప్రబలించె నెటో. 542

తే. గీ. పెండిలికిముందు స్నాతకవిధికిఁ గూడఁ
బరులె తలితండ్రులై జరిపిరి మహంబు
భవము సర్వంబు పరులసంపదలు గుడుచు
నట్టిదే యయ్యెఁ గారణం బెట్టిదొక్కొ. 543

వ. నా వివాహంబు తలంపనితలంపుగా నగుటచే స్నాతకసయమునకుఁ తలిదండ్రులు రాలేకపోవుటచే నితరు లా భారము నిర్వహించిరని తెల్పెడి.

క. పరులే పెండ్లి యొనర్చిరి
పరులే విద్దియలు నెప్పి ప్రబలించిరి త
త్పరులగుచు నన్నుఁ దుదకుం
బరదేశమె శరణ మేమొ? పరమేశానీ? 545

క. అతినిస్సత్త్వముతోడం
బ్రతికించిన లాభ మేమి? పరమేశ్వరి? ము
ద్రిత మగు పెట్టులు స్కాందము
కృతి నీ పతి కిచ్చినాఁడఁ గృపఁ గను మంబా. 546

క. కలలో వేనియు మది నే
నలుపుదు నను కొనని పెండ్లి పలిపితి వడుగున్
నలిపితి సుతునకుఁ బౌత్రిన
కెలమి న్నీదుకృప గాక యిది నా బలమే. 547

ఆ. వె. నడుమునొప్పి నాకు నలువదేడుఁలనుండి
యాశ్రియించి యున్న దంబ? యిప్పు

డది ప్రకోప మంది యలజడి గలిగింప
కుండఁ జూడు మింక నొంటు గోర. 548

తే. గీ. వీరభద్రయారాధ్యులు వేవిధముల
నచ్చుకొఱకు యత్నించెడి నదియు నాడు
సాయ ముండనిచో నెగ్గఁజాల దెఱఁగి
నడుము కాపాడు మని ప్రార్థనం బొనర్తు. 549

షరా:- 549వ సంఖ్యగలపద్యములోని వీరభద్రారాధ్యులనుగూర్చి లోఁగడ నక్కడక్కడఁ గొండొక వ్యాకరించియుంటిని. ఈయనకును నాకును గలిగిన మైత్రి కేవలము కాకతాళీయము. పరమశివుఁడే యీ రూపమున వచ్చి నన్ను గ్రంథరచనకుఁ బురికొల్పె నని నా విశ్వాసము. నే నీ బెజవాడలో నాఁగుట కీయనయే ప్రథమకారణము. పిమ్మట నా యసమర్థత, చదువరులు తత్త్వ మిట్లరయు దురుగాక.

తే. గీ. ఎందులకుఁ గాని కొఱగాని వృద్ధదశను
గైత బండ్లఁ దోలించితి కరుణ నెఱపి
మిగులు నాయువు కూడ నిమ్మెయిని సార్థ
కముగఁ గడవంగఁ జేయుట కామ్య మంబ ? 550

వ. ఇట్లు దుర్గాపరమేశ్వరిని వేడికొనుచు రాహువిదశకూడ బెజవాడలో నపనయించితి.

స్వభాను సం॥ మార్గశీర్ష బ ౩ మొదలు ఫాల్గున శు ౪ వఱకును
శనిలో చంద్రునిలో

—• గు రు వి ద శ •—

క. ఓపిక తగ్గియుఁ గవన
వ్యాపార మ్మొకటి నాకు నంబిక కాల
క్షేపమునకు నిదుకతమున
నే పాపము లేక రోజు లేగుచు నుండెన్. 552

తే. గీ. ఏదినమునందుఁ గవిత యొకించుకేని
నేలిఖింపనో ? వాక్ప్రిత్తు నిజము నాకు
నాదినము దుర్దినంబు సమ్మోద మిడదు
కవు లెఱుంగుఁడు నా వార్ధకమువిధమ్ము. 553

క. స్కాందమ్ము ప్రూపు దిద్దుట
స్కాందము విరచించుటయును గాలక్షేపం
బిందులకు వీరభద్రయ
స్కందజనకభక్తుఁ డడరెఁ గారణ మగుచున్. 554

తే. గీ. అమరవాదికులుఁడు దేశికాంఘ్రిభక్తుఁ
డిచ్చె మును పఱనూఱాలు లిపుడు మరల
నెవరో వైశ్యుని బురికొల్పి యీయఁ జేసె
నితనిగురుభక్తి వర్ణ్యమై యెసక మెసఁగు. 555

వ. అంతియ కాక తానాంధ్రీకరించిన చంద్రాలోక మనుపోత్తం బంకితం
బొసంగి సత్కరించె నని యెఱుంగునది. 556

క. మానసమున కొక్కెడసం
తానారోగ్యముకతనన్ గొందొక చిం
తానుగతి దొడరియును నీ
శానికతన వెంటనే ప్రశాంతియుఁ గలిగెన్. 557

క. ఏనాఁటికి నానాఁడే
యీనాఁడు గడచునోకో ? యథేచ్ఛగ నని డెం
దాన నెడరు దొడరియు నీ
శానికతనఁ గాల మెలమి జరుగుచునుండెన్. 558

వ. ఈగురువిదశయంద తణుకుకోర్టుప్లీడరు శ్రీయుతుఁడు బలిజేపల్లి
వేంకటసుబ్బారావుగారు తనకొమిరెపెండ్లికి నే నేగలేక యేగకున్నను
నందులకు సంబంధించు బహుమాన మని యీ బెజవాడకే తెచ్చి
ముప్పదిరూపిక లొసంగి గారవించె. మఱియు నీ విజయవాడపురివాస్త

వ్యఁడు శ్రీమంతుఁడు నగు నద్దేపల్లి వేంకటరామయార్యుఁడు నిర్ని
మిత్తముగ నాహ్వానించి విలువగలవస్త్రములును నర్ధనూటపదాఱు-
రూపికలును నొసంగి సమ్మానించె నని యెఱుంగునది. 559

తే. గీ. ఋయిదొకరువేసినట్టిది కాదు గాక
ఆత్మబుద్ధికృతం బయి యవలి కెపుడుఁ
జనకయుండు కారణమున సంభవించి
నట్టు లయ్యెను శనిగుణ మరయు డిదెయు. 560

వ. మహాదశాధిపతియగు శనికిఁ గలయధికారములలోఁ బంధనాప్తియుఁ గలదు. వాఁడు పూర్తిగా దోషియగునేని జాతకునకు బంధనప్రాప్తి తప్పదు. గాని నవమాధిపతియైనకతనఁ గొంత దోషము తగ్గివదనియు నక్కతన నింతమాత్రముతోఁ దేల్చె ననియు విజ్ఞు లరయుదురుగాక. మఱియు నీ గురువిదశ తుట్టతుదిని శ్రీబొబ్బిలిమహారాజావా రంపువార్షికము నూఱురూపాయిలును ఇన్స్యూరు కూడ వచ్చె నని తెల్విడి.

స్వభాను సం॥ ఫాల్గున శు ౪ మొదలు తారణ సం॥ జ్యేష్ఠ శు ౪ వఱకును
శనిమహాదశలో చంద్రాంతరములో

—• శ ని వి ద శ •—

చ. ఇరువురు కాకవుల్ జడు లొకించుక యల్లి కెఱుంగువార లి
త్తఱి నరులౌచు మీసములతత్త్వముగూరిచి మున్ను వేంకటే
శ్వరుఁడు రచించినట్టియలపద్యము వారియమాత్యకోటికిన్
గర మయశస్కరం బనుచుఁ గాఱులు వ్రాయఁదొడంగి రీర్ష్యమై. 562

షరా:- ఉ. దోసమటం చెఱింగియును - పెంచినార మీ మీసము - రెండు
భాషలకు మేమె కవీంద్రుల మంచు - (నానారాజసందర్శనము)

తే. గీ. ఒకవి కక్కరములు వచ్చు నొకవి కవియుఁ
బూర్తిగా రా వనఁగవచ్చు ధూర్తు లాత్మ
శాఖ కవమాన మంట? మీసములపద్య
మెంతటిపప్రిబుద్ధులో వారలిలకు బరువు. 563

వ. వీరిని శనిమహాదశలో,చంద్రాంతరములో,కుజవిదశలో స్పృశించి విడి
చితి నిందలియువకుఁడు వదరువదరులకు మితియే లేదు. దీనిమీద
"లీగలు" చర్య జరుపవలసియున్నను నయ్యది నాకుబొత్తిగా రుచింపని
కతన మిన్నకుంటినని చదువరు లరయుదురుగాక. 564

తే. గీ. భాషనుండి యాపద్యము పాఱఁదోల
వలయు నఁట?వీనికోరిక పాడుగాను
దీని నేగతిఁ దీర్పఁగా నేను బూను
వాఁడ నివ్వాఁడు నిక్కము వాతులుండు. 565

క. పంచాంగమ్ములు చింప న
శించునె?రిక్క లని హితము చెప్పిన వినఁ డీ
పంచజనుఁడు కేవలము న
కించనుఁ డనుకొంటిఁ జిత్తగింపుఁడు విజ్ఞుల్. 566

ఆ. వె. సంజముక్కరానిజడులకుఁ గూడ మీ
సములపద్య మనినఁ జనువు జ్ఞప్తి
గలదు దాని నేను గ్రంథమ్మునుండి తో
లంగఁజేయ నేమి లాభ మరరె? 567

వ. ఈ యువకునకన్నను వృద్ధుని బుద్ధిమాంద్యము మఱియు శోచ్యము.
వృద్ధుఁ డైదాతేండ్లనుండియు యువకుండు రెండేండ్లనుండియుఁ గొంత
పరోక్షమ్మునఁ గోలాహల మొనర్చి విజ్ఞులచే మందలింపంబడుచుండి
యునుఁ దమయుద్యమమును విరమింపలే దని యెఱుంగునది.ఈజం
టలో రెండవవాఁడు తిట్టుతిట్లకు మితియే కనుపడదు. వీనితిట్లు గురువు
గారితిట్లను గూడఁ దలఁదాటిన వనియు దీనికంతకును శనియే కారకుఁ
డనియు నా విశ్వాసము.జాతకజ్ఞులు పరికింతురుగాక. 568

షరా:- ఆ యీ వృద్ధుఁడును యువకుఁడును వయోవిషయమునఁ దారత
మ్యము గలవారయ్యు దురభిమానగ్రహావేశధూమధూపితత్వము
నకు నిరువురు నొకవయసువారే, ఈ ద్వితయములో వృద్ధునకును

నాకును గొండొక పోలిక కలదు. ఇరువురమును శుక్రులము. నాకీ శుక్రత్వము చిన్నతనమందే సంఘటించినది. (జాతకచర్యచూ.) అందుచే వీతనితో వాదు నాకు న్యూనతాపాదకము గాదని తెల్విడి.

తే. గీ. వేలకొలఁదిగ సత్కృతుల్ విభవ మలరు
షష్టిపూర్తియు జరిపినశని యొకింత
తిట్లు దగిలించుటకు సమ్మతింపకున్న
జాతకస్థితి యేరీతి సత్య మగును. 569

మ. పలుశాఖల్ చెలువారుబ్రాహ్మణులలోఁ బాండిత్య మా శాఖవా
రలలోఁ గొండొక హెచ్చు వైదికులలోఁ బ్రాక్కాలమం దేరు వా
రల భూషించి నమస్కరించి, రిపుడో భ్రాజిష్ణుతం గోరి వా
తులు లే కొందఱొ తిట్లకున్ దిగిరి ధూర్తుల్ వీరి దీవించెదన్. 570

ఉ. వీరలమాటఁ బట్టికొని వేఁదుఱుత్రోవలఁ ద్రొక్కకుంటచే
ధీరులు తక్కకోవిదులుదీర్ణయశస్కు లటంచు సర్వథా
వారల మెచ్చువాఁడ, నల పద్యము నర్థ మెఱుంగ కేవియో
కాఱులు పేర్చువారలకుఁ గావ్యవిదగ్రిణు లగ్గకుండుతన్. 571

క. శని వచ్చె తడవుగఁ బ్రా
క్తనమాత్రవ్యాధి తఱచు గన్పట్టుట యెం
దునకుఁ గొఱగానిపల్కుప
క్షినినాదమ్ములను వినుట చేకుఱె నాకున్. 572

ఆ. వె. ఈ "యథార్థ" వాద మాయామయముకన్న
హేయ మనుచు నే నొకించుకేని
గలుగఁజేసికొనక స్కాందంపుటచ్చుకుఁ
గన్నువెట్టుచుంటిఁ గాల మెలమి. 573

ఉ. కుక్కలు గూసికోఁ జెడునొకో? మఱి జంగముపర్వు మీకు వీం
డ్రెక్కడిశత్రుకోటి యని యెల్లరు నన్ను నియోగి శిష్యులా

పత్రిక్కకు నేగకుండఁగ మరల్చిరి, వారలఁ గూడఁ దిట్టె నం
దొక్కఁడు, వానివై ఖరి యయోమయ మే మని వ్యాకరించెదన్. 574

ఆ. వె. నన్నుఁ దిట్టె సరియె నా శిష్యులను దిట్టె
వంతకన్న సరియె అఖిలవైది
కులను దిట్టె నొప్పికొందము నన్నయఁ
గూడఁ దిట్టె నాల్కఁ గోయ వలదె ? 575

షరా:- ఒక్కఁడు = రెండవవాఁడు. (యువకుఁడు) ఇతఁడు వేలూరి శివ
రామశాస్త్రిని, విశ్వనాధ సత్యనారాయణకవిని, త్రిపురనేని రామస్వా
మిని, వేటూరి ప్రభాకరశాస్త్రిని, ఇంతవఱకు గాఢముగను, కాటూరి
వేంకటేశ్వరరావును, పింగళి లక్ష్మీకాంతమును గొంతతక్కువగను
దిట్టి ప్రచురించెను. వైదిక మితనికి కవులలోనున్నట్లు వినఁబడినచో
నిప్పుద్రొక్కినకోఁతివలె నాట్య మాడు నని యెఱుఁగనగు.

ఉ. మాలలు మాదిగల్ నృపులు మంగలి చాకలి బట్లు రెడ్లు కం
సాలులు సాలె లీడిగలు సానులు మౌనినియోగివైదికుల్
బాలురు వృద్ధు లంగనలుఁ బాత్రి లపాత్రిలుఁ దెల్గుఁగైతకున్
జాలినవారె యొక్కరి దెసం బడి యుండెనె? యూపె యెన్నఁడున్. 576

తే. గీ. అందులో నన్నయకు వచ్చె నధికకీర్తి
అందఱకు మార్గదర్శకుఁ డగుటఁ జేసి
అతఁడు వైదికుఁడో నియోగ్యగ్రిపరుఁడొ
కాకదంతపరీక్షకుఁ గడఁగు నెవఁడు. 577

ఉ. నన్నయఁ దిట్టి యా సుకవినాధు నగాధునిగా నుతించుచో
నన్నను దిట్టి వైదికజనంబులఁ బాచకు లంచుఁ దిట్టుచో
మన్నన యంతమాత్రిమున మాయునె? మాయురె? తిక్కయజ్వ యె
ఱ్ఱన్నయుఁ బోతనాదులును నాతని మెచ్చరె? వారు దూష్యులే. 578

ఆ. వె. ఓకు వంక లెన్నియో చెప్పఁగాలేని
మొఱకు లఱపు లెవియొ మొఱిగినంత

నతని కేమి కొఱంత యతనిమెచ్చెడివారి
కేమి కొఱంత మొఱకు తెఱఁగు పెట్టు. 579

ఉ. నన్నయ పూజ్యుఁ డట్టులె ఘనప్రతిభాగతిభాసురుండు తి
క్కన్నయుఁ బూజ్యుఁ డట్టులె మహాకవి యెఱ్ఱన పూజ్యుఁ డట్లె పో
తన్నయుఁ బూజ్యుఁ డీ కవులయంతరముల్ వివరించుపట్టునన్
దున్నలకుండునే యధికృతుల్, సుకృతుల్ గమనింపకుందురే? 580

ఉ. గానరసారసంబులఁ దగన్ గ్రహియింప శిశుల్ పశుల్ ఫణుల్
జ్ఞానములేదుగాక యధికారము గాంచుఁ గవిత్వతత్త్వవి
జ్ఞానముపట్ల శంభుఁడును గాఁ డధికారి యటన్న వట్టిదు
ర్మానుల కేలొకో? పనికిమాలినజోలికిఁ బోయి మాయుటల్. 581

ఆ. వె. కాలఁబోవుదాని నేలొకో? మీసాల
పద్య మెత్తి నెత్తిఁ బ్రామికొనుట
ముప్పదేండ్లనాఁటిముచ్చట గుంటూరి
తగవు మరలఁ బయికిఁ ద్రవ్వనేల? 582

క. తగవు గలిపించువారలుఁ
దగవరులును బాత్రములును దయచేసి రికన్
మిగిలిరి యిరువురు వారికిఁ
బగ యిప్పుడు లేదు మైత్రి వాటిలుకతనన్. 583

తే. గీ. అసలువారలు మిన్నకున్నట్టివిషయ
మెవ్వరో "లాకలూకాయ" లిపుడు పైకిఁ
దెచ్చి కారులుమాటెడితెలివిఁ జూడ
నాలు దూడలు నుండ గుంజార్చినట్లు. 584

శా. శ్రీనాథుండును రామలింగమును నిశ్శేషాత్మశక్తిప్రతా
పానూనత్వము దెల్పు పద్యములు రాజాస్థాని వాక్రువ్వరే
ఆనాఁ డుండినవారిఁగాక యవి మున్నాలోకముం జేర్కవీ
శానుల్ నన్నయముఖ్యులం గలఁచెనే? శంకించిరే యెవ్వరున్. 585

శా. ఈక్షోణి న్నినుఁ బోలుసత్కవులు లేరు........సాహిత్యముల్
దివిజకవివరుగుండియల్ దిగ్గు రనఁగ, నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ
డమరపురికి.

మ. ఉదయం బ స్తవగంబు సేతువు....నీ కెదు రేరీ?....రామకృష్ణకవిచంద్రా

మ. అమలోదాత్త........శిల్పమునం బారగుఁడన్.

శ్లో. వాచా మాచార్యతాయాః పద మనుభవితుం కోఽస్తి ధన్యో మదన్యః
(కవి సింహగర్జితములు చూ.)

తే. గీ. ఎన్నఁడో స్వర్గతిం గన్నతన్నపార్యుఁ
గాని తిక్కన్న నెఱ్ఱన్నఁ గాని యొరులఁ
గాని నాదుమీసంబులు గలఁచివైచు
పేరు విన్నను నవ్వారే? యేటిసోదె? 586

తే. గీ. మీసములు వెక్కిరించినమేటు లెవరొ?
వారికే నేను జెప్పినపద్య మన్వ
యించు నని గూడ నెఱుఁగనిహీనుఁ గూర్చి
యిందు స్పృశియించుటకు బ్రాజ్ఞుఁ డెవఁడు మెచ్చు. 587

వ. అట్టి యజ్ఞానిఁగూర్చి యొక్కయక్కరమేని వ్రాయుటకుఁ బ్రాజ్ఞులు నన్ను నిందింతు రని యెఱిఁగియు నియ్యది జీవితచరిత్రం బగుటం జేసి కొండొక స్పృశింపవలసివచ్చె నని సహృదయు లరయుదురుగాక.

ఆ. వె. ధార యున్నఁ జాలుఁ దప్పొప్పులకు నేమి
మాతృభాష తెలుఁగు జాతితోడ
నేమి యెల్లవారు నేమాత్రిమో చెప్ప
నెవరు గాని పెనఁగి యేమి ఫలము. 589

క. ప్రతివాఁడుం గవి యయి సం
స్కృతమున ధార గలఁ డయ్యుఁ గీర్తని నపకీ
రితిని గడియింపఁ డాంధ్రము
ప్రతివానికి లోఁగు మాతృభాష యగుటచే. 590

తే. గీ. "ఆఁడుబిడ్డ మాయింటికి నాంధ్రభాష
యనుచు నాడినవానికి నవమతి నిది
తెచ్చి తలవంపు చేకూర్చుఁ దెగి నికృష్టుఁ
దగులుకొనిపోవుచో నప్డు పొగులవలయు. 591

తే. గీ. ఇంత యెఱుఁగని "శశ్ఛోటి" యెన్నియేని
వదరెడుంగాక అయ్యది వాని కేమి
దొసఁగు కలిగించు ? వాని తుందుడుకు నెఱిఁగి
మందలింపని విందుల నందుఁ గాక. 592

తే. గీ. ఎవరు మందలించుటకును జవుకబారు
వాఁ డగుట నర్హతయె లేమి వార లూర
కుండి రని తోఁచెడిని వీఁడు బండ "మొండి
వాఁడు తేనికన్నను బలవంతుఁ" డనరె ? 593

తే. గీ. పోతనామాత్యుఁ డీ దున్నపోతుతోడ
వేంకటేశ్వరుమీసాలు పెఱుకు మంచుఁ
బ్రార్థన మొనర్చె నంట ? యావాతులు డిటు
చెప్పు వానిమాటలు చూడ సిగ్గు వొడము. 594

తే. గీ. "దురభిమానగ్రహావేశధూమధూపి
తులును" గల రల్లవారిలోఁ దొలుత వీని
బరిగణింపంగఁ దగు నిట్టిమొఱకు నిందు
నేను స్పృశియించుటకు క్షమియింత్రు కవులు. 595

వ. అది యటు లుండె నీ యనాత్మజ్ఞుఁడు నెట్టవంటగ యావద్వైదికులను జాల బేలతన మూని దూషించుకతన నయ్యది తమకుఁ గూడఁ దగిలి వచ్చుటంజేసి నన్ను ద్వేషించుశ్రీపాదగురువుగా రేమో కలిగించికొని త్రిలిఙ్గపత్రిక నొక వ్యాసము వ్రాసి మందలించి రని వింటి. వా రెందుకుఁ గలిగించుకొనిరో గాని యీయనామకుం డందులకు నర్హుండు గాఁ డని వారికి విన్నవించుచున్నాఁడను. ఈ విషయము

లోఁగడ స్పృశించి విడిచినదియే. గురువుగారివ్యాసమునుండి కొంచె ముదాహరింతును. 596

—• (24–4–1944 సం॥ త్రిలిఙ్గనుండి) •—

నెల్లుట్ల యను పిల్లవాఁడు ముప్పదిసంవత్సరములక్రిందట తిరుపతి వేంకటేశ్వరులకును, కొప్పరపువారికిని గల్గినవివాదముం బురస్కరించుకొని యీ తిట్లగ్రంధము రచియించినట్లు తెలియుచున్నది.... అందు సర్వవైదికజాతిని దిగపాఱఁ బోసినాఁడు. నన్ను అందుఁ గొంచెము గౌరవించినను సర్వవైదికజాతినిం దిరస్కరించినప్పుడు నేనును అందుఁ జేరియున్నవాఁడ నగుటంజేసి యిట్లు వ్రాయుట తగ దని నెల్లుట్ల కించుక బోధించువాఁడనై యిట్లుపక్రమించితిని. వినుండు వైదిక దూషణభాగములు కొన్ని.

తే. గీ. వైదికుల నొక్కనన్నయ్యభట్టు తక్క
నరయ నందఱు పప్పుబ్రాహ్మణులె....
వంటలే లోకముగనుండు వైదికుండు
వైదికు లనంగ నెంత నిర్భాగ్యు లౌర ?

ఇత్యాదులు వేనవేలు. ఆత్మస్తుతులు. ఎవఁడురా ? మాయమాత్యుల సీసడించి కలము నడిపెడిమొనగాఁడు తెలుఁగునేల........ఆంధ్రభారతి మాయింటియాఁడుబిడ్డ....నేను నాతండ్రి కింక జనింప లేదు. వెధవలంబోలె నూరక ప్రేల నేల ? ఇత్యాదు లెన్నియో ? పెక్కులు వ్రాసినాఁడు నెల్లుట్ల. చెళ్ళపిళ్ళ........నెల్లుట్లపట్ల నేరము చేసినవాఁడు కాఁడు. అమాత్యజాతిని దూషించినవాఁడును గాఁడు.... ...చిన్నతనమ్మునంజేసి జాత్యభిమానముం బురస్కరించుకొని, వెధవ, కుంక, పీఁకినాఁడు లోనగుతిట్లు వ్రాయఁగూ డని వ్రాఁతలు చూచినప్పుడు నాకు మేను నూడిన ట్లయినది .......ఎప్పటి వివాదమో నెత్తిపై వేసికొని వ్రాసినవ్రాఁత రోఁత యనక తప్పదు. అప్పటికి నెల్లుట్ల పుట్టనే లేదేమో? నెల్లుట్లగారూ?.............వైదికజాతి నంతను జెందనాడుట

మీకు దగదు. చెళ్ళపిళ్ళమీసములపద్యము వ్రాసెనని నియోగిజాతిదే మీసము గనుక మీకు నిట్లుద్రేకము గలిగినదేమో? ఆపద్యములో తిరుపతివేంకటేశ్వరులగర్వము దోఁపవచ్చును గాని నియోగిజాతిని దిరస్కరించినట్లున్నదా? మీసము నియోగిజాతిదే గాని మఱి యెవ్వనిదియుం గాదా?.........అది సృష్టికర్త పెట్టినది గదా?......... రొయ్యకు మీస మున్నది.........ఇది (మీ వ్రాఁత) బాలచేష్టితము మీ వ్రాఁతలలో నుచ్చరింపరాని తెలుంగు లెన్నియో యున్నవి............ నేను జెప్పఁగరానికొన్నింటిఁ బెంతు దోస మన నేల! పీఁకుత రోస మున్న, ఈ పెంచునవి. పీకు మనునవి. చెప్పఁగరాని వన్నియు నేవి? వానిని మీసములుగాఁ బెంచుదురా? దేశముఖుగారూ! ఈ వెంట్రుకల గొడవఁ బెట్టుకొని క్రిందును మీఁదునుం గానక యిట్లు వ్రాయుట తగదు, తగదు. దీనికిఁ గత్తిఁ బట్టినారా? జాగ్రత్త, జాగ్రత్త! యెట్లుండి యెట్లు వచ్చునో?మీ యుత్తరకుమారప్రజ్ఞలకు లోకము పక్కున నవ్వుచున్నది............కలమునడిపెడిమొనగాఁడు తెలుఁగు నేల? అంటిరి.........ఇట కల మన్న నోడ గాదు గదా?............ నేనే మూఁడులోకములకుఁ జాలినవాఁడను....ఏశక్తి చూచుకొని యిట్లు పలికినారో? పిల్లవాఁడు"చందమామ రావే, జాబిల్లి రావే!" అనునట్లే యున్నది. దేశపాండ్యాబిరుదముఁ జూచుకొనియా?దేశపాండ్యా యనిన కవితాచక్రవర్తి యనుకొంటి రేమో? దేశపాండ్యా. కరణం......... అని యర్థము సుడీ, మీకు విద్యాజ్ఞానమే కాక, లోకజ్ఞానము గూడలేనట్లు డోఁచుచున్నది............మీకు సంబంధింపనిముప్పదేండ్లనాఁటి .........విషయము నెత్తి......... కలిగించుకొని నియోగివర్గమునకు మానవష్టముగూర్చినా రని పిచ్చివాఁడు తలంచినట్లు తలంచి......... నేను గూడ గాలిపోదు నంటిరే?.........ఇది లౌక్యునివ్రాఁత యగునా? .........ఎల్లపండితులతోఁ బోరుదురా? ......... దేహబలమా? విద్యాబలమా?.........దీనంజేసి మీకు భాషాజ్ఞానమే లేనియట్లు కానవచ్చుచున్నది. ఇట్టిమీరు విద్వత్కవుల నెట్లోడింతురో?....మీరు రాజుకన్న

బలవంతులే ? ఇట మీ బాల్యచాపలము తప్ప నితర మేమియుఁ గాన వచ్చుట లేదు........పిల్లకా కే మెఱుఁగును. అనునట్లు మీరు ప్రవర్తించుచున్నారు. ఇట్లు వర్తించుట మీకు తగదు........అని బోధించుచున్నాను........ఇఁక మీ చిత్తము.

(ఇది గురువుగారివ్యాససారము)

తే. గీ. గురుఁడు "నెల్లుట్ల"యాతని మొఱకుఁదనము
నెఱుఁగ కిటు మందలించె నెబ్బెఱికపునుడు
లాడె నని పిచ్చివాఁ డతఁ డని యుపేక్ష
సల్పుటే యుక్త మంచు మత్స్వాంత మెంచె. 597

తే. గీ. అతఁడు కడియమ్ము వచ్చి నన్నరసె మొదటఁ
దిట్టి పిమ్మట ననుతాప ముట్టిపడఁగ
నెంతయో సిగ్గుపడియె నా వంత నేను
జూడలేకపోయితి నిది సూనృతంబు. 598

తే. గీ. అతఁడు ననుఁ దిట్టిపోసినయట్టికవిత
కడిగినాఁడు నన్నును నభిప్రాయ మేను
వ్రాసియిచ్చితి నది గురువరుఁడు చూడ
లేదు చూచినం దేలెడి లేఁతదనము. 599

చ. తిరుపతివేంకటేశ్వరులు ధీరులలోన నియోగులందుఁ దా
మెఱిఁగి జనింపలే దనెడిదే యొక తప్పుగ నెంచునా గుణో
త్తరుఁడు స్వశాఖయందలియుదారత కయ్యది లోటుగా మదిన్
బొరిఁబొరి దుఃఖమందు నల పూరుషసత్తము మెచ్చుఁజెల్లదే. 600

ఆ. వె. తిట్టుఁగాక యతఁ డుదీర్ణ మౌయశమునే
మా కొసంగినాఁ డమాత్యమౌళి
అతనికవిత కిడితి నలరి యభిప్రాయ
మతఁడు చిరము బ్రదికి యలరుఁగాక. 601

ఆ. వె. జని మఱొండు మాకు సంప్రాప్త మగునేని,
మా యమాత్యుసదభిమానమునకుఁ
బాత్రిమై యెసంగఁ బ్రయతించుచే తప్ప
లేదు వేఱుత్రోవ లేమ లేదు. 602

వ. ఇది యింతతో ముగించి యీ శనివిదశలోని సన్మానములు వివరింతు.

క. వేమూరికులుఁడు సీతా
రామసుకవి శిష్యుఁ డిచ్చె ద్రవ్యంబధిక
ప్రేమమెయి నూటిలో సగ
మేమికతమొ వైశ్యుఁ డొకరుఁ డిటులే యిచ్చెన్. 604

ఆ. వె. సభ యొకండు సల్పి సత్కరించెను వైశ్యుఁ
డాత్మశిష్యుఁ డురక యర్పణం బొ
నర్చె నింక నొక్కనాఁడు వేఱొకశిష్యుఁ
డర్చితుం బొనర్చి యర్థ మిచ్చె. 605

షరా:- సికింద్రాబాదానివాసి ముదిగొండనాగవీరేశ్వరశాస్త్రి(శిష్యుఁడు) కొం
డొకసొమ్ము పంపి గౌరవించె నని యెఱుంగునది.

ఆ. వె. మఱియు మల్లముపలి వరవంశ్యుఁ డల భైర
వాహ్వయుండు మన్మరాతిపెండ్లి
వ్యాజమునను ధనము వస్త్రాదుల నొసంగి
సత్కరించె మిత్రసత్తముండు. 606

వ. వేఱొకశిష్యుండు సంపన్నుండు తంగిరాలరాఘవయ్య యను విప్రుండు తనసౌధమ్మునకుం బిల్చి కొంత ద్రవ్య మ్మిడి సత్కరించె. నీ శనివిదశలో నారోగ్యము చాల డీల్పడియున్నను యథాపూర్వమ్ముగ నన న్యాపేక్షమ్ముగ విద్యాగోష్ఠితోఁ గాలమ్ము జరుగుచుండె. కొలఁది మాసముల పసివాఁడు మన్మఁ డొకఁడు జాఱిపోవుట యను బొసఁగుతప్ప నితరవిచారకారణమ్ము లీ శనివిదశయందు లేవు గాని.

చ. సకలము నుండి నీవు తనుజాతగృహమ్మున నుండ నేల ? ర
మ్మింకఁ గడియాన కంచు సుతు లెంతయుఁ బేర్మివి సారెసారె వ
చ్చి కడు బలాత్కరింపఁ జనుచేవయు ధైర్యము లేక యేమి దో
చక బెజవాడలోఁ గొమిరె సాఁకఁగ నాఁగితి జాతకస్థితిన్. 608

తే. గీ. ఏవిచారమ్ము లేక నా కిచట సుఖము
గా జరుగుచుండెఁ జక్కఁగాఁ గాలమైన
నేమి ? "యీలకూరకు నేగి యిల్లటంబు"
పగిది నిట నుంటి నని మది పొగులుచుండు. 609

క. ఏవేవో యూహలు మది
నావిర్భవ మందు నణఁగు ననుదినమును స్వా
భావిక మిది వృద్ధుల కని
యే వానిన్ లెక్కపెట్ట కెలమిఁ జరింతున్. 610

క. ఆయుర్దీర్ఘత కొందొక
శ్రేయంబే యగునుగాక వృద్ధత్వంపుం
బ్రాయమున బ్రిదుకుమానిసి
రోయుదు రనుకొందు రెవ్వరుం గని లోకుల్. 611

తే. గీ. సన్న్యసించినచోఁ జెప్పఁ జాలఁ గాని
గేస్తుగా మన్నచో వానికి ఘటియించు
నంతరరులందు మూఁడవయతినిపీడ
అది ఘటింపనిదొసఁ గంచు నవని లేదు. 612

ఉ. తా గడియించినట్టిది వృథాగ సుతుల్ వ్యయపెట్టుచుండి రిం
కేగతి భావికాలమున నింతకు మున్నటె పీండ్రికున్ దినా
లేగెడి గౌరవమ్మునకు నించుక లోటును లేకటంచు వృ
ద్ధాగురుఁ డాత్మలో నొగులు టారయ లోభ మహత్త్వమే కదా ? 613

ఉ. బీదకొలమ్మునం బొడమి విద్దియ కొందొక నేర్చి యెల్లెడన్
వాదుల నోర్చి ద్రవ్యము నవారిగఁ గీర్తియు సంగ్రహించి మ

ర్యాదకు లోటులేనిగతి నాత్మకుటుంబము నిర్వహించి నే
నీఁదితి నింతదన్కఁ గన నెన్నఁడు లోభము నేఁడు గాంచితిన్. 614

శా. సంపాదించి భుజించుచుండు రెవ రా సంసారులన్ జూడ నా
కింపౌ నూరక కూరుచుండి తినువా రెంతెంతవారైననున్
గంపింతు న్మది వారలం గని; సుతుల్ గారైరి సంపాదకుల్
సొంపారన్ దినకృత్య మెట్లు లని తోఁచున్ శంక లేవేవియో. 615

మ. పలుచోట్లన్ వివరించినాఁడ నిది యీ ప్రాయమ్మునం గూడ నే
నిలువేల్పుంగృపకారణంబుగ ధనం బే సుంతో యార్జింతు "నాం
గలభాషన్" పఠియింపకుండినను నే కష్టంబు లేకుండ వా
రలతోపాటు గడించినాఁడ గవినై ద్రవ్యంబుఁ బ్రఖ్యాతియున్. 616

మ. నను నేఁ జెప్పికొనంగరాదు జగతి న్నన్మించువారల్ శతం
బును గా రంతకు నెక్కుడే కలరు, నన్ భూషింతు రవ్వారు వి
ద్యను నే నెక్కుడువాఁడ నంచు, నిది నా కాశ్చర్యముం గొల్పు నన్
ధనికాగ్రేసరుఁగా గణింతు రెవరున్ గైకోరు నా సత్యమున్. 617

తే. గీ. తెలిసె "బుద్ధ్యై ర్యశో లభ్యతే"యటన్న
నార్యవచనంబు నాపట్ల నన్వయించెఁ
గాను బెద్దవిద్వాంసుఁడఁ గాను పెద్ద
ధనికుఁడను వచ్చుపే రెట్లు తగ్గు నిపుడు. 618

మ. కలికాలానకుఁ జెప్పినట్టిగొనముల్ క్షామంబులోనైన వీ
యిల సర్వత్ర విజృంభణంబు గనెఁ గూడే లేక బెంగాల్‌ప్రజల్
బలవంతమ్ముగఁ జచ్చుచుండి రెటులో ప్రాణమ్ముతోనుండె నీ
తెలుఁగున్ దేశము,యుద్ధ మాఁగ దదియున్ దీర్ఘాయువై పొల్చెడిన్.

క. ఖండాంతరమున జరిగెడి
భండన మీదేశమునకె ప్రాఁకిన దన్నం
బుండుట దృశ్యాదృశ్యము
తండులములుఁ గట్టియలును ధనికిన్ గలవే. 620

క. ఇది యెక్కడి యుద్ధంబో?
చదివినయేగ్రంథమును బ్రిసంగింపదు దు
ర్మదు లిది గల్పించిరి తే
లదు గడచెన్ జాలవత్సరమ్ములు పెలుచన్. 621

తే. గీ. పండుపంట సర్వమ్మును దండు గకట?
"మిల్టరీ" తినుచుండె గోమేధములకుఁ
బరిమితియె లేదు దేశదౌర్భాగ్యముడుపఁ
బూనఁ డే దేవుఁడును బ్రజఁ బ్రోచు రెవరు? 622

క. కొలబత్తె మిచ్చి మునురా
జులు ప్రిజలన్ సాఁకినట్లు సూరివరేణ్యుల్
విలిఖింప రెచట, నీద్రు
క్కలి వ్రాయుట చెళ్ళపిళ్ళకవికి ఘటించెన్. 623

ఆ. వె. అన్నివస్తువులకు నాజేడురెట్టులు
వెల పెరింగిఁ బెరుగు వెన్న మాట
కేమి మజ్జిగయును నెక్కడఁ జిక్కదు
గోధనంబు గొంతు కోఁత వడియె. 624

క. ఆయీవిచార మనిశము
బాయక పీడింప విజయవాటిక చెళపి
ళ్ళాయఁడు దేవీచరణము
ధ్యేయంబుగ నుండఁగఁ జనుదెంచె బుధుండున్. 625

షరా:- ఈ శనివిదశలో విశేషించి కవితారచన సాఁగలేదు గాని మూఁడవ చిరంజీవికిఁ గొండొక శుశ్రూషాదర మతిశయించుటచే శ్రీమద్వాల్మీకిరామాయణమును, తెలుఁగులో పాండురంగమాహాత్మ్యమును పాఠము చెప్పుకతన సద్గోష్ఠితో కాలము గడచె నని తెల్విడి.

తారణ సం॥ జ్యేష్ఠ శు॥ ౪ మొదలు శ్రావణ బ ౧౪ వఱకును
శనిమహాదశలో చంద్రాంతరములో

—• బుధ విదశ •—

తే. గీ. విద్యకన్నను వేఱొండు ద్విజులకొకరి
కేయనఁగ నేల? యెల్లరు వృద్ధులకును
నిహపరంబుల నిడునట్టి దేది లేమ
నాదు ననుభూతి వ్రాయుచున్నాఁడ నేఁడు. 626

క. ముదుసలి యన్న ననాదర
మది సహజం బెల్లరకు రవంత యెదో కో
విదత గలఁడేని వృద్ధుని
పదదాస్యము సేయుచుందురు పలువురు ప్రాజ్ఞుల్. 627

క. గఱువలు విద్దియ "మాతే
వరక్షతి" యటంచుఁ బల్కువాక్యము సర్వుల్
శిరసా వహింతు రది నను
గర మోముట జరుగు సుఖముగా రేయిపగల్. 628

తే. గీ. పూర్వజన్మమ్మునం బెట్టి పుట్టియున్క
నబ్బె నాలుగక్కరములు "డబ్బుదస్క"
మబ్బుజనికన్న నిది పూజ్యమై రహించె
జన్మజన్మాల కీ సరస్వతినె గొలుతు. 629

క. త్రైపూరుషముగ విద్యా
వ్యాపృతి ధనవత్త నిలువ దని మునియెవరో
శాపం బిడినను నయ్యది
నాపట్లన్ దూరమై కనంబడుఁ గాతన్. 630

తే. గీ. ఎంతని వచింతు నాకు నీ వృద్ధదశను
విద్య యొనఁగూర్చు ననవద్యహృద్యసుఖము
కాని యీపయి రాఁబోవుకాలమందు
స్వీయవిద్యలఁ దలపోయఁ జింత వొడము. 631

చ. చదివినవారె లేరు గద? శాస్త్రము వేదము, సోమకాసురుం
డిది గికురింప మత్స్యమయి శ్రీశుఁడు వాని వధించి తెచ్చెఁగా
కద నిపు డట్టిదే జగతి కబ్బెను శ్రీశునివల్లఁ గావ యా
పద యిది తప్పఁజేయు టని పాయని చింతఁ గృశింత్రు పండితుల్.

క. కులవిద్య జదివికొనుటకు
నెలమి యెవనికేని యొకని కెడఁద జనింపన్
సలలితగతిఁ జెప్పెడివా
ర లెచట లభియింతు రకట? బ్రాహ్మణులందున్. 633

క. ఏరున్ జెప్పరు చెప్పిన
వారమ్మలు దొరక వొకట వారము లీయన్
దారకులదురభిమానం
బా రీతికి నేవ మందు నకటా యెట్టుల్. 634

ఆ. వె. ధనికులిండ్లయొద్దఁ దఱ "చబ్రివీత్తురా
ణములు" సెప్పువారు నాణెముగను
బారములను జెప్పి బాగుఁ జేతురె? శిష్యుఁ
జెడియె నార్య విద్య చెడియెఁ జెడియె. 635

ఆ. వె. చంక జోలితోడఁ జనుదెంచునట్టివి
ద్యార్థిఁ గాంచి బ్రహ్మ యరుగుదెంచె
నంచు భక్తితోడ నర్చించుసాధ్వులి
ష్టుండుబ్రి గాక వటువు లున్నవారె? 636

క. నూటికి నలభై "మార్కుల"
పాటిది పాండిత్య మాయె బడిపంతులలోఁ
గోటి కొకఁ డేని పూర్వుల
దీటగువాఁ డున్నె? తెలివితేటలకలిమిన్. 637

ఆ. వె. చదువువాఁడు లేడు శబ్రిద్ధగాఁ బాబ్రిచీన
ఫక్కిఁ జెప్పునట్టివార లసలె

లేరు స్వకులవిద్య లేరీతి నిలిపెడి
నెవరు దిక్కు వీని కెవఁడు మ్రొక్కు. 638

క. ధనికులగువార లింగ్లీ
షను బఠియించెదరుగాక స్కూళ్ళ కరిగి ని
ర్ధనులు కులవిద్యఁజదువం
గ నుపాయము లేదు గురులు కఱవగుకతనన్. 639

తే. గీ. అకట? దేశపుదుర్దశ నాత్మఁ దలఁచి
కొన్నకొలఁది బేజా రయి గుండె పగులు
నాఁడుపిల్లకు మగఁడు రాఁ డరరె? యింగి
లీషు రాదేని యెంతటిలేకిదశయొ? 640

క. సంగీతము నింగ్లీ షే
యంగనకున్ రావొ దాని కామరణమ్మున్
మంగళసూత్రిం బుండ ద
నంగునికోర్తలకు వార లాఁగుట యెట్లో. 641

తే. గీ. అన్నవస్త్రమ్ము లుండినయయ్యలగతి
యిట్టు లున్నది కట్నము లెచ్చి పిల్చి
పిప్పిచేయుచునున్నవి పేదవాండ్రి
కెప్పుడును జిక్కె వారల నెన్న నేల? 642

ఆ. వె. కొలదినాళ్ళలోనఁ గొంపకొంపకుఁ బెండ్లి
గానియాడువాండ్రి గానఁబడెడి
కలి తటస్థ మగుట తలఁపునకున్ వచ్చి
సిగ్గు గదురు నకట! చిత్తమునకు. 643

చ. అలరెడి నూత్నయౌవనము నందఁగ బాలిక పాఠశాలలో
పలఁ గలజవ్వనం బొలయుబాలురపంక్తిని సంగసంగమం
బెలమి ఘటింపఁగాఁ జదువు లెంత విచారణ చేసిచూచినన్
గలియుగచర్య సర్వమును గన్నులఁ గట్టినయట్లు కన్పడున్. 644

ఆ. వె. సిగ్గులేనివేశ్య స్త్రీజాతికిఁ గళంక
మంచు వాండ్రు సాధ్వు లగుట కొప్పు
రేమి కర్మ మొక్కొ? యీలువనకు ముప్పు
గొలుపుచుండి రగ్రకులపుఘనులు. 645

మ. గతకాలమ్మునఁ బుట్టువందుమనుజుల్ గళ్యాణమూర్తుల్ సమం
చితు లీపై జనియించువార లెవరో చెప్పంగ నోరాడ దే
పతితాభిఖ్యయు వారి వాకొనమ దౌర్భాగ్యంబు వా రెంత సం
చితమున్ జేసి జనింప నుండిరొ? శివా! శ్రీకంఠ! మృత్యుంజయా.

శా. వందల్ వేలును జీతనాతములు దేవా? తెచ్చునే యమ్మ ని
స్సందేహమ్ముగఁ దండ్రి వానికొమిరెన్ సౌందర్యపర్యాప్త లా
కందర్పున్ విజయింప నేరుతురె? యేకాంతాన కేమో? యటం
చుం దల్లుల్ మఱి తండ్రులుం గనుట కీశుల్ గామి కేకర్మమో? 647

ఉ. మద్దెలకాఁడు పార్శ్వమున మంగలొ? కుమ్మరియో "ఫిడేలుకాఁ
డద్దరిఁ గూరుచుండి తన కం గొనరింపఁగ వీణఁ బూని యే
ముద్దియ గేస్తురాలు సదమున్ మును సంతసపెట్టె నెంత యా
పద్దశ మూఁడె దేశ మిఁక బాగఱ కే మగు నౌర? విద్దియల్. 648

ఉ బోగపుటింతి తాఁ గనినపుత్త్రికిఁ దండ్రిగ నేరుపడ్డగే
స్తా గణికాత్మజన్ బరిణయం బొనరింపఁ దలంచుఁ గాని దూ
రాగిణిగాఁ జరించునలరట్టున కోరువఁ జాలఁ డౌర! యే
లాగు సహించు స్వీయయెడలన్ గని పెంచినకూఁతురోఁతలన్. 649

ఉ. పెండిలి కేమి? విద్యఁ జదివించినవారలె చేసికొండ్రటం
చండజయానలన్ బడుల కంపుదు రట్టె? సతీర్థులందు భీ
ష్మండు శుకుండు నుండుదురె! సూనశరుం డలవారిడెందమం
దుండఁడె! వానిచై దము లయోమయముల్ తరుణుల్ వలంతులే. 650

చ. వయసులలోన జవ్వన మపాయకరం; బది వెట్టకున్న బ
మ్మయె పొనరింపఁగావలె సమస్తజగమ్ములసృష్టి; యిప్పు డం

తయు జగమే సృజించికొను఼ దాను నిమిత్తము గాఁగ నున్న, నా
వయసుకుమాత్రి ముందవలెఁ బాయనిసంకెల లెన్ని యేనియున్. 651

ఉ. అందులకే వివాహ మనునట్టిది పుట్టిన, దద్దిలేనిపూ
ర్ణేందుముఖుల్ స్వయంకృతము లేవియొ చెట్టలు చుట్టుముట్టి రో
చందనగంధులట్టిరయి సంస్కృతికిం గొఱగారు వాంఛచే
గందుఁ గనుం గొలమ్ము; చెడి కల్కి జగం బఖిలమ్ము మాపెడిన్. 652

ఆ. వె. ఆదికాలమున స్వయంవరణమ్ములు
కలవు గాక యెల్లకలుకులకును
గలవె ? రాజకన్యకల కేరుపడియె స
కృత్తుగా, నవేని యిపుడు లేవు. 653

చ. వలచినవానిఁ గైకొనినఁ బార్థివపుత్త్రులు తక్కువార లం
దుల కరుదెంచువా రదియు దోసముగా గణియించి యవ్వనా
దలపడి పోరుచే తఱచు తాఁ గనుపట్టెడి నట్టిపెండ్లికే
కలికియు నర్హయే ? నృపతికన్యలె యర్హులుగానిపట్టునన్. 654

చ. నలనృపుపెండ్లియున్ ద్రుపదనందినిపెండ్లియు భారతమ్మునన్
గల, పవి ముప్పుదెచ్చుటకుఁ గారణ మేది ? స్వయంవరంబ, వి
జ్ఞు లెఱిఁగి తల్లి దండ్రియును గూఁతులపెండిలిసేయు టొప్పుఁ గ
న్యలకు ననర్హమే మఱి స్వయంవరణమ్ము లనేకభంగులన్. 655

ఉ. కూఁతులు మ్రాఁగు రొక్కని కొకొర్తుకు నేఁటికిఁ బెండ్లి లేదు వి
ద్యాతిశయంబువారలకు నాంగ్లమునం గల దెచ్చు ద్రవ్యమే
జీతము దెచ్చి వృద్ధునకుఁ జేతికి నిత్తురు తండ్రి, కాయెఁబో ?
లేఁతవయస్సు, పెండ్లి యలలేమల కీపయిఁ గావలెన్ గటా ? 656

క. అందఱును గార్గు లౌదురె ?
చందనగంధు లల పంచశరునియలజడిన్
గుందదె ? డెందము, పెండిలి
యందముఁవే ఱబ్బుఁగాక యందున్ దొసఁగుల్. 657

మ. తమశ్రేయస్సునుగోరుమాతరపితల్ తత్తత్స్వబంధూత్కర
స్థములౌ యోగ్యత లెంచి "కంచమును మంచమ్మున్" విచారించి పే
ర్మిమెయిన్ జేయువివాహమే సతులకున్ శ్రేయస్కరం బౌను గా
క మఱొక్కం డెడియోగతిన్ గనుపడున్ గళ్యాణకాఘాసమై. 658

మ. ఒక రూపో ? మఱీ యొండో ? కన్యక మనం బూరించి పెండ్లాడుచో
నిఁక నెన్నో సమకూరఁగావలయు. లేనే లేవుపో ? పెండిళుల్
సకలమ్మున్ సరిపడ్డయట్టివి, కళాశాస్త్రంబు జన్మించె నిం
దుకె; అద్దానికి లక్ష్యభూతములు బంధుత్వమ్ము లెందుండెడిన్. 659

ఉ. దానికి లక్ష్యమైన వనితామణి దానికి లక్ష్య మైన ప్రి
జ్ఞానిధి పూరుషోత్తముఁ డొకానొకటన్ ఘటియింత్రు పూర్వపు
ణ్యాన,న దెల్లవారికి సమన్వయ మెట్లగు నల్ల సత్కవీ
శానుఁ డెటుల్ పచించె మనుసంభవమం దది సర్వభోగ్యమే ? 660

షరా:- "క. మెలఁతకుఁ బతిపై నైనను
మెలఁతుకపైఁ బతికి నైన మేలగు టెందున్
గలయది మెలఁతకుఁ బతికిన్
వలపు సమం బగుట జన్మవాసన చెలియా"

(మనుచరిత్ర)

ఉ. ఇచ్చకు వచ్చినట్టులు తెగించి చరించెడివేశ్యకేని భా
గ్యోచ్చయ మట్టి ఁబ్బ దన నుగ్మలికన్యకు నెట్టు లబ్బు; న
య్యచ్చర రంభ కబ్బె నలకాధిపునాత్మజుఁ డవ్వరూధినిన్
హృచ్చలితన్ ద్యజించి చనఁడే ? ప్రవరుండు వరించుకామినిన్. 661

తే. గీ. ఎంత స్వాతంత్ర్య మిచ్చిన నింతి గోరు
పూరుషుం డింతి కెన్నఁడు తారసించు
టరిది.యట్టులే పురుషున కక్కతమున
గురుజనులె తాల్చి టొప్పుఁ దద్భరము నెలమి. 662

ఉ. వచ్చిన వచ్చకున్న సుజనస్తవనీయపుమార్గ మిద్ది, సం
పచ్చయులైనగేస్తులు కొమార్తల కీ యుహాముం బిరంబుఁ బె
న్మచ్చకు నాకరంబుగ నమర్చుట శోచ్యము, పూర్వవిజ్ఞు లి
పిచ్చిపథానఁ గా లునిచి బిడ్డలశ్రేయము పీటఁబుచ్చిరే. 663

చ. తురకలు దూదెకుల్ కులవిహూనలు నత్కులజాతు లెంద ఱిం
దఱొ బడి సుందు రం దెవఁడు తన్వికి నచ్చనొ ? వాని బిడ్డకున్
వరునిగ గౌరవింపఁగలపాపపుఁగాలముదాపరించె నె
వ్వరితర మాఁగఁగా. నొక యుపాయము గన్నదుఁబో ? మనస్వికిన్.

ఉ. పెండిలి మానుకొన్నయెడ బిడ్డలచిక్కది లేదు ఘోరతా
శౌండుడె యయ్యు జన్వనపుఁజాపల మాఁప లవంబు పీలుగా
కండజయానతోఁ గలియు టబ్బిన నబ్బును గాక సంతతిన్
కొండొక గాంచుఁ గాక యవి కుత్సితుఁగాఁ దనుఁ జేయ దంతగన్.

ఆ. వె. ఒడలు జుందరించు చెడుకాల మది కదు
దాపుగాఁగఁ వోఁచుఁ దష్య మింత
పెండ్లియాడి గేస్తు బిడ్డలఁ గని యింక
నెగ్గలేఁడు సిగ్గు సిగ్గు సిగ్గు. 666

క. కాలము చెఱిచెడివిజ్ఞులు
వేలకువేల్ నెలకుఁ దెచ్చుబీదలు; సిరియా
బాలిశులవెంటఁ బడి దు
శ్శీలుర నొనరించె నేమి సేతురు వారల్. 667

ఉ. పేదతనంబునందుఁ దమపెద్దలు గడ్పినకాల మెట్టిదో ?
యీ దయనీయమైనతెఱఁ గెట్టిదొ ? పీ "ర్నడమంత్రిపున్‌సిరిన్
స్వాద మొనర్చి కైపొవవి సర్వము విస్మరియించి రీ మహో
న్మాదము లోకమున్ జెఱిచె మత్తుఁ దొరున్ జెకఁగొట్టుఁ దాఁజెడున్.

క. ఒకరినిజూచియొకరు పు
త్త్రికపెండ్లికిఁదొందరేమిరేపల బీ. యే.

కీఁకఁబోయి - ప్యాసుగనునం
తకుఁజేసినఁ జదువుచెడుఁగదా ? యనుదురహో ? 669

శా. దాంపత్యమ్మున కాంగ్లభాషయెడ స్వాదం బెచ్చుగా నుండు నో?
యింపా మాదిరి దాత్మభాషయెడ లేనేలేదో ? యింపుండ నే
కంపో గొట్టునో ? యేమికర్మమిది ? యాకళ్యాణికిం బెండ్లినై
లింపావాసమునందకావలయు భూలేఖుల్ తటస్థింపమిన్. 670

శా. ఎన్నోరాజ్యము లేలి యేగినవి ఆ యీ దేశమందున్ సుసం
పన్నుల్ బంగరుటాకులంమఁ దిను సౌభాగ్యంబునం బొల్చు వి
ద్వన్నుత్యుల్వినవత్తురగ్రిజులలోఁ బాతివ్రతిఁ వీడునా
తెన్నున్ బిడ్డలఁ ద్రొక్కఁజేయు ఘనులెందే నున్నటుల్ వింటిమే. 671

ఉ. శీలము వల్వదంచనరు శీలముదూలెడి పాడుబాటలన్
బాలికలన్ స్వయమ్ముగఁ గృపాళువులై చరియింపఁ జేతు, రే
వేళకు నాపెబుద్ధి యెటుప్రీలునొ ? వీలునుబట్టి. బిడ్డయో ?
బాలికగాదు కేవలము, బాలురఁ బెంచు వయస్సులోనిదే. 672

క. బలవంతము లింద్రియములు
పలుగున్ గుఱ్ఱములు పథముఁ బట్టినడచునే
తలునులనటుంత మయ్యావి
చెలరేఁగి యతీశ్వరులనె చెఱచుంగాదే ? 673

మ. "మలభూయిష్టపుఁ దోలుబొమ్మ" యనుచుం బైకేమొ వాగ్రుచ్చు న
వ్వలఁ బాప్తించిన గంగవంటిదగు నాబాలాశిరోభూష వి
జ్ఞులచందంబిటులుండ బాలికల కిచ్చో ధైర్యమెట్లుండుఁ బెం
డిలి కాకుండెడి బ్రహ్మచారిణుల యానేమంబు దుస్సాధమౌ. 674

ఆ. వె. వయసుకాలమందు వామాక్షులకు సీడు
జోడునైన వాండ్రతోడి పొత్తు
పనికిరాదటంచు బమ్మెరపోతన్న
వలికె నింతకన్నఁ బరులుఘనులె. 675

(పొలఁతిదావవహ్ని.........పొత్తువలదువలదు. - భాగవతము చూ.)

వ. ఇట్లేవేవియో యూహలు తఱచు మానసముం గలంపఁ గాలంబొండొక సుమాళంబుగ నీబుధవిదశారంభమునుండి జరుగుచుండె. మఱియుఁ

మ. నిసువుల్ వేఱొకచోట నేనొకట నీనిర్ణీతికిన్ లోఁగి స
న్న్యసనంబుం గొనినట్టులుంటయును శ్రీనారాయణోత్కృష్టమం
త్రిసమాసక్తులు వైష్ణవాగ్రిణుల మిత్రత్వంబు తద్గ్రంధస
ద్రిస సుస్వాదము సంఘటించెనభవా? త్వన్నిర్నిమిత్తాదృతిన్. 677

ఉ. వచ్చితి దేవిపూజ యెడ వారెవ రోననుఁ బిల్వ నంప స
ర్వోచ్చ భవత్కృపాకలన నోపికమై శివలీలలన్ రసం
బెచ్చఁగఁ గైతఁ గట్టితి నహీనులు శైవులు సంతసింప ని
ష్ఠచ్చగ వైష్ణవ ప్రవరులం డొకరుండుగ నుంటి శంకరా? 678

తే. గీ. నీకు విష్ణువు మిత్రుండు నీవు విష్ణు
వునకు మిత్రుఁడ విందులే దనృత లవము
శైవులును వైష్ణవులు వృధాసంగరమ్మొ
నేతు రెందులకో? యని చింత వొడమ. 679

తే. గీ. అసలు వారలు "మిత్రుల" మంచుఁ దేట
తెల్లముగ నొప్పికొన్నట్లు తెల్పుచుండె
ఋషు లొనర్చిన గ్రంథముల్ పృధగ శైవ
వైష్ణవుల కెందుకో గదా? వైర మభవ. 680

ఆ. వె. కొన్ని యుపనిషత్తు లెన్ను నీ పారమ్య
మెన్నుఁ గొన్ని యల్ల వెన్ను మహిమ
వేదమంద యిట్టి భేదంబు గనుపట్టుఁ
వృథగ వాద మేల బుధుల కింక. 681

క. ఏపేరు పెట్టకయె తా
నా పరతత్త్వమును మౌని వ్యాసుఁడు నూత్రి

వ్యాపృతి వ్యాఖ్యానించె ను
మాపతి ? మీరిరువురును సమానులకారే ? 682

క. సములని చెప్పుటయును దో
షమనియు నటు చెప్పనట్టి చతురులు నరకా
న మడియుదు రనియు నల స్కాం
దమునఁ గలదు తేలుపెట్లు తత్త్వము దేవా ? 683

తే. గీ. పైకి నద్వైతు లీవ్యర్థవాదములను
బాల్గొనని రీతి నుండియు భస్మ ధార
ణాదికము కల్మి శైవుల కనుగుణముగ
నుంద్రు వైష్ణవులి వ్వారి నొప్పు పెట్లు. 684

క. ఈయూ ర్వచ్చుటె మొదలుగ
నా యీ యిరువాగు తోడ నబ్బెఁ జెలిమి శే
షాయుర్దాయ మ్మిట్టులె
శ్రేయస్కరముగను జెల్లఁజేయుము దేవా ? 685

క. సోమరి యటన్నఁ గోపము
నామది జనియించు పెఱిఁగినావో ? యేమో ?
సోమరిగ నన్నుదిద్దితి
వేమాడ్కిన్ రోజు గడచు వృద్ధుఁడ నాకున్. 686

తే. గీ. విద్యయే దిక్కు సేవ్యము విద్య నాకు
విద్దెకన్న వేఱొంట నా బుద్ధి చనదు
ఇహముఁ బరమును విద్దెయే యిచ్చు నాకు
దానినె యొసంగు మీశ్వర ? తరణమునకు. 687

తే. గీ. ఇతరమునకు సోమరి నని యెఱుఁగు దీవు
విద్యయెడ సోమరిని గాను విశ్వనాథ ?
కడపు మాశ్వాస మిట్లు నీకరుణ గల్గి
నంతలో నెట్టి చిక్కు నా కంటఁబోదు. 688

తే. గీ. ఇట్లు పరమేశు వేడుచు నెలమి మూఁడ
వసుతునకుఁ జిరంజీవికి భారతాదు
లందలి విశేషములు దెల్పుచహము లరుగఁ
జేయు నంతట ధ్వజుఁడు విచ్చేనె సరఁగ. 689

తారణ సం॥ శ్రావణ బ ౧౪ మొదలు ఆశ్వయుజ శు ౨ వఱకును శనిలో చంద్రునిలో

— కేతువిదశ —

క. హరినాగభూషణుఁడు నను
గురువుగఁ బ్రేమించు గానకోవిదుఁ డతఁ డు
త్తర మొకటి వ్రాసె నయ్యది
యరివర్గ కుచేష్ట దెలుపునట్లుగ నుండెన్. 690

క. దానిగుఱియించి యిట వ్యా
ఖ్యానింపను వృధగ నతని నరిపక్షీయుల్
ధీనిధి నవమానింపఁగ
సూనృత దూరమగు వ్రాఁత సూచించి రొగిన్. 691

వ. అయ్యది కృతఘ్నతా దోషము నాపాదించు వ్రాఁత ద్వేష ప్రయుక్తము దాని తత్త్వమెల్ల నాయెఱిఁగిన దగుటంజేసి యతఁడు నాకుఁ దెలిపెఁ గాని యోపిక లేనికతన నే నా విషయమునకు విముఖుఁడనై మిన్న కుంటి నింతమాత్రి మిట స్పృశించి విడుచుటకున్ గతంబు లోకము నకు నాగభూషణుఁడు నిర్దోషియని చదువరు లరయుదురుగాక యనియే.

తే. గీ. ఎందులకు నోపిక లవంబు నేను లేక
యూరకున్నను బూర్వ గుంటూరివైరు
లాత్మ శాఖాభిమానంబు నణఁచుకొనఁగ
లేక వ్రాసిరి యొక్కెడ లేకవ్రాఁత. 693

వ. దాని స్వరూపం బెట్టిదనిన కీ॥ శే॥లు శ్రీ నుసర్ల దక్షిణామూర్తి శాస్త్రులు గానశాస్త్రకోవిదులు హరినాగభూషణము గారికి గానవిద్యా గురువులై యుండ నాగురుత్వమును విస్మరించి నాగభూషణము గారు కృతఘ్ను

లైరని యొకరు లిఖింప నా యీవ్రాఁత కేవల దురుద్దేశ పూర్వకంబని మూలముట్టుగ నెఱిఁగిన నా కసహ్యమ్ముగఁ దోఁచి యొక వ్యాసము వ్రాసితి—దానిపేరు —ఎందుకీ చేదస్తం అని, అయ్యది, 26 అగష్టు 1944 సం॥ తేదీగల ఆంధ్రవాణిలోఁ బ్రచురింపఁబడియె. 694

(కథలు-గాధలు అను పొత్తములోచూడుఁడు. ప్రకాశకులు.)

ఉ. ఏ మొగమూని యాడుదురొ ? యేవము నెంచక సత్య మక్కటా ?
ధీమహితుల్ మహోఘ మది దెచ్చునటంచు నెఱింగి కూడ; నే
నీ మహిఁ బుట్టి బుద్ధెఱిఁగి యిట్టి దురీహుల వల్లనే యశో
ధాముఁడ నైతి, నిప్పటికిఁ దప్పవ నాయెడ వీరి ఘోరముల్. 695

క. ఎఱిఁగిన సత్యము వ్రాయుట
పరమార్థం బనుచు నేను వ్రాసితి నది ధీ
వర సమ్మతమయ్యును ని
ష్కారణులు పరిపంధులకు వెగటుగాఁ దోఁచెన్. 696

తే. గీ. నాగభూషణు వంటి గానప్రవీణు
లాంధ్రదేశమ్మునన్ మృగ్యు లనుట ధృవము
అంతియే కాదు గాయకులందు నట్టి
సచ్చరిత్రులు దొరకరు సత్యమింత. 697

ఆ. వె. అట్టి నిషధయోగ్యు ననవద్యు గాయక
సార్వభౌము సుకవి సాహితీధు
రీణు సత్యవచను గృతమెఱుంగని కూళ
యనుచు వ్రాయఁ జేయి యాడు టెట్లొ. 698

తే. గీ. ఉన్న దోషమ్ము నేనియు యోగ్యులైన
వార లొప్పరికింతురు పరమెఱుంగ
కల్ప లాభం బెదో కోరి యనృతకల్ప
నము లొనర్తురు కొందఱన్యాయ మరరె. 699

చ. పలువుర కూటసాక్ష్యమును బల్కి శరించిన సత్యమోడు యా
జులు గొను యాగపుంబశువుఁ జోరులు కుక్కయటన్న వీడఁడే :
కలియుగమిద్ది సూనృతము గాదిలి చుట్టము గాదు దీని క
శ్మలి యనృతంబునం దలఁప మీఁదటి పాటు లెవం డెఱింగెడిన్. 700

క. అపర ప్రష్ఠోమం డని
కృపణేతరులైన కవులు కీర్తించెడి వా
జ్నిపుణుండు నాగభూషణుఁ
డపరాజితుఁ డొందుఁగాక ఆయుః కీర్తుల్. 701

శారణ సం॥ ఆశ్వయుజ శు ౨ మొదలు పుష్య శు ౭ వఱకును
శనిలో చంద్రాంతరములో

—• శు క్రి వి ద శ •—

తే. గీ. ఉన్న యోపికలోఁ గొంత సన్నగిల్లె
వార్ధకము హెచ్చుకతమున "వాసుదేవ"
యన్న శ్లోకార్ధమును దఱ చంతరంగ
మెలమి స్మరియింపఁ జనుదెంచె భృగువు శుభుఁడు. 702

షరా:- శ్లో. వాసుదేవ జరా కష్టా కష్టం నిర్ధన జీవనమ్.

క. ఆరోగ్య మయోమయ మను
తీరునఁ గనుపట్టుచుండె ధీవైఖరి ని
స్సారమగుచుండె నేదొ వి
చారము మదిఁ గలఁచు కతన సౌఖ్యము తగ్గెన్. 703

వ. దశానాధుండగు శని శత్రుక్షేత్ర గతుండగు కతన వికలావస్థా ప్రయు
క్తంబగు గొనమ్మలు చూపుచున్నను భాగ్యాధిపత్య ప్రయుక్తంబులగు
సన్మానాదికంబులు గూడ సంఘటించుచుండె నం దిందుఁ గొండొక
యుదాహరించెద. 704

తే. గీ. సరసుఁడు పత్రికాశరా వన్నవరము నుండి
పంపె నూఱు రూపికలను వైశ్యరత్న

మైన చుండూరిరెడ్డి నూటాఱులిచ్చెఁ
బలువురు మహాకవులు తన్నుఁ బ్రస్తుతింప. 705

వ. మఱియు నీవేంకటరెడ్డి దానధర్మంబుల పరిమితి యింతయనికాని యిట్టిదనికాని వివరింప నాతరముకాదు. సర్వతంత్రికళాశాల లోనగు ధర్మసంస్థలు జగత్ప్రసిద్ధంబులు. "ధర్మమాచరింపఁదగు మృత్యుచే దలపట్టి యీడ్వఁబడిన వాఁడువోలె" నను పద్యమున కీవదాన్య శిరోమణియే ప్రధమోదాహరణంబని నా నిష్కృష్టాభిప్రాయము. ప్రతివత్సరమును కార్తిక మాసమునఁ దన గురువగు నమృతానంద మహాశయుని జన్మదినోత్సవ వ్యాజంబున నీయలఘుం డనేకుల విద్వాంసుల నాహ్వానించి వరుసగా నైదురోజులు మహాసభలు సంఘటించి యందు వేయార్లు మూఁడార్లును బండితులకు సత్కరించు, వేలకొలఁది బీదలకు నన్నదానంబొనర్చు నిట్టి యీతఁ డీవత్సరము మచ్ఛిష్యుండగు దోమా వేంకటస్వామిగుప్త శతావధాని యొనర్చిన విష్ణుభక్తి యను కబ్బంబు కృతిగాఁ గైకొని గ్రంధకర్తకు వేయా ర్లతో నింపిన వెండిపళ్ళెరమును మాకు నసఁగా శ్రీ శ్రీపాద కృష్ణ మూర్తి శాస్త్రిలవారికిని శ్రీ జనమంచి శేషాద్రి శర్మగారికిని నాకును శ్రీ హరినాగభూషణ గాయక సార్వభౌమునకును ఈయన కొమరు లిరువురకును మూఁడార్లను బ్రత్యేకించి యొసఁగి సన్మానించె. మఱియు నాయా యీ జయంతి సందర్భమున నీమహాదాత యొనర్చుచున్న దానధర్మము లింకను బెక్కులు గలవు. కాశీపురినుండి సప్రయత్న ముగ రప్పించిన శ్రీ రాజేశ్వర శాస్త్రిలవారికిని శ్రీమద్దేవనాయకా చార్యులవారికిని జెరి మూడునూర్లును విలువగల వస్త్రములను నొసఁగి గారవించె నాయెఱిఁగినంతలో భూత కాలంబునఁగాని నేఁడుగాని యిట్టి వదాన్యుండు గానరాఁ డని యిందు లిఖించితి. నిదియంతయు నేను స్వయముగాఁ జూచినదికాని వివి వ్రాసినది కాదు. నేఁటికి మూఁడేళ్ళనాఁడు నాచే శివభక్తిని గృతినంది వేయార్లతో నన్ను

సత్కరించె నితఁడు తత్త్వజ్ఞాని. వేయేల? కులభేద మొకటి తక్క జనకమహారాజునకును నీయనఘునకును భేదంబు గానరా దని చేతు లెత్తి వక్కాణించుటకు నేను జంకను. శివభక్తిలో నాశీర్వదించిన పద్య మొకటి యిట నుదాహరింతును. 706

తే. గీ. రెడ్డి తలపెట్టినట్టి సత్కృతుల కెల్ల
వప్పరాశక్తి విద్వదుపాస్య తోడు
నీడయై మంచి కీరితి నింపుఁగాక
యిహపరమ్ముల సుఖమది యిచ్చుఁగాక. 707

(శివభక్తి చూడుడు.)

మ. గురురాడ్జన్మమహోత్సవంబను మిషన్ గోమట్లలోఁ గాద యే
నరనాథాగ్రిణులందు నీదృశ వదాన్యత్వంబు చూపించువా
రగుపడుచున్ వచియించుకన్న నెట లేరంచున్ బ్రశంసింతుఁ జుం
డురి రెడ్డింగని నేర్చుకోవలయు ధర్మోపాస్తి నేరేనియున్. 708

తే. గీ. అతఁడు ధర్మకార్యమ్ముల నాచరించి
ధన్యుఁడగుచుండె నేను దద్ధర్మకృతులు
చూచి ధన్యుఁడ నగుచుంటి శుక్రవిదశ
యిట్టి సాయ మ్మొనర్చి సుకృతము నొసఁగె. 709

వ. మఱియు.

క. తనయ సుఖప్రసవంబునఁ
దనుజాతన్ గనియెఁ బిల్ల తల్లియు ద్వయమున్
నను మనుచు కనకదుర్గా
జనని మనుచుఁగాక సుఖమొసంగి సతమ్మున్. 711

చ. అలరెడు భక్తితోఁ దను నహర్దివమున్ భజియించు దైత్యరా
ట్కులపతి పుత్త్రుఁ బ్రోచుటకుఁ గొండొక వేసము మార్చుఁగాక మం
గళగిరి పేరు సార్థకముగాఁ దనభక్తులయార్తిఁ బాపు మం
గళగిరి నారసింహుఁడు సుఖంబిడి ప్రోచుత మత్కుమారికన్. 712

వ. మఱియు ముదిగొండ నాగవీరేశ్వరశాస్త్రిగారి శివపురాణము సంస్కా-
రించు కతమ్మునఁదఱచుగా సద్గోష్ఠి యీ శుక్ర విదశయందు సంఘటిం-
చెంగాని యేదో విధమున మనంబు మాఱి అయోమయంబుగఁ గను-
పట్టుచుండె నంత రవివిదశ ప్రారంభించె. 713

తారణ సం॥ పుష్య శు ౨ మొదలు మాఘ శు ౫ వఱకును శనిలో చంద్రాంతరములో

—: రవివిదశ :—

తే. గీ. పరిఢవిల్లె నీరవియందు బారసాల
కూఁతు కొమిరెకు మూఁడవ కొడుకు భార్య
పుష్పవతి యయ్యెఁ జుండూరి పుణ్యకులుఁడు
రెడ్డి పిలిచి సన్మానించెఁ గృతమహుండు. 714

వ. ఆమహా మాయన జన్మదినమునకు సంబంధించినదని యెఱుంగునది. ఆ యీ యుత్సవమునకు బ్ర॥ శ్రీ॥ వేదుల సూర్యనారాయణ శాస్త్రుల వారు. శ్రీవారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రులవారు లోనగు పండితులు పీఠికా పురమునుండి ఆహూతులై విచ్చేసిరి. కొప్పరము (గుంటూరు డి॥) నుండి కొప్పరపు కవుల కొమరులు బాలకవులు గూడ నరుదెంచిరి. వీరలలోఁ గొందఱికి నూర్లు కొందఱికి విలువగల వస్త్రములు లోనగు నవి యొసంగి చుండూరి వదాన్యుండు సత్కరించు సభ చూచి యానందించితి. 715

క. ఏదే నొకవ్యాజమ్మున
నేదినమును బండితులనొ హితులనొ లేదా
పేదలనొ సత్కరించు ద
యోదయుఁ డీరెడ్డి మెచ్చకుండుట యెట్టుల్. 716

శా. కీర్తిం బొల్చునుగాక శ్రీ విజయవాటీ పౌరభాగ్యంబు దు
ర్గావిశ్వేశ్వరి దేవళంబు గలగోత్రంబున్న దిచ్చోట వి
ద్యావైశద్యము నిత్య దీనజన వస్త్రాన్నప్రదా నోత్సుక
శ్రీ వైశ్యాన్వయ మిప్పురీవరమునన్ జెల్వారుఁ గృష్ణాతటిన్. 717

తే. గీ. అంత శనిలోన భూమిజు నంతరమ్ము
వచ్చె వచ్చుచేతడవుగ వార్ధకమ్మ
హెచ్చి మానసికవ్యాధి పెచ్చుపెఱిగి
కడు నయోమయముగ జాతకమ్ము దోఁచె. 718

తారణ సం॥ మాఖ శు ౫ మొదలు పార్థివ సం॥ ఫాల్గున శు ౧౫ వఱకును
శనిమహాదశలో కుజాంతరము. ఈకుజాంతరములో

— కు జ వి ద శ — (మాఖ బ ౧౩ వఱకును)

వ. ఈ కుజవిదశలో నింట ననారోగ్యాదులు పొసఁగె భగవతీకటాక్షమున నుపశమించె. నప్రయత్నమ్ముగ నొకకొంత ధనాగమమ్ము సంఘటించె. మఱియు నుపచారార్థ మరుదెంచి నాయొద్దనేయున్న మూఁడవ కొమరుని యవివేకము నిర్నిమిత్తముగఁ బెచ్చుపెరిఁగె. 719

తే. గీ. నిర్వచింపఁగ రానంత నెగులు దిగులు
నేవమును బుట్టి నెమ్మది కింత యంత
యనని పరితాపముదయించె నద్దియెంత
వ్రాసిన సశేషముగ నున్నపగిది నుండు. 720

క. కొమరుని యజ్ఞానముఁ బాఁ
పుమనుచుఁ బోరి నింటివేలుపును బ్రార్థనసే
య మొదలు వెట్టితి నాప
ద్యము లాస్తవమందుఁ జూడనగు సుకవివరుల్. 721

క. మది ముదిమికతనఁ గొమరుం
డెదిరి యెవోవదరుకతన నేదోగతి మా
ఱఁ దొడఁగె వ్యాధియుహెచ్చెన్
బదపడి తా రాహువిదశ ప్రారంభించెన్. 722

తారణ సం॥ మాఘ బ ౧౩ మొదలు పార్థివ సం॥ నిజచైత్ర బ ౧౩ వఱకును,
శనిమహాదశలో కుజాంతరములో

— రా హు వి ద శ —

తే. గీ. రాహువిదశను గుఱ్ఱధోరణి మఱంత
యవకతవకగ మాఱి యప్డపుడు చింత

కలఁగుకతమున శాంతి చొప్పడకయుంటి
వేల్పుపైఁ బద్యములుచెప్పి వేడవలసె. 723

వ. ఆరోగ్యస్థితియు నెప్పటికప్పుడు మాఱుచుండె. నాకు నేకలవ్య శిష్యులలో నగ్రిగణ్యుండును బరమ భక్తుండును నగు గూడూరి వియ్యన్న యను ఆదిశైవ బ్రాహ్మణుండు స్వర్గతుండయి ఖేదంబు గలిగించె. 724

తే. గీ. కొన్ని విషయము లిట్టివి యున్ననేమి
కొన్ని సందర్భములు పేర్మి కుదురుపఱచె
నయ్యది ధనాగమము మన్మరాలొకర్తు
జననమందుట లోనైన వనియెఱుఁగుఁడు. 725

వ. పైపద్యమునందలి యంశములు కొండొక వివరింతు. మనుమరాలు చి॥ పెద్దకొమరుని కుమార్తెగా నెఱుంగునది. ధనాగమమ్మెట్టిదన, సాక్షచ్ఛిష్యుం డేలూరుపురవాసి చి॥మంచావఝ్ఝుల సీతారామశాస్త్రి అర్ధ నూటపదాఱు రూప్యములును విలువగలవస్త్రములును బుష్పఫలాదులును దెచ్చి యొసంగి పూజించె. శ్రీమదన్నవరపు సత్యనారాయణస్వామివారి ధర్మకర్త శ్రీగొల్లప్రోలుజమీందారు శ్రీయినుగంటి ప్రకాశరావుగారు నూఱురూప్యములు పోస్టుద్వారమున బహూకరించె నిది యిట్లుండ మద్రాసురేడియోవారుసంవత్సరాది సందేశమునొసంగుటకై ప్రత్యేకించి గవర్నరుగారిచే మూఁడువందల రూప్యములు సత్కరించుటకును గౌరవ ప్రదముగా నీబెజవాడనుండి చెన్నపురికిఁదీసికొనివెళ్లి మరల నియ్యెడకు భద్రముగాఁ దీసికొనివచ్చుటకును నేర్పఱిచి ఆయాసందర్భమును దెల్పి బలాత్కరించిరి కాని, నాయసమర్థతం దెల్పి నిరాకరింపవలసిన వాఁడనైతిని. పదంపడి ఆయాఫీసువారు రేడియోపరికరములతో నాయున్న యీక్షీరసాగర నామక గేహమ్మునకే వచ్చి రికార్డుచేసికొని నూఱురూప్యములుమాత్రము బహూకరించిరి, వారికి నాయొసంగిన సందేశపద్యము లియ్యెడ నుదాహరింతు. 726

షరా:- మనికొండ నరసింహ మనియెడి వణిక్సత్తముని సన్మానమును.
కాటూరి వేంకటేశ్వరరావు చేసిన (రు 40—0—0 లు) సన్మాన
మును నీ రాహువిదశలోనివే.

—/ సం దే శ ము /—

ఉ. తారణ వత్సరమ్ము మనతాపము లార్చి, అభీష్టసిద్ధి చే
కూరిచి బాగుచేయు ననుకొంటిమి, దానికి శక్తిచాల దే
కారణమో ? యిఁకన్ బ్రకృతకాలము పార్థివ వత్సరమ్ము సం
సారుల నెల్ల నిద్ధి సుఖసంపదలన్ బొదలించి యేలుతన్. 727

తే. గీ. పార్థివుల కింద జయము సంపన్న మగుతఁ
బ్రజల కష్టసుఖమ్ములు వారలరసి
ఉపకరింతురుగాక జయోత్సవములు
ప్రబలుఁగాక యీ పార్థివ వత్సరమున. 728

క. అమ్మా ! పార్థివ ! నీకు జ
యమ్మగు నినుఁగొలుచునట్టి యఖిల ప్రజకు సౌ
ఖ్యమ్మగు నీపేరు ప్రసి
ద్ధమ్మగు నన్వర్థమగుచు దైవతకృపచే. 729

వ. మఱియు నీ విజయవాడ పురవాసి వణిక్సత్తముఁడు కురుకూరి సుబ్బా
రావు తన కొమరుని పెండ్లిసందర్భమ్మున నేర్పఱచి ఆహ్వానించిన
కవిపండితసభకు నశక్తతచే నేనేగకున్నను అర్ధనూటపదాఱు రూప్య
ములును విలువగల వస్త్రములును నాయున్న ఐసకే పంపి బహూక
రించి ఆశీర్వచనముఁ గైకొనియె నాపద్య మిట నుదాహరింతు. 730

—/ ఆ శీ ర్వ చ న ము /—

ఉ. శ్రీయిడి సంతు నిచ్చి గుణసేవధిగాఁగ ననుగ్రహించి దీ
ర్ఘాయు వొసంగి "సుందరమ" యన్ సతితోడ స్వరాజ్యసత్యనా
రాయణరావుఁ బ్రోచుతఁ గరం బనురక్తి దలిర్ప సత్యనా
రాయణమూర్తి సంతతము నక్షికి తెప్పయుఁబోలె సాఁకుచున్. 731

వ. మఱియు నిట నొక రహస్యాంశము జాతకజ్ఞులకై వ్రాయుచుంటి. ప్రస్తుత మేలూరి వాస్తవ్యుఁడును అసలు బందరు వాస్తవ్యుఁడును బుద్ధిమదగ్రేసరుఁడును జమీందారును నగు ప్రొఫెసరు శేఖరరావను సంపన్న గృహస్థునకు నేనన్నను నాకవిత్వమన్నను మిక్కిలి యాదరము కలదు. ఇతని యన్న శేషగిరిరావు నాయెడ మిగుల భక్తుఁడును శిష్యప్రాయుఁడును నగుటఁజేసి తమ్ముని పెండ్లికి నన్ను సగౌరవంబుగ నాహ్వానించెఁ గాని తాత్కాలికముగా నారోగ్యము వ్యతిరేకించుటచే నేనేగక ఆశీర్వచనపద్యములు మాత్రమంపితిని. శేఖరరావున కదిమొదలు నన్ను సన్మానించు కుతూహల ముదయించి పలుసార్లు తన జమీను గ్రామమునకుఁ దీసికొనిచని అచటనే యీసత్కారము జరుపవలెనని యనుకొనుట నేనేగాదు. శిష్యుఁడు మంచావర్ఝుల సీతారామశాస్త్రి కూడ నెఱుఁగును. నే నప్పటికే అసమర్థతాస్థితికి వచ్చియుంటచే నతనికోర్కెకుఁ దోడుపడలేదు. అప్పటికి సత్కారపరిమితి నూటపదాఱుమాత్రమే కాని అది నానాఁటికి వేయినూటపదాఱులుగా మాఱినది. ఇంత పెద్ద సన్మానమును గైకొని నేను ఋణపడుట భావ్యముఁగాదని పతివ్రత యనుపేరితో నొకకబ్బము రచించి అంకితమిచ్చితిని. దానిని విని సంతసించి సన్మానసభ చేయు తేదీలను పలుసార్లు సూచించుటయేకాని అది జరుగలేదు. శ్లో. సా కిం నరమ్యా సచ కిం నరంతా బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా (పండితరాయః). పుస్తక మచ్చొత్తించి నాలుగేండ్లు దాఁటినవి. ఇంతలో నన్నదమ్ముల కిరువురకుఁ గోర్టుకేగఁదగు వివాదపొసఁగి ఆ యీ సన్మానోద్యమ మాఁగినది. ఇట్లుండఁగా నీ రాహువిదశ ప్రారంభమైనది. నాకుఁ గొండొక ధనముతో నవసరమువచ్చి కబురు చేసితిని. శిష్యునితో "ఇన్స్యూరు" ద్వారమున నందఁజేయుమ ని కబురంపెను గాని అదియును జరుగలేదు. ఈ రాహువిదశలోఁ గొన్ని యనుకోని నూఱార్లు వచ్చి అవసరమును దీర్చినవి. కాని అనుకొన్నది అద్దములోని ముల్లెగాఁ బరిణమించినది. ఇందులకుఁ గతంబు జాతకమర్మజ్ఞు లాలోచింతురుగాక యని యిందుదట్టంకించినాఁడ. 732

తే. గీ. ఇచ్చె నీకుండె దానికి నేమిగాని
మంచిదే యీతనికి జనియించె నూహ
అక్కటతమున నాదీవన కర్థమిదిత(డు
సిరి యితోఽధిక మీతని జెందు(గాక. 733

క. దాతృత యీతనికిన్బలె
నీతని సంతునెడ( గూడ నీషన్మాత్ర
ప్రీతియు( జూపక వర్ధిలు(
గాత మతొక్కయెడ సుకవి గణనీయంబై. 734

క. ఆయుష్యం బారోగ్యం
బాయతమై కృతిని గొన్నయందు కలరుతన్
శ్రీయు నితోఽధిక సౌధ
స్థాయినియై తాండవంబు సలుపున్గాతన్. 735

క. బలి కర్ణు(డు లోనగు దా
తలు దాతృత కలిమి( జెడిరి తత్తచ్చరితల్
దెలుపును బై విషయంబును
పరిలోభి వర్ధిల్లు(గాక పదివేలేడుల్. 736

వ. అది యటులుండె నీ రాహువిదశయందె శిష్యు(డు వేదాంతకవి తన రచించిన పొత్తములు డాక్టరు జంధ్యాల దక్షిణామూర్తి గారికిని మఱి కొందఱికిని నంకితమిచ్చు సందర్భమున( దత్తత్సభల కెట్లో మోమోట పెట్టి తీసికొని వెళ్ళ(గాని కొన్ని నిమిషములుగూడ నయ్యెడ నుండుట తటస్థింప దయ్యె దీనింబట్టి నానా(టికి వార్ధక్య మెట్టి మాంద్యపు చెందు చున్నదియు( జదువరులు గుఱితింప(గలరు. 737

క. జరయును నాధివ్యాధులు
తఱచై పీడింప నేమి ధనమఱిముఱి( బొం
పిరివోవుకతన ధైర్య
స్ఫురణమెయిన్ జీవయాత్ర పొదలుచు నుండెన్. 738

క. పొరుగూర నునికి జరయును
గఱవును నివి యొకటఁ గూడుఁగాక మనము ని
బ్బరముగ నుండుట కామే
శ్వరికతన ఘటించె ధనము కరగత మగుటన్. 739

తే. గీ. ఇంటిలో మూలగదిలోన నెవరి మోముఁ
గాంచుటకు నిచ్చలేక నేఁ గనులు మూసి
కొని "నమశ్శివాయ" జపము మననసేయ
నెట్టులో వచ్చిపడు ధనం బెసక మెసఁగ. 740

క. ఆరోగ్యము ధనధాన్య
శ్రీ రోచిష్ణుతయు నిఖిలశ్రేయస్సులు శై
వారాధనపరులకు వి
స్తారంబని తెల్పిరి మునిసత్తము లెలమిన్. 741

చ. నెలకొ పదేనురోజులకొ నిల్వగ రొక్కము కొంత యుండఁ బై
నెలకని చూచికోలది మనీషకు లక్షణ మౌట నెమ్మదిన్
దలఁపుదయించె నిద్ది యెటు తప్పెనొ ? పంపెఁ బ్రకాశరాయఁ డి
మ్ముల నొకనూఱు రూపిక లమోఘుఁడు మేఘుఁడు వృష్టియున్ బలెన్.

వ. ఈ గుప్తవదాన్యశిరోమణి యిప్పటికి నాఱుమాసముల నాఁడు తంతి ద్వారమున నూఱు రూపికల నంపె నట్టు లంపుటకు గతంబు వివరింతు

తే. గీ. అన్నవరపు దేవస్థానమందుఁ దాను
ధర్మకర్త యగుటఁ జేసి దైవతపద
భక్తుఁ డీతఁడు వార్ధకప్రాయ మచటఁ
గడపుచున్నాఁడు సంసృతి బెడఁదవిడిచి. 744

వ. ఈయన నాయఁత కాకున్నను షష్టి (60 యేండ్లు) పూర్తికి నతిక్రమించిన వృద్ధే సంసృతి త్యజించి వానప్రస్థుఁడు గా నన్నవరపుఁ గొండయందుఁ బ్రవేశించి యైదాఱేఁడు లైనది. నన్నుఁగూడ నక్కడనే యుండంజేసి యుపచరింప వలయునని యీ యలఘున కెంతో

కుతూహలము కలదు. లోఁగడ నాలుగేండ్లనాఁడు నన్నన్నవరముఁబలా
త్కరించి రప్పించి యీ సందర్భమును ముచ్చటించెఁ గాని నా యోపిక
యీ బెజవాడలోని యీ క్షీరసాగరపు బిళ్ళింగు మూలగదికేతప్ప
నెయ్యెడకును దగియుండమింజేసి ఆయలఘుని మనోరథమునెఱపేర్పఁ
జాలక లజ్జింపవలసిన వాఁడ నైతిని. 745

ఉ. ఎన్ని భవంబులంగలుగు నింటి బెడందల జోలిపోక యీ
త్పన్నవయస్కులౌ సుతులపై భరమెల్లను డించి దేవు నా
పన్నశరణ్యునిన్ హృదయ పంకజమందు స్మరింపఁగల్గు భా
గ్యోన్నతి; శ్రీపరికాళనృపుఁ డొందె నిదం సుకృతం బవాప్యుఁడై. 746

క. భగవద్భక్తుఁడు మిక్కిలి
సుగుణుం డాచారపరుఁడు సూరిహితుండుఁ
మొగమోటమి గలఁ డాదృతి
నిగముండు పరికాళరావు నెగడుంగాతఁ. 747

మ. భవబంధమ్ములు పెంచికొన్నకొలదిన్ బాధించెడిన్ గేస్తు న
య్యవి మెల్లో తెగఁద్రెంచుకోఁ గలుగుచో నబ్బున్ మనశ్శాంతి ప్రా
గ్భవపుణ్యంబునఁగాని దెండవది సంప్రాప్తింప, దీనేరు పె
ట్లవగాహించెఁ బరికాళరావు; కడు ధన్యాత్ముండు నాఁ జెల్లదే? 748

క. శివునిన్ ద్వేషింపఁడు వై
ష్ణవ శిష్యుండయ్యు, సలుపు సాయం బుదయం
బవధానముతో విష్ణు
స్తవమును దేశికులు దెలుపు తత్తత్పణితిన్. 749

వ. మఱియు నీపరికాళరాయుఁడు తాను ప్రస్తుతము నివసించుచున్న
శ్రీ అన్నవరపుఁ గొండ కెక్లేని నన్ను రప్పింపవలయునని తఱచు
ప్రయత్నించుచునేయుండె నేను దానికిఁ దగిన యోపికలో లేమి
నయ్యనఘు నుద్యమంబు ఫలింపదయ్యె నీరాహువిదశయంద యీ
నిర్వ్యాజదాత మరల నూఱు రూపికలంపె శ్రీ బొబ్బిలి మహారాజు

లుంగారి వార్షికము గూడ నందికొంటె నింటఁ బిరుశ్బు వచ్చి శుభసమృద్ధి సంఘటించె. నాయోపిక మాత్రి మహోమయముగ మాఱుచుండె. 750

ఆ. వె. మనుమరాలు నాల్గుమాసాల లేకూన
కమ్మవారు వోసి యంబ కృపను
బ్రదికె నాత్మజాతు సదసద్వివేక హై
న్యంబు నాఁడువాఁటి కడరుచుండె. 751

ఉ. ఏను గృతఘ్నుఁడన్న గడు నేవము చెందెడి వాఁడ దానికిన్
మానుఁడె యగ్గమై యడరుచో నదియెట్లు సహింపనేర్తు నన్
మానుగ వేల్పుమాద్రిగఁ గొమార్తయు నల్లుఁడు గౌరవించుచో
దానికి సంతసింప నెడదన్ మఱి మెచ్చుట దేనికన్నచో. 752

వ. నాకూఁతు నత్తగారు నన్నుఁ గన్నకొమరుంబలె నాదరించుటకు నేనెంతో యక్కజం పడుచుఁదు. నిట్టియామెయెడఁ గృతజ్ఞత చూపుటకు మాఱుగా ననాత్మజ్ఞుడగు నస్మత్కనిష్ఠసుతుండు కృతఘ్నతం జూపి తేలికమాటలాడుటకు నేను మిక్కిలిగా విచారింపవలసి వచ్చినది. 753

ఉ. వీనికి మిత్రుఁ డొక్కరుఁడు వీఱిఁడి వీఁడొనరించునట్టి య
జ్ఞానపుఁ జెయ్వులన్ వలదు నా కెసకొల్పుచునుండు నాతఁ డ
జ్ఞానియుఁగాఁడు జ్ఞానియును గాఁ డొక "కార్లి" కని చెప్పనొప్పెడిన్
వానికి వీనికిన్ గలిసె "బంగుకు నుమ్మెతకున్" బలెన్ లలిన్. 754

చ. జనకు నెదుర్చు తల్లియెడఁ జాల నవజ్ఞుఁడుగా మెలంగు "న
ల్పునకు ఘటించెనేని సిరి పుణ్యవశంబున నర్ధరాత్రి తె
మ్మను గొడు" గన్న సామెతకు నాతఁ డుదాహృతి యైననేమి ఆ
తని కొనవేర్లి గోటికి నిదం మదపత్యము పోల దెమ్మెయిన్. 755

ఉ. పోలినఁ బోలకుండినను బొత్తిరువాగుకు హత్తె క్షీర నీ
రాలకుఁబోలె నెవ్వ రపరాధ మొనర్చిన నిర్వురొక్కడై

ప్రాలి సమర్థనమ్మున కుపక్రమణం బొనరింతు రందులో
హీ్రి లవమున్ గనంబడమి హేయముగాఁగనుపట్టు సర్వమున్. 756

చ. ఇరువురుఁ బండితాత్మజులె యిందొకరుండు ప్రియోజకుండు సో
మరి మఱియొక్కరుండు తగుమాత్రమె భేదము వీరలిర్వురుఁ
గఱువల దూలనాడుదురు "కా" దన "నౌ" ననియందు "రౌను"నా
నఱతురు "కా"దటం చెద భయమ్మను భక్తియు లేదు వీరికిన్. 757

క. కల వన్నవస్త్రములు తం
డ్రులకతమున వీండ్రికున్ మనోరథములతోఁ
గలయన్ దిరుగుదు రెల్లెడ
నెలమి "సినీమా"లవెంట నేవములేమిన్. 758

క. దాయాదుండు వృథాగా
నాయెదకున్ గొల్పు వేదన న్నెనిచటన్
ప్రాయంగఁజాల దీనికి
శ్రేయంబెటు గూర్తునంచు జింతింతు సదా. 759

తే. గీ. సతత మస్మ దుపాస్యయై సాఁకుచున్న
యిఁటివేల్పు కామేశ్వరి కొంచెతనపుఁ
జెయ్వులకుఁ బాపి మత్సుతు శ్రేయమునకు
నిక్కయగునట్టు లొనరించి యేలుఁగాక. 760

చ. భయపడుచుంటి నంబరొ? యపాత్రుఁడు వీఁ డొనరించునట్టి వా
గ్వ్యయమున కేను నీయెడల భక్తుఁడనై తినయేని వీని దు
ర్నయుఁ జిరజీవిఁ జేసి కరుణ న్నను వృద్ధు ననుగ్రహింపు మా
మయమునకన్న నీజడుఁడు మన్మనమున్ విదళించు నిచ్చటన్. 761

తే. గీ. ఎన్నఁడో చేయు పాతకం బీవిధమునఁ
బరిణమించెనొ? యేమొ? యీబాలిశుండు
శ్రేయ మెంచఁడు వీనిఁ జిరాయువుగను
జేసి నాహృదయము చల్లఁజేయు మంబ? 762

తే. గీ. ఎట్టిదోసఁగులు భావత్కృపకుఁ దాన
కంబ నగు నన్నుఁ గలఁపక కడకు నొదుగు
నజ్జుఁ గొమరు నిరామయంబైన యాయు
వలరువానిఁగఁ జేయుమో యఖిలజనని ? 763

ఉ. అమ్మరొ ? నాదునెమ్మది భయంపడు హేతు వెఱుంగుదీవు నా
యుమ్మలికంబు దీర్చుటకు నొండొకరెవ్వరు దిక్కునాకు స
త్సమ్మతుఁజేసి పుత్త్రకుని సాఁకు మనామయుఁజేసి యాయుర
ర్థమ్ముల పుష్టినిచ్చి; శతధా నినుఁగొల్తు సహస్రథా సదా. 764

శా. వాగర్థీలతవల్లఁ జుట్టికొను దౌర్భాగ్యంబు వారించి స
ర్వాగోమూలము జ్ఞానలేశ జనితాహంభావమున్ దోలి సు
శ్రీగణ్యుండగు గేస్తుఁగాసలిపి సచ్ఛ్రేయమ్ము లాయు ర్యశో
ధీ గాంభీర్యము లిమ్ముబిడ్డకుఁ గృపాబ్ధీ ? తల్లి ? కామేశ్వరీ. 765

మ. చదివెన్ శంతయుఁగాఁడు వీనికెదియో సాంగత్యమో ? లేక వే
ఱెదియో హేతువుగల్గి పెద్దలయెడన్ "హీహీహిహీ"ల్వుట్టి నె
మ్మదిలో నన్నుఁ గలంపఁజొచ్చు కతనం బ్రార్థించుచున్నాఁడఁ ద్వ
త్పదపద్మాశ్రితుఁడన్ సుతు న్మనుపుమంబా? శ్రేయముల్ గూర్చుచున్.

వ. ఇట్లు శ్రీపరమేశ్వరిని బ్రార్థించుచుఁ గాలంబు గడపుచున్నంత మరల శ్రీ చుండూరి వేంకటరెడ్డిగారు శ్రీపాదగురువుల ఋణాపనయనార్థంబు సమకూర్చిన మహాసభకు నేగవలసివచ్చెఁ గాని నాబసకు మిక్కిలి సమీపమందే ఆసభాప్రదేశమైనను నేగుట యెట్లనునంతలో నాయోపిక యుండె. 767

క. లోకులకు నాదునోపిక
యేకొంచెముగూడఁ దెలియ కెలమి సభలకై
ఆకారింతురునను నే
నేకరణిన్ జనఁగనేర్తు వృద్ధుఁడనైతిన్. 768

వ. శ్రీపాద గురువుగారు నాకన్న సుమారు నాలుగేఁడులు వృద్ధులై యుండి కూడ నిప్పటికింకను పనివడినచో నొకటి రెండు మైళ్ళు నడువఁగలరు. శ్రీమదన్నవరపుఁ గొండ కేనేగుటమాని పంద్రెండేండ్లైనది. వారిప్పటికి నెక్కుచున్నారు. నాలుగేండ్లనాఁడు శ్రీ పత్రికాశరావుగారు బలాత్కరించి న న్నాకొండ నెక్కించిరి. గాని అయ్యది సవారీమీఁదఁగాని కాలి నడకను గాదు అందుచే వారికిని నాకును నీవిషయమునఁ బోలిక లేశమును లేదు. పత్రికృతము శ్రీరెడ్డిగారి ప్రయత్నమున నీయూర జరుగు నీసభకు గురువుగారు చేయు స్వయంకృషిలో నెన్నవ వంతును నేను జేయఁ జాలను సరిగదా ? నాకే యిట్టి సన్మాన సభ నేర్పఱచి దానికి రమ్మని యాహ్వానించినను ఆసన్మానము నందికొనుటకుఁ గూడ నాకు నోపిక చాలకున్నయది. 769

క. తలతిత్రి ప్పెక్కుడుగా నా
కలజడి గలిగించు దావి నన్యులకు న్నేఁ
దెలిపిన నమ్మెదురే ? ఆ
త్తులె నమ్మరు శతుత్రికోటి బొంకనఁ దప్పె. 770

వ. శ్రీపాద గురువుగా రీవిషయమునఁ జేయు వ్యాఖ్యానము నిటవ్రాయు టంత యుక్తము గాదని యుపేక్షించితి. రెడ్డిగారికి నాయందుఁ గల గౌరవాతిశయ మసాధారణమగుటంజేసి యెట్లో తమ యింట జరుగు నన్ని సభలకుఁ గాకున్నను నేదో యొకదాని కేని కొన్ని యదుపాయములతో నన్ను బలాత్కరించి తీసుక వెళ్ళుట గలదు. అది గురువుగారి మదికి పైఁపక తోఁచినట్లెల్ల వ్యాకరించుట నేఁడేకాదు. శ్రీ జయపుర సంస్థానము నాఁటి బలవదాహ్వానము మొదలు కొనియును గలదు. "విక్రమ చెళ్ళపిళ్ళ" యను పొత్తము చూచినచో నా యీవిషయము గోచరించును గాన స్పృశించి విడుచు చున్నాఁడను. 771

ఆ. వె. ఆశ్రయించి బిరుదు లార్జించుట యెఱుంగ
ధనము నట్లె యెట్లొ తావకాంఘ్రు

లాళ్రీయమ్మ దొరకె నాముష్మికం బైహి
కమ్మ గూడ నాకు గలుగు నంబ. 772

వ. నాకు వత్సరమునకు భూముల మీఁదఁ బదివేలు రాబడి వచ్చుననియు నేఁబదివేల రూపికలు వడ్డికిఁ దిరుగుచున్నవనియు శ్రీపాదగురువు గారు వ్యాకరింతు రని వింటి. నిందు భూముల మీఁది రాబడి సర్వా బద్ధము. ఏఁబదివేలు గాకున్నను నే పదివేలో వడ్డికిఁ దిరుగుట దాదా పుగా సత్యమే. 773

ఉ. కావున నే ధనార్జనకుఁగాఁ బ్రియతించుట లేదు, దానికిన్
జేవయు లేదు, రండనుచు శ్రీగలవారలు వచ్చిపిల్చినన్
బోవుటలేదు, నీకరుణఁ బొంపిరి వోయిన వాఁడనౌట నో
దేవి ? యనుగ్రహింపవలె దీనతలేక యిటే అనేహమున్. 774

తే. గీ. ఈషణ త్రియమందు ధనేషణంబు
వదల దాశ్వాసమును నిల్చి పొదలు చుండు
దేవి ? యది లేనిదే యొక్కదినము కాదు
క్షణము జరుగదు నీ వెఱుంగనిది లేదు. 775

క. నెలకొక యేఁబది రొక్కము
వలయున్ బైకర్చు కెట్లువచ్చునొ ? నాకున్
దెలియదు వచ్చుచు నున్నది
కలదే ? నీభక్తులకు నొకానొక లోటున్. 776

వ. అది యట్లుండె నోపిక లేకున్నను శ్రీపాదగురువుగారికి జరుగు సన్మానసభకు రెడ్డిగారి బలాత్కారమునం జేసి వెళ్ళుట తప్పదయ్యె. నన్ను బలాత్కరించి రప్పించుట గురువుగారి హృదయమునకు లేశ మును నిష్టములేదను నంశము గురువుగారి ప్రసంగము వ్యంగ్య మర్యాదచే స్ఫురింపఁజేయుట సభ్యులలో ననేకులు గ్రహించిరి. 777

ఉ. వాతులు పోల్కినుండు పిశుపాటి కవీంద్రుఁడు సార్వభౌము వి
ఖ్యాతి కళంక పంకిలముగా నొక కొంత యుపన్యసింపఁ ద

ప్చేతము నొచ్చి యుత్తరముఁ జెప్పిరి శ్రీవసు లక్ష్మి తత్సభా
ప్రీతికి దూరమౌట వివరించుట ప్రస్తుతమయ్యె నాకిటన్. 778

షరా:- పైపద్యములోని పిశుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి గురువుగారి సార్వభౌమత్వమును గూర్చి చేసిన ప్రసంగమున కేనే కారకుఁడనని గూడఁ దత్పక్షీయులు వాకొనుచుండి రనివింటిని. వీని సత్యాసత్య భారము శ్రీ పరమేశ్వరిపై నిడుటతప్ప గత్యంతరము లేమింజేసి యే నట్లే చేయుచుంటి. శాంతం పాపమ్.

వ. ఈ పిశుపాటికవి పేరు సుబ్రహ్మణ్యశాస్త్రి వీఁడు ముప్పదియేండ్ల మున్ను నాయొద్ద సంస్కృతాంధ్రములు బాగుగ నభ్యసించుటం జేసి సార్వభౌములకు నన్నుంబట్టి ప్రశిష్యకోటి లోనివాఁడు. అట్టిండయ్యు గురువుగారి సార్వభౌమబిరుదము సార్థకమా ? కాదా ? అని విమర్శకు దిగుట ప్రాచీనాచారముంబట్టి యెంతయేని అనుచిత మనక తప్పదు. ఉన్మాదావస్థలో నున్నవాని కిట్టి పరిజ్ఞాన మెక్కడిది. ఈయంశము గురువుగా రెఱుఁగనిది కాదు. వా రెఱిఁగినవా రగుటచే మిన్నకుండి నచో నెంతో బాగుగ నుండెడిది. ఇపుడో ? తత్త్వమెఱిఁగిన వారికి గురువుగారి యావేశ పూరిత ప్రసంగము వెగటుగా దోఁచినది యని వ్రాయవలసి వచ్చినందులకుఁ జింతిల్లుచుంటి.

తే. గీ. గురువుగారిని బలవంతపఱచి యెవరు
గాని బిరుదుల నీలేదు కష్టపడి స
మార్జనము చేసికొని రనుమాట నిజము
ప్రభలపంతు లియ్యెడలను బ్రథమసాక్షి. 780

వ. భారతాంధ్రీకరణమునకును సార్వభౌమ బిరుదమునకును లేశమును సంబంధము లేదు. మహామహోపాధ్యాయ బిరుదమునకుఁ గూడ భారతాంధ్రీకరణము సాహాయ్యకారి కాదు. ఆంధ్రవ్యాస బిరుద మొక్కటి తప్ప వీరియెడల నిఁక నేబిరుదమును నన్వర్థము గాఁజాల దని నేననుకొందును. ఈవిషయము కృష్ణాపత్రికలో గొందఱు దిగ్దం

తుల వంటి పండితులు విమర్శించి సిద్ధాంతీకరించినదే గాని నూతనము గాదని కవిలోకమునకు నావిజ్ఞప్తి. 781

(ఈ కృష్ణాపత్రిక వ్యాసము జాతకచర్యలో చూ.)

తే. గీ. మఱియు నభినవ శ్రీనాథ బిరుదు మంత
వీరిపట్టున సార్థకమై రహించు
విరువు రప్పులపాలైరి కృషికతమున
నిదియె పోలిక వీరికి నిరువురకును. 782

క. ప్రకటించిన భారత మే
రికొ గాని రుచింప దొకపరిశ్రమ మిగిలెన్
సుకవులు శ్రమమునకై వీ
రికిఁ దలలను వంచి యిడుదురే ? జోహారుల్. 783

వ. ఆయావిషయమెట్లున్నను సదుద్దేశముతో నేను నాఁటిసభలో గురువు గారి భారతమును గూర్చి చెప్పిన యీక్రిందిపద్యములో దురుద్దేశ మున్నట్టు లొకపండితమ్మన్యుఁడు వివదింప మొదలిడియె. సుకవులకు దెలియుటకై ఆపద్యమిట నుదాహరించు చున్నాఁడను. 784

తే. గీ. దేవళములందు వీధి వేదికలయందు
నాట్యసభలయందు నెందుఁ బౌరాణికులకు
జీవనాధారమై వ్యాప్తిఁ జెందుఁగాక
యెలమి శ్రీకృష్ణభారత మిద్ధరిత్రి. 785

వ. ఈపద్యమునం దేవిధమైన దురర్థము నుండదని నానమ్మిక. అకృతజ్ఞత మున నే పరస్పరద్వేషము కలవారి రచనం గూర్చి రచించిన దీనిని నేను జడియక వివిపించితినని విజ్ఞులకు విజ్ఞప్తి. ఇంకొక పద్య మిట్టిదే నేను గురువుగారి సన్మానము నభినందించుచుఁ జదివితి. దానిం గూడ నొకపండితమ్మన్యుఁడు దురుద్దేశ ప్రయుక్తంబుగా నపవదించె. నదికూడ నుదాహరింతు.

తే. గీ. భారత మ్మఖిలము నాంధ్రభాష కనువ
దించి కవిసార్వభౌముఁడై తేజరిల్లు

కవికి బెజవాడపౌరులు గౌరవించు
గౌరవము శాశ్వత యశంబు గాంచుఁగాక. 787

వ. దీనియందుఁ గూడ నేవిధమైన దురర్థమును రాదని నా దృఢవిశ్వాసము గాని దురర్థమున్నదని యెవరో కొందఱు గురుపుగారి శాఖ (వెల్నాటి) వా రపవదించినట్లును ఆమాటను గురుపుగారే కాక రెడ్డిగారు గూడ విశ్వసించినట్లును విని యక్కజపడితిని. 788

చ. హృదయమునందు నాయెడల నెంతయు నొజ్జకు ద్వేషముంటచే
నెదియు దొసంగు లేనియెడ నేదొసఁగో పొడకట్టుఁగాక నే
నది యెద వింతగాఁ దలఁపనట్టి కళంకు లవంబులేని స
ద్విదితుఁడు రెడ్డిగారి మది వేరుగ మాఱుట కేమిహేతువో ? 789

వ. మాఱినప్పుడు దానికి హేతువిచారణం బనావశ్యకము. నా హృదయ విశ్వాస మిదివఱకే వ్యాకరించితినిగదా ? ఐనను నిదిగూడఁ బ్రాజ్ఞ లోకమునకై వ్రాయుచుంటి. 690

ఉ. ఏనెదిగాని స్పష్టముగనే వచియింతునుగాని గూఢమా
ర్గాన వచింప, నయ్యది పురాణముగా నిలవ్యాప్తిఁజెందుచో
హానిస్ఫురించు నంచనెడి యార్యుల నేమియనంగనేర్తు దై
వానకు సర్వమున్ దెలియు వాగ్వ్యయ మింక నొనర్పనేనిటన్. 791

వ. లోఁగడ శేఖరరావు జమీందారు పతివ్రతాకృతిని గూర్చి యాలస్య మొనర్చుటంగూర్చి కొంత ప్రస్తావించియుంటి. నల్లపరిస్తావనయందలి పద్యములును వచనమును శిష్యుఁడు సీతారామశాస్త్రి యతనికిం జూపిన వెంటనే యాతఁడు నూటయిరువది రూపికలు తచ్ఛిష్యునిద్వారమునన యంపుచు నిట్లువ్రాసియిచ్చె నాయక్షరము లిట నుదాహరింతు. 792

వ "అయ్యా ! నేనున్నాను. మీ జీవితాంతము వఱకు ధనవిషయములో నేలోటును గలుగకుండ నెలవారీగా మీరు కోరిన మొత్తము పంపు కొనఁగలను. భగవంతుఁడు అట్టి శ్రీ, సద్బుద్ధి నాకిచ్చియున్నాఁడు." 793

క. శనిదశలోఁ గుజునంతర
మున రాహువిదశను దొడరు ముఖ్యాంశమ్ముల్

వినిచితి నందను దుడుకుం
దనము సడలి నాదు మనమునకుఁ గుసిగలిగెన్. 794

తే. గీ. అంబికను వేడుకొంటి వీఁడకట ? పనికి
మాలు తెరువునఁ బడుచుండ మంచిత్రోవ
కేను ద్రిప్పఁగలేక యా దీనజన శ
రణ్య తుత్రిటిలోన మంచిమార్గమునఁ బెట్టె. 795

వ. ఆయీ సందర్భము సక్రమముగా వ్రాయునెడల గ్రంథము చాలఁ బెరుఁగు నట్లగుటంజేసి మిక్కిలిగా సంగ్రహించి యుట్టంకించితి. 796

క. ఒక దుస్సహవాసము కు
ఱ్ఱకు నలవడినట్లు మున్నువ్రాసితి నెవియో
కకవికలు దొడరి యామై
త్రికి భంగముగలిగె సుతుఁడు తెలిపిని బడియెన్. 797

వ. అన్నిటికన్న నీరాహువిదశాకాలమున నామనస్సునకు నెక్కుడు సంతసమును నచ్చెరువును గలిగించినది. శ్రీ చుండూరిరెడ్డిగారి దానశూరత్వము, ఆయీవదాన్యత్వము పూర్వకాలమున నేయుగమందేని యుండి నదేమోగాని యీయుగమున మాత్రము "నభూతో నభవిష్యతి" ఈయన శ్రీపాదగురువుగారికిఁ గల ఋణము సుమారు పదివేలరూపికలును స్వహస్తపరహస్తముల ద్వారమునఁ దీర్చి వారిమేడకు రానున్న చిక్కు దప్పించుటయేకాక వారి యావజ్జీవమును సంవత్సరమునకు వేయినూట పదార్లవంతున నిడుటకై మహాసభలో వాగ్దానమొనర్చుట కెల్లరును సంతసించి యీవదాన్యశిరోమణి నాశీర్వదించుచున్నారు. ఆ యీ దాతృత్వము శ్రీకృష్ణదేవరాయలు తన అముక్తమాల్యదలోఁ దెల్పిన దానికి దీటని నేనభినందింతును. 798

షరా:- శ్రీరెడ్డిగారు అగర్భశ్రీమంతులయ్యును గురువుగారి ఋణాపనయనమునకుఁ గా ధనాఢ్యులైన తమ బంధువులనేకాక తదితరులనుగూడ యాచించుట నేనొకనాఁటి సభలో (మణికొండవారిమేడమీఁద)

వింటిని. ఈయన చర్య శ్రీ పోతరాజుగారి, కం॥........పరహిత రతమతి యుతులగు దొరలకు నడుగుటలు నొడలి తొడవులు పుడ మిన్. అనుపద్యమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. భగవంతుఁడీయనకు శ్రేయఃప్రదాత యగుఁగాక.

మ. కలుగుంగావుత రెడ్డిగారికి నిరాఘాట ప్రకృష్టాయురా
దులు, నిస్సీమ యశఃప్రచారము సుబంధుప్రీతి ఆరోగ్య మి
తెలుఁగున్‌దేశ మదృష్టవంత మయి యాదీనావనున్ గంటచే
నలరుంగావుత నిస్తులుండితఁడు నా యానందమున్ దెల్పితిన్. 799

ఆ. వె. "ధర్మ మాచరింపఁదగు మృత్యుచేఁ దల
పట్టి యీడ్వఁబడిన వాఁడువోలె
ననెడి మాట రెడ్డియందె సమన్విత
మింక నొకటఁ జూచి యెఱుఁగ నేను, 800

చ. ఇతఁడు ధనాఢ్యుఁడే యగుత మింతకుమించు ధనాఢ్యు లెల్లెడన్
శతము సహస్రమున్ గలరు సర్వధనంబును దానధర్మప
ద్ధతికిడు సాహసుల్‌గలరె దాతృశిరోమణు లందు సర్వధా
స్తుతి కితఁడర్హుఁ డెల్లరు బుధుల్ నుతియింతు రిదంవదాన్యతన్. 801

తే. గీ. ఏ దురుద్దేశమును లేని నాదు పద్య
మందు నొజ్జతో పాటుగ నట్టిదొసఁగు
కలదని యితండు పొరఁబడుఁగాక నాదు
దీవనకు నీతఁడర్హుఁ డెంతేని సుకృతి. 802

వ. తాను నావలనఁ గృతినందిన శివభక్తి యను పొత్తముపై నొజ్జగారు యథాపూర్వమ్ముగ నేవో అస్తవ్యస్తపు మాటలు వ్రాయ నయ్యవి నాకన్న మున్నుగాఁ దాఁ జూచి అవ్రాఁతకు జవాబు వ్రాయ నక్కఱ లేదని నాకున్ దెలిపిన యీప్రాజ్ఞున కిప్పుఁ డొజ్జగారి కవిత్వముకూడ రుచించుటకు గతంబు విచారణీయము. లోకులు ప్రస్తుతము తాను వ్రాయించుచున్న గురుచరిత్రమునందు ప్రాజ్ఞులు విశ్వసింతురా? లేదా?

యని సంశయింపక తాఁజెప్పినదెల్ల లిఖించుటయే ఆయీమాప్పనకుం
గతమని చెప్పఁగా నసకృదావృత్తిగా వింటిని. భవతు, ఏది యెట్లున్నను
శ్రీరెడ్డిగారివంటి వదాన్యశిరోమణి "నభూతో నభవిష్యతి." 803

ఉ. ఎవఁడున్ గట్టుక పోఁడు గాక ధన, మాయీ రెడ్డియున్ బోలెఁ బా
త్రవిశేషంబు నెఱింగి ప్రాయమున విద్యన్ దద్దయున్ బెద్దయౌ
కవి బాధించు ఋణమ్ము దీర్చి నిలువంగాఁ బెట్టుటేకాక, ఆ
కవి యావద్భరమున్ వహించు నుడి వక్కాణింప సామాన్యమే. 804

క. ఏవారును దాతలు నుతి
కై వీనులనొగ్గ, రితఁడు నట్టిండె "మను
ష్యావాఈడేన్యా" అను
భావమునన్ శ్రుతికిఁ బక్షపాతమదేమో? 805

క. స్తుతిచేయవచ్చు నిచ్చెడి
మతిమంతుం డుండెనేని మఱి సూరులు సం
స్తుతిపట్ల జంక రీదా
తృతకు నుతికి ముడిని వైచుకే నొప్పికొనన్. 806

తే. గీ. రెడ్డిప్రభువని యనుఁగాక కృష్ణసుకవి
అందులకు నీతఁడెంతయు నర్హతముఁడు
ప్రభువులకు నుండఁదగినట్టి లక్షణములు
కలవు నిస్సంశయముగ నీ ఘనునియందు. 807

తే. గీ. ఏని నెవ్వఁడు పోషించు వానికతఁడు
ప్రభువనుచుఁ గుట్టికవి చెప్పెఁ బ్రథితయశుఁడు
కృష్ణసుకవి "ప్రభు"వటంచు రెడ్డిననుట
అది స్వభావోక్తిగాని యన్యంబుగాదు. 808

షరా:- కుట్టికవి దాక్షిణాత్యుఁడు ఇతఁడు తంజావూరు సంస్థానము
వాఁడు ఆరాజునకును దనకును నేదో వైరకారణ మేర్పడి మహిష

శతకము వ్రాసి తేసికి పీతి గఱపినవాఁ డీకుట్టికవి ....అతఁడిట్లు వక్కాణించెను.

శ్లో. యం యో రక్షతి తస్య సప్రభు రితి స్పష్టంహి మద్రక్షిణో
రాజశ్రీ మహిషా న్వినుత్య సఫలం కుర్వేఽద్య వాగ్వైభవమ్
తక్కినది ఆశతకమందే చూడనగు.

తే. గీ. ఆశ్రయించిన కతమున నలఘుఁడితఁడు
కృష్ణసుకవికిఁ బ్రియతించి ఋణముదీర్చి
యిది మొదలు జీవితంబుంతు నెంతదనుక
నంతదనుక సాలుకు వేయి యంపుడు ననె. 809

వ. ఇయ్యది సర్వథా శ్లాఘ్యంబ యగుఁగాక చదువరు లీవ్రాయఁబోవు విశేష మున్ దిలకించి యానందింతు రని యిం దుట్టంకించు చున్నాఁడను.

క. నాకున్ శేఖరునకు నే
దో కొండొక బెడియురీతి దోఁచుట పద్యాల్
వాకొనుఁ దుద కతఁడెంతో
పాకమునకు వచ్చి నన్ను బహుమానించెన్. 811

వ. ఆయాసఁదర్భము 793 వ సంఖ్యగల యతని వాక్యములు (అయ్యా ........ఆట్టి శ్రీసద్బుద్ధి నాకిచ్చియున్నాఁడు చూ.)తెల్పును. మఱియు నతఁడే యిటీవల వ్రాయించి పంపిన మాటలు కూడఁ జూడనగు. "గురువారం శేఖరుగారింటికి వెళ్ళగా బొబ్బిలిరాజాగారు పిలిపిస్తే వెళ్ళినారని చెప్పిరి. తరువాత నిన్న వెళ్ళి మీజాబు యివ్వగా నాడినమాటలివి.........నన్ను ఫస్టుక్లాసు బండిలో బొబ్బిలికి తీసుకువెళ్ళెను........ నేను మెస్మరిజం శక్తి వల్ల పడిపోయిన అంగములను కవదీయించి చూపి...............పూర్తిచికిత్స తరవాత చేయుదును....... ....ఆరాత్రి గుమస్తా వచ్చి వేయి రూపాయీల చెక్కున్న కవరు నాకిచ్చి....చెప్పి వెళ్ళెను. అప్పుడు నేను శాస్త్రులుగారి మనస్సు సంతోషించి నన్ను

దీవించి యుందు రనుకొంటిని. నేను నాల్గురోజులలో బెంగుళూరు వెళ్లుచున్నాను, జూనులో వత్తును. బెజవాడలో ఆంధ్రాబ్యాంకిలో నుంచి ప్రతినెల 1 వ తారీఖున వారికి కావలసినంత ధనము గుమస్తా వచ్చి యిచ్చిపోవుచుండును. అట్లు యేర్పాటు చేసితిని. యిది సన్మానములో చేరదు. సన్మానసభ వేఱే చేయుదును." 812

తే. గీ. ఏకలవ్య శిష్యుండు నా కితఁడు మాకు
నాశ్రియాశ్రయి భావ మావంత లేదు
వార్ధకమ్మున రుగ్ణతావస్థయందు
నితఁడు తోడ్పడె నిర్వ్యాజ మెంతసుకృతి. 813

క. నెలకింతయనఁడు నాకున్
వలయునెడల నెంతయేని వసువిచ్చుటకే
తలఁచి కబురంపెనని నే
నలరుచు దీవింతు నామయ విరహితునిగన్. 814

తే. గీ. ఇతని కేలోపమును లేదు సతులిరువురుఁ
గూడ సంతానవతులు సుగుణ గరిష్ఠ
లున్నది ధనంబు లచ్చుల కన్న హెచ్చు
నే నిరామయాయువును వీని కలరింతు. 815

ఉ. ఇంతటి బుద్ధిమంతుని మఱెవ్వని నేఁ గనలేదు వీని కే
మంతువుగట్టి చెప్పుటకు మానస మొప్పదు నిక్క మిట్టి ధీ
మంతుఁడు నెట్టపంటగను మన్ననకుం గొఱగాని యేవపుం
బంతము పాలుగావుటకు మన్ననమెప్పుడుఁ గుందుచుండెడున్. 816

క. కడుశాంతుం డాలోచన
యెడల బృహస్పతియె యిట్టిఁడేటికొ ? నిందన్
గడలుకొలుపు వ్యాజ్యంపున్
బెడఁదకు లోనయ్యె నెవఁడు విధిగడచు నిఁకన్. 817

తే. గీ. అన్నకు ధవాళగల దతఁడంపుకొఱకుఁ
బాటుపడుఁ గాక యాతఁడు పంతమునకు
నగ్గమై నా నుడికిఁ జెవియొగ్గఁ డితవి
కింత కొండు దొసంగు లే దేనెఱుఁగుదు. 818

తే. గీ. భవతు భగవంతుఁ డీతని ప్రజ్ఞ వృద్ధి
పఱచు నట్టు లనామయ భాగ్యమిచ్చి
పేద సాదలఁ గాపాడు పేర్మినిచ్చి
కలిమి సార్ధకమగు నట్లు కాచుఁగాక. 819

క. అయ మయము నిరామయ మయ
మయి శేఖరు భవన మెల్లయవుడు కవీడ్వా
జ్మయ మయమై నయమయమై
జయమయ మగుఁగాక సదతిశయ మయమగుచున్. 820

వ. ఆ యీ రాహు విదశయందు ననే శ్రీ విమలానంద భారతీ స్వాముల వారి సన్మానసభకు సభ్యుల బలాత్కారమ్మున నధ్యక్షుఁడుగా వెళ్ళుట తప్పదయ్యె. నా వెళ్ళుట కేవలము పరాధీనముగనే జరిగినదని వ్రాసి నచో నెట్లుజరిగినదో చదువరులు గమనింతురని వివరింపనైతిని. అంత గురువిదశ చనుదెంచె.

పార్థివ సం॥ నిజచైత్ర బ ౧౩ మొదలు జ్యేష్ఠ బ ౬ వఱకును
శనిలో కుజాంతరములో

—• గు రు వి ద శ •—

తే. గీ. గురువిదశ వచ్చుచే మొదల్ కొమరు నవక
తవక ధోరణి హెచ్చి స్వాంతమ్మునకుఁ బ్ర
శాంతి లేదయ్యె నీదృశ సంఘటనము
వెనుక నేకవి యనుభవించినదిలేదు. 822

ఉ. త్రాగఁడు జూదమాడఁడు వృధా యెకసక్కెము లాడునన్ను నీ
యాగడ మేటి కావహిలె నన్నుఁ బరాత్పరుఁడే యెఱుంగు, నెం

తే గఱువల్ మతిన్ గఱప నెంచిరిగాని ఫలింపదయ్యె. నే
లాగిఁక వీనివీడు నవలక్షణ మంచుఁ దపింతు నేనెదన్. 823

తే. గీ. ఉరక తీరికూర్చుండి వదరెడినన్ను
నెక్కసక్కియ మై దాఱు నెలలనుండి
మాఱె నీరీతి వన్నలు మామగారు
నెల్లరును ద్వేష్యులే హేతు వెఱుఁగఁ బడదు. 824

క. తనయక్క బుద్ధిసూక్ష్మత
గొనియాడితి నంట నేను, గూళనయితి నం
తన వీనికి, రోజెల్లను
ననుఁ దెప్పుచుఁ దఱచు హేళనము వొనరించున్. 825

క. తన యన్నకొడుకు నాపే
రున నెగడెడివాఁడు మతిపరుఁడు వీఁడగునం
చనినాఁడ నంట ? నను నం
దునకై యీయాత్మజుండు దూషించుఁ బొరిఁ. 826

క. అతిథులయెడ మఱి యభ్యా
గతుల యెడన్ జీమ లోనుగాఁగల జంతు
ప్రతతి యెడన్ దయగల యీ
సుతునకుఁ దనవారలన నసూయ జనించున్. 827

క. ఏయెడ నేతండ్రులు విన
రీయెడ సుతుఁడాడు నుడుల, నివి నే జూడన్
హేయమ్ములనుచు; హాస్య
ప్రాయుఁడుగా మేలఁగు నెట్టి ప్రారబ్ధంబో. 828

క. ననుఁబెట్టు తిప్పలకు నం
తును బొంతును గానరాదు దోసంబనినన్
వినఁ దేమనుకోవలెఁ బ్రా
గ్జని పుణ్యంబనుట తప్ప గతివేఱున్నే. 829

క. చదివిన చదువేమైననొ ?
వదరున్ వెఱివెఱ్ఱి నుడులు వాతులతకు నా
స్పదమయ్యె నేమొకో మది
ముదిమిని ననుబాధవెట్టు మోఱకుఁడయ్యెన్. 830

క. వలదని నేవారించిన
కొలఁదిన్ గడురెచ్చి తప్పుకూఁతలు నాచేఁ
బలికించు వీనికతనన్
గలుదాఁవినవాని వాలకము నాకబ్బెన్. 831

క. తన కింగిలీషు చెప్పిం
చని కతమునఁగాని దానిఁ జదివించినచో
ధనమును వేలకొలఁది నా
ర్జన చేసెడినంట ! వీనిపఁకృతి లిఖింతున్. 832

తే. గీ. ముప్పదియు రెండు నక్కరా లొప్పు శ్లోక
మేను బాఠమ్ముగాఁ జెప్ప నెన్నఁడద్ది
యొప్పఁజెప్పని యీకుఱ్ఱఁ డురక హూణ
భాషఁ జదివి పరీక్షలు ప్యాసగునొకొ ? 833

క. దినమున కయిదాఱుగఁ జె
ప్పిన పాఠము లొప్పఁజెప్పి వినయమడర స్కూ
లున కేగవలయు నీదృశు
లనయులు చదివి కృతకృత్యులగుదురె ? దానన్. 834

తే. గీ. చెప్పు పాఠమ్ము నొప్పంగఁ జెప్పకున్న
నెప్పుడో బుద్ధిరాకున్నె ? యేండ్లుగడచు
మీఁదనని యెంచి పాఠ మోర్మిమెయిఁ జెప్పి
సుంత జ్ఞానిఁగాఁ జేసితి సుతుఁడటంచు. 835

ఉ. స్కూలునఁ బెట్టు జీతమునకున్ ధనమంపితి నేనియున్ "సినీ
మా" లకు ఖర్చువెట్టు మతిమంతుఁడు వీఁడిటువంటి బాలురన్

వేలకొలంది చూచితి నవీనముగా దిది బందరందు నే
స్కూలున టీచరై నపుడు చూచిన నాయనుభూతిఁ దెల్పితిన్. 836

తే. గీ. ఉత్తమపు వంగడమ్ము వా రువిదఁదెచ్చి
పారిబర్హంబుతోనిడఁ బరిణయంబు
చేసితిని వీనితో నెట్లుచేయఁగలదొ ?
కాపురము వీఁడు కర్కోటకప్రతిముఁడు. 837

క. జనని కడుఁ బుణ్యశాలిని
చనియె న్నాకన్న మున్న, చవిఁజూడద యి
త్తనయుని గుణగణమును నా
యనుభూతికి విడిచిపెట్టి ననుకోవలయున్. 838

తే. గీ. అనుభవింపకయే తల్లి యరిగెనాక
మేననుభవించి యేగెద నిపుడొ రేపొ
కన్నె యెవ్వతె యివ్వానిఁ గట్టికొనెనొ ?
ఆపెకై వీఁడు సజ్జనుం డగునుగాక. 839

తే. గీ. అట్టులేకాక వీఁడిట్లె యడరెనేని
యేపొలఁతి వేఁగు నీ సుదుర్లాపితోడ
దయయు దాక్షిణ్యమును లేని తనయుఁగన్న
నన్ను దూషింపకున్నె ? యక్కన్నె మిన్న. 840

ఉ. ఆపె కుటుంబగౌరవము వారసి యా పరమేశ్వరుండు దు
ర్లాపిని వీని యోగ్యుఁడగులాగున మార్చి చిరాయు రున్నతి
శ్రీ పరిపూర్ణుఁగా మనిచి చెల్వము పిళ్ళ కొలంబు గౌరవ
ప్రాపకమౌనటుల్ సలిపి పండిత సన్నుతి కెక్కఁజేయుతన్. 841

క. నా వార్ధక్యపుఁ జిహ్నము
లీవెడఁగుం గొడుకు నటన లివియని నవ్వీ
క్షీ విడిచి తెల్పితిని గవి
దేవులు క్షమియించి వీని దీవించుటకై. 842

క. చెవినిల్లుగట్టుకొని యీ
యవినీతి మరల్చుపొంతె యత్నించుచు నుం
టి వినం దేమియొన ర్తు భ
గవతిన్ బార్థింతు పినీఁ గాపాడుటకై. 843

క. ఏలాభమొక్కొ ! వృథగా
వేళాకోళమ్ము లాడు వృద్ధులతోడన్
వాలాయము దీనులతోఁ
బ్రేలున్ బేర్లిలించు నన్ను వృద్ధున్ గుర్ద్ధున్. 844

తే. గీ. జనకుఁడనిగాని దేశికుఁడనియుఁగాని
భయము భక్తియు లేదు నాపట్ల లేక
పోవుఁగా కెకసక్కెముల్ బోలెఁడాడుఁ
దప్పనిన మానఁ డదియేమి ? దారుణంబొ ? 845

క. భయపడుచునుంటి నీదు
ర్నయమునకై నేను భక్తరక్షిణి యిలువే
ల్పయము నొడఁగూర్చి నాకు న
భయ దానం బొసఁగుఁగాక భద్రాత్మ పొరిన్. 846

క. పరి పరి విధముల నీవేఁ
దురుకొమరుని వెట్టిమొట్టి ధోరణికై నే
దురపిల్లుచుంటిఁ గామే
శ్వరి నాకభయంబొసంగి సాఁకున్గాతన్. 847

తే. గీ. తెలివితక్కువ రాలుఁగాయలు పలువురు
నావలన బాగుపడిరి బందరుపురమ్ము
సాక్షి దీనికి నాకుట్టు చదువు సుంత
అబ్బియును వ్యర్థుఁడగు టిదే యబ్బురంబు. 848

క. లోఁకువఁ గట్టె నకట ? న
న్నీకొడుకుంగుట్ట వీఁడు వృద్ధుఁడని వృథా

పోకిరికూఁతలు గూయుఁ బు
రాకృతమో ? బమ్మ నొసట వ్రాసిన వ్రాలో ? 849

ఉ. నీతులుచెప్పి యీసుతు వినీతునిగా నొనరింపఁ జాల ని
వ్వాతులు వావదూకత లవంబును లెక్కకుఁ దేక శ్రీజగ
న్మాతృక కన్నపుత్రు బలె నాకయి వీని భరించుఁగాక మ
చ్చేతము చల్లనౌనటులుచేసి యశ మ్మనిశమ్ము గాంచుతన్. 850

ఉ. నేనిటఁ జిక్కుకొంట యవినీతుఁడు పుత్రకుఁడౌట వానియ
జ్ఞానము కారణానఁ జెడి స్వాంతము చింతకు నగ్గమౌట యీ
స్థానము వీడిపోవుటకు దార్ఢ్యము సుంతయు లేక యుంట నన్
దీనునిజేసె నేనెఱుఁగ దీనత లేశము నెట్టిపట్టునన్. 851

తే. గీ. నన్ను వేలుపుగాఁ జూచుచున్న బంధు
జనుల నివ్వాఁడు చూచు నీచముగ నేమి
కర్మమో ? కనుపట్టదు కారణంబు
"కడుపుచింపికొనినఁ బడుఁగాళ్ళమీఁద" 852

క. శని వచ్చినదాదిగ నే
ననుదినగండముగ నుంటి నంతర్దశ లే
మి నిమిత్తమొ ? కడతేర్పవు
తనూబలము సుంత జీవితమునకు వలయున్. 853

క. తనుమనుచు సహోదరి నా
పెను గూఁతురుగాఁగఁ జూచు వియ్యపురాలిన్
దనబావను నిర్హేతుక
మనుచితములనాఁడుఁ దనయుఁ డదివెతగొలుపున్. 854

తే. గీ. బొమ్మనినఁ బోవఁ డిటఁ గలహమ్ము పెంచు
వీనికై నేనె యేగుట వీలెకాని
విస్తరిపవేమి భర్తయేవెలఁదికున్న
బురదలోఁబడ్డ ద్విరదంబు పోల్కివచ్చె. 855

క. నాకే కఱదలు గఱపెడి
యీకుఱ్ఱఁడు నాకువినుట యెట్లుపొసఁగుఁ? దు
ర్ధీకుఁడుగాకుండియు దు
ర్ధీకుఁడుగా మాఱెఁ దుదకు దేవునిచెయిదిన్. 856

తే. గీ. అపరియత్నసిద్ధంబు సన్న్యాసమనుచు
సకలమును వీడియుంటి నిచ్చటను నేను
వీఁడురానేల వచ్చినవాఁడు చక్క
నుండక వివాదములు పెంచుచుండు సేల. 587

క. ఆయుర్భాగ్యము వృద్ధులఁ
బాయనిచో భయము భక్తి వఱలెడివారల్
సాయపడవలయు నపుడది
శ్రీయుక్తంబగుచు నిహముజేయున్ బరమున్. 858

చ. భయమునులేదు భక్తియుఁ బ్రపత్తియుఁ బేర్మియు మున్నె నాస్తి వా
గ్వ్యయమొనరించు నద్దిగలహాలకుఁ గారణ మేకుమేకుగా
నయిననుఁ జిక్కువెట్టఁగ నయానవచించుచు నుంటి నెమ్మదిన్
దయగనుపట్టదించుకయుఁ దండిరి వృద్ధుఁడటంచు వీనికిన్. 859

చ. చదువునుగాని యేదియును సాఁగగనీఁ డొకసర్గయేని కో
విదజన మాననీయములు వీనికినచ్చవు కబ్బముల్ రసా
స్పద మిదిగాదు పొమ్మని వివాద కుపక్రమణం బొనర్చు నె
య్యదియిఁక వీనిబాగున కుపాయ మపాయవిహీన మారయన్. 860

క. అని యన్వేషించుచుఁ గీ
ర్తనమాత్రిన కలినడంచు దైవతము శుభా
ప్తినిమిత్తము నైషధమున
దిన మొండో రెండొఁ? చెప్పి దిద్దుచునుంటిన్. 861

వ. ఆయీ గురువిదశయందే హరివేంకటసుబ్బయ్యగారి కోరికపై శ్రీ
కృష్ణానదీ తటస్థంబగు శ్రీమదుభయ రామేశ్వరక్షేత్ర మాహాత్మ్యము

రచించితి. లోఁగడ నొనర్చిన వాగ్దానమునకు భంగములేకుండ శ్రీ శేఖరరావు రు 50-0-0 లును ఆంధ్ర బ్యాంకుద్వారమున నందఁజేసె, మఱియు శ్రీమదన్నవరపు దేవుని ధర్మకర్త శ్రీ మదినుగంటి ప్రకాశ రావు జమీందారుగారు సొమ్ము నంపుచు తమయౌదార్యమును నాకిట్లు తెల్పిరి. దాని నిటనుదాహరింతు.

షరా:- "శ్రీశ్రీ కవిచక్రవర్తిగారికి ....ప్రకాశరావు దండములు, స్వామి సన్నిధిని మీతాలూకు సొమ్ము నిల్వయుండును గనుక తమకెప్పు డెప్పు డవసరమో తెలియపర్చుతూ తీసుకుంటూ వుండవలయును.

రత్నగిరి
12-6-45 } శ॥ ప్ర॥ సోము వెంకట్రాజు (అని)

తే. గీ. అడుగకుండనె రెండుమార్లంపెనితఁడు
నూఱువంతున నిట్టి యుదారుఁడింక
మరలఁ బంపించు నని శంక మదికిఁ దోఁచి
వలదనుచు వ్రాయ నతఁడు జవాబువ్రాసె. 863

తే.గీ. కలరుదాతలు లేరనఁగలనె ? యీప్ర
కాశరాయనిఁబలెఁ గవికష్ట సుఖము
లెఱిఁగి యౌదార్యమును జూపు నృపతులన్న
నెచటనోగాని కనుపట్ట రింత నిజము. 864

క. ఇట నాకు ద్రవ్యలోపం
బెఱుగలుగుఁ బ్రకాశరాయఁ డిద్ధయశుఁడు వేం
కటరెడ్డియు ప్రొఫెసరు ధీ
జటిలుఁడు శేఖరుఁడుఁ బేర్మి సాఁకుచు నుండన్. 865

తే. గీ. ఇంటిలోఁగూడ నిప్పటి కించుకయును
లేదు లోపంబు మున్ను సంపాదనంబు
చేసినట్టిదె కలదుసుశ్రీ యొకింత
కాని క్షామంబు భీతిని గలుగఁజేయు. 866

తే. గీ. అప్పుడప్పుడు జీవసమాప్తి యగునొ ?
యేమొ ? అనురీతి దోఁచియు నెలమి మరల
గలుగు చెట్టెట్టులో జాతకము గడచుచు
నుండె శని వచ్చె వివశనాథుం డగుచును. 867

షరా:- ఆ యీ శనిదశాకుజాంతరములో గురువిదశాచ్ఛిద్రకాలమునందు పరమమిత్రులు, బంధుప్రియులు నగు శ్రీమాన్ వేదాలరంగాచార్యులవారికుమారుఁడు విషధయోగ్యుఁడు, ప్రయోజకుడు, లేతవయస్సువాడు, నాయందత్యంతభక్తుఁడునగు లక్ష్మీనరసింహాచార్యులు జలగండమువలనఁ బరమపదించిదుదక పారమైన చింతను గలిగించె.

పార్థివసం॥ జ్యేష్టబ ఒమొదలు శ్రావణబరావఅకును. శనిమహాదశలో కుజాంతరముకో

—• శనివిదశ •—

తే. గీ. ఉన్నయోపికలోన శిష్యునకు బాఠ
మెలమి గౌముదిఁ జెప్పుచు నేవొ నాట
కములు చెప్పుచు గుఱ్ఱకుఁ గాలయాప
నం బొనర్తు శివస్మరణంబుతోడ. 868

తే. గీ. రెంకుసార్లడుగకయె యే జేఁడు పంపె
నాతఁడు ప్రకాశరావు దాతగ్రిసరుఁడు
మరల నూఅంపె నమితమౌ పెరిమతోడ
ద్రవ్యమున కేమి యతనియుత్తరము గనుఁడు. 869

—• శ్రీప్రకాశరావుగారియుత్తరం •—

అన్నవరము
7—7—45

బ్రి॥శ్రీ కవిచక్రవర్తిచెళ్లపిళ్ళ వేంకటశాస్త్రిగారిసన్నిధికి............
మీకు ద్రవ్యం ప్రస్తుతంలో కల దనియు, కోరినప్పుడే గాని పంపనవసరం లే దనియు వ్రాయించినారు. చాలారోజులైనది మీ క్షేమములు తెల్పుచూనైనను మీవద్దనుంచి వుత్తరం రానందుననున్నా

యిచ్చుట మీకొఱకు అని సంకల్పించినసొమ్ములోనుంచి మీరు అడిగి నప్పుడే గాక శ్రీవారికి తోచినప్పుడుకూడా పంపుచుండుట శ్రీవారిఅభి లాషకనకనున్నూ వారిసెలవు ప్రకారం సోమవారం పోష్టులో మని యార్డరుద్వారాగా రు 100-0-0లు పంపుచున్నాము. మీరు రాపీలుతే కున్ననూ మీ సంతకమైనతరచు చూచుచుండుటకు గల కుతూహలమే యిట్టి ప్రోద్బలమునకు కారణము.

శ॥ ప్ర॥ రం॥ సోము వేంకటరాజు. (అని)

చ. అడుగుచునుంటి సత్కవుల నందఱ మిమ్ములఁ గేలు మోడ్చి,యి
ప్పుడు పుడమిం గలారె ! మఱి భూపతు లిట్టి వదాన్యు, లేను ద
న్నడుగక పంప వల్వ దన నప్పుడు పైతము మాన డిమ్మహీ
శుఁడు వెలమాన్వయాంబునిధిసోముఁడు వర్ధిలుతఁ జిరాయువై. 870

తే. గీ. ఈయనకు వెట్టిప్రేమ నాయెడలఁ గలదు
నేను గవిచక్రవర్తిని గానుగాక
కలరు కవిచక్రవర్తు లిక్కాలమందు
వారు విన నన్నుఁ గవిచక్రవర్తి యనెడి. 871

క. కవిచక్రవర్తి యను బిరు
దు వహింపఁగ శక్య మొక్కొ ? దోషజ్ఞత్వ
స్థవిరతయుఁ గవితయున్ గల
కవికే కా కేదొ యల్లఁ గలిగినమాత్రిన్. 872

చ. ఎఱుఁగక కొంతమం దెవరొ యిచ్చిరి మా కని వ్రాసికొంద్రు దు
ర్భరబిరుదంబు దాల్చుటకుఁ బాండితి చాలునొ ? చాలదో ? యటం
చరసిన నాత్మకే విశద మయ్యెడి, డిండిమభట్టువంటిది
క్కరటుని నాజి నోర్చు హరి గాక తదన్యుఁ డనర్హుఁ డందుకున్. 873

వ. అది యటులుండుఁగాక.

చ. చదువఁడు సంస్కృతంబు పెలుచన్మఱి "యాంగల" మాంధ్రభాషయున్
జదువఁడు దేశికున్ గొలిచి; జ్ఞానము మాత్రము చాలినంత కో

విదులకుఁ బోలె నున్నయది వే త్తలచెల్మికతాన; సర్వధా
విదితుఁడు వృద్ధిఁ జెందుత వివేకిపరికాళుఁడు కాశకీ ర్తియై. 875

వ. పరికృతమహాదశాంతర్దశావిదశాధిపతులు (శని-కుజ-శనులు) మూఁగు రును స్వతఃక్రూరుల నుటయే కాక ఆధిపత్య (శనికి భాగ్యాధిపత్యము మాత్రము శుభము) పాపులు గూడ నగుటచేఁ దీవ్రముగ జబ్బుచేసి యంతకు మున్నున్న స్వల్పశక్తినిగూడఁ దగ్గించి ప్రాణమాత్రావ శిష్టుఁగా నొనర్చిరి. శ్రీయుతులు జంధ్యాల (డాక్టరు) దక్షిణామూర్తి గారి వైద్యసహాయము శ్లాఘింపవలయు నన్నుఁ దగిన యోపిక లేక స్పృశించి విడిచితి. 876

క. తుదిదినము డగ్గఱయినకొ
లఁది వైరాగ్యమ్ము హెచ్చి లలితాంబాశ్రీ
పదములపై నానాఁటికి
మది మసలం జొచ్చెఁ గడు సుమాశం బమరెన్. 877

తే. గీ. న్యాయతఃప్రాప్త మైనసన్న్యాసమునకు
నర్హుఁడను గానుగాక నే నంతరంగ
శుద్ధికతన సన్న్యాసినై బద్ధబుద్ధి
వదలి కాలమ్ము నెట్టెడివాఁడ నైతి. 878

తే. గీ. బ్రిదుకఁదగినంతకాలమ్ము బ్రదికినాఁడ
సిరియు సంపద సేవింప వఱలినాఁడ
నెంతయో కొంత కీరితి నెసఁగినాఁడ
నింకఁ బర మేగకుండి యే నేమి సేతు. 879

క. కర్తవ్యము లేదయ్యె రు
గార్తుఁడనై యుండుకంటె నత్యమలశ్రీ
కీర్తికర మైన వేఁటొక
మూర్తిన్ గయికొనుటకన్న ముదమున్ గలదే? 880

వ. అది యటు లుండె వీ శనివిదశలో నింతకుమునుపటివలెఁ గాక ఆహా రాదులలో నెక్కుడుగా మార్పు సంఘటించెఁ గాని డాక్టరు దక్షిణా మూర్తిగారి వైద్యప్రభావము కతన నేవిధమైనబాధలును లేకుండఁ గాలము కొంత సుమాళమ్ముగ జరుగుచుండె. 881

క. మంచావఝ్ఝులశిష్యుఁడు
దంచద్గౌరవ మెలర్ప నఱనూఱాఱుల్
గొంచె మనక గైకొని దీ
వించుఁ డమచు మరలఁ దెచ్చివిందొనరించెన్. 882

వ. ఇతం డింతకుమును పొకయర్ధనూఱాఱును విలువగలవస్త్రమ్ములను దెచ్చి యిచ్చి సత్కరించె నితని గురుభక్తి యనన్యసామాన్యము నాఁ దగు వెండియు. 883

క. ఎలమిని శేఖరరా విడు
నెలకేఁబదిరూపికలను నియతముగా నం
దుల కిత్తఁడె కారకుఁడు ని
చ్చలు సీతారాము శిష్య సాఁకుత వేల్పుల్. 884

షరా:- శేఖరరావువలన నేను నెలకు నేఁబది (రు 50-0-0లు) రూపికలు మాత్రమే బ్యాంకిద్వారమునఁ గైకొనుచుంటిని గాని అతనియీవి అంతమాత్రమే కాదు నెలకెంత ధనము మీకు వలయునో అంత యుఁ బ్యాంకినుండి కైకొనుఁ డనినాకుఁజెప్పి బ్యాంకుకుఁ గూడ నట్లే వ్రాసె నని చదువరు లరయుదురు గాక.

తే. గీ. ఇతఁ డొకఁడు మధ్య లేకున్న నిరువురకును
బొరయుఁబొచ్చెము నేర్పడి విరసత కవి
కారకం బగు నింత నిక్కం బటంచుఁ
బద్యమునె చెప్పు విస్తరింపంగ నేల. 885

క. పలువురు విద్యార్థులు మునుఁ
గలరు చదివికొనినవాండ్రు కడు భక్తులు; వా

రలలో నీతని విద్యా
కలనము వివరింతు నూత్నగతిగా నుంటన్. 886

వ. ఇతండు సుమారు పదునాలేండ్లప్రాయమున నాకడకుఁ జదివికొను వాఁడై తనగ్రామమ్ము (ఏలూరు) వదలి కడియమునకు వచ్చె.నీకుఁ జదివికొనునవకాశము కలదా? యని ప్రశ్నించితి. భార్య యింకను గాపురమునకు రాలే దని (యథార్థముకాదు) చెప్పెను. నాఁడే కుమార సంభవ మారంభించితిని. 887

క. మఱునాఁ డుదయము వచ్చె శ్వ
శురుండు జామాత వెదకుచును గన్నీ య
క్కిరిబిక్కిరిగాఁ జూచితి
నరుగుపయిన్ గూరుచున్నయా యనఘు నొగన్. 888

వ. ఆయనవలన యథార్థంబు దెలిసె నీతని కొకకుమార్తె యుదయించి నట్లును. బారసాల జరుగవలసియున్నట్లును నింతలో నీతఁ డెవ్వరికిం దెలియకుండ నిట్లు చనుదెంచె ననియును వాక్రుచ్చెఁ బదంపడి నేను వీర లిరువురకును వీలగుమార్గము నారసి చెప్పి యొప్పించితి, ననధ్యా యనముల కింటికి నరుగుచు మూఁడేండ్లు చదివికొని యితఁడు బుద్ధి మంతుండు గాన స్వబుద్ధిచే ననేకవిషయమ్ములు సంగ్రహించికొని మచ్ఛిష్యులలోఁ బరిగణింపఁదగినవాఁ డయ్యె. 889

తే. గీ. అవసరంబైనచో సేవ నాచరింప
వత్తు నే నని నాతోడఁ బలికె నితఁడు
దాన నామది కెంతొ సంతసము గలిగె
మనుజునకు నున్నయది పుష్టి యనఁగ వినమె. 890

వ. మఱియు నీ శనివిదశాభుక్తియందు చి॥ సౌ॥ వతి చిన్నకూఁతురును బౌత్రియు (మహాలక్ష్మి) నన్నుం జూచుటకై చి॥ పెద్దకొమరుఁడు కామేశ్వరశాస్త్రి సహితముగ వచ్చిచనిరి. నాకు మధ్యమధ్య గండ ములు తారసించి తొలఁగుచుండె. 891

క. కొమరులకు నన్నెటులో గే
హము చేర్చెడికోర్కి కలిగి యది ప్రబలియు నా
మమదికి ధైర్యము చాలక
ప్రమోద మది యింతవఱకు ఫలియింప దహో. 892

క. కడియమునకు బెజవాడకుఁ
గడు దవ్వట వత్తుఁగాక కాపురముండ౯
గడఁగియె వచ్చితినే? నా
యెడఁదకుఁ గడుఁజిత్రమగుచు నిది గనుపట్టున్. 893

వ. అదియట్లుండె శ్రీలింగంజగన్నాథరావు(రిటైర్డుమేజస్ట్రేటు)గారు కృష్ణాపుష్కరమునకు వచ్చి నా యోగక్షేమములు గనుఁగొని స్వగ్రామమున కేగినపిదప.

షరా:- ఆ యీ జగన్నాథరావుగారు పదునాఱుపాపికలును సుమా అన్నియె ప్రశంసాపద్యములను గూడ పోష్టుద్వారమున సంపిరి.

క. జననపుదినమున ధరియిం
చునిమిత్త మటంచుఁ బంపె సురుచిరములు స
జ్జనమాన్యుఁడు వస్త్రమ్ములు
పనిగొని రైల్ద్వారమున సభాజనపరతన్. 895

(జననపురోజు ప్రమోదూత సం॥ శ్రావణ శు ౧౨)

ఆ. వె. ఒడలఁ జేవ లేని దొకటె లోపము గాని
యిచటఁ గాలు వెట్టుటే మొదలుగ
నెపుడు జరుగుచుండె నేవియో సత్కృతుల్
శయ్య విడిచి యెటకుఁ జనకయున్న. 896

తే. గీ. జననకాలశుక్రుఁడు రవిచంద్రకుజులు
రాహుగురువులు యోగకారకులె యయ్యు
శని యొనర్చినయోగమ్మె చాల హెచ్చు
వలద టన్నను ధన మది వచ్చుచుండె. 897

తే. గీ. కాని కొమరుల నొకట నొక్కంట నన్ను
నిర్నిమిత్తము విభజించి నిజ మెఱుఁగని
వారి కతమున సుతులకు దూఱు గూర్చెఁ
గుజునియింటనుండిన చెడుగుణముకతన. 898

క. అరియింట నుండినగ్రిహం
బఱిముఱి వికలుఁ డయి దాని కనువైనదురా
చరణాదులు గలిగించున్
బరదేశావాసమాది పరిభవపదముల్. 899

తే. గీ. ఏ గ్రిహము గాని యెవనికినేని జాత
కమునఁ బూర్తిగా మంచినే కలుగఁజేయఁ
డల్లె చెడుగును రామాదు లలఘు లిందు
లకు నుదాహరణమ్ము లిలన్ గలారు. 900

వ. మఱియు నీ శనివిదశయందు నన్నుఁ గొమరు లెల్లని స్వగృహము నకుఁ జేర్చుటకై పట్టుపట్టుచుండి రని లోఁగడ నుట్టంకించితి గదా? అక్కతన నంచుల కసమర్థతాస్థితిలో నుంటంజేసి వారల కేవిధమైన సమాధానమును జెప్పలేక యెడతెగని చింతకు లోఁబడవలసినవాఁడ నైతిని. 901

క. అనృతములు ముఖప్రీతివ
చనములుఁ జెప్పుటయు నా కసహ్య మగును గా
కనిమిత్తంబుగఁ దాదృశుఁ
డనిపించుకొనంగవలసె నని చింతింతున్. 902

ఆ. వె. ఏముహూర్తమందు నే నీ గదిని గాలు
వెట్టినాఁడనొ మఱి విడుచుచొరవ
నాకుఁ గలుగకుండె నాకమ్మకన్న ని
య్యది సుఖముగఁ దోఁచు నన్నృత మాడ. 903

తే. గీ. కూఁతు నిల్లనియును గాదు కొడుకు లింటఁ
జూడ రేమో యనియుఁ గాదు సూనృతంబు

నాకు నీ గది సాక్షాత్తు నాకముగఁ గ
నంబడెడి వార్ధకమ్మున నన్నృత మేల. 904

క. కౌమరుండు పెనగపప్పువి
ధమునన్ వెచ్చించు ధనము; తద్ద్రవ్యము స
ర్వము నిచ్చుదాత యీ స
ద్మమె నా కియ్యెడలఁ గడుఁ గృతజ్ఞతవలయున్. 905

క. ధన మించుక నున్నయది ని
ధన మింతట జరుగునేని ధన మదియే చా
లును వ్యవధి యొదవెనేనియుఁ
గనికరపుదశకుఁ గొంత కంపింపవలెన్. 906

మ. వ్యసనంబుల్ శత మున్న నే మవియు ద్రవ్యం బున్నచో లేశమున్
గసుగందింపవు దానిలేమి కడు దుఃఖంబున్ బోసంగించు, నీ
రసపంసారుల నీరసత్వమునకై తాయేని నీరూరి, మా
నసికవ్యాధికి హేతుభూత మయి చింతం గూర్చు నశ్రాంతమున్. 907

ఆ. వె. అన్నపూర్ణగుఱిచి అష్టకమ్ము రచించు
టాది నన్ను విడిచి యవలి కేగి
దాని సిగను దఱుఁగ దారిద్ర్యభర మది
వలదు వలదు శత్రువులకు నేని. 908

[ఈ అష్టకం కాశిలోఁ జెప్పఁబడినది. ఇప్పటికి 50 ఏండ్లైనది.]

క. పరమేశ్వరియగుకామే
శ్వరి నా కిలువేలు పామెసాయముతో నే
నఱిముఱి సంసృతి మెలఁగెదఁ
గరబదరములై వరించుఁగావుత శుభముల్. 909

తే. గీ. అంబికాకృప యొకటి నా కండ యగుచు
నుండుటంజేసి కాని లేకున్న న న్నె

దుర్చుచున్న సమస్యలఁ దోలు నెవ్వఁ
డాపెనే నమ్మియుండు వే నఖిలమునకు. 910

పార్థివ సం॥ శ్రావణ బ ౭ మొదలు ఆశ్వయుజ బ ౭ వఱకును
శనిలో కుజాంతరములో

—• బు ధ వి ద శ •—

క. శనివిదశ చనియెఁ బిదపఁ గు
జునిలో బుధవిదశ వచ్చె శుభకర మై యిం
దున నొలయువిశేషమ్ములు
మునుకొని లిఖియింతు గ్లుప్తముగఁ దెల్లముగన్. 911

క. అనిమిత్త మ్మింటికి నను
శని దవ్వుగఁ జేసెఁ గాని జరుపుచునుండెన్
మునుకొని సకలమ్మును శో
భనముగ నగుఁ గాక చింత వదల దదేమో ? 912

తే. గీ. చాలవఱకు సంసారప్రసక్తి నన్ను
విడిచినది గాని పూర్తిగా విడువ లేదు
అందులోఁ గవి నైతి దా నాఁడె మొల్ల
"చింత కవులం ద" నుచు సుప్రసిద్ధురాలు. 913

క. వృద్ధులు చింతాతంతుని
బద్ధులు తరుణులు నితాంతభామాసక్తుల్
శ్రీద్ధ నిసువులకు నాటల
నిద్ధరఁ దత్త్వమున నెవరి కిచ్చ జనించున్. 914

చ. ఎవఁడు సహస్రమాసములవృద్ధుఁడొ వానిని దైవతమ్ముగాఁ
గవులు వచింతు, రెందులకుఁ గావ్యవిదగ్రిణు లట్టు లాడిరో
శివ ! శివ ! వార్ధక మ్మనఁగఁ జిక్కులకెల్లను నెల్ల, యెందుకో
నవసెడివృద్ధు నెమ్మది గనం గల దొక్కొ ? ప్రశాంతి యొక్కటన్.

క. ఇఁక నిట దౌహిత్రుండు వ్య
ధకుఁ గారణ మల్ల నిపుఁగు తాపజ్వరబా
ధకు లోనై నవనెడినీ
శుకుటుంబిని వాని కిడుత సుఖ మాయతియుణా. 916

ఉ. తాత జ్వరాన నుండిన వెతం గనఁబోఁ డొకమన్మఁడేవి, అ
ప్లై తనతండ్రి రుగ్ణుఁ డగునేనియుఁ బుత్రకుఁడున్ గనండు, వృ
ద్ధో! తనయింట నుండునిసువో? పశువో? వెసఁ దుమ్మి నంత నే
కాతరుఁడై కృశించుటయె కన్పడు సంస్కృతిశీల మెట్టిదో? 917

తే. గీ. పుత్త్రదారానుషక్తుని బుధుఁ డటంచు
గౌరవించుట కేవలాజ్ఞాన మనుచు
శుకుఁడు వ్యాసునితో ననె, శుకునిమాట
పారవిదులు విజ్ఞులు శిరసా వహింత్రు. 918

తే. గీ. ఎన్నిగతులఁ జూచిన నొకయించుకేని
శాంతి యన్నది లేదు సాంసారికులకు
సకల మెఱిఁగియు సంసారసాగరమున
నీఁదులాడుచు నుంద్రు బుధేంద్రు లకట! 919

తే. గీ. ఉపనిషత్తులు గీత వ్యాసోక్తసూత్ర
ములును వీనిభాష్యాదికమును బఠింప
నేమి యగు నుపన్యాసము లీయ నేమి
యగును సంసారిమది కుండ దరరె? శాంతి. 920

తే. గీ. ఆశ్రమములునాల్గిట గృహస్థాశ్రమంబు
చాల మేలని పొగడుధీశాలు లుంద్రు
గాక యేను దెగడుచుంటిఁ గానరాఁడు
దీన ధన్యత గన్నట్టిమానవుండు. 921

మ. ధన మున్నన్ ధన ముండకుండినను సంతానంబు పేళొండు న
ట్లనె యింకొండు మఱొండు నట్లె యెదొ కష్టంబే గృహస్థాశ్రిమం

బువఁ గన్పట్టెడి నక్కతంబునసె యామోదింపఁగాఁ గొంకినా
రసఘాత్మల్ కృతబుద్ధు, లట్టి రిపు దత్యంతమ్ము మృగ్యల్ ఘవిన్.

వ. ఇంక నొక్కం డీకాలమ్మున సామాన్యగృహస్థుల నెదుర్కొనుసమస్య
గన్పట్టుచున్నయది. 923

క. బాలురకు వివాహంబులు
వాలాయముఁ జేయరామి వచియింతుర షీ
శాలులు; చేయనిచో నీ
కాలము శీలమ్ము చెఱచి కష్టము తెచ్చున్. 924

తే. గీ. బ్రహ్మచర్యమ్ము నిరువది వత్సరముల
వఱకుఁ జేసెడివారలు పాఱులందె
తఱచు గానరా రనిన నితరులఁ దడవ
నేల ? గతకాలమే మేలుఁ గెల్లగతుల. 925

తే. గీ. క్రొత్తసదుపాయములు నూర్లకొలఁది "రైలు"
మొదలుగాఁ గల వేర్పడి ముదముఁగొలుపుఁ
గాక "ఫర్లాంగు" మేరయుఁ గాలినడక
సాఁగ దుండఁగవలయు "రిక్షా" యొకండు. 926

తే. గీ. బాలుకు వివాహ మన్నసంబరమె కాని
సవతితల్లితోఁ బోరాట సంభవించు
టెఱుఁగఁబడ దన్నయట్టు లాయీప్రపంచ
ముబ్బి తబ్బిబ్బగుట కెవ్వఁ డోర్చు బుధుఁడు. 927

వ. అది యట్లుండె, భగవతి కామేశ్వరియనుగ్రహంబుకతన చి॥ దౌహి
త్రుండును చి॥ సౌ॥ దౌహిత్రియు నారోగ్యంబు నందుటయేకాక ఉప
చారార్థము వచ్చియున్న మూడవచిరంజీవి అనారోగ్యంబువలననే కాక
పలువిధముల (లోగడ నుదాహరించియున్నవి చూ.) నాకు మనః
క్లేశంబు గలిగించువాఁడు త్రుటిలో బుజురీతికి మాఱి సంతసమ్ము
గలుగఁజేసె.

తే. గీ. ఇంటికి బలాత్కరించి యే నేగు మంచుఁ
బంపితిని బంపుపైనొకవారమునకె
పూర్తిగా మార్పు కనుపట్టి ముదము గొల్పు
నుత్తరము వ్రాసి కలిగించెఁ జిత్తశాంతి. 929

తే. గీ. ఇంటి కంపని పూర్వమం దేను మీని
కతనఁ బొందిన నిరవధికపరితాప
మెపుడు నాజన్మమధ్యమం దెఱుఁగ, నేన
కాదు మఱి యొక్కరును నెఱుంగ రనుకొందు. 930

తే. గీ. భవతు గతము గతం బయ్యెఁ బాపశాంతి
అనుభవంబునఁ జేకూరె నబ్బె భవుక
మిక్కుతంబున నాకు నొకింత దేహ
మందు నారోగ్య మొదవి యానంద మలరె. 931

క. ఎలమిని శేఖరరాయఁడు
కలిమికి సార్థక్య మొదవఁగా నేబదిరూ
కలు "బ్యాంకి" ద్వారమున ని
స్తులగౌరవపుం బ్రపత్తితో నిడుచుండెన్. 932

షరా:- శేఖరరావుచూపునౌదార్యము కడుంగడు వర్ణ్యము ప్రస్తుతము నేను నాయున్నగది విడిచి యేపదిగజములుగూడ నరుగఁ జాలను. అందుచే బ్యాంకివారు నాయున్నచోటికిఁ దెచ్చి క్రొత్తనెల తొలి వారము దాటకుండ నిచ్చునేర్పాటు చేసె నని యెఱుంగునది.

తే. గీ. పలువురకునిచ్చుదాతలు గలరు జగతి
నాకు నా కంతగా నిచ్చువారు గారు
నాకు హెచ్చుగా నిడువదాన్యమణి మాత్ర
మితరులకుఁ గొంచె మేనియు నిడుట లేదు. 933

క. ఇది చిర మనుభవమున నా
మది గనిపెట్టినది నేఁడుమాత్రమె కా ది

య్యది యెన్నఁడో యెఱింగిన
యది యిప్పుడు తెలిపినాఁడ నరయుఁడు విజ్ఞుల్. 934

క. అలరుంగావుత శేఖరు
కలిమి చిరాయుష్కమై జగన్నుతమై శ్రీ
చెళపిళ్ళసత్కవీశ్వరుఁ
డలరి యొసఁగు దీవనల కుదాహరణంబై. 935

క. ఇనుగంటికులేనుఁడు వా
రని పేరిమితోఁ బ్రకాశరాయఁడు మునుపం
పినయది లోఁగడ వ్రాసితి
ననఘుఁడు నేఁ డంపె శతము నడుగనిమునుపే. 936

తే. గీ. ఆయనకుఁ గలప్రేమంబు నరసి కవులు
గోష్ఠులందుఁ బ్రసంగించుకొనుటకొఱకు
నయ్యలఘుజాబునందలియక్కరములు
నిట నుదాహరించెద మ్రుగ్యుఁ డిట్టిదేఁడు. 937

శ్రీశ్రీశ్రీ కవిచక్రవర్తిగారికి
ప్రకాశరావు దణ్ణములు.

రత్నగిరి
18—9—45

చాలాకాలమై "కావలిస్తే వ్రాస్తాను యింక పంపవద్దు" అని వ్రాస్తిరి..........వృద్ధ్యాప్యంలో శరీరసంరక్షణకు జాస్తీ ఖర్చు అని మీ అనుభవమునకు రాలేదేమో అని...........యింకా కొన్నికారణముల చేతనూ నేఁడే పంపడ మైనది — (చేవ్రాలు)

చ. "అడుగుట యెన్నిజన్మముల కాతెడిసెవ్వగవో" యటంచు వి
జ్ఞుఁ డెఱిఁగి "సంకుసాల" కవిసోముఁడు వ్రాసెఁ బ్రకాశరావు నాఁ
బడు "ఇనుగంటి" వంటికవిపండితభక్తులు గొంద ఱున్నచో
నడిగెడికష్ట మేకవికి నబ్బ దటంచును జేతు లెత్తెదన్. 938

ఆ. వె. పెద్దజేఁడు గాఁడు వేలు వచ్చును గాని
రావు లచ్చ లితనిరాఁబడికిని

గర్భునకును పోల్కి గనరాదు శ్రీ యను
గంటితేఁడు ప్రిబలుఁగాక వీఁక 939

ఆ. వె. ఇతఁడు కొంతవృద్ధుఁడే యయ్యు వృద్ధుల
కష్టసుఖము లించుకయు నెఱుంగఁ
డేల యెఱుఁగవలయు నెఱుఁగకుండనె నూఱు
వత్సరమ్ము లెలమి బ్రదుకుఁగాక. 940

వ. అది యట్లుండె.

క. "ధ్వని" పత్రికాధిపతి వా
రనిపేరిమి మీఱ వచ్చి వ్రాసికొనియెఁ బ
ద్యనికాయము జీవితచరి
తనుండి; ఛాయాపటము నతఁడ తీయించెన్. 942

వ. చిరంజీవి సౌభాగ్యవతి దౌహిత్రి కన్నప్రాశనము జరుగుట, ఆత్మవిద్యా విలాసమును శివమానసికపూజయుఁ దెలిఁగించుటయు నీ బుధవిదశ యందే సంఘటించె. 943

క. గతవిదశకన్న దేహ
స్థితి కొండొక మంచిరీతిఁ జెన్నలరె సమం
చితముగ విద్యాగోష్ఠియుఁ
బ్రతిదినమును బుధునివిదశఁ బ్రబలి రహించెన్. 944

షరా:- ఆయీకుజాంతరమందే ధూళిపాళగ్రామవాసి (రేపల్లె తా॥) దురభిమాని అకారణశత్రువునకు భారతంలోవున్న "భారత భారతీసముద్రము" అనేపాఠాన్ని దిద్దినందుకు తగినప్రాయశ్చిత్తము చేయఁబడిన దని యెఱుఁగ నగు.

పార్థివ సం॥ ఆశ్వయుజ బ ౭ మొదలు కార్తిక శు ౧౫ వఱకును కుజాంతరములో

—• కేతువిదశ •—

క. కొమరు లరుదెంచి నా సే
మము గనుఁగొనుచుండ రామమ తనూభవ ప్రే

మమున నుపచరింపఁగ నం
తమొగిసెఁ గేతువును దనవిదశ యగుకతన్, 945

వ. ఈకేతువిదశాకాలమునందు.

క. భగవద్గీతకు శంకర
భగవత్పాదులు రచించుభాష్యము పైవ్యా
ఖ్య గుడాద్రిసుకవి చేసిన
ది గంటి నచ్చెరువు నందితిన్ దద్దీకిన్. 947

(టిప్పణి గుడాద్రిసుకవి = బెల్లంకొండరామరాయపండితుఁడు)

తే. గీ. బ్రిదికినది స్వల్పకాల మప్పండితుండు
స్వగృహమును వీడఁ డెన్నఁడు సకలశాస్త్ర
ములను సాధించి వ్యాఖ్యానములు రచించె
గ్రంథములు చేసె నూఱిటికన్న హెచ్చు. 948

క. రామానుజీయమత మీ
రామారాయండు శంకరగురుమతముపైఁ
బ్రేమం జూపుచు ఖండన
చే మాయన్ జేసె నెట్టిశేముషి గలఁడో ? 949

తే. గీ. క్లిష్టమార్గములను ద్రొక్కి కేవలము న
సూయ వెలిఁగ్రక్కరామానుజీయభాష్య
మితనిధాటికి నాఁగమి యెఱుకపడెడిఁ
జదివిచూడుఁడు పండితేశానులార ! 950

వ. మఱియు నీ కేతువిదశాకాలమ్మునందు బ్రహ్మశ్రీ లక్కావఝ్ఝుల వేంకట కృష్ణశాస్త్రి విరచితం బగు శ్రీమదాశ్చర్య రామాయణంబును సంస్కరణ వ్యాజమ్మునంజేసి ప్రత్యక్షరమ్మును దిలకించుభాగ్యంబు ఘటించె. 951

క. రామాయణమ్ము లెన్నియొ
యీ మాన్యుఁడు సంగ్రహించి కృష్ణసుకవి యీ
రామాయణమ్ము చేసెను
ధీమంతుఁడు సంస్కృతమున; ధీరులు మెచ్చన్. 952

వ. మఱియు నీ కేతువు కొండొక నాకు దేహమ్మున నారోగ్యసంపాదకుం డయ్యె, నింట నించుక ననారోగ్యము లేర్పడియు వెంటనె శమించె. జైమినిమునీంద్రకృతఁ బగు వేదపాదస్తవం బాంధ్రీకరించితి, నంత శుక్రవిదశ తారసించె. 953

పార్థివ సం॥ కార్తిక శు ౧౫ మొదలు పుష్య బ ౭ వఱకును శనిలో కుజాంతరములో

—• శుక్రవిదశ •—

క. ఇతఁ డించుక కవితావ్యా
పృతియును వ్యాసమ్ము వ్రాసి శ్రీపాదగురు
ప్రతిపాదిత మగుపరమా
నృతమును ఖండించుటయును నెలమి ఘటించెన్. 954

వ. తత్స్వరూపంబు కేవలసంకుచితమగుమనీషతో నమృతానంద మనియెడి పొత్తములో నా బిరుదులనుగూర్చి యెట్లో అపలపించుటయు శ్రవణా నందమును నా చరిత్రమనుటయు నని యెఱుంగునది. మఱియు నీశుక్రుఁడు ధూళిపూడిశాఖాభిమానింగూడ నెన్నఁటిఁకి దలయెత్తనివడువున మంగ లింపం జేసె. శరీరారోగ్య మొకింత మంచిగనే మార్చెను గాని మానసిక రీతి మఱింత అయోమయంబుగ నుండునట్లనుఘటించె. 955

తే. గీ. ఇంట శుభకార్యములు సేయునెసక మొసఁగెఁ
బత్రికలకు వ్యాసమ్ము లపారముగ లి
ఖింపఁగాఁ జేసె శుక్రుండు కీర్తిదాయ
కుండు సుఖదుండు నయి; రవి కూడె నవుల. 956

షరా:- ఈ వ్యాసములు శ్రీపాదగురువుగారు అమృతానందములో నొనర్చిన అనుచితప్రసంగమునకు సంబంధించినవని తెల్విడి.

పార్థివ సం॥ పుష్య బ ౭ మొదలుకొని మాఘ శు ౧౧ వఱకును శనిమహాదశలో కుజాంతరములో

—• రవివిదశ •—

క. ఈ రవి గృహమున శుభకా
ర్యారంభకుఁడై తదర్థ మగుజతనం బిం

పార నౌనర్వ(గ( జేసెన
పారముగ లిఖింప(జేసె వ్యాసము లెలమిన్. 957

క. పదపడి చంద్రు(డు వచ్చెన్
విదశాధిపు( డగుచు నృపులు విత్తమిడిరి బల్
ముదమున శుభకార్యపుసం
పద పొదలెన్ సర్వమును సమంజస మయ్యెన్. 958

పార్థివ సం॥మాఘ శు ౧౧ మొదలు ఫాల్గున శు ౧౫ వఱకును
శనిమహాదశలో కుజాంతరములో

—• చ ం ద్ర వి ద శ •—

తే. గీ. చంద్రు(డు ధనాధిపతి, ధనసహితముగనె
రావలయు(గాన; బొబ్బిలిరాజుగారి
వార్షికముతోడనే వెస వచ్చి, యాధి
పత్యమునకు( గడంగి శుభము లొనర్చె. 959

క. జయపురపు నృపాలు(డు త
ద్దయు దాతృత్వమున మేటి ధన మంపెను దా
నయమునకు రెండు నూఱులు
స్వయంకవీశ్వరు(డు సుగుణసాగరు( డెలమిన్. 960

తే. గీ. రావుకులు(డు గంగాధరరామరావు
ఱేడు పాములపాటి కూర్జితయశుండు
స్వయముగా వచ్చి నాదుబసకు నొసంగె
నూఱునాఱును నిట్టి యుదారు లుండ్రె. 961

షరా:— గంగాధర రామరావుగారు జాతకచర్యకును గోదేవికిని కృతిభర్త. ఇట్టి యోగ్యు(డు న భూతో న భవిష్యతి.

తే. గీ. పీఠపురి ఱేని దత్తుని పెద్దకొడుకు
వేంకటగిరీశ సత్కుల విశ్రుతుండు
గర్వమెట్టిదొ ? యెఱు(గ( డఖర్వగుణు(డు
వర్ధిలుత మీత( డొకనూఱు వత్సరములు. 962

క. శివలెంకవంశ్యుఁ డల వి
శ్వవదాన్యాగ్రిణికి వట్టిజామాతయెకాఁ
డవు మేనయల్లుఁడు ప్రసా
దవసరమువకంపె నూఱునాఱును వేయిన్. 963

షరా:- సన్మానము ( రు 1116-0-0 లు ) నకు కారణం తఱచుగా నేను సుమారు పండెనిండేండ్ల నుండి వ్రాయువ్యాసములు వారి వారపత్రిక కిడుట కావలయు.

క. శంభుప్రసాదుఁ డిటు నను
సంభావించు కత మెఱుఁగఁ జాలను మిగులన్
గంభీరుఁడీతఁ డితనిన్
శంభుఁడు రక్షించుఁగాక సకలవిధములన్. 964

క. అనుకొన్నకంటె నెక్కుడు
గనే ధనము లబ్ధమయ్యె గర్భాధానం
బును జరిగె మన్మరాలి ప
రిణయమును బొనర్చు వేడ్క రేకెత్తె మదిన్. 965

(ఇందలి గర్భాధానం చి॥మూడవకొమరునిది)

షరా:- శుభకార్యమునకు శ్రీ కొల్లాపురం ( నైజాం ) రాజుగారు కూడ పోష్టుద్వారమున రు 116-0-0 ర్లు పంపి సత్కరించిరి.

వ. ఇట్లు శుభోదర్కంబుగ శనిలోని కుజాంతరము ముగిసె. జాతకవేత్తలిరువురు పీఁడు మారకుఁ డని యొకరును, కాదని వేఱొకరును ప్రజామిత్ర పత్రికలో వాదించుకొనుట పలువురెఱిఁగినదే. వారిలో నెవరోడినదియు విస్పష్టంబయ్యె నంత శనిలో రాహ్వంతర మారంభమయ్యె.

పార్థివ సం॥ ఫాల్గున శు ౧౨ మొదలు వ్యయ సం॥ శ్రావణ బ ౪ వఱకును శనిమహాదశలో రాహ్వంతరములో

—• రా హు వి ద శ •—

క. కొమరుల యందున రెండవ
కొమరుఁడు దుర్గయ్య పేర్మి కొమరొప్పఁ గుటుం

ఋముతో నీబెజవాడకుఁ
బ్రమదం బలరారఁ గాపురముగా వచ్చెన్. 967

వ. వీనితో మూడవ చిరంజీవియు స న్నుపచరింప నరుదెంచుచుండెసి సంసారము సంతోషావహం బయ్యె. శిష్యుఁడు విశ్వనాథ సత్యనారాయణ రచించిన రామాయణ కల్పవృక్షమ్మును శ్రీపాదగురువులు సుకవి జన సమయదూరముగ విమర్శింపగా నయ్యది గని సైఁపఁజాలమి నందుఁ గలిగించుకొనక తప్పదయ్యె నందులకుఁ గినిసి పాండితీ రిక్తతకు గుఱుతుగా గురువుగారు "లీగలు" నోటీసు జారీ చేయుటయు నా యీ అనుచితమ్మునకు బెజవాడపురవాస్తవ్యులగు న్యాయవాదు లెల్లరును దమయేవమును శాంతిసందేశమనుపేరుతో జన్మభూమి పత్రికాముఖమున వెల్లడించుటయు వారిసమయజ్ఞత నభినందించుటయు వీడు పత్రిపత్రిధమమంద సంఘటించెఁబిదప శ్రీపాదగురువు లేత్రోవఁ ద్రొక్కి రో ముందు వివరింతు. ఈ రాహువు ప్రారంభించినకొలఁదినాళ్ళలో స్వగృహమ్మున పెద్దచిరంజీవికొఱఁరె చంటిది జాఱిపోయె. దేహారోగ్యముకూడ త్రోవయుఁ దెన్నును లేనిరీతిని విషమింపఁ దొడఁగె. 968

క. గతకాలంబున నేదో
గతి దుర్గత లేచుచుండుఁగాక యెదో ప
ద్ధతి వర్తించినఁ గొండొక
గతి కనవచ్చెడిది యిపుడు గనరాకుండెన్. 969

వ. మఱియు నొండొక్కవిశేషంబు.

క. బంధుసముద్రుండును గుణ
బంధురుఁడు ద్విభాషివంశపావనుఁడు కృపా
సింధుఁ డగువేంకటేశుఁ డి
లంధన్వంతరి యతం డలరు సిరితోడన్. 971

వ. ఆ యీ మహనీయుండు మదరాసురాజధానియందు సర్వత్ర మందులు విక్రయించుషాపుల నేర్పఱిచి తనమ్మాలమ్మున నెందఱికో బందుగుల

కుపకరించుచుండుట యెల్ల రెఱింగినదియ. ఈతండు మత్సుతులలో రెండవచిరంజీవి కీపని విడి బహూకరించుటం జేసి నన్నుపచరించుట కీ కొమరుం డిట వసింపఁ గలిగె నక్కతన సీయలఘు వి శ్లాఘ్య చించి కృతజ్ఞతం బ్రకటింతు. 972

మ. పరమాప్తుండు ద్విభాషివంశజుఁడు దివ్యద్భవ్యవైద్యుం డుమే
శ్వరభక్తాగ్రణి మేటిదాత కరుణావారాశి శ్రీవేంకటే
శ్వరుఁ డాత్మోద్భవుతోఁ దదాత్మజులతో వర్ధిష్ణుసంపత్తితో
వెలుఁగాత జమీనుదారుఁ డగుచున్ వాసిన్ శతాయుష్కుఁడై. 973

వ. మఱియు.

క. కొమరులు మూఁగురు వ్యష్టి
క్రమమునకుం వచ్చి యొకరు కడియము బెజవా
డ మఱొక్క డొక్క రిట నట
నమరిరి పంచికొనివట్ల యయ్యెం బయికిన్. 975

వ. చరముతప్ప స్థిరధనంబు పంచికొననికతన నిందనుక సమష్టికుటుంబ ముగాని వ్యష్టికుటుంబము కా దని యెఱుంగునది. 976

క. చిత్రముగ నస్మదీయచ
రిత్రము గనుపట్టు నీ పురికి వచ్చిన దే
మాత్రి మిట నుంటకున్ గా
దత్రస్థుఁడ నైతి సుతులు నై రత్రస్థుల్. 977

క. కర్తల మనుకొంచును వ్యవ
హర్తల మనుకొంచు లోకు లహమహమికతో
వర్తింతురు భగవంతుని
వర్తనపాత్రముల కుండునా ? స్వైరగతుల్. 978

క. ఓపిక తగ్గుచు నున్నను
శ్రీపరమేశ్వరికృపాయురీలేశము దా

నాపైని జిలుకుచున్నను౯
గాపాడుట౯ జేసి సుఖముగా మన౯ గలిగెన్. 979

వ. ప్రొఫెసరు శేఖరరావు పతివ్రతాకృతికి సన్మానింప యుత్నించెఁ గాని నాకు సభలోఁ గూర్చుండు నోపిక లేమింజేసి యతనియుద్యమంబు నెఱవేఱదయ్యె. నీ రాహువిదశాభుక్తియంద తాత్కాలిక నివాసంబగు విజయవాటికయం దొకస్థలము వేయిరూపాయీలవెలకుఁ గొనఁబడియె మఱియు శేఖరరావు నెలనెలకు బ్యాంకిద్వారమున నంపుముడుపునాఁపె.

క. ఎక్కువమంచియు మిక్కిలి
తక్కువ చెడ్డయును గాఁగఁ దరలించెను దా
నెక్కొని రాహువిదశ యే
చిక్కును గలిగింపఁ డితఁడు సిరి నెగడించెన్. 981

వ్యయ సం॥ శ్రావణ బ ౪ మొదలు మార్గశీర్ష బ 30 వఱకును శనిమహాదశలో రాహ్వంతరములో —• గు రు వి ద శ •—

తే. గీ. అంత గురుఁ దేగుదెంచె విద్యాప్రసక్తి
తోడ మనుమలతోడ సంతోషముగను
జరిగెఁ గాలమ్ము నానాఁట సురుఁగుచుండె
నోపిక మఱెందు లోటు లేకుండె నింక. 982

వ. విశ్వనాథసత్యనారాయణ కవితలో శ్రీపాదగురువుగారు పట్టినతప్పులు తప్పులు గావని సమర్థించినందులకు వారు విద్యాగోష్ఠి విడిచి లీగలు చర్య కుపక్రమించి రని లోఁగడ నుటంకించియుంటి. 983

తే. గీ. గురువుగారు మచ్చరమునఁ గోర్టు కేగ
వారియుద్యమ మే కోర్టువారుఁ గూడ
యుక్తముగ గౌరవింపమి నోడిపోయి
రక్కతమ్మున ఘటియించె హాయి మదికి. 984

క. మితిమీఱినవార్ధక మే
గతిఁ గోర్టులవెంటఁ దిరుగఁగాఁ గల నంచున్

మతిఁ జింత వొడమె నది యధి
కృతులకతనఁ దీరె వారినెదఁ గీర్తింతుౝ. 985

వ. మఱియు నీసందర్భమ్మున మాత్సర్యమునుగూర్చి చెప్పినపద్యములు.

మ. అరు లున్నా రొక యార్గు రాంతరులు, నీ వా షట్కమం దంతమం
దరయంగాఁబడుదాన పయ్యుఁ జెడుకార్యంబుల్ ఘొనర్పించి వం
కరమార్గంబులు ద్రొక్కఁ జేయునెడ నగ్రస్థానముంగొందు మ
చ్చరమా! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 987

మ. ఒరులన్ దూఱెదు నిర్నిమిత్తముగ నిన్నొ ద్లేమి నాకుండినన్
మొఱవెట్టన్ దొరఁకొందు వీ చెయిది ఆమోదార్హ మెట్లయ్యెనో?
గెఱువల్ నీకిది కూడ దంచన కుపేక్షన్ జూపుచున్నారు మ
చ్చరమా! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 988

మ. అరరే! నీ కవకాశ మెవ్వఁ డిడునో! అవ్వానిచే నీవు దు
ర్దురితంబుల్ ఘొనరింపఁ జేయుదువు నీతోఁ జేయుసావాస మె
వ్వరికిన్ గీ, డిహమున్ బరంబు భయమున్, భంగింపకే పోదు మ
చ్చరమా! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 989

మ. అరికిం గాలికి ముల్లు గ్రుచ్చుకొనిన ట్లాలించి సంతోష మె
వ్వరు గైకొందురొ! వారు ముఖ్యముగ నీ బంధుల్ భవద్బంధుతా
స్ఫురణం బన్యము దోఁపనీయమ యశంబున్ మంటిలో గల్పు మ
చ్చరమా! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 990

మ. పరునింటన్ బదిపుల్లె లెట్లయిన లేవన్ సంబర మ్మందు పా
మరుఁడౌఁ బండితుఁడేని నీ పరిచితిన్ బాటించుచో ద్రోణికిన్
గొఱగానట్టిదురూహ గొల్పినది నీ క్రూరత్వమే పొమ్ము మ
చ్చరమా! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 991

మ. "కఱచెన్ గుక్క యరాతి" నంచు వినిచంకల్ గొట్టికొంచున్ బొరిం
బొరి నానందముఁ జెందుపూరుషులఁ దా మోయంగ భూమాతకున్

బరువౌ నఁట! సముద్రముల్ కులగిరుల్ భారమ్ము గావంట, మ
చ్చరమా! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 992

మ. అరినిర్జించెడిశక్తి లే కరికి వ్యాధ్యాదిప్రకోపాప్తి కొం
దఱు వాంఛింతురు! కొంద ఱట్టిసిలుఁగుల్ దైవంబె చేకూర్ప సం
బరమున్ గాంచెద రీసమస్తము భవన్మాహాత్మ్యమే కాదె? మ
చ్చరమా! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 993

మ. "మరణాంత" మ్మనె వైరమున్ గుఱిచి రామక్ష్మాతలాధీశుఁ డా
పరమార్థమ్ము నెఱింగి వర్తిలుటయే ప్రాజ్ఞత్వపర్యాప్తి యె
వ్వరు దానిన్ గమనింపరో? చెడుదు రవ్వా రిందె గా దంచు మ
చ్చరమా! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 994

మ. పరమామ్నాయము లెన్నియో చదివినన్ బ్రహ్మజ్ఞుఁడై మించినన్
జిర మాయుష్యము గాంచిన న్నిను దరిన్ జేర్ప న్నరుం డెందుకున్
గొఱగాఁ డన్నిటఁ బాడుచేసెడిని నీక్రూరత్వ మే మందు; మ
చ్చరమా! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 995

మ. పరిశీలించిన నీదుతత్త్వ, మెటులో వైరమ్ము సాధించుచే
పరమార్థ మ్మనిపించు, ధర్మజునిచేఁ బల్కించె నానాఁడు ద
బ్బర నీచైదియ కాదె; యెవ్వఁ డిఁకఁ బాపం బన్న శంకించు మ
చ్చరమా! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 996

మ. సరసీజాక్షునియంతవాఁడు గొనియెన్ జక్రంబు నిర్వక్రసం
గరు భీష్మున్ వధియింప నీపరిచితిన్ గంకోష్ఠమా? నీకు నె
వ్వరు దూరంబుగ నుండఁగావలయు నేపాపంబు నీసొమ్ము మ
చ్చరమా! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 997

మ. కరణ మ్మొక్కఁడు చచ్చుచు న్మదికి నక్క స్సింకనున్ దీర కే
డ్తెఱ; వ్యాజమ్మున మున్సబున్ దురకలన్ డీకొల్పి కొట్టించె నం
దురు, తత్కృత్యము నీపరితాప మనియే తోఁచున్ ధ్రువం బింత మ
చ్చరమా! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 998

మ. పరమందే నిహమందునేని లవమున్ బ్రఖ్యాతి రానీనివం
కరమార్గంబుబు ద్రొక్కఁజేయునిను నిక్కంబైనపేరున్నయె
వ్వరు ప్రేమింతురు ? నే నెఱుంగుదును భావత్కంబు తత్త్వంబు మ
మచ్చరమా! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 999

మ. గఱువల్ మెచ్చెడికీర్తి గోరునెడ నేకవ్యగ్రఱుల్ గాని ధీ
వరదూరం బగుత్రోవ వట్టి నడువన్ బ్రాప్తింప దీ వెద్దు వం
కరమార్గంబులె తొక్కఁ జేసెదు, కడున్ గర్హ్యంబు నీ చైది మ
చ్చరమా! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 1000

మ. ధర నీకున్ జయ మండ దెందు నిది సిద్ధాంతమ్ము, దుర్యోధను
సిరికిన్ దూరగుఁ జేసినట్టిది భవత్స్నేహంబ వింధ్యాద్రి ను
ర్వర మట్టంబుగ ద్రొక్కఁజేసినది నీప్రావీణ్యమే కాదె ? మ
చ్చరమా ! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 1001

మ. విరథుం డయ్యును నాజికిన్ జనుమహావీరుంతు బాహుద్వయం
బరి ఖండించిన వానిమ్రింగఁ జనుయోధాగ్రేసరుండున్ దురో
దరమం దంగనఁ గూడ నోడుఘనుఁడున్ ద్వద్దాసవర్గంబ మ
చ్చరమా ! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 1002

మ. బరిభావమ్ము ఘటింపఁ జేయఁగల వ్యాపారమ్ములందున్ బొరిన్
బొరిఁ గాల్వెట్టుచుఁ బంక మంటికొనుడున్ బోఁగొట్టుకో నెంచి వ
కరమార్గంబులు ద్రొక్కఁ జేయునది నీ కార్పణ్యమే కాదె ? మ
చ్చరమా! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 1003

మ. పరిభావమ్ము స్వయంకృతాగమున సంప్రాప్తింప నద్దాని నె
వ్వరొ అన్యుల్ గలిగించినా రనుచుఁ గార్పణ్యంబునన్ సారె వం
కరమార్గంబులు ద్రొక్కి దైన్యమున కగ్గం బౌట నీ చైది మ
చ్చరమా! నాదరి రాకు నీ కిదె నమస్కారంబు దూరోగమా! 1004

మ. పరిశీలించిన నీ వానర్పనియఘపారంభముల్ సున్న, అం
తరరుల్ సర్వులు దుష్టు లయ్యును భవద్దౌష్ట్యంబు శోచ్యంబు, నిన్

దరిఁ జేర్పం దగ దెందతో చెడిరి నీ దాస్యానకున్ లోఁగి మ
చ్చరమా ! నాదరిరాకు నీకిదె నమస్కారంబు మూరోగమా! 1005

మ. తరుణీహత్యలు ధేనుహత్యలు మొదల్ తత్తన్మహాఘోరముల్
తురకల్ సేయుచు నుండి రిప్డు డిల హిందూతూర్పుబంగాళలో
నరరే ? దానికి మూలకారణము నీ యౌద్ధత్యమే హంత ! మ
చ్చరమా ! నాదరిరాకు నీకిదె నమస్కారంబు మూరోగమా! 1006

వ. మరల వక్తవ్యాంశము నుపక్రమించెద.

తే. గీ. కాకినాఁడ కలెక్టరు కనరి కేసు
లే దనియె రాజమండ్రీకలెక్ట రావి
యంద లే దనె దోసఁగు నా వ్యాసమందు
గురువుగా ర్విరమించిరి కోర్టుబెడద. 1008

క. కేసున్నను లేకున్నను
గాసిన్ గలిగించుపొంతెఁ గడు యత్నంబుం
జేసిరి క్షమాపణకు నీ
దాసుఁడు సంసిద్ధుఁ డని యెదన్ దెలియరాకో ? 1009

క. నెల లైన నేమి మఱి గడి
యలె యందము గురుత కొప్పినప్పుడు మర్యా
దలు నెఱపవలయు నని వా
రెలమిన్ గైకొనరుఁ గాక యీసుకతమునన్. 1010

వ. ఈ శనిదశారంభమునుండి తీరనిసమస్యగా నీ గురువుగారిచిక్కు వేధించు
చున్నది. దానిస్వరూపము లోగడ వివరింపఁబడినదియే యైనను
మరల నియ్యెడఁ గ్రోడీకరించి వివరింతు. 1011

ఆ. వె. తప్పుగానిదానిఁ దప్పనుటయు నేను
దగుపరిమాణముల నుదాహరించి
యొప్పటంచుఁ దెలుప నుగ్రులై "లీగలు"
చర్యకేగు టదియె సకల మరయ. 1012

వ. ఇట్టులే మఱికొన్ని తీఱనిసమస్య లీ శనిదశ యారంభించినదిమొదలు వేధించుచుండె. నందులోనొకటి మఱియు విషమావస్థలోనుండి "దిగఁ దీసిన బ్రహ్మహత్యయు నెగఁదీసిన గోహత్యయు" గావేధించుచున్నది. అయుక్తమేయైనను దాని నిట నుదాహరింపనిచో మనస్సునకు శాంతి లేమింజేసియుదాహరింతు. నాజీవితకాలములో నెక్కడఁగాని యెన్నఁడు గానియిట్టి యవమానమును పొందలేదు. ఒకపెద్దపులి పులినోటిలో లేఁడి చిక్కికొన్నది. లేఁడికి నపాయము లేకుండ నా కూఁతురమృగమును వధింపవలయు నా యీ సమస్యాస్వరూప మియ్యదియే. 1013

ఆ. వె. ఎగ్గు లే దొకింత సిగ్గును లేదు పా
పం బటన్న లేదు భయము సుంత
అట్టివాని కెట్లొ యైతి వియ్యంకుఁడ
నిప్పు డెంత వగచి యేమి ఫలము. 1014

ఆ. వె. ధన మొసంగినాఁడఁ దనయకుఁ దమ్మిడీ
కూడఁ దక్కలేదు కోక లిడిన
నవియు నత్తగారి కర్పితంబై నట్లె
యిప్పు డెంత వగచి యేమి ఫలము. 1015

ఆ. వె. భూమి కొంత యిడితిఁ బుత్త్రికపేరిట
నదియు బెదరు గొల్పి అమ్మఁజేనె
వీరకాఁడు వానిపేరు భీతిని గొల్పు
నిప్పు డెంత వగచి యేమి ఫలము. 1016

ఆ. వె. ఇచ్చి చెప్పరాద యెఱుఁగుదు నల్లున
కట్టులుండ వియ్యపమ్మవారి
కిడితి నెన్నిసార్లొ యేఁ గానుకల నాపె
కించుకంత కరుణ యెదను లేదు. 1017

ఆ. వె. నాదునింతి యాపెమీఁదఁ జూపినపేర్మి
కంతుఁ బొంతు లేద అది సమస్త

మేమి యయ్యెనొకో? యిపు డాపె వేధించు
గోడలిని సతంబు గుమతి యగుచు. 1018

తే. గీ. అన్నిటికి నోర్చి నాకుఁ బ్రఖ్యాతి తెచ్చు
చున్నయది కూఁతు రజితియందుండునగయు
దోఁచికొనె నగ లన్నియు దోషి మామ.
యిప్పు డెంతగా వగచిన నేమిఫలము. 1019

ఉ. దైవతభక్తి గాని తలిదండ్రులయందలిభక్తి గాని స
ద్భావము గాని లేనికులపాంసనులింటికి బిడ్డ నిచ్చి నాఁ
డీ వెటివెంగళప్ప యిపు డేమనుకొన్న మఁటేమిలాభమోఁ
గావలుఁ డల్లుఁ డాతఁ డొక గవ్వకు మాఱఁడు చెప్ప సిగ్గగున్. 1020

తే. గీ. చెప్పికొన్నది వేదంబు సిగ్గుచేటు
వేషము తురుష్కజాతిని వెన్ను దన్ను
"క్యాటు బూటు" లాంగ్లేయులకన్న మిన్న
ఏ-బి-సీ-డీ-లు రా వెంత ఏవ మకట. 1021

క. తలకిందుగ మాఱిన వా
ర్యలయాచారములు చూచుచుండఁగ నిది యే
విలయమ్మనకొ? స్వరాజ్యం
బలవడునే? యింతమాత్రిననియున్ దోఁచున్. 1022

క. మాలం డొకండు బ్రాహ్మణ
బాలికఁ బెండ్లాడుపూన్కిఁ బత్రికలం దా
నోలిఁ బ్రకటించె వాఁడు వ
లాలము తినఁ డంతలోఁ గులము బ్రాహ్మంబే? 1023

క. తురకలకుఁ బాపపుణ్యము
లరయం బని లేదు వారియందున్ సచ్ఛీ
లురు గలరు శతమునకు నొ
క్కరు తక్కనవారిఁ జెప్పఁగా నేమిటికిన్. 1024

క. నవకాళీ జిల్లాలో
శివ ! శివ ! రక్కసులు మున్ను చేయని అయ్యె
యవమానంబులు హత్యలు
పొవరుంబోతు లొనరిం త్రిపుడు ఘోరముగన్. 1025

తే. గీ. అట్టియోగ్యులతోఁ గలియంగవలయు
నంచుఁ జెప్పెడిగాంధిమహాత్మకుండు
వాండ్రితోఁ జెల్మి మనకు స్వప్నమున నేని
సంఘటింపదు గాంధిజీ సర్వసముఁడు. 1026

తే. గీ. తెల్లదొరలకు "లా" యున్న దుల్లమున్న
ఉక్కుతన వారు లోఁగిరి హాత మొనర్ప
కలకుఁదురకలు కంఠముల్ నఱికి తింద్రు
మనుజమాంసమ్ము వాండ్రకుఁ గనికరంబె. 1027

తే. తురకమంత్రిత్వ మున్నయందుననె కాశి
ఘట్టమున కట్టి దుర్దశ గలిగె నేఁడు
వారితో మైత్రి గాంధిజీ గోరుకంటె
బండగట్టుకు నూతిలోఁ బడుట మేలు. 1028

క. అల "యగ్బరు" రాజ్యమ్మునఁ
గళంకునకు నైఁచి స్వీయకన్యకలను వా
రల కిచ్చి క్షత్రియులు పెం
డిలిచేసిరి మైత్రి సంఘటించెనె దానన్. 1029

క. తురకలబాధలు పడిపడి
మఱచితి మాంగ్లేయులు మనమహి నేలుటచే
మరలఁ జవిఁ జూచితిమి నే
డఱిమఱిగ స్వరాజ్యభాగ్య మబ్బిన కతనన్. 1030

క. కుక్కినపేలన్ బలెఁ దమ
యుక్కెల్లను దక్కి తురక లుండిరి ఆంగ్లో

న్యక్కృతిని జిక్కి ఆర్యుల
కక్కరణిన్ వారినొంచు టది సాధ్యంబే. 1031

తే. గీ. స్త్రీలఁ జంపిరి చెఱచిరి దేశమున క
రాజకము సంఘటించిరి రాష్ట్రవిధి
యూరకుండెఁ గిక్కురుమన కొందు దిక్కు
లేక ప్రజ గ్రామములు వీడి లేచిపోయె. 1032

క. బలవంతముగా నబలలఁ
గలిపికొనిరి తమమతమున ఖడ్గంపుఁదళ
త్తళలు గనఁజేసి; వారల
చెలిమికిఁ బ్రార్థించుగాంధిజీ వీఱిఁడియే. 1033

తే. గీ. కాఁడు వీఱిఁడి కార్యార్థి గర్వ ముడిగి
చేయవలయు యత్నం బని స్వీయపౌరు
షంబు చంపుక యత్నంబు సలుపుచుండెఁ
గావి వారలు మనతోడఁ గలిసిరారు. 1034

క. మన మెల్లను దురకలమై
మనవలెఁ గాదేని వారి ఖండింపవలెన్
గొని ఖడ్గంబును బ్రార్థిం
చిన లాభము లేదు గాంధిజీ యే మనునో ? 1035

తే. గీ. ఎల్లచోట నహింసయు నెల్లచోట
హింసయున్ గూడఁ బనికి రా దేగి గాంధి
శిరము నొగ్గిన యెడ "జపా" సేయుఁ దురక
కత్తిపీఁటకుఁ బలియుట గలదె ! పండ్లు. 1036

క. తొలిరాజులు తురకలలోఁ
గలిసిరి కన్యకల నిచ్చి కడకు మన మచే
గలిసినచో సుఖ మగు నీ
యిల పాకిస్థానముగ రహించు సకలమున్. 1037

తే. గీ. ఆంగ్లదొరలకు నవకాశ మబ్బ దపుడు
గడబిడలకును దా వప్డు గలుగఁబోదు
క్షీరనీరమ్ము లొక్కసై చెల్వుమీఱు
నేలుకోవచ్చును స్వరాజ్య మెనక మెసఁగ. 1038

క. కులము చెడిపోయి మఱి ధో
జులు గా దబ్దములు గడచె శూద్రులు ద్విజులున్
గలిసిరి మాలల్, గలిసిరి
కలవనివా రేరొ చెప్పఁగాలే రెవరున్. 1039

తే. గీ. ఎపుడు దేవళములు మన కెల్లిదమ్ము
లయ్యెనో కుల మప్పుడే అంతరించెఁ
గాని మనకు స్వరాజ్యంబు గలుగ లేదు
తురకసైంధవుఁ డడ్డమై పరిభవించె. 1040

క. "ఏయెండ కాగొడుగు" సదు
పాయము వేఱొండు గానఁబడదు స్వరాజ్యం
బాయత్త మయ్యు దూరం
బై యేగెడి కులము వదల నది సిద్ధించున్. 1041

మ. కుల మెట్లుం జెడె రాజ్యపాలనఁ దురుష్కుల్ సాఁగనీ రింక వా
రలలోఁ జేరినయుత్తరక్షణములో రాజ్యంబు సిద్ధించు వా
రలు రమ్మన్నను రారు వచ్చినను శాస్త్రం బడ్డమౌ నాంగిలే
యుల నిర్జించుట కొం డుపాయమును నే నూహింపలే నయ్యెదన్. 1042

క. "తురకము తుద కబ్బిన" దని
అఱిముఱి మనయార్యులన్న నందురుగా కె
వ్వరికిన్ జంకము మన మిఁక
స్వరాజ్యసిద్ధి కిది మంచిసమపాయ మగున్. 1043

తే.గీ. ఈనఁ గాచి నక్కలపాలుగా నొనర్ప
నేల ! కులగౌరవము చెడి చాలఁ గాల

మయ్యె దేవాలయము లెప్పు డంటువడెనొ
అపుడె "సర్వం జగన్నాథ" మయ్యెఁ గాదె. 1044

క. చెడినకులము రమ్మన నె
క్కడ వచ్చెడి! ఫలముకూడఁ గరగతమై యి
ప్పుడు జాతిపోవుచున్నది
బడబానల ముద్భవించె బంగాళమునన్. 1045

క. "మాలవ్యా" పండితుఁ డీ
కాలుష్యము సైఁపఁ డనెడికాతర్యము శే
షేలేదు చనియె నతఁ డా
యీ లోకము విడిచి స్వర్గ మెవ రడ్డ మిఁకన్. 1046

క. మను వాపద్ధర్మమ్ములు
మనకున్ వివరించెఁ గొన్ని మన మా యూఁతం
గొని చన్న దోస ముండదు
జన మురక నశించునట్టిసమయం బిదియున్. 1047

తే. గీ. ఎప్పుడో యెత్తు నఁట? విష్ణు వేదొ యవత
రంబు పాప మాతనికిశ్రీమంబదేల
మనము తురకలమైనపిమ్మట నతండు
రాఁ బనియె లేదు మనల "నల్లా" యె ప్రోచు. 1048

తే. గీ. సంఘసంస్కర్త నేఁ గాను జడుఁడఁ గాను
"కాటికిం గాళ్ళు సాచెడికాలమందుఁ
దురకనై ప్రాణములు వీడుదునె వృథాగ
నింతకన్నను సదుపాయ మెందు లేదు. 1049

తే. గీ. ఎందఱో చచ్చి రెందఱో కృష్ణదేవుఁ
డవతరించిన పుట్టింట నగడుగుడిచి
రక్కతమున స్వరాజ్యమ్ము నాంగిలేయు
లిడక తప్పనివిధియయి యిచ్చినారు. 1050

క. కుల మని గోత్రిం బని సం
కెలలై మన కడ్డు దగిలి కేల్వట్టు స్వలీ
లలు చూపనున్నశ్రీరా
జ్యలక్ష్మి కెడ యగుట యెంత యవివేక మయో. 1051

క. కులగోత్రిమ్ములు మఱియున్
మలమూత్రిమ్ములును దొంటి మాటలు సాక్షా
త్కాలిరాజ్య మేలుసీరో
జులను విధినిషేధములకు జో టెట నుండున్. 1052

క. చెళపిళ్ళరాయఁ డల తుర
కలతో వియ్యమ్ము నందెఁ గలియుగమున న
న్యుల కట్లు సలుపునెడలన్
వెలి యగు ననుకొనుట వట్టి వెఱ్ఱియ కాదే. 1053

సీ. మూడుసారులు ముక్కు మూసికొందుము మన
మైదుసారులు వారి కగు నమాజు
కార్తికనక్తముల్ గలవు హిందువులకు
"రంజాను" వారికి రాత్రితిండి
గోవన్న భక్తి మ్రొక్కును హిందువుండు మె
క్కును దురుష్కుం డది కూరఁజేసి
వేదశాస్త్రమ్ముల విశ్వాస మలవారి
కున్నది మనవారి కున్నయట్లె

తే గీ. మార్దవము లేకపోలేదు మనకుమించి
కలదు కాఠిన్య మద్దానిఁ గసరుఁ గాని
మనము వారుగా మాఱిన మనకె కాదు
వారికిని లోకమునకుఁ జేకూరు సుఖము. 1054

క. పౌరుషము తక్కువై య
వ్వారికి హిందువులు లోఁగి భయపడి రని మె

వ్వా రనుకొందురొ ? వార్భి
హోమమహాఘోరములను నరయనివారల్ 1055

తే. గీ. గాంధి కెంతటికోపమో కలదు గాక
అల్ల ''నవఖాళి'' నతులయార్తారవంబు
విన్నవాడిగ దిగ్భ్రమింగి వెరవు లరయు
చున్నవాఁడు మహాత్ముఁడు ఖిన్నుఁ డగుచు. 1056

ఉ. ఛాగములన్ వధించెడికసాయికి నన్నలొ తమ్ములో యనన్
శ్రీగలగేస్తులన్ దొరసి చెండుచునుండ "నహోహొహో" యటం
చేగతి సాధ్వులేడ్చిరొ ? సహించిరొ ? చూచినవార లేగతిన్
సాఁగదు చేయి వ్రాయుటకు స్వాంతము నైఁపదు వ్రాయకుంటకున్.

తే. గీ. అట్టివారలతో మైత్రి యలవడ దని
యెఱుఁగు గాంధీమహాత్మకుం డెఱిఁగి కూడ
నలుపయత్నించు వారితో గలిసిపోదు
మన్నవారల నాయన యడ్డఁబోఁడు. 1058

ఉ. గాంధిమహాత్మకుం డనఁగఁ గారణజన్ముఁడు, తన్మనంబు దు
ర్గంధులపట్లఁ బూర్తివిముఖం బని లోక మెఱుంగు నా కృపా
సింధుఁడు వంగదేశము నశించుట కెంత కృశించుచుండెనో
అంధమనస్కులౌ తురక లారయనేర్తురె ? గోపలాశనుల్. 1059

క. క్రియలోమాట స్వరాజ్యం
బయనించుటె కాదు వచ్చెననుకొంద మనా
మయముగ లోకము నెగడదు
భయకారకు లెప్పటికిని భయకారకులే. 1060

వ. అది యటులుండె నీ గురువిదశలో మూడువంతులకాలము జరిగిన
పిమ్మట నొక్కనాఁడు తలంపని తలంపుగా. 1061

క. పనిగట్టుక ననుఁ జూచెడి
అనురాగముతోడ వచ్చె నలఘుండు పత్రికా

శన్మపతి మిత్రుం డుదారుం
డినుగంటి కులోద్భవుఁడు ప్రకృత కృతిపతియున్. 1062

వ. అట్లు చనుదెంచి యోగక్షేమాదు లడిగి యాదరించి చనఁబోవుచు
నిట్లనియె. 1063

ఉ. సూరివరేణ్య మీరలు యశోధను లౌదురు దీనిచేత సం
సారము సాగు బెట్టు లిది క్షామపుఁగాలము సొమ్ముకోసమై
"కారుడు" గూడ వ్రాయరిది కైకొమఁ డంచును బంపినప్పుడే
మీరలు స్వీకరింతు రిది మిక్కిలి యక్కఱమిట్టి రుందురే. 1064

క. "అడుగక అమ్మయుఁ బెట్ట" ద
నెడి సామెత మీ రెఱుంగనిది కాదు కడున్
గడు వార్ధక్యము మీ కి
ప్పుడు గావలె నెలకు ధనము బోలెఁడు సుకవీ. 1065

క. కొడుకులుఁ గూఁతులు వారల
కొడుకులుఁ గూతుంద్రు పేరుగొప్పది మీ రె
క్కడి కిప్పు డేగుదు రహో!
పుడమి పతులఁ జూచి ద్రవ్యమును నార్జింపన్. 1066

క. నెల కొక్కకార్డు వ్రాయుఁడు
కల మెప్పుడు కరమునందుఁ గ్రాలెడి మీ కి
మ్ములఁ గవిత వ్రాయుటకు; నే
నెలమిన్ బంపించుచుందుఁ దృప్తిగ ధనమున్. 1067

ఉ. ఆయన "జాబువ్రాయుఁడని యన్నను నే నటు వ్రాయ కూరకే
చేయుదుఁ గాలయాపనము; సిగ్గుకు లోఁగి అతండు సత్కవి
ధ్యేయుఁడు సారె నూర్లకొలఁదిన్ మనియార్డరు సేయు నిట్టి సు
శ్రీయుతు లిక్కలిన్ గలిగిరే! యుగ మిద్ది కృతంబె! చిత్రమౌ. 1068

క. కృతయుగమున దానము యో
గ్యత గల విజ్ఞులకుఁ బిలిచి యర్పించుట యౌ

వితరణము కలికిఁ జెల్లదు
స్తుతమతికిఁ బ్రకాశరాయసుకృతి కలవడెన్. 1069

క. ఎవ రెంత ఆపరము న
త్కవి వృద్ధుం డని తలంచి కనక మ్మిడి పే
లువులు మెయినిండఁ గప్పెనఁ
గవికన్నను దాత సుకృతిగాఁ గనుపట్టున్. 1070

క. కవితయు దాతృత రెండున్
జవిఁ జూచిన విజ్ఞజనియె శ్లాఘ్యము నాకున్
శివ ! రాఁగలభవ మీ పై
భవమునకున్ లక్ష్య మగుత భవదీయకృపన్. 1071

క. ఔచిత్యము గనిపెట్టెడి
ధీచతురుఁ బ్రకాశనృపుని దేవుఁడు సతమున్
బ్రోచుత దీర్ఘాయువు నిడి
కాచుత సంపదల నొసఁగి కలకాలమ్మున్. 1072

తే. గీ. కాశిభొట్ల బ్రహ్మయ శాస్త్రి కష్టకాల
మెల్ల సుఖకాల మగునట్టు లితఁడు గడపె
నల హరిశ్చంద్రరావు ని ద్దరయుచుండె
సర్వవిధముల సంస్కృతి జరుగునట్లు. 1073

తే. గీ. వేలు గాని లక్షలు రావు వితరణమున
నెముక చేతికి లేద యీ నృపతి మణికి
సత్యనారాయణునియెడఁ జాలభక్తి
గలిగి జీవితయాత్ర నీ ఘనుఁడు సల్పు. 1074

ఆ. వె. ఇతనికన్న బోలెఁ "డిక్కము" గలభూమి
పతులు గలరు దానపరులు గలరు
గాని యౌచితి గని కనకమ్మొ నొసఁగెడి
వారు దాతలందు లేరు లేదు. 1075

క. వెలమలలో నినుగంటికిఁ
గల దెక్కుడుపేరు దాని గలిగించినయ
య్యలఘులయందుఁ బ్రకాశుఁడు
వెలుఁగులలో వేవెలుంగు విధముగఁ దోఁచున్. 1076

తే. గీ. స్వయముగా యోగ్యుఁ డీతఁడు సత్యదేవు
కరుణ దానికిఁ దోడ్పడి కనకమునకుఁ
దావి ప్రభవించె సహజ ముదారభావ
మన్నిటికి పన్నె గూర్చి చెన్నారె నెలమి. 1077

క. పూర్వాచారపరాయణుఁ
డర్వాచీనతకు దూరమందుఁ జరించున్
గర్వం బెఱుంగఁ డెల్లపు
డుర్వీసురభక్తుఁడును మహోదారుండున్. 1078

తే. గీ. స్నాన మొనరించుఁ బ్రొద్దుట సాయమందు
నిష్ఠ జపియించు శ్రీహరి నిగమవేద్యు
శంఖచక్రాంకితుండు వైష్ణవమతస్థుఁ
డలరు నిస్గంటి శ్రీప్రకాశాహ్వయుండు. 1079

ఆ. వె. ఇతనిచిన్ననాఁటనే వచ్చి కొల్వుండె
గొండ ముక్తి గొనుము కువలయేశ
అనుచుఁదెలుపుపొంటె నట్లె గొలుచుచుండె
శ్రీప్రకాశనృపతి శిష్టు లలర. 1080

ఆ. వె. ఎన్నిలేవు కొండ; లీ కొండపైఁ గొల్వు
దీర్చి పూజగొనుట దేవదేవు
నకు జనించినట్టిప్రకటానురాగంబు
గాక వేఱు గలదె కారణంబు. 1081

క. రతనపుశైలమ్మున కధి
పతి యంట! ప్రకాశరావు పండితకవిస

మ్మతుఁ డంట ! ఆతసిన్ గీ
రితిగజిత స్వయమ్ముగా వరింపకయున్నె. 1082

క. ఈ గురువిదళనె "వర్థ్మ"ని
యోగి దురభిమాని భారతోక్తులయెడ బా
గోగులు దెలియమిని వృథా
ప్రాగల్భ్యము చూపఁ దొడఁగెఁ బ్రాజ్ఞత లేమిన్. 1083

తే. గీ. పండితంమాని యైన యాప్రల్లదుని శి
రోభరం బది తగ్గి నోర్మూత వడెడి
యట్లుగాఁ జేయ నల్ల శాఖాభిమాని
యోడియును నేదియో వ్రాయు టుడుగఁ డయ్యె. 1084

తే. గీ. దురభిమానులు పలువు రెందును గలారు
గాని యీదృశుం డన్యత్రి గానరాఁడు
ఆక లితనికి నాకాశ మంత సూది
బెజ్జమునకన్న వక్త్రమ్ము పెద్దగాదు. 1085

క. పదిపంద్రెండు సమలనుం
డి దురీహుం డితఁడు కడుఁ గడిందిగ వదరున్
వదరెడి సారెకుఁ జీవా
ట్లు దినియు మానం డితం డెటో ప్రలపించున్. 1086

తే. గీ. ఆఱువేలవిప్రుండు పద్ధతినియోగి
చదువుసందెలు తక్కువ సత్యమునకుఁ
గట్టువడఁ డనాత్మజ్ఞుఁడు తిట్టుఁబోతు
నరక మన నీతనికి జంకు నాఽస్తి నాస్తి. 1087

తే. గీ. జ్ఞానలవదుర్విదగ్ధు లున్నారు గాని
వార లీతనిగోటికి గారు దీటు
రాహుగురుయోగ మిట్టి మోఱకునితో "న
ధాత్తు" వాదమ్ము గూర్చె విత్తములు నవ్వ. 1088

వ. ఆయీ వివాదమ్మే భారతాదిపర్వమునందలి "చ. అమలిన తారకాస ముదయమ్ముల నెన్నను" అను పద్యమునందు తృతీయచరణాంతమం దలి - "భారతభారతీ" అనుచోట "భారతవాహినీ" అనెడి అపూర్వ పాఠము గల్పించి వెఱ్ఱిమొఱ్ఱి యర్థములు చెప్పఁబూనుట యని యెఱుంగునది. 1089

తే. గీ. వర్ష్మవృద్ధుండు పరలోకభయము విడిచి
పరిభవం బెటులేనియుఁ బాపికొనఁగఁ
దప్పుత్రోవలు ద్రొక్కు నత్తరుణమందు
శనివిదశ వచ్చె నాత్మకు జయము గూర్ప. 1090

వ్యయ సం॥ మార్గశీర్ష బ ౩౦ మొదలుకొని
సర్వజిత్సంపత్సర జ్యేష్ఠ శు ౧౨ వఱకును
శనిమహాదశలో రాహ్వంతరములో

—• శనివిదశ •—

తే. గీ. ఎందుకుం గొఱగానివాఁ డితనిఁగూర్చి
జీవితచరిత్రిలో నింత చెప్ప నేల!
తద్జ్ఞతాదూరుఁ డనరా "దధాత్తు" వాది
యీదృశుని సోఁకు మూయించు టెంతో కస్తి. 1091

క. తనకన్న వయసులోఁ బె
ద్దను విద్దియమా టటుంచుదము నను నీతం
డనుచితములు ప్రేలును స
జ్జనులవలనిభీతి యితనిస్వాంత మెఱుఁగునే. 1092

తే. గీ. వర్ష్మకన్న వనాత్మజ్ఞు వసుధఁ జూడ
నని తలంచితి గాని యజ్ఞునితాత
గనుపడె నొకండు మద్బంధుజనులయందు
దానితో నక్కజము కొంత తగ్గఁ జొచ్చె. 1093

క. కవియగువాఁ డౌచితికిన్
దవులనిసుడు లాలకించి తలవంచికొనున్
జెవుల కవి పీడగొలుపుఁ
శివ ! శివ ! పవికన్న నేమి చెప్పఁగ నేర్తున్. 1094

వ. ఔచిత్యం బన వేషభాషాదులయందుఁ దనకుం గలయర్హతను గుర్తించి వర్తించుట "మ్రింగమెతుకులేదు మీసాలకు సంపెఁగనూనె" లోనగు లోకోక్తు లీ యౌచిత్య జ్ఞానములేని మొఱకులంగూర్చి నవియే తప్పించు కొంద మన్నను తప్పని కతమున నీ యిరువుర అనుచితపు మాటలువిని లజ్జించుచున్న సమయమ్మున దైవసంఘటనమ్ము కతమ్మునంజేసి యొకపిచ్చివాఁడు నన్నుం గనవచ్చె. 1095

క. అగుఁగాక పిచ్చివాఁడితఁ
డు గుణగరిష్ఠుండు గడుఁ గడు న్నేర్పరి మె
చ్చగుగతి సంభాషించున్
నగుఁ బాటున్నడుల కన్న నాకవి నచ్చెన్. 1096

తే. గీ. "అల్లునకు సిరి వట్టిన నర్ధరాత్రి
తటిని గొడుగు దెమ్మన్న చంద మగు" నందురి
సరియె సిరి వట్టకున్న యత్తటినె యట్టు
లైనయవ్వారిఁ గూర్చి యే మనఁగ వలయు. 1097

ఆ. వె. బూతుఁగూఁత లేని బుధసమ్మతి గడించు
నౌచితీ గుణమ్ము నంటియున్న
నట్లుగాకయున్న నవి యాగమములయ్యు
నాకు నచ్చ వెఱుఁగుఁగాక జగము. 1098

వ. అది యటులుండె నీ యౌచితీ విషయ మెంత వ్రాసినను తేలునదిగాదు ప్రకృతం బందికొందు. 1099

క. శనిదశ రాహ్వంతర్దశ
శనివిదశయు నయ్యు నాకు శాఁకరి కరుణా

ఖని సాయ మున్నకతమున
దినములు సుఖబహుళముగనె దిరుగుచు నుండెన్. 1100

తే. గీ. "అఖిలదుష్టగ్రహమ్ములు నష్టమమున
నున్న నా కేమి ! భయము లే దోమదంబ"
అనియెఁ గవి వేంకటాధ్వరి అట్లెనేనుఁ
గూడ నో శాంకరీ ! తల్లి ! కొదవ లేదు. 1101

క. ఆతండు వైష్ణవుఁడు ల
క్ష్మీ తన్విగ నిన్నునమ్మి సేవించె గుణా
తీతవు నిన్నెటు గొల్చినఁ
జేతోమోదమ్ము గలుగఁ జేతువు తల్లీ! 1102

క. శంకరు నర్ధాంగి ! స్వయం
శంకరియని కవులు గడుఁ బ్రశంసింతురు ని
న్నోంకారాకారిణి ! మ
త్పంకమ్ముల డులిచిప్రోవఁ దగదే తల్లీ ! 1103

క. అతివృద్ధవయస్కుఁడ స
ప్తతిపై సప్తకము దాటుతటి యోపిక లే
దితికర్తవ్యము గన్పడ
దితరము త్వత్పద మనుగ్రహింపుము తల్లీ ! 1104

తే. గీ. ఎక్కుడు దొసంగులను జేసి యే నెఱుంగ
బొత్తిగాఁ జేయ లేదని బొంకఁ జాల
యౌవనారంభమునఁ గాశి కరిగి గంగ
నాడినాఁడ దొసంగు లే మైననున్న. 1105

తే. గీ. యౌవనంపు "హొటల్" విందు లారగించు
టొండుఁ గర్మ పరిభ్రష్టయోగమొండు
దక్క నితరపాతకముల దారిఁ బోయి
యెఱుఁగ నంచు వచింతు నీ యెదుటఁ దల్లి ! 1106

తే. గీ. శ్రద్ధగా సంధ్యవార్చక సాపడుటకు
నేను బశ్చాత్తపించెద నెడఁ దఁదలచు
న్యాయమున కేనియును నుపాధ్యాయుతోఁ బె
నంగుటకుఁ గూడఁ బొగులు మన్మనము తలచు. 1107

తే. గీ. తలచు విద్యావివాదముల్ తారసించెఁ
గాని సూన్నృతమును దప్పి యే నెఱుంగఁ
బనివడినవిన్నొ సాక్షిగాఁ బలుక నేర్తు
కలదు ధైర్యమ్ము నా కెంతొ కన్నతల్లి. 1108

క. పంచమహాపాతకముల
నెంచఁగ నన్నృతో క్తికన్న నించుక లొచ్చొ
నంచుఁ దలంచెదఁ బాతక
పంచక మిది లేనిబ్రిదుకు బ్రిమకం గలదే. 1109

తే. గీ. అన్నృతమునయందు నాకు బాల్యమ్మునుండి
వైర మంబరొ! యీ "వర్జ్యు" వార్ధకమున
నందుకే అట్టివాదమ్ము నందికొనియె
నిహాపరమ్ములు చెడు గదా యిక్కతమున. 1110

తే. గీ. ఆఱువేలనియోగి నన్నయ్యభట్ట
టంచు వాదించు "వర్జ్యు"కు నన్నృతమన్న
భయము గల దంచుఁ దల్లి! నీ స్వాంత మొప్పి
కొనువె యివ్వానితో వాదు కూడు ననుచు. 1111

ఆ. వె. కడలి యెల్లఁ గల్లుగా మాఱుటకుఁ గోరు
కొనెడు త్రాఁగుబోఁతు కొంత "వర్జ్యు"
కన్న మెఱుఁగు సర్వకవిమండలం బాత్మ
జాతిసాత్కరణము సల్పునెడల. 1112

క. నన్నయ నియోగి యగుచో
నెన్నికకుఁ దగినమేల్కవీశానుం డా

నన్నయ వైదికుఁ డగుచో
మన్ననకున్ దగఁడు "వఝ్ఝు"మహావీయునకున్. 1113

తే. గీ. నిన్న మొన్నఁటిదాఁక నన్నియకు వైది
కత్వ మున్నట్టు లెఱుఁగు లోకంబు భార
తఁపుఁబీఠిక వైదికత్వంబె వోడువు
"వఝ్ఝు" కొలఁగాని వ్రాఁత లెవ్వాఁడు నమ్ము. 1114

క. "కా దన్నవాఁడు కరణం"
బే దెసనేని తనపేరి కెసకమ్మును సం
పాదింప "వఝ్ఝు" యనృతపు
వాడము గావించు చుండుఁ బ్రాజ్ఞులు నవ్వన్. 1115

సీ. పద్యాలలో సీసపద్యమ్ము కడుఁబెద్ద
కవులలో నన్నయ కవియుఁబోలె
నట్టి సీస మ్మొక్క డాదిపర్వమ్మునఁ
దమ్ముగుఱించి యాతండు వ్రాసె
కాపె నం దమాత్యుఁడ ననలేదు "వఝ్ఝు" క
నృతభీతి లేనట్టి హేతువునకు
"మోకాలికిని బోడిబుఱ్ఱకు ముడి వెట్టి"
"అబ్రవీత్తు" పురాణ మల్లఁ దొడఁగె

తే. గీ. శంభుదాసుని వైష్ణవాచార్యుఁ జేసి
రామరాజభూషణుని నారాధ్యుఁ జేసి
కృష్ణరాయసుకవిని విప్రేంద్రుఁ జేసి
నన్నయ నియోగి యన్నచో నమ్మ జగము. 1116

తే. గీ. ఈతఁడే గాఁడు వేఱొకం డీదృశాభి
మానపూరితుఁ డున్నాఁడు కోనశర్మ
"డోలుకింతటి ప్రజ్ఞవాఁడు మఱి వీర
ణమ్మనకు నంతవాఁడు గానంబడండు." 1117

క. ఈ దురభిమానులకుఁ గల
వైదికవిద్వేష మమరవరులపయిని గ్ర
వ్యాదులకు వైతమును గన
రాదనిచెప్ప నగుఁ గడు భరంబగుకతనన్. 1118

తే. గీ. ఏవియొ కుయుక్తులం బన్నుచే సతమ్ము
వీరలకుఁ బని యెందుఁ గోవిదులు గారు
జ్ఞానలవదుర్విదగ్ధులు కోన, వర్ఝు
కులజలధిచంద్రులు కడు మలినమతులు. 1119

క. పనిలేనిపాటగా నీ
ఘనులు ననుం గదపి యోడి గర్తమ్మునఁ గూ
లినచరిత వ్రాయ నెంతే
నిని గ్రంథము పెరుఁగుఁగవులు నిజ మెఱిఁగినదే. 1120

క. హరినాగభూషణునిపై
దురితమ్మను బొలిపినట్టి ద్రోహమ్మనకున్
బరిభూతుఁ డయ్యెఁ "గోన" ప
వరింపఁగా నేల ? అల్ల "వర్ఝు" తెఱంగున్........ 1121

క్షరా:— ఈకందములోని, కోన, వర్ఝు, అను రెండుపేరులును ఇంటిపేర్లు. ఒకఁడు వెంకటరాయశర్మ, వేఱొకఁడు సూర్యనారాయణశర్మ. అని తెలివిడి.

తే. గీ. "వర్ఝు" తిరుపతివేంకటేశ్వరుల కబ్బ
ములకు మర్దనమును జేయఁ బూని గోతఁ
గూలె భారతపద్యమ్ముగూర్చి సూత్రి
మాత్రి మీ పొత్తమునఁ దెల్పి మానినాఁడ. 1122

క. ఈ యిరువురుశర్మలు కడు
మాయావులు మిగుల దురభిమాను లనృతవి

ద్యాయత్తులు వీరలకు
న్నాయెడనున్నట్టియీాసునకు మితి గలదే. 1123

తే. గీ. కారణ మ్మల గుంటూరివారు దెల్పు
సీమ యను పొత్తమే వేఱు చెప్ప నేల
అంబికను సాక్షిగాఁ జేసి యల్లినట్టి
సత్యచరితకుఁ జ్యోతి యెట్లు సంభవించు. 1124

క. అపు డా సీమనియోగులు
కృపణు లగుచు సలిపినయపకీర్తికరములో
చపలతలు వారిమదికే
త్రిప గలిగించెడిని సూన్రుతగతికి దవ్వో. 1125

క. "నవఖాళీ"లోఁ దురకలు
శివ! శివ! యీనాఁడు సలుపుచెట్టలకుం దీ
టవునవి,చెళపిళ్ళ యెటో
భవానికృపకతనఁ బ్రిబలి బయిటికి వచ్చెన్. 1126

తే. గీ. కఱకుతుఱకల వన నేలః కర్మపరులు
బ్రాహ్మణులు గాని యన్య వర్ణంబుగారు
వైదికులకు నియోగులు వైరు లగుచు
చేసినకుచేష్ట లవి విప్పి చెప్పఁ దరమె. 1127

క. గతము గతియించె నిప్పుడు
మతిమంతులు దాని నెల్ల మఱచిరి సున్నే
హితులుగ నుండిరి ఆయీ
ద్వితయమునకు మానదయ్యెఁ దెవు లుదరములో. 1128

క. ఉదరమునయందు నాటిన
పర్రిదళమువలె "సీమ" వీరి బాధించెడి, నే
నది వ్రాయుట కీద్రుశుల
సుదురాచారములె కతము సూరు లెఱుఁగరే? 1129

తే. గీ. జీవితచరిత్రితోపాటు శ్రీపదగురు
వుల యసూయయు నభివృద్ధిఁ బొందుచుండె
వారిశంకలు బొత్తిగా నీరసములు
"ఘస్తుఘారము" కుజ్జులు పరిహసింతుర్రి. 1130

తే. గీ. తెలుఁగులో లక్ష్యవిజ్ఞానకలన లేదు
సంస్కృతంబున శాస్త్రవిజ్ఞతయు లేదు
వార్రియువార్రిఁత సర్వము పొల్లు వాదమో "అ
ధాత్తు" వాదము మెచ్చఁగాఁ దగదె? గురుని. 1131

తే. గీ. తాము నూఱుసారులు వాడి దాని నొరుఁడు
వాడినంతన తప్పనువాఁడు తమరు
వాడితి రటన్న నేఁ బొరఁబడితి నను
మచ్చుకుండదు విల్చేడిమాట యకట. 1132

ఆ. వె. ఎదురుకొన్నఁ గోర్టు కేగెద నంచు నో
టీసు గురువుగారియీాసు సకల
మెల్ల రెఱిఁగినదియె యిందు లోఁగడఁ గొంత
తెల్పినాఁడ మరలఁ దెల్ప నేల? 1133

క. కవి విద్వత్కవి యగునెడ
బవరమ్మున కేగి బొందఁ బడఁ డటు కాదే
నవమతి తప్పదు శ్రీపా
దవారిమర్శనము దీనితత్త్వము దెలుపున్. 1134

క. కవి కెట్టిజ్ఞానముండిన
సువిమర్శకుఁ డగునో? లేనిచో నే మగునో?
యెవరో యెందుకు శ్రీపా
దవారిమర్శనము దెల్పుఁ దత్త్వజ్ఞులకున్. 1135

క. కవి గణములు గూరిచి యగు
నవునె? విమర్శకుఁడు: దీని కన్యంబెదియో?

శివుఁ డీవలయున్ శ్రీపా
దవారిమర్శనము దీనితత్త్వము దెలుపున్. 1136

క. కవికన్న విమర్శకునకు
సువివేకం బధిక మున్న శోభించును వా
నివిమర్శంబిది శ్రీపా
దవారిమర్శనము దెల్పుఁ దత్త్వజ్ఞులకున్. 1137

క. వివిధపరిజ్ఞాఖనియగు
కవివరునివిమర్శనంబు గణ్యము తక్కుం
గవులది కాదని శ్రీపా
దవారిమర్శనము దెలుపుఁ దనకుం దానై. 1138

క. శివుఁ డిచ్చినతమదీర్ఘా
యువునకు సార్థక్య మెట్టిదో? యెఱుఁగరు ర
డ్డీవశు లటంచుఁ శ్రీపా
దవారిమర్శనము దెల్పుఁ దత్త్వజ్ఞులకున్. 1139

క. ఎవ రెంత పెట్టి పుట్టిరొ
కవితారాజ్య మున నంతె కలిగెడి యశమం
చు వచించున్ బోరి శ్రీపా
దవారిమర్శనములోనితందరపలుకుల్. 1140

వ. మఱియు నిప్పటి కాంగ్రెస్సుపరిభుత్వవికారములంగూర్చి నాకుం దోఁచినయంశములు కొన్ని సూత్రీకరింతు.

క. మంత్రిపరికాశము సేయుస్వ
తంత్రిమ్ములు గొన్ని మిగుల దారుణములు కో
పింతురి బుధజనులు. కవులు శ
పింతురి వృథా చెడు నితండు వృద్ధికి దవ్వై. 1142

క. ఏరాజ్యమునందు జమీం
దారు లనియు రైతు లని, యుదారు లసారుల్

ధీరులు మోఱకు లుండీ్రి
వారన్ వారింప నెవరివశ మగు నవనిన్. 1143

క. భేదం బయ్యది సృష్టిన
నాదిగఁ గన్పట్టుచుండె నది భువిలో నే
కోదరులకె కల దన,భి
న్నోదరులఁ ద్యజించు నన్న నొప్పుట యెట్టుల్. 1144

తే. గీ. ఎల్లవారును బల్లకీ నెక్కుటయును
నెల్లవారును మోయుట సృష్టి నింత
వఱ కెఱింగినవారలు ధరణి లేరు
టంగుటూరిలోఁ బుట్టి పెరింగి రాకొ్కా? 1145

క. గతజనిలోఁ జేసినదు
ష్కృతమును సుకృతంబుఁ దక్క నితరంబు దరి
ద్రితకున్ శ్రీమత్తకుఁ దాఁ
గత మని ప్రాజ్ఞుండు వలుకఁగా శక్తుండే. 1146

ఆ. వె. కూలివానిచేతికొడవలి రైతుకు
రైతుచేతిహలము భూతధాత్రి
పతికి నిచ్చినంత వారు వీ రగుదురే?
కర్మ మంతనే పొకాలి చనునె. 1147

తే. గీ. కర్మవాదంబు గహనమౌఁ గాక అంత
కన్న వేఱొక్కమార్గంబు గానఁబడదు
నాఒస్తికులు దక్క దీనికి నన్యులందు
నొప్పకుండెడివార లీ యుర్వి లేరు. 1148

ఉ. త్రాగుఁడు మానిపించుట విధాతకు శక్యము గా దహో! మహా
భాగులు లేకయే జగతిఁ బాయక పానము నిల్చెనే; యితం
డాఁగఁ దలంచె నయ్యది తదర్థము పన్నులు కొన్ని పెంచి; కో
ష్ఠేగతి నష్టి పూడ్చుఁ గలఁ డెంద అనాగసులన్ గలంచునో? 1149

ఉ. త్రాఁగుడు కారణ మ్మగుచు ద్రవ్యము కోటులు కొన్ని వచ్చు,తేం
ట్లేగతి మిన్నకుండెద ర దెట్టులొ శిష్టులనెత్తి రుద్ది దరి
ద్ర్యాగతి చూపఁగావలయు నాలను జంపుట, చెప్పు లిచ్చు టీ
త్యాగము మెచ్చువారలును ధారుణిలోఁ గల రెంద తెందరో. 1150

ఆ. వె. పందు లేమి తినునొ? పందులమాంసమ్ము
దినునభాగ్యు లైనదీనజనుల
మానిపించు నితఁడు మద్యమ్ము త్రాగుట
యితఁడు స్వర్గ మేగ కెవ్వఁ డేగు! 1151

ఆ. వె. త్రాఁగుఁబోతు లిచ్చుదర్వ్యమ్ము కోటులు
శిష్టులయినవారు చెల్లఁజేయ
వలయు ననుటకన్నఁ బాతకం బుండునే?
మంచిమంత్రి దొరకె మనకు నేఁడు. 1152

క. ఎవ రెవ్వరు పూజ్యులొ మును
పవనిన్ వా రిపుడు దండ్యు లవుదు రనుచుఁజె
ప్పవలెనె? వేఱుగ నకటా!
శివ!శివ!కాంగ్రెస్సుపేరు చెప్పఁగ భయ మౌ. 1153

తే. గీ. నల్లమందును మద్యపానంబె యంట!
రోగు లా మందు వాడుచు రోజునెట్టు
టీపయిని సాఁగ దఁట! శివా! యెంతమంచి
మంత్రి నిచ్చితి మాకు నమస్సు నీకు. 1154

క. "గతకాలము మే"లని భా
రతమున నన్నయ్య చెప్పెఁ బ్రత్యక్షము చే
సితి వయ్య నీవు దేవా!
శితికంఠా! మంచిమంత్రి చేకుతెమాకున్. 1155

తే. గీ. నల్లమందు సిందూరమ్ము నలిపి చంటి
పిల్లలకు వాడుచుందురు తల్లు లింక

నదియు నొకపెద్దనేరమై యధికృతులస
మక్షమున కేగఁ జేయు నో మంత్రిగారు. 1156

ఆ. వె. నల్లమం దొకండుఁ దెల్లనిమం దొండుఁ
గాక మందు లంచుఁ గలవె ? బీద
జనుల కివియ కావె ? సంజీవు లిప్డును
మునుపు చెప్ప నేల ఘను లెఱుఁగరె. 1157

తే. గీ. మంచియుద్దేశ మున్నట్టిమంత్రి యయ్యు
కష్టసుఖము లెఱుంగనికారణమున
గల్లుపంక్తిని జేరిచి నల్లమందు
వృద్ధులకు సంకటము దెచ్చిపెట్టినాఁడు. 1158

ఉ. చాకలివానిగాడిద ద్విజన్మునిగర్భిణిచేతఁ దాడితం
బౌకత "కేసు" కేగినపు డయ్యధికారి వచించినట్టితీ
ర్పే కడు యుక్తియుక్త మనిపించుఁ బ్రికాశముమంత్రిగారిప్ర
జ్ఞాకుశలత్వమున్ గవులు గాంచి విమర్శకుఁ దెత్తురేనియున్. 1159

తే. గీ. మాలఁ డొకమంత్రి మాదిగమంత్రి యొకఁడు
పాకివాఁ డింకనొకమంత్రి భరతఖండ
మెపుడు పుట్టినదో ? యిట్టి యెబ్బెఱికము
కని విని యెఱుంగి మిప్పుడు గంటి మకట ! 1160

ఆ. వె. మాలమంత్రికన్న మాదిగమంతిరి
కన్న నగ్రిజాతి యెన్నిరెట్లొ
హేయమైనపనులు చేయుచు నుంటచే
వారిమంత్రితనమె వరమ టందు. 1161

క. చండాలురు లోకములో
రెండు తెఱఁగు లం దొకండు క్రియలకతన వే
ఱొండో జనికతమున నని
పండితనమ్యంబు భాగవతము వచించున్. 1162

ఆ. వె. తనకు గొప్పపదవి తారసించునుగాక
చేయలేఁడు మాల చెడ్డపనులు
బ్రాహ్మణుండొనర్చు బడవాపనుల కంతుఁ
బొంతు గూడ నుండఁబోదు నిజము. 1163

తే. గీ. స్వర్ణకారులకరణికాల్ పాప మనక
కొలమువారల కిడె మున్ను గోపమంత్రి
ప్రభువునకుఁ బంపవలసినద్రవ్య మెల్ల
రామునకు నర్పణముఁ జేసె రామదాసు. 1164

తే. గీ. జాత్యహంభావమొక్కండు సాయపడెడి
కతనఁ బాఱుండు జంకఁడు కానిపనికి
పాప మబ్బినఁ గలదుగా ? ప్రాచితంబు
ముక్కు మూసుక జపియించు మూలమనువు. 1165

క. పంచమహాపాతకపుర
మంచును నట జేనితీర్పులంచున్ గవి చి
త్రించెన్ గాంగ్రెస్సందు కొ
కించుక భేదించ కిప్పు డేలదొడంగెన్. 1166

క. కాలజ్ఞులు మౌనులు చెడు
కాలము సూచించినారు గ్రంథములన్ దు
శ్శీలురు మంత్రులు వారికి
వాలాయము దోడుపడిరి వాస్తవ మింతే. 1167

తే. గీ. హెచ్చుతగ్గులు లేకుండ నెల్ల రొక్క
ఫక్కి సుఖియించుగతి పరిపాలనంబు
నడుపువా రఁట ? యేరికి నవ్వుపుట్ట
కుండుఁ గాంగ్రెస్సు మంత్రుల యూహ లరయ. 1168

క. పరదేశీయులు నృపులై
పరిపాలించునపు డిన్ని పన్నులు లేన

ల్లిరయఁగ నయ్యెడి వీరల
దొరతనమున్ గాంచుకొలఁది దుఃఖము వాడమున్. 1169

తే. గీ. మొదట నాపాతరమణీయముగ నగుపడు
మద్యపాననిషేధమ్ము మరల దాని
వలనినష్టిని బూడ్చెడిపై ఖరి గన
విది వృథాసాధుబాధగా నెదకుఁ దట్టు. 1170

క. పన్నఁట ? ఆపై నింకొక
పన్నఁట ! ఆమీఁద నొక్కపన్నఁట ? ఆపైఁ
బన్నఁట పైఁ బన్నఁటఁబైఁ
బన్నఁట ? కాంగ్రెస్ప్రభుత్వపై ఖరి ఖరిరే ? 1171

చ. ఎఱుఁగుదు రీరు గూడఁ బరమేశ్వరసృష్టి సమస్తమున్ భిదా
కర మని ! కొంద ఱుంద్రు ధనికప్రవరుల్ మఱికొందఱో ? నిరం
తరము దరిద్రు లౌదు రిది తథ్యము ప్రాగ్భవహేతుకంబు నే
ర్పఱితన మెంత యున్న నిట వ్యర్థము కర్మము మీకు ఱంకునే. 1172

ఆ. వె. ఈరు మంత్రు లగుట యేను గవీంద్రుఁడ
నౌట కూడ కర్మ మని యెఱుఁగుఁడు
బొందఁ గూలుపనులు పున్నెమునకుఁ గావు
నరక మిచ్చితీరు నమ్ముఁ డీరు. 1173

సీ. "ఏడువఁ గల్గిన నెగసాయ" మనియెడి
పలు కీరు వినలేదె ? ప్రాజ్ఞులార !
అట్టిరయితు భూమి కధికారిగాఁ జేసి
అసలువారలహక్కు నంతరింపఁ
జేయు మీదు కుచేష్ట చిత్తముండిన కవి
యెవఁడు మెచ్చు నెవల నేమి యైన
నాగలిదున్నుచే నా హక్కునకు గుర్తు
వృషభంబు వానికి హెచ్చు గాదె ?

తే. గీ. నోరు దానికి నుండిన మేర మీఱి
కొమ్ములను రైతులను గ్రుమ్మి కూలఁ ద్రోచి
భూమిఖామందు నేను బో పొమ్ము నీవ
టంచుఁ గలహించుటకు సందియంబు కలదె: 1174

తే. గీ. వంటబ్రాహ్మణుఁడును రైతువంటివాఁడె
వంటకము సర్వమును నిచ్చ వచ్చినట్లు
తాను దనతోయమును దిని తక్కుమిగులు
నట్టియుచ్ఛిష్టమునుజేని కవల నిడునె: 1175

క. ఎలుకలపైఁ బిల్లులఁ బి
ల్లులపై నెలుకలను బెట్టి లోకులలోనన్
గలహములు పెంచుటే నా?
ఫల మని ప్రశ్నింతు మంత్రివరులార మిమున్. 1176

క. రైతుల కెగఁబెట్టుటలోఁ
జాతుర్యము మెండు మీరు సాయపడిన భూ
నేతలపాట్లకుఁ బార మ
తీత మ్మద్దాని నెఱుఁగు దేవుండె యిఁకన్. 1177

క. రైతులు భూనేతలపై
రైతులపైఁ గూలివాండ్రు రాచరికమ్మున్
జేతురు సర్వులపై నెనుఁ
బోతులరాచఱిక మదరు భూమికిఁ దొడవై. 1178

క. పుడమి అసారం బై కడుఁ
జెడుఁ దగునోషధులు లేక;సిరి నడరుచునీ
చుఁడు ఘనుఁ డగు నని కవి యె
వ్వఁడొ మునుపే కాలరీతి వ్యాఖ్యానించెన్. 1179

ఉ. దానికిఁ దగ్గవారలె ప్రధానులు తారస మైరి,వీరు వి
జ్ఞానులు కాకపోయినను జ్ఞానవిహీనులు కారు ప్రాచ్యవి

జ్ఞానమునందు పీరలకు గౌరవభావము నాస్తి ఆంగ్లవి
జ్ఞానము రెంటికిం జెఱచుకశ్మలమార్గము దొ్రక్కఁ జేసెడిన్. 1180

ఉ. ఎన్నివిధమ్ములం గనిన నింతట ధాత్రికి మంచికాల మా
సన్నముగాఁ గనంబడదు సంస్కరణమ్ములపేర మంత్రు రే
పన్నులొ నెత్తి రుద్దుచు విపన్నులఁ జేతురు లోకులన్, బుధుల్
దున్నుట నేర్చికోవలయు దోర్బల మున్నసె చెల్లు మాన్యముల్. 1181

తే. గీ. భరతనాట్యంబు పూర్వము పనికిరాదు
గేహినికి, నేఁడు కొఱగాదు మోహిని కని
"బి ల్లాకటి"ప్యాసుఁ జేసి రీ బిల్లు గేస్తు
రాండ్రకొంపల కగ్నిహోత్రంబ కాదె. 1182

ఆ. వె. ప్రతిగృహస్థునింటఁ బల్లెలలోఁ గూడ
నిపుడు నాట్యవిద్యయే కనుపడు
వేశ్యలకు నిషిద్ధవిషయంబు సంసారి
బాలికలకు నెట్లు పనికివచ్చు. 1183

క. ఒకయెకరమునకు వెల వే
లకువేలిడి కొన్నభూమి రయితువశముగా
నకటా? తోడ్పడియెడి బి
ల్లుకు నే గే స్త్రొప్పుకొనెడి లోకములోనన్. 1184

తే. గీ. రయితు లోకసంరక్షణార్థమయి భూమి
దున్నుచున్నాఁడె? పొట్టకై దున్నుచుండెఁ
గాన నితరులసొత్తు నవ్వానినెత్తిఁ
బెట్టి యూరేగఁ జేయుట చెట్టసేఁత. 1185

క. "కూలికి వచ్చి యెవండో
పాలికి మాటాడె,నను టబద్ధము గా దీ
పాలనమునందు జేఁడులు
కూలీలే పాలి కొప్పికొందురె; వారల్. 1186

ఉ. నాయకశూన్య మైన,బహునాయక మైనను నంతె కాదు స్త్రీ
నాయక మైన, బాలకులు నాయకు లైనను బిచ్చిమానిసుల్
నాయకు లైనఁ గార్య మది నష్టికి భాజన మౌ నటండ్రు వి
జ్ఞాను; లనేకనాయకమ కా మనకాంగ్రెసుకర్జ మన్నిటన్. 1187

మ. కలగం ద్రొక్కుచు నున్నవారు జగతిన్ "కాంగ్రెస్" ప్రభుత్వంపువా
రలు, రైతున్ మఱి కూలివాఁడు ప్రజలన్ రక్షింపఁగాఁ బుట్టి నా
రలు తక్కుంగలవార లీ యిలకు భారం బంచు వాదింతురి వీ
రలు, మంత్రిత్వము వీరి దిప్పుడు ధరన్ రక్షింతురో? భక్షింతురో?

తే. గీ. పృధివి పుట్టినయది మొద లింతదనుక
నిట్టి సిద్ధాంత మెపు డుదయింప లేదు
మంచికో చెడ్డకో పుట్టెఁ గాంచఁ గలరు
ప్రజలు దీనిపరిణతిని బాగు బాగు. 1189

మ. తరణోపాయము గాంచి భూసురులకున్ దాతృత్వపర్యాప్త లి
చ్చిరి ఱేఁడుల్ మును పగ్రహారములు స్వశ్రీ చెన్నుమీఱంగ నీ
దురితాత్ముల్ పరలోకభీతికిఁ గడున్ దూరస్థులై హంత ! ము
ష్కరులై రైతుల కిచ్చిపుచ్చెద రిదే, సత్సంప్రదాయార్థమో ? 1190

శా. వచ్చుంగాక స్వరాజ్యభాగ్య మధవా స్వారాజ్యమో ! పూజ్యుల
న్నిచ్చల్ పీడితులం బొనర్చుటయె కానీ అన్యథా "కాంగిరె"
స్సిచ్చన్ గొల్వ దపూజ్యపూజకతయే యిద్దానిసిద్ధాంత మిం
దుచ్చైస్థానము లెల్ల నీచులవియై యుండు న్నిరాఘాటమై. 1191

తే. గీ. "ఐనవారల కాకులు కానివాండ్ర
కెలమిఁ గంచమ్ములుగ రాజ్య మేలుపట్ల
నొకటి తిన్నగ నుండునే? సకల మెట్టు
లుండవలె నట్టులే యుండు నొండు కాదవె ? 1192

ఉ. మాలను "నీవు మాల" వనుమాత్రన కేసగునట్టిపాడుచం
డాలపుఠూలుసున్ గడు హుటాహుటి ప్యానొనరించునట్టిమూ

ర్ఖాళి యమాత్యులై సలుపునట్టియకృత్యము లాలకింప ధీ
శాలికి నెంతయేనియు నసహ్యత గల్గెడి నేమి చేసెడిన్. 1193

క. మాలలు మాదిగలును దే
వాలయములు మాకు వలయు నని కోరిరె; దు
శ్శీలురు విధియు నిషేధముఁ
బాలింపమి నిట్టి పాడుపని చేసి రొగిన్. 1194

క. గుడిలో నున్నది ఱాయని
యెడి నిశ్చయ మొక్క టెవని కేర్పడు వాఁ డ
య్యెడ నేమి సేయుటకు జం
కఁడు మాలలఁ జొన్పు టొక్క ఘనకార్యంబే? 1195

క. విడియాకులచట్ట మ్మొ
క్కఁడు స్త్రీలకుఁ బెట్టినారు కొంగ్రెసుమంత్రుల్
చెడు గదియని నే నెఱిగియుఁ
గడుంగడున్ మెచ్చుచుంటిఁ గలుషితమతినై. 1196

మ. ఒకచండాలుఁడు వానిసాధ్వియును నా యుల్లమ్ములోఁ జొచ్చి పా
యక యీరీతికిఁ బ్రోత్సహించెదరు పూర్వాచారముల్ నాకు న
చ్చక కా దయ్యవి నాదునెమ్మదికి నిచ్చల్ నచ్చియున్ దుష్టభ
ర్తృకలౌ స్త్రీలయివస్థ చూచి యిటు మాఱె న్నా మనోభావముల్. 1197

తే. గీ. దుష్టభర్తృకకంటెను నష్టభర్తృ
కనె తలంతును నేను భాగ్యవతి గాఁగ
స్వానుభవముకతమ్మునఁ బలుకువాఁడఁ
బాపమబ్బిన నరకానఁ బడుదుఁగాక. 1198

ఉ. వ్రాసెఁ దెనాలిసత్కవి యపాత్రు నొకానొకనిం గుఱించి; దు
శ్శాసనుఁడైన యయ్యధము సాధ్వినిగూర్చియు; వానికన్నదు
శ్శాసను నే నెఱుంగుదును జాల్మఁడు వీనికి వాఁడు దీటె? యే
వ్రాసి యభాగ్యదుష్టగుణరాశి, మదీయసుతాహృదీశియున్. 1199

ఉ. ఏ నొకలేమ నొచు జనియించితి నేనియు వీనిభార్యనై
వీనిసమక్షమందుననె వేవుగ వల్వదటన్న ముండనం
బూనుదు నప్డు గాని మదినుండిన వేడిమి చల్లఁబాఱ దే
గానికిమాఱనట్టిఁడును గాంతపయి న్నెఱుపున్ బ్రభుత్వమున్. 1200

తే. గీ. భర్తిఁ జూపినకొలఁదిని భార్యమీఁదఁ
గారములు మిరియములును నూఱుజాల్మ
లుంద్రు గాక యవ్వారల నురక వదల
రాదు శిక్షింపవలయును రాజు లరసి. 1201

ఆ. వె. ఇట్టి బిల్లొకండు వెట్టక ''విడియాకు
లంచుఁ బెట్టుచుండి రది యనేక
భర్తృకత్వరూపపాతకమ్మన కవ
కాశ మిచ్చు దొసఁగు గాంచ వలదె? 1202

చ. ఎవనికతాన బుద్ధి చెడి యియ్యది నే లిఖియించుచుంటి నా
చవటనుబోలు జాల్మఁడు స్వశాఖనె కాదు మతెందు లేఁడు వే
దవిహితమౌ హవిస్సును వృథాశునకాస్యమునందు వైచితిన్
గవి నయి మంచిచెడ్డ లెఱుఁగం గలవాఁడను గూడనై కటా? 1203

ఉ. వీనిపరివర్తనంగుఱిచి విందులు నాకు లిఖింతు రే నెటుల్
వీనికి బుద్ధి జెప్పఁ గల, ''భేరిని నిద్దురఁ బుచ్చుకర్జ మె
వ్వానికి నచ్చు? నాయెడల వారికి గౌరవ మంత యున్నచోఁ
బ్రాణముజోలి కేగ వల దంచును నే నలవారి వేడెదన్. 1204

తే. గీ. అనపరాధి నొకానొకయగ్రిజన్ముఁ
గొట్టెఁ జెప్పున నొకశూద్రికులజుఁ డంచు
వింటి నినమొన్న నాతఁ డీవిఱుగుబాటు
శుంఠకున్ బుద్ధిఁ జెప్పట సూరిహితము. 1205

ఉ. ఎంగిలిగంజిదాగ్రివుటకు నేవ మెఱుంగనివీని కొక్క శూ
ద్రుం గనఁజేసె జాతకము; రోజును రోజును వాఁడు గ్రోలుకా

ఫిం గొని క్రోలు "సిగెర్టులు" పీల్చు నిదే యొకరాజయోగ మం
చుం గయి పెక్కు చెప్పుకొను శుంఠకు సేవము గోచరించునే. 1206

క. ఆ మిత్రుని కొకమాలెత
కాముకురా లింటియాలుగా నేర్పడె వీఁ
డేమో వేదవిదునకున్
దా మనుమఁడు దైవసృజన తప్పునె యొందున్. 1207

తే. గీ. వాఁడుమెక్కినదేనియు వీఁడు మెక్కు
వాఁడుగట్టినదేనియు వీఁడు గట్టు
వేఁడు త్రొక్కినదేనియు వీఁడు ద్రొక్కు
వారిఁత యిట్టిఁడు నాకు జామాత యౌట. 1208

శా. పాతివ్రత్యముకన్న నుత్తమతపఃపారిగ్భ్యరము ల్లేవు స్త్రీ
జాతిం చూతముఁ జేయ నీ వ్రతము సృష్టం బయ్యె నస్మత్తనూ
జాతన్ మెచ్చెదఁ గాని అల్లునికుచేష్టల్ నాదుచిత్తానకున్
రోతం గొల్పెడి నక్కతమ్మున నిటుల్ క్రోధమ్ము రేకెత్తెడిన్. 1209

ఉ. ఏగుణమేని సుంత గలదేనియు హీనునినైతమున్ మహా
భాగునిగాఁ బతివ్రతము పట్టి సతుల్ యజియింపవచ్చునే
లా గకటా! సమస్త మవలక్షణశీలమె యైనపాపికిన్
లోఁగి చరించు టట్టిచపలున్ ద్యజియించుటె లగ్గు సాధ్వికిన్. 1210

క. త్యజియించి వేతొకపతిన్
భజియింపక బ్రహ్మచర్యవర్తనమున ని
ర్వృజినయయి యోగినిన్‌బలె
నిజాయతి వ్యయించుమానినికి దివ మబ్బున్. 1211

క. పాపియగుభర్తతోడం
గాపుర మొనరించుసతి కఘము దుర్వారం
బాపద్ధర్మము సతి కా
పాపిన్ ద్యజియించి శివు నుపాసించుటయే. 1112

క. పంచమహాపాతకుల గ
ణించెడిసందర్భమున మనీషు లిటే యో
జించిరి పంచము దుర్భగు
నంచితుఁ గావించుసతియు నట్లగుఁ గాదే. 1213

క. వాశ్రియరుగా కీగతి సదు
పాయము మునివరులు సతికిఁ బాతివ్రత్యం
బే యించుకయును జెడ ద
న్యాయము దుర్భగునితోడ నవయఁగ నేలా ? 1214

క. కొట్టినఁ గొట్టక తిట్టినఁ
దిట్టక కొన్నాళ్ల సైచి దేవుఁడు తన్నుం
బట్టఁడు తప్పని సతిగ
న్పెట్టి త్యజించి చను టొప్పు నృపశున్ భర్తన్. 1215

తే. గీ. ఎపుడు దుశ్శీలునకు ఘటియించుభార్య
సద్గుణోపేత; వాఁ డెంత చండశాస
నుం డయినఁ గాని వానికి నొండు చెప్ప
కడుగులకు మడుగుల నొత్తు నడఁగిమడఁగి. 1216

తే. గీ. పనికిమాలినవానికి భార్య మంచి
దలఘునకుఁ జెడ్డదియుఁ గాఁగ నజుఁడు గూర్చు
నతఁడు మూర్ఖుండు గాఁడు పండితుఁడు వేద
శాస్త్రముల కెల్ల నతనియాస్యంబు గృహము. 1217

ఉ. వేదము నేర్చి వంశము పవిత్రము చేయు నటంచుఁ జాల నా
హ్లాదము జెందితిన్, దుదకు లక్షణ మిప్పుడు మ్లేచ్ఛవేషభా
షాదృతి కగ్గమై యెదియు నంటక రెంటికిఁ జెడ్డరేవణై
భూదివిజుల్ హసించుటకుఁ బూర్తిగ నాకర మయ్యె నద్దిరే ? 1218

ఆ. వె. "అయ్యవారిఁ జేయ నారంభ మొనరింపఁ
దుదకుఁ గోతిసొబగు తోఁచె నన్న

బుధులనుడి కితండు పూర్తిగా లక్ష్యమై
నన్ను లోక మెల్ల నవ్వఁ జేసె. 1219

ఆ. వె. అక్షరమ్ములేని ఆంగ్లభాషను రావు
"సారుసా" రటంచు సారెసారె
నెవరినేని బిల్చు నీతండు, మది నప్డు
నాకుఁ బట్టరానినవ్వు పుట్టు. 1220

తే. గీ. తాతముత్తాత లెల్ల వేదమున ఘనులు
పెద్దతండ్రియుఁ బినతండ్రి కొద్దిగొప్ప
తండ్రియును గులవిద్యలోఁ దద్జ్ఞు లంతొ
యింతొ తన కందులో స్వల్పమేని వచ్చు. 1221

తే. గీ. స్వరము మంచిది స్మార్తమ్ముఁ జక్కఁ జెప్పి
కొన్న "బ్రహ్మరథమ్మనఁ" దన్ను గౌర
వింతు రిక్కాలమున, వట్టివేష మేమి
యుపకరించు హాస్యాస్పద మపకరించు. 1222

ఆ. వె. సైకి లెక్కవచ్చు "సర్కిల్" పగిది "డ్రెస్సు
వేయ వచ్చు" రెట్లు పీల్చ వచ్చు
"టీ" యుఁ "గాపి" గడెకు వేయిసార్లేనియుఁ
దాగ్రి వచ్చు బాస రాదుగాక. 1223

తే. గీ. డొక్కశుద్ధికి నింగిలీ షొక్కయక్క
రమును రాదయ్యె యూనిఫారంపుడ్రెస్సు
తోడఁ బ్రత్యక్ష మైన నెవ్వాఁడు గాని
నోటితోఁ నవ్వననుచు నేను మది నెంచ. 1224

చ. ఒకని ననం బనేమి యిపు డుర్వి సమస్తము మాటె నింగిలీ
షుకుఁ దన కించుకేనియును జుట్టుటికం బగుపట్టకున్న వై
దికునకు నట్టివేషము పదింబది నవ్వులచే టటంచుఁ దోఁ
చుకతన నింతగా వగతు సూరు లెటుల్ తలపోతురో ననున్. 1225

తే. గీ. చాలఁ గాలమ్మునుండియు ఛాందసంపు
రక్తమునఁ బూతమైనవస్త్రములు వొలుచు
వంగడం బగుకతమున బ్రహ్మతేజ
మగుపడెడి నిప్పటికిఁ గూడ మొగమునందు. 1226

ఆ. వె "కాలు వట్టి లాగఁగాఁ జూరు వట్టుక
వ్రేలు" నుడిని దెల్పు వేదవిదుల
వంగడములుగొన్ని వఱలు నిప్పటికిఁ గాం
గ్రెస్సు వానిఁ గూడ గెంటివేయు. 1227

క. మాలనికి నొక్కవిప్రుఁడు
సాలంకారముగఁ గూఁతు నర్పించుటకై
చాలఁ గుతూహల మందుచు
వాలాయము నుంటఁ గంటిఁ బత్రికలందున్. 1228

తే. గీ. తెల్లదొరలనుపొమ్మని నల్లదొరలఁ
బాలనమ్మున నిల్ప నివ్వారు పెంచు
పన్నులకు నంతుపొంతు గన్పడుట లేదు
ముల్లు పుచ్చి కొఱ్ఱుడచిన ముచ్చటయ్యె. 1229

తే. గీ. కొనిన నొకపన్ను పయి నమ్మకొనినఁ బన్ను
తినినఁ బన్ను తేన్చినఁ బన్ను కనినఁ బన్ను
కనక గొడ్డుపోయినఁ బన్ను "కాంగిరెస్సు"
ప్రజల సుఖపెట్టువాసన బయటఁ బడియె. 1230

తే. గీ. "అంకుమగఁడు వీఁపుకును నల్పఁ" డది నిజమె
యింటిమగఁడును నట్టివాఁడే యగునెడ
నేమిసేయంగవలయు నాయీప్రభుత్వ
చర్య సర్వథాశోచ్య మాశ్చర్య మకట? 1231

క. చెఱచిరిగరితల, నిసువులఁ
గఱకున్ గత్తులకుఁ బాలు గావించిరి యే

తురకలు వారల మైత్రికిఁ
బోరిఁబోరి యత్నించు గాంధిముని నట్రుండై. 1232

తే. గీ. రామనామంబు తనదుప్రార్థనమునందు
నెపుడు ప్రారంభ మగు నప్పు డెల్ల తురక
లవలి కేగుచు నున్నవా రనుచుఁ బత్రి
కలు వచించెడి వారిసఖ్య మిట్లఁ కెట్లు. 1233

తే. గీ. మంచిదో చెడ్డదో వారిమతము సర్వ
లోకమునకు మాటగా నిల్చియుండు రెండు
వారలకు హిందువులమీఁద వైర మిపుడ
పుట్టెనే ? పుట్టువుకుమున్నె పుట్టు వందె. 1234

తే. గీ. అందులో గోవు లనిన బ్రాహ్మణు లటన్న
బుఱిటిలోనున్న నిసువును విఱుచుక తిను
గాంధిజీ సర్వసముఁ డగుఁగాక వారు
విశ్వసింతురె ? మొఱకులు వెఱ్ఱి గాని. 1235

ఆ. వె. ఎపుడు తురకలకును హిందువులకు సఖ్య
మేరుపడునొ ? నాఁడె యినుఁడు పశ్చి
మమున నుదయ మందు మగవాండ్రుకడుపుతో
నుండి పుఱుడువోసికొందు రెలమి. 1236

ఆ. వె. ఎపుడు తురకలకును హిందువులకు మైత్రి
కుదురుపడునొ నాఁటఁగోలె గొడ్డు
బోతుముసలియాండ్రు పుఱిటియాం డ్రయి నిసుం
గులను గండ్రు పూలుమొలుచు మింట. 1237

ఆ. వె. ఎపుడు తురకలకును హిందువులకుమైత్రి
పొసఁగు నాఁటనుండి పుట్టుఁ జెవుల
పిల్లిజాతికెల్లఁ బెదపెద్దకొమ్ములు
కలియుగమ్ము మంచిగా రహించు. 1238

ఆ వె. ఎపుడు కూలివాఁడె యీ లోకము సమస్త
మేలువాఁ డటన్న యెఱుక వొడమె
నపుడె బాగుపడియె నఖిలప్రపంచమ్ము
పాలికాపు ప్రభువు ప్రభువు లెంక. 1239

ఆ. వె. గతము మేలు వచ్చు కాలమ్ముకన్న నం
చనియె నెపుడొ నన్నయాఖ్యసుకవి
అతని మెచ్చవలయు నాతని బూజింప
వలయు నతని మ్రొక్కవలయు జగము. 1240

క. జ్వర మది జీర్ణించినగతిఁ
దురకలు పాదుకొని రిందుఁ దొల్లిటివిభుతా
స్ఫురణము వోయియు నిప్పుడు
తఱి యగుటన్ విక్రమింపఁ దలఁచిరి పెలుచన్. 1241

తే. గీ. వారుకోరిన దిచ్చిన వారు దాని
తోడ సంతుష్టి పడ, రేదొ ద్రోహమునకు
యత్నపడియెద రీకున్న నల్లరులు పొ
నర్చుచుందు రవ్వారు వినయముగలరె ? 1242

క. ఏదో దురూహ వారికి
లేదని వాదింప రా, దళీకము గా దీ
వాదము పూర్వము వారిని
భూదేవి యనుగ్రహించెఁ బోలు పెసలారన్. 1243

క. మనకన్నన్ దగ్గఱ జ్ఞా
తినికాయము తురక లనుట తెల్లమ యవ్వా
రిని పీడి అంగిలేయుల
ధన మయ్యెన్ భారతమ్ము తనకున్ దానై. 1244

ఆ. వె. బాహుబలము గల్గువార లయ్యును దురు
ష్కులకు రాజనీతి కొదవ యగుట

వారు లోఁగినారు వీ రేకుమేకుగా
బరిణమించి తుదకుఁ బ్రభువులైరి. 1245

ఉ. భారతరాజ్యలక్ష్మి తనబందుగులన్ సుకులీనగౌరవో
దారుల రాజపుత్త్రులను దాఁ ద్యజియించి స్వయంవరమ్ముఁగా
గ్రూరుల మ్లేచ్ఛులన్ వలచెఁ గొండొకకాలము వారితోడ సం
సారము చేసి యంటువడి సాహెబులన్ దలఁ దన్ని పిమ్మటన్. 1246

ఉ. పౌరుషమందుఁ గాని భగవంతునియందునఁ గాని లేశమున్
గౌరవమున్ గణింపక ధనమ్ము గడించుట యొక్కటే మహో
దారతగాఁ దలంచెడిసితాస్యులకౌఁగిళులందుఁ జేరి చె
న్నారె ననేకనూతనపుటాటలఁ బాటలఁ గ్రొత్తబాటలన్. 1247

క. దూరశ్రవణమ్ములు మఱి
దూరపుసందర్శనములు దుస్సాధములున్
జారుతరమ్ములు నగు పలు
గారడిపోకలును వారికతన నెఱింగెన్. 1248

ఉ. ఎక్కె విమానముల్ కనియె నేడుసముద్రము లొక్కయంగఁగాఁ
ద్రొక్కెను ద్వీపముల్ ఘననదుల్ సుతరంబు లొనర్చె నెన్నియో
పక్కణముల్ సిటిల్ గులుగుపట్టణముల్ ఘొనరించె ఱేఁడులన్
మ్రొక్కఁగఁ జేసి శోభిలె నమోనమ యంచును నాంగ్లజాతికిన్.

క. దేవుఁడు లేఁ డనిపించెను
"దేవత లాంగ్లేయు లను మతిన్ గలిగించెఁ
మానవు లగు ద్విజులన్ బలు
త్రోవలు ద్రొక్కించి స్వమతదూరులఁ జేసెన్. 1250

క. చాకలికిన్ మంగలికిన్
బాకీ కుద్యోగ మిచ్చి వారలకున్ సు
శ్లోకులచే మ్రొక్కించెన్
మేకలఁ బులుల నొకచెఱువునీ ర్ద్రావించెన్. 1251

క. కడుపే కైలాసం బని
యెడిసిద్ధాంత మ్మొకండె యిహపరములకే
డ్గడ యయ్యె నేమి చెప్పుదు
నొడయఁడులేనట్టిరాజ్య మొకఁ డేర్పడియెన్. 1252

తే. నాలుగేండ్లకొ, యైదునేండ్లకొ యొకానొ
కండు "కశ్చన్న" యేలికగా రహించి
మాఱి మఱియొక్కఁ డంతట మండలమ్ము
నేలెఁ బ్రజలయంగీకృతి నెనసిమొనసి. 1253

ఆ వె. పుడమి మాఱుమనువుపడతిగా నేర్పడె
ననియొ యేమొ? యెల్లయంగనలును
మాఱుమనువు "రూలు" మాకుఁ గావలె నని
పట్టుఁ బట్టి నిచ్చెఁ బ్రభుసదస్సు. 1254

క. పదిమందిగోరుచే తడ
వది యిచ్చుటె కాని ధర్మ్య మగునో? మఱి య
య్యదికాదొ యని విచారిం
పుద మను మఱియాదపదము మూచూడ దహో? 1255

క. తిష్ఠన్మూత్రులు సభ్య
జ్యేష్ఠులు వారాడుమాట చెల్లుణ శిష్ట
శ్రేష్ఠులమా టగునేని క
నిష్ఠ మనిష్టంబు నగుట నెగ్గదు దానన్. 1256

తే. అసలు శిష్టుల కందుసభ్యత్వ ముండ
దుండినను "నూఱుకాకులపిండునందు
నుండుకోయెలచందమై చెండువాఱుఁ
బదుగురాడినమాటకే పాత్రభవంబు. 1257

తే. గీ. ఎప్పుడో వచ్చు నిటువంటిహేయమైన
కాల మనుకొనుచుండ దీర్ఘమగునా యు

ప్రబుకతమున నాకెఁ బ్రత్యక్ష మయ్యె
ఋషులవాక్కులు వ్యర్థమ్ము లెప్డుగావు. 1258

క. తేఁ డన్న భీతి ప్రజకుం
గూడదు మగఁ డన్న భీతి గూడదు సతికిన్
బాడుంగాలమొ? శుభ మొనఁ
గూడుంగాలంబొ? యెందుకొఱ కేర్పడెనో? 1259

తే. గీ. రైతు సర్వస్వమునకుఁ గారణమటంచు
వానిఁ బీఠమ్ము నెక్కింప వాఁ డొనర్చు
ద్రోహములకు నంతం బుండమి మఱి వాఁడు
మొండిచేతిని జూపించు గండుమిగిలి. 1260

క. పిడుగునకు బియ్యమున కొ
క్కఁడె మంత్రం బన్నయట్లు గాంధీజీ యి
య్యెడ సిగపట్లకుఁ బురికొ
ల్పెడివాఁడై పెద్దబెడఁదఁ బెంచుట ధ్రువమౌ. 1261

తే. గీ. మేఁకపాలు గాంధికిఁ బడె మేదిని యిఁక
సకల మవి త్రావి బ్రదుకుట సంభవించు
నొక్కొ? దేశమ్ముఁ గాలమ్ము నూహసేయ
వలయుఁ బాత్రమ్ము లేకున్న వచ్చుఁ గీడు. 1262

క. వేలకొలఁది సొమ్మిడికొని
మాలనొ మాదిగనొ? కాపు మర్యాదగ నం
దోలి న్నిల్పినమాత్రన
వాలాయము వానిబాబు స్వమ్మగునె? కటా? 1263

క. పంచమహాపాతకపుర
సంచారులు తప్ప నిట్టిసంస్కృతు లామో
దించరు కలికలుషమ్మును
బెంచుట కేర్పడియె గాంధివిజ్ఞత బళిరే. 1264

తే. గీ. దినమునకు నొక్కఁ డధికారి దేశమునకు
వనిత కట్టులె భర్తయు వాంఛ యున్న
మాఱుఁగా కది ధర్మసమ్మతమె యన్న
చట్ట మేర్పడి కలికిఁ బ్రోత్సాహ మొసఁగె. 1265

క. మద్యము గ్రోలుట వ్యభిచా
రోద్యమమును నల్లమందు నొసఁగి భిషక్కుల్
వైద్యము సేఁతయు దోసఁ గని
సద్యమ యొక "రూలు" పుట్టు సమయున్ దృటిలో. 1266

తే. గీ. ఎట్టులేనియు బిడ్డల నీను టొకటె
కావలయు నిందులకుఁ గొఱగానిచాన
యుండఁగారాదు దేశాన మండలమ్ము
విడిచి పోవలె నంచు నొక్కఁడు వచించు. 1267

తే. గీ. ఒకఁడు శాసించు నిట్లు వేఱొకఁడు మంత్రి
పీఠమున కధినేతయై వేఱువిధము
గాఁగ "రూ" లొండు సృష్టించుఁ గాని యదియు
నంతరించు మాసానకొ? అబ్దమునకొ? 1268

క. పరలోక మున్న దనియు
న్నరకము గల దనియు నుంత నమ్మకమే వా
రెఱుఁగరొ వెల్లమొగముగల
దొరలకతన మనకు నిట్టి దొసఁగు ఘటించెన్. 1269

తే. గీ. పానమున కొప్పికొనుఁ గాని వారిభూమి
స్నానమున కొప్పికోదు దేశంబు కాల
మవలఁ బాత్రింబు గనిపెట్టి యాచరణము
లనుమతింపఁగఁ దగు నవి యందుఁ బ్రిబుధులు. 1270

క. చెఱువులుఁ గాల్వలు నదులును
సరస్వదాదికము పేరి స్పటికపువేదిన్

బురుడించెడి యైరోపా
చరణము లీ దేశమునకు సరిపడునె? కటా? 1271

తే. గీ. స్నాన మట్లుండ వారికాసనపు శుద్ధి
కూడ జలముచేఁ గామి తద్జ్ఞులన వినికి
అట్టివారియాచారము లకట మనకు
నెట్లు సరిపడు మనకర్మ మేమి కాలె. 1272

తే. గీ. మూఁడుమార్లు స్నానము సల్పుకొను శుద్ధ
వైదికపు సత్కుటుంబు లిప్పటికిఁ గూడ
నక్కడక్కడ నున్నవా రలఘు లల్లి
యార్యుల స్మరించు మాత్రన యఘము దుల్లు. 1273

తే. గీ. "అందఱికి నేను లోఁకువ యగుదుఁ గాని
నాకు లోఁకువ నంబికొండయ" యటన్న
వచనము ధ్రువంబు మొదట దేవళము లంటు
వడియె గాంధిసాహస మనివార్య మఠరె. 1274

క. వచ్చె స్వరాజ్యము పన్నులు
హెచ్చెన్ బూర్వసుకృతాత్ము లిడు మడిమాన్యా
లచ్చరమెఱుఁగనిశుంఠల
కిచ్చినటు ల్పరిణమించె నే మన వచ్చున్. 1275

క. చెప్పెడియుక్తుల్ తలకు
న్నొప్పిన్ గలిగించుఁ గడుపును న్వేఁతొందున్
దప్పిన నన్యము పీరల
మెప్పునకున్ బనికిరాదు మేదిని యందున్. 1276

తే. గీ. రైతునే పెట్టవలయును బ్రాహ్మణార్ధ
మునకు భూస్వామి తద్దినమ్మనెడ రైతు
పెట్టవలెఁ గూలివానిని బితరు లన్య
థా చరించిన శపియింత్రు తామసించి. 1277

తే. గీ. ఇవ్విధమ్మునఁ జరియించు నేవమునకు
భయపడియె "ఆంగిలేయులపార్లమెంటు"
మనకు నిడియె స్వరాజ్యమ్ము మనము దీని
నిల్పికొనవలె నైచ్యమ్ము నిర్వహించి. 1278

సీ. హరిజనుఁ డనవలె నంతియే కాని మా
లని నీవు మాలవం చనఁగ రాదు
ఎదు రైనచో "షేకుహేం" డీవలయుఁ గాని
పక్కత్రోవకు నేగరాదు చూచి
పాలేరుపనిసేయువానికి మిత్రున
కిచ్చెడిగౌరవం బీయవలయు
హోటల్సు''లోఁ బంక్తి కొాగి వచ్చి కూర్చున్న
నవలికిఁ జట్టన నరుగరాదు

తే. గి. యౌవసంబంధ మేరికే నబ్బునేని
అది వివాహముగా బంధు లరయ వలయు
నిందులకు నన్యథా చరియించువారి
కన్వయించు "పీనల్ కోడ్డు" నడ్డునెవఁడు. 1279

క. చిత్రవిచిత్రపు "రూలుసు"
చిత్రవిచిత్రప్రకారశిక్షలు కాంగ్రెస్
గోత్రులు ప్రవేశపెట్టిరి
సూత్రప్రాయముగ వానిఁ జూపితి నిందున్. 1280

క. తిష్ఠన్మాత్రుల నాంగ్ల
జ్యేష్ఠుల నిర్జింప గాంధిజీ, కల్ల సుర
జ్యేష్ఠుఁ డిది తోఁపఁజేసె గ
రిష్ఠమతుల్ దీనిమెత్తురే ! అకటకటా ? 1281

క. మాలలకోసరమై దే
వాలయముల నంటుసేయుటఘ మగుఁ గాకి

క్కాల మటు నేయు మనియెన్
వాలాయము వారు తురకవార్గాకుఁడన్. 1282

క. పదికోట్లతురక లపుడి
ర్వదికోటులదాఁకఁ బెరిఁగి బాధిం తఱిని కో
విదదూరమైన యీ దు
ష్పథమున నడిపించు నగఱిపర్ణమువారిన్. 1283

తే. గీ. గాంధి యల బుద్ధునిం బోలుఁ గాని శంక
రాదులకు దీటుగాఁ డీతఁ డవతరించు
కతమునఁ బురాణఋషులవాక్యమ్ము లవి య
థార్థములు గావు టబ్బెశ్లాఘ్యగుణుఁ డితఁడు. 1284

ఆ. వె కానికూడుగుడిచి కడజాతివియ్యాన
కియ్య కొంటి మింక నెన్నియేని
దొసఁగు లొప్పికొన్న దురకసైంధవబాధ
యెప్పటట్లు నుండె నేది తెరువు. 1285

క. "నవఖాళీ" తురకలకున్
వివేక ముదయించుపొంచె వృద్ధు మహాత్ముం
డెవియో సూక్తులు దెలిపెన్
"జెవిటికిసంకూఁద" ఫలము చేకుఱునె : కటా ? 1286

తే. గీ. కాలినడకను బ్రతియూరు గాంధి యేగి
పడినకష్టమ్మునకు నొకపదిదినములు
గూడఁ దిన్నగా నుండరు "కుక్కతోఁక"
సామెతకు వారినడత లక్ష్యముగ నుండె. 1287

క. త్వరలోనే తురకలు దె
ల్పిరి తత్త్వము గాంధిజీకి; వేదాంతమ్ముల్
మొఱకులకడఁ బనిసేయునె ?
నఱకక తను విడుచు టది జనస్త్వవ్య మగున్. 1288

తే. గీ. గాంధిపాప్రియోపవేశమ్ము గడగడ మని
వణఁకఁజేయును సకలప్రపంచ మది తృ
ణమ్ముసేయదు తురకకులమ్మువారి
కెందుకో ? గాంధిగారి కీయెడల వెఱ్ఱి. 1289

తే. గీ. నాకుఁ దోఁచినమాట యీనాఁడు గాంధి
జీ యవతరింపఁడేని ఆంగ్లేయపీడ
వదల దీ దేశమున, కింత వాస్తవంబ
గాని లోకమ్ము చెడియె సకలవిధముల. 1290

సీ. కోడలత్తను జూచి కొంక దెందుకుఁ గూడ
విధవయై రమియించు విటులతోడ
నత్త "మర్యాదగా"దని మందలింపంగ
"ఖేరిజోకొట్టు" నవ్విధముఁ జూపు
తనదువేడుకకాని తాళియాబిడ వచ్చి
ధవు భిక్ష వేడంగ దయ్యముబలె
తీసుకపోయెద చేసెడిదేమియో
చేసికొ మ్మంచు గర్జించు నడరి

తే. గీ. అగ్రికులమంద కాదు మున్నంత్యకులము
నందె యందము కలదె ? మర్యాద యిట్టి
దబ్బుఁగాక స్వరాజ్య మీ యవకతవక
లాద్యుఁ డెవ్వఁడు సహియించి యనుభవించు. 1291

ఆ. వె. గురునిభయము శిష్యకోటికి లే దెందు
భర్తభయము లేదు భార్య కట్టె
అంకుటాలు పూజ్యురా లక్కరమ్మలు
చదువనేర్చినంత జగము బళిరె. 1292

క. నాగలిదున్నుటయే తాఁ
పిఁగల్గున్ భూపతిత్వ మితరగుణమ్ముల్

వే గల్గుఁగాక వానికి
సాఁగవు భూసతికి నింక సంసృతిపొత్తుల్. 1293

క. గతకాలమ్మున భూమ్యధి
పతికిన్ హలరేఖ లుండవలె హస్తమునన్
క్షితిపతి కిప్పుడు హలకిణ
తతి కరమున నుండవలయు దట్టముగ బళి. 1294

క. ఎన్ని దురాచారమ్ములు
మున్ను మనకుఁ దెల్పినారొ మునిచంద్రులు నేఁ
డన్నియు స్వరాజ్యమునకై
మన్నించుచు నుంటి మనలుమా ఁటే మగునో ? 1295

క. ఏవో యిట్టి విచారము
లేవేళఁ గలంచుఁగాక హృదయమ్మును, సం
భావితగతి శనివిదశయుఁ
దా వెడలె యథోచితముగఁ దద్దయు సుఖమై. 1296

వ. మఱియు నీ శనివిదశయందు కొంతనష్టద్రవ్యప్రాప్తియు గృహమ్మున శుభకార్యసూచనయును ఘటించె నపుడప్పుడు దేహారోగ్యము చెడినను ద్వరలోఁ గుదుటఁబడుచుండె.

సర్వజిత్సం॥ జ్యేష్ఠ శు ౧౨ మొదలు కార్తిక శు ౭ వఱకును శనిదశలో రాహ్వంతరములో —• బుధవిదశ •—

తే. గీ. అంతఁ బుధుఁ డేగుదెంచి తా నమ్మఱుచటి
నాఁడె జరిగించె సీమంతనామకంబు
మహము చినకోడలికి, భావిమంగళమున
కయ్యె నది నాంది; మది ముద మతిశయించె. 1298

క. కృపణతకుఁ దావు వార్ధ
క్యపువయ సని యంద్రు కొంద, అది సత్యముగా
దెపుడును "జీవన్ భద్రా
ణి పశ్యతి" యటన్న నుడియె నిక్కువ మరయన్. 1299

క. ధనధాన్యమ్ములుఁ బ్రాజ్ఞులు
తనుజులు మనుమలును గడు ముదం బిడఁ బరమే
శుని దలఁచికొంచు జీవిత
మును గడపుటకన్న నొందు పుణ్యము గలదే. 1300

క. అతిథుల కభ్యాగతులకు
గతిమాలినయితరులకును గలయంతటిలో
మెతుకులో గంజియొ యిడుజీ
విత మిహపరములకు వన్నెపెట్టి తరించున్. 1301

క. మని రిట్లు భరతఖండం
బునఁ జాతుర్వర్ణ్యమైనపుణ్యులు; నేఁడో ?
ధనమూలము సర్వంబై
మనమున కేవంబు గొల్పు మతిమంతులకున్. 1302

ఆ. వె. ''వంటపూటి''కన్నఁ బాపిష్ఠవృత్తి లే
దనిరి మనపురాణులైన ఋషులు
ఇపుడు దానికన్న హృద్యమౌ వృత్తియే
గానఁబడ దిదెట్టి కాల మొక్కొ? 1303

క. ఒకఁడని పేర్కొన నేటికి
సకలము గనుపట్టు సంకచండాలంబై
వికలమగుమన్మనము దీ
నికి లేశము నీకు లేదె?నెగులు పురారీ? 1304

క. పలువిధములయినదోషం
బుల నేకరువెట్టినారు పూర్వఋషులు నేఁ
డిల నవి యెల్ల సమక్షం
బులు గావుటకతన మనము పొగులు గిరీశా. 1305

శా. “గోరీ” మున్నొకరుండె గాని యిపుడో!· కోటానుకో ట్లెల్లెడన్
గోరీలే కనుఁగొమ్ము నీదుశిరమున్ గొడ్డళ్ళ ఛేదింత్రు బల్

ధీయల్ శూరులు, రక్తబీజులగతిన్ దీండ్రించుచున్నారు దు
శ్వారుల్ మాలలు మాదిగల్ తదధికారం బిప్డు దైవాతెడిన్. 1306

ఆ. వె. "గాంధి"గారుఁ దదనుగాములునుం గూడి
మాలమాదిగలకు నాలయప్ర
వేశమిచ్చినారు వీసంబు దోసంబు
వాం డెఱ్రిఱుంగ రింత వాస్తవంబు. 1307

క. నరకం బీ తప్పునకున్
గలువలు వచియింతుర్రి దాని "గాంధీ"గారే
భరియింపవలయు మాలలు
నిరాగసులు,వాండుర్రి గండుర్రి నిర్జరపదవిన్. 1308

తే. గీ. ఎఱిఁగి యెఱుఁగక చేసిన విట్టి దొసఁగు
లింక మఱికొన్ని యున్నవి యెంచ తెంద
జేద్దురో మీఁదఁ దెల్లమౌ నెల్ల ధర్మ
ములను శాసించునే యొక్క-పురుషుఁ డభవ. 1309

తే. గీ. అన్నివస్తులకన్నను బ్రాణ మెక్కు-
డట్టిపాణమ్ము తృణముగా నరయుగాంధి
అతనిగొప్పఁదనము సర్వమందె కలదు
దాననే వందనీయుఁడై తనరె నతఁడు. 1310

ఉ. అంతియ కాని వేదమున కాతఁడె యర్థము చెప్పు శాస్త్ర మా
ద్యంతము నాతఁడే యెఱుఁగు యజ్ఞము లాతఁడె నిర్వహించు సి
ద్ధాంతము లాతఁ డాడు నుడు లన్నియు నంచు వచించువారు ధీ
మంతులు గామి వారలు విమర్శకు లంచుఁ దలంచ నే నెదన్. 1311

క. భగవద్భక్తుం డయ్యును
నిగమములం దాస్థ యాతనికి లేదు మఱిన్
భగవద్గీతయు యావ
త్తు గణింపఁడు "త్రోసిరాజు" తో సరిపెట్టున్. 1312

తే. గీ. ఆతఁ డవధూతమార్గంబు ననుకరించు
వదియె బోధించు నితరుల, కలవి యగునె?
గేస్తులకు దానితత్త్వమ్ము కేవల మొక
గాంధికే చెల్లె, నాతఁ డీ కాలపుఋషి. 1313

మ. మెడకున్ గుంపటి లింగకాయబలె నెమ్మిన్దాల్పు పైఁ గూడ గ
డ్గడ లాడించు హిమానివాల్పునల "లండన్" ప్రోలిలోగూడ నె
క్కుడు "డ్రస్సున్" ధరియింపకుండ న్మపుఁ గన్గో నేగె గాంధీమహా
త్ముఁడు; తాదృశులు గేస్తులందు మనహిందూదేశమం దుండిరే. 1314

తే. గీ. అతనిభుక్తియు మఱియు నల్లతనిరక్తి
అతనిభక్తియు మఱియు నల్లతనిశక్తి
అతనిముక్తియు వేఱు లోకాతిశాయి
యతనిచరితం బితరులకు నందఁబోదు. 1315

ఉ. పాతుకపోయి దేశమును బట్టి పలార్చువిదేశవాసులన్
నేతల నీతులన్ గఱపి నెమ్మదిగాఁ దొలఁగించినట్టి యా
చాతురి కెంతమెచ్చిన రసజ్ఞకుఁ దృప్తి జనింప, దిట్టి వి
ఖ్యాతులు మున్ను పుట్టరు యుగంబుల నెన్నిట నెన్నిచూచినన్. 1316

ఉ. ఆస్తికు డయ్యు గాంధి కడు నాస్తికుభంగిని దోఁచుచుండుఁ జే
దస్తములేని యాతనియుదారత దుర్గ్రహ, మమ్మనీషి వి
ధ్వస్తసమస్తభిన్నమతవర్తనుఁ డాయనతత్త్వమున్ యథా
వస్తుకమౌనటుల్ దెలియువ్యక్తులు మృగ్యు లెఱుంగఁజెప్పితిన్. 1317

క. చండాలుం డేనియు బా
పండేనియు గురుఁ డటంచు బలికిన ధీమం
తుం డలశంకరునట్టిఁ డ
ఖండుఁడు గాంధి యన నొరులు గా రతనిసముల్. 1318

క. కాలానుసారముగఁ జం
డాలురు మన మొక్కటే యనక తక్కినచో

ఖాలిశులు తురుష్కులు చం
డాలురఁ గల్పికొనునెడన్ జిక్కాదవున్. 1319

క. "ఏ యెండకు నా గొడుగను
ధీయుక్తినెఱుంగు నాసుధీమణి గాంధీ
మాయావుల నిర్జించు ను
పాయ మరసి చేర్చికొనియెఁ బంచమజాతిన్. 1320

తే. గీ. ఒక్కబ్రాహ్మణజాతిలోఁ బెక్కుభేద
ములుగలట్టిసు భారతీయు లగుకతనఁ
గాదె ఖండాంతరీయులు గళము నొక్కి
మనల నేలుట తుదకు సంప్రాప్త మయ్యె. 1321

తే. గీ. అక్కతమ్మునఁ గులభేద మవల నెట్టి
పాఱ నూఁకిన వచ్చినదారిఁ బట్టి
తెల్లదొర లేగుదురు వారిదేశమునక
టంచు గాంధిమహాత్మకుఁ డెంచె నెడఁద. 1322

క. ఆపద్ధర్మము లెఱిఁగిన
శాపాయుధు లీ మహాత్ముచైదికిఁ దుష్టిం
జూపుదు రుదారహృదయులు
ధీపటిమము వలయు దీనితెఱఁ గెఱుఁగుటకున్. 1323

క. కులమతభేదము లరయని
మలినులతోఁ గయ్యమునకు మార్కొనినపుడే
కలికిం జుట్టల మైత్రిమి
కలిదోషము సోఁకకుండఁగా మనఁ గలమే. 1324

క. వచ్చెను స్వరాజ్య మెల్లెడ
హెచ్చెను సంతోష మైన నేమి తురుష్కుల్
విచ్చలవిడి చెలరేఁగుచు
ముచ్చులు హంతకులు నగుచుఁ గ్రుద్ధత మెఱయన్. 1325

తే. గీ. హైదరాబాదు నోరుగల్లవల నుత్త
రానఁ బంజాబు సరిహద్దురాజ్యమందు
సలుపుఘోరమ్ములను విని యులుకు చెంద
వలసె నీబుధవిదశలో నెలమి దక్కి. 1326

ఉ. వచ్చె స్వరాజ్య మన్ననుడి వచ్చి చెవింబడి గంతులేయఁగాఁ
జొచ్చెను సంతసంబు, పరిశుద్ధచరిత్రుఁడు గాంధి నెంతగా
మెచ్చినఁ ఉన్వితీరు నపమేయుఁ డతండు, జగన్నియంత యీ
పిచ్చితనంపుఁజెయ్వులఁ ద్రివిక్రమలీలకు వన్నె వెట్టెడిన్. 1327

క. మూఁడవకోడలు సీశల
నాడెన్ సుతుఁ డుద్భవించె నఖిలము సుఖదం
బై డెంద మలరెఁ గొమరులుఁ
గోడండ్రును మనుమలు వనుఁ గొలిచిరి యెలమిన్. 1328

తే. గీ. బుధవిదశ వచ్చి కొండొక భుక్తమైన
తఱిని నతిసారముకతాన మరణశంక
దనుక జీవిత మరిగి యుద్దండుఁ డైన
దక్షిణామూర్తికతన భద్రముగ నిలిచె. 1329

క. సిరిసంపదలకు గౌరవ
భరమునకును నార్జనకు లవఁబును నెందున్
గొఱఁత ఘటిల్లకె కాలము
జరిగె సుభోజ్యముగ ధ్వజునిసమయ మటుపయిన్.

సర్వజిత్సంవత్సర కార్తిక శు ౭ మొదలు పుష్య శు ౪ వఱకును శనిలో
రాహ్వంతరములో —, కేతువిదశ ,—

క. కేతువు వచ్చుటె తడవుగ
దాతపత్రికాశవిభుఁ డనిచె ధనము శతము ప్ర
ఖ్యాతుఁ డినుగంటి వంశ్యుం
డీతఁడు కృతయుగపుదాత యీ నాపట్లన్. 1331

క. సోమినకామేశ్వరరా
వామెయి ననుఁ జూడ నేదొ వ్యాజమ్ముమెయిన్
శ్రీమంతుం డిట వచ్చిను
ధీమణి నూఱాఱు లొసఁగెఁ దేఁకువకల్మిన్. 1332

తే. గీ. ఇట్లు క్షీరసాగరగృహ మేను వచ్చి
నట్టిసుముహూర్త మెట్టిదో అప్రయత్న
ముగఁ గురియుచుండె ధనవృష్టి భగవతి యిలు
వేల్పు గడపుత నాదుజీవితము నిల్పె. 1333

క. కలవనఁ గలవా ? యీయా
ర్భరకాలము మునులు మునుపురాణమ్ములఁ జె
ప్పిరె యెఱిఁగిరేని చెప్పరె ?
జరిగెన్ సుఖదముగ నిది విజయవాటికలో. 1334

క. క్షామం బియ్యది గడ్డుగ
శ్రీమంతులె చూడ శేముషీమంతులు వి
ద్యామహితులకున్ గతి గల
దే మర్యాదగ దినమ్ము లేగవలయుచో. 1335

తే. గీ. వీసెగోగాకు కర్ధరూపిక నొసంగ
వలయు నిది యెట్టి కలవొక్కొ ? పది యొసంగ
వలయు వీసెఁడునేతికిఁ బదియణాలు
సేరుబియ్యమ్ము వెల యేమి చెప్పవలయు. 1336

తే. గీ. ఏను రుగ్ణుండ వృద్ధుండ నెట్లు కుట్టు
లీ మహాక్షామవారిధి నీఁదఁ గలరు?
ఇంటివేలుపు కామేశి యిచ్చుచుండెఁ
జాలినంత ధనమ్ము నీ క్షామమునకు. 1337

తే. గీ. చాలఁ గాలము దా “ప్రొఫెసరు” ధనంబు
నెలకు నేఁబదివంతున నియతముగను

బంపి యాదృతి గనఁజేసెఁ బాదపూజ
సలిపె బెజవాడనాటకసత్సదస్సు. 1338

వ. ఇట్లు శుభోదర్కంబుగ నిలువేల్పునను గ్రహంబుకతన మంచి హెచ్చు
గను జెడ్డ తక్కువగను నడరువిధమునఁ గేతువిదశ ముగిసెఁ బిమ్మట
శుక్రవిదశ ప్రవేశించె. 1339

సర్వజిత్సంవత్సర పుష్య శు ౪ మొదలుకొని సర్వధారి సం॥ జ్యేష్ఠ బ ౧౦ వఱకును
శనిమహాదశలో రాహ్వంతరములో

—• శుక్రవిదశ •—

ఉ. కేతువు పాదపూజ జరిగించెను శుక్రుఁడు వచ్చి "దేశ వి
ఖ్యాతకవీంద్రులం దితఁడె యర్హుఁడు కాంగ్రెసురాజ్యసత్సభా
నేతృత గైకొనంగ" నని నిచ్చలు వ్రాసెడికీర్తి నిచ్చెఁ బౌ
త్రీతనుగాత్రిపెండ్లి యురరీ కృత మయ్యెను వీనిభుక్తిలో. 1340

తే. గీ. పూర్వరాజు లాస్థానవిభూషణుల మ
హాకవుల నెంచి పోషించి రట్టిపూజ
కిపుడు చెళపిళ్ళయే అర్హుఁ డెల్లకవుల
యం దనుచుఁ బత్రికలు చాటె నలరె జగము. 1341

చ. పరిణతిఁ జూడ వెంకనకు వార్ధక మొప్పునొ లేదొ గాని ధీ
వరజనవాణి నల్దెసలఁ బ్రాఁకె విశృంఖల మౌచు "పిళ్ళ"యే
పరమగురుండు నేఁటికవిపట్టపురాచటికాన కంచు నె
వ్వరు నెదురాడఁబోరు గురుభార్గవసాహ్య మెఱింగి పిళ్ళకున్. 1342

క. "పిళ్ళ"కు గలపే రెఱిఁగియు
నుల్లమునందలియసూయ యుప్పొంగి యెవో
కల్లలు వ్రాసెడిగఱువల
ప్రల్లదములు విలువ దప్పి పదఁడై సురిగెన్. 1343

ఆ. వె. మనుమరాలిపెండ్లి మనుమలవడుగులు
నాడయైనమహము లలరె శుక్రి

నంద యెందు లోప మనునది లేకుండె
భూమిపతులసాయమును లభించె. 1344

క. శరభారాధ్యుఁడు గృహ మిడెఁ
బరిణయమున కంబగుడికిఁ బరిసరమున న
చ్చెరువుగఁ బెండిలి జరిగెన్
బరమేశ్వరికరుణ నెల్లవా రలరంగన్. 1345

సర్వధారి సం॥ జ్యేష్ఠ బ ౧౦ మొదలు శ్రావణ బ ౧ వఱకును
శనిమహాదశలో రాహ్వంతరములో

—• రవివిదశ •—

తే. గీ. ఇంట గొంత ననారోగ్య మేరుపడిన
కతన రవిని బూజించి వినతుల నిడుట
మనుమరాలినోములు నాపెమామగారు
తగవు తెచ్చుట రవియం దొదవె నెలమిని. 1346

సర్వధారి సం॥ శ్రావణబహుళ ౧ మొదలు కార్తిక శు ౧౩ వఱకును
శనిమహాదశలో రాహ్వంతరములో

—• చంద్రవిదశ •—

క. రవివిదశ కొంత యలజడి
నవయంగాఁ జేసి కొమరునకు సుఖమిడితా
భవుకము సూచించుచుఁ జం
ద్రుు విదశనాథుఁగ నొనర్చి తొలఁగె నెలమిమై. 1347

క. చందురుఁ డొసంగె విద్యను
జందిరుఁడే పెండ్లి చేసెఁ శాస్త్రజ్ఞునిగాఁ
జందురుఁడె చేసెఁ గాశీ
ట్సందర్శన మబ్బఁజేసె సకల మ్మొసగెన్. 1348

తే. గీ. చంద్రుఁ డంశలోఁ బడియె నీచస్థలమున
దానిఫలితము విద్యార్థిదశను మాధు

కరము నెత్తించె నిది యొండు గాక సకల
మిందిరాసోదరుఁడు మంచి నిచ్చి మనిచె. 1349

క. ఈ చందురుఁ డంశను దా
నీచిస్థితి నందుకతననే వేలకువేల్
కాచములౌ బలె రూకలు
దాఁచిన వౌషధములు గొనఁగ దా వ్యయపఱచెన్. 1350

తే. ఇంట నారోగ్యభాగ్య మె ట్లేరు పడునొ
అనెడి యాలోచనయె సతమయ్యె మదికి
పరిపరి విధాల యోజనల్ ప్రబలఁ దొడఁగె
నంబ కలదు శివంకరి యనియుఁ దోచె. 1351

తే. గీ. అన్నిబలములు నొకయెత్తు నర్థబలము
నంగబలము నొండొక యెత్తు నండ్రు విజ్ఞు
లెంతయేని కర్చగుఁగాక యెట్లొ వచ్చు
చుండె ద్రవ్యమ్ము లోటు లేకుండె నెందు. 1352

తే. గీ. క్షీరసాగరనామకాగారమందు
నెట్టిసుముహూర్తమునఁ బాద మే నిడితినొ
అపుడె వెంటనె తచ్ఛాయి యనుఁగు దయిత
వచ్చినట్టులుగాఁ దోఁచె వాస్తవముగ. 1353

సర్వధారి సం॥కార్తిక శుద్ధ ౧౩ మొదలు పుష్య శు౯ వఱకునుశనిమహాదశలో
రాహ్వంతరములో కుజవిదశ, ఆ యీ రోజే గుర్వంతర్దశ ప్రారంభం
నాడుమొదలుఖర సం॥ ఆషాఢ బ ౭ వఱకును శనిలో గుర్వంతర్దశ,
నాటితో శనిదశ పూర్తియై

—బుధమహాదశ ప్రారంభం—

తే. గీ. శనిదశాచ్ఛిద్రకాలమంచున గురుండు
వచ్చి వేలకొలంది ద్రవ్యంబు నిచ్చె

నిచ్చె నాస్థానకవి యనియెడి సుగౌర
వంబు నానావిధముల భద్రింబు గూర్చె. 1354

క. కౌమరుని యారోగ్యము కొం
తమంచికిన్ మాఱె నెంత ధనమో వ్యయమ
య్యె మహేశ్వరియే యిడె న
శ్రిమముగ సంసారరథము సాఁగెన్ బెఱుచన్. 1355

క. మఱి పెక్కు వయ్యె నిద్రా
భరంబధిక మయ్యెఁ దఱచు వార్ధక్యంబున్
శిర నెక్కి తాండవించెన్
గురులఘుభేదంబు దెలిసికోలేనయితిన్. 1356

తే. గీ. కవిత రచియించుటయె లేదు గాక యొకట
రచనకై పూనఁ దబ్బిబ్బు రాదొడంగె
వేంకటేశ్వరుశేముషివొంక మఱి యె
దోవిధమ్ముగఁ దోఁచె బుధులకు నరరె. 1357

ఆ. వె. నల్లమందు నకట ? కల్లుతోఁ దుల్యమ్మ
గా నిషిద్ధవస్తుగణములోనఁ
జేర్తు రద్ది ముసలి యార్తుల కొనరించు
సేవ తల్లి తండ్రి సేయఁగలరె ? 1358

క. ఆ మందు సేయుసాయము
సేమం బొనఁగూర్పఁ దఱచు సెజ్జయె మిత్రుం
డై మెలఁగఁ గాలయాపన
ధీమంతులు మెచ్చఁ గవికిఁ దేఁకువ జరిగెన్. 1359

తే. గీ. ఎందు లోటు లేదు కొందఱు మిత్రులు
ధనమునంపు నక్కతమునఁ గఱవు
బాధ కూడ లేదు భద్రమ్ముగా రోజు
లరుగుచుండె దేవికరుణకతన. 1360

ఆ. వె. ధన మయాచితముగ ననిపెడివారిలో
మొదటివాఁడు నకు ముఖ్యసఖుఁడు
ఘనగుణుండు శ్రీప్రికాశరా వరిగె స్వ
ర్గమున కక్కృతమునఁ గలిగెఁ జింత. 1361

తే. గీ. ఇంత పరిశీలనము మఱి యింత సమయ
విత్త్వముఁ గవిత్వసారస్యవేత్తృతయును
గలుగుదాతలు శ్రీమంతు లిలను దఱచు
దొరక రనియె నాదు మదికిఁ దోఁచు నెపుడు. 1362

క. వలదు ధన మిపుడు పంపఁగ
నిలవ గలదు కొంత యనుచు నే వ్రాయఁగ నీ
యలఘుఁడు ప్రికాశరాయఁడు
పలుమఱు దా నంపెఁ దంతివలన ధనమ్మున్. 1363

తే. గీ. ఇతనిసమయజ్ఞతనుగూర్చి యెంతయేని
వ్రాయఁగావలె నితఁ డెంతో వాఁడో కాఁడు
రాజబంధుమాత్రుఁడె కాని రాజు గాఁడు
కాని యినుగంటి యింటిపే ర్ఘనత హెచ్చు. 1364

క. అవి భక్తు లయ్యుఁ గొమరులు
సువిభక్తులు గాఁగ నుండి సుఖ ముండిరి స
ర్వవిధములను శాంకరి దా
శివదాయిని మనుచుచుండె శ్రేయము లలరన్. 1365

తే. గీ. ఎప్పటికి నప్పుఁడే యిఁక నేళ్ళుపూళ్ళ
గావు మాసమ్ములేనియుఁ గడవ వనుచుఁ
జెప్పికొనగండములు దాఁట జేయు శివయు
నాపెదయ యాయు విచ్చె వెంకన్న కెలమి. 1366

క. కనువారికిఁ దోఁచినయ
ట్లనె వెంకనమదికిఁ దోఁచు లలి జాతకమున్

గనుమారకశాస్త్రిని మె
చ్చను ఘనుఁ డవి శోధకుఁ డని సూరియు ననియున్.

క. ఘనులన్ శుశ్రూషించిన
వినాగ దైవప్రసాదవిభవము శోభం
గనఁజాలరు పూలకు వా
సన యనుకొని దైవతార్చ నలుపఁగవలయున్. 1368

క. శనిదశ యావత్తును జరి
గినపిమ్మట బుధుఁడు వచ్చి కీడిడి జరిగిం
చును రెండు కేంద్రములకా
యన యధిపతి వెదక నేల యగుపడుచుండన్. 1369

క. మఱికొందఱు శనిదశలో
గురునంతరమందు రదియుఁ గొండొక జరిగెన్
దరువాయి గలదు మఱి వ
త్సరద్వయము దేవగురుఁడు సల్పెడిపట్లన్. 1370

తే. గీ. నాదునోపిక పరిశీలనం బొనర్ప
గురుఁ డనెడివాదమునె బలపఱచుఁ గాని
బుధునిదన్క నిరీక్షింపఁ బోదు బుద్ధి
ప్రొఫెసరును నిట్టులే చెప్పె బుధహితుండు. 1371

క. ప్రతిపదమారకతాశం
క తోఁచుజాతకుల కబ్బుఁ గడు దీర్ఘం బా
యతి యం ద్రభియుక్తులు త
న్మతమున కిది లక్ష్యమనుచు నాకున్ దోచున్. 1372

క. ఆయుర్భాగ్యము దీర్ఘం
బై యుండిన నేమి అదియు నారోగ్యముతో
శ్రీయుక్తము గావలయున్
నా యాయు వనామయం బనరు కనువారల్. 1373

క. తిరుపతికన్నను నా యీ
డరయఁగ నొకముప్పదేఁడు లధికం బిపుడే
మరణించనిచో నాయువుఁ
బెరుఁగన్వలె నెవ్వఁ డెఱుఁగుఁ బెరుఁగునొ ? యేమో?

శా. జ్ఞానం బున్నది లేదు తాఁ ణ లవముఁ గాయమ్ము నం దెట్టు లీ
శానీ ! జీవితయాత్ర సల్పుట భవచ్ఛంచత్కటాక్షౌషధ
శ్రీ విండారుటఁ జేసి యింతదనుకన్ జీవించితిన్ హాయిగా
పై నా భారము నీకుఁ బెట్టితి భరింపంజూడు కామేశ్వరీ. 1375

అనేవత్సరంనాటిపద్యములోనిస్థితి కూడా మాఱిన దని తెలిసికొం గలిగిరి. శరీరబలం యెంత తగ్గినా యింతవఱకూ నన్ను బుద్ధిబలమే కాపాడుచున్నది. తన్మేమనశ్శివసంకల్ప మస్తు-స్వస్తి

25-8-49 క్షీరసాగరం
బెజవాడ, కృ. డి.

వెం॥ శా॥
శతావధాని.

ఇక్కడనుండి

—• గ్రంథకర్తకుమారుఁడు దుర్గేశ్వరశాస్త్రిచేపూర్తి గావింపఁబడెను •—

సర్వధారి పుష్య శు॥ అష్టమి మొదలు శనిమహాదశలో గుర్వంతర్దశప్రారంభము
తదాది విరోధి సం॥ వైశాఖ శు॥ నవమివఱకు గుర్వంతర్దశలో

—• గురువిదశ •—

క. ఇంతవఱదాఁక లేఖిని
స్వంతముగా నడచెఁ గాని శ్రమహెచ్చుటతో
నంతంతకు దేహము న
త్యంతమ్ముగ బుద్ధిబలము తగ్గ దొడంగెన్. 1376

తే. గీ. అయిన నేమి విలేఖరులాదిగలుగు
గ్రంథకర్త లీతనియభిప్రాయములకు
వచ్చుచుంటయు నితఁ డేదొ వ్రాసియిచ్చు
చుండుటయుఁ గూడ జరుగుచు నుండె నెలమి. 1377

క. గురుసంతర్దశ యీవిధి
జరుగుచు నుండెన్ సుతు లుపచారము లెలమిన్
జరుపదొడంగ నంత శుభో
త్కరముగఁ జనుదెంచె శనివిదశ యోగద మై. 1378

విరోధి సం॥ వైశాఖ శు॥ ౧౦ మొదలు ఆశ్వయుజ శు॥ ౩ వఱకు శనిలో గురునిలో

—• శ ని వి ద శ •—

క. శివనామం బౌషధమై
నవశివుఁ డనఁదగిన దక్షిణామూర్తియె వై
ద్యవరేణ్యుం డయి నమ్మిన
భవాని యనఁదగినకొమిరె పరిచారిక యై. 1379

తే. గీ. త న్ననుసరింప వ్యాధిబాధల కతండు
చిక్కువడియును జిక్కులఁ జిక్కఁ బోడు
రాజయోగమ్ములన్ గూర్పుగ్రహము లయ్యు
నొడిసి బాధింప కాతని విడువ లేదు. 1380

వ. ఇది యిట్లుండగా నంతకు మున్నే స్వయంవరంబున వరించివచ్చిన చందంబున - జీర్ణప్రాయదేహం డైన తన్ను-తనగృహంబునందలి శయ్యాగారంబునకే చనుదెంచి పాణిగ్రహణం బొనర్చికొనిన(మద్రాసు) ప్రభుత్వాంధ్రస్థానకవి పట్టంబును బురస్కరించుకొని యావదాంధ్ర దేశ ప్రజాపక్షంబుగా-ప్రజలును ప్రజాప్రభుత్వపక్షంబుగా ప్రభుత్వం బును-తనయున్నయెడకే చనుదెంచి సన్మానించవలె నను కుతూహల ముతోఁ గావించిన ప్రయత్నములన్నియు సఫలీకృతము లగుటయు.

తే. గీ. దేశదేశాల విఖ్యాతిఁ దేజరిల్లు
కవులు పండితులు విమర్శకప్రముఖులు
శిష్యులు ప్రశిష్యులున్ దన్నుఁ జేరి కొలువ
జరిగె సన్మానసభ మహోత్సవము గాఁగ. 1382

క. ఒకవంక ప్రభుత్వము వే
ఱొకవంకఁ బ్రజాసమూహ ముత్సాహోద్రే
కకవిత్వారాధనలోఁ
బ్రకటీకృతజయపతాక పట్టి రితనికిన్. 1383

ఉ. నన్నయ పొందలేదు జననాథకళాపరిపోషణంబులో
మున్ను కవీశ్వరుం డెవఁడు పొందినయట్లు వినంగ లేదు-వెం
కన్నయదృష్ట మేమొ ? సమకాలమువారలమెచ్చులోన వి
ద్వన్నుతిపాత్రి బ్రహ్మరథదైవత మై యశమూనె నెంతయున్. 1384

వ. తత్తద్విషయమ్ము లాయాయీ ప్రముఖపత్రికలనుండియుఁ గళారాధ
కుల రచనలనుండియు సంగ్రహమ్ముగా నుల్లేఖించి-పిమ్మట-కృతజ్ఞత
వెల్వరింతు. 1385

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారి యుపన్యాసమునుండి :—

"ఆంధ్రమహాకవి శేఖరులగు శ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారి యఖండప్రతిభను గూర్చియు యావజ్జీవ- ఆంధ్రభాషాసేవను గూర్చియు ఎందఱో భాషాకోవిదులు ప్రశంసించబోవుచున్నారు. వారిశతావధానములు మేము విద్యార్థులుగా నున్నకాలములోనే మా కందరకును గౌరవాశ్చర్యములను కలుగజేసినవి. వారికావ్యములు నాటకములు ఇతర రచనలు యావదాంధ్రదేశములో వారికి పూజ్యస్థానమును కలిగించినవి. అనేకమంది ప్రఖ్యాతకవులు వారి శిష్యులు-ఇట్టి మహామహుని మన మద్రాసు ప్రభుత్వమువారు ఆస్థానకవిగా నిర్ణయించుట మిగుల ముదావహము."

గౌ॥ శ్రీ మద్రాసు ప్రధానమంత్రి పూసపాటి కుమారస్వామరాజాగారి యుపన్యాసమునుండి :—

"శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు తాము రచించినకృతుల మూలముగా-సంఘ అభివృద్ధి ఆలయ ప్రవేశము హరిజనుల అభ్యుదయము మున్నగు విషయములలో గొప్పసేవ జేసియున్నారు - వారు వృద్ధాప్యులు,

గౌరవనీయులు, వారిని మనము గౌరవించడమువల్ల మనలను మనభాషనీ కూడా గౌరవిస్తున్నాము. వెంకటశాస్త్రులుగారు చాలాకాలం సజీవులుగా ఉండవలె నని భగవంతుని ప్రార్థిస్తో శ్రీ వెంకటశాస్త్రి గారికి ప్రభుత్వము తరపున విపుమ సన్మానము అర్పించుచున్నాను."

మరా:- ఇక్కడ శ్రీ ప్రధానమంత్రిగారి యుపన్యాసమును గూర్చి రెండు మాటలు వ్రాయవలసి యున్నవి. వారు వ్రాసినట్లుగా ఆంధ్రాస్థాన కవి నైన నేను ఆలయప్రవేశ విషయములో గాని హరిజనాభ్యుదయ విషయములో గాని ఏవిధమైన సేవను చేసినవాడను కాను కాని గతాను గతికమైన యీ లోకములో పూర్వాచారముల పట్ల విశ్వాసము తొలఁగినవారికి ప్రాతినిధ్య మేర్పడిన నాడు అత్యధిక సంఖ్యాకులగు ప్రజలు వారివెంటనే నడచుచుండగా అల్పసంఖ్యాకులు ప్రతిఘటించుట కంటె-అనుసరించకుండ నుండుటయే మంచి దను తాత్పర్యములోని వాఁడ నని మాత్రము మనవిచేయు చున్నాను. పైవారి యభ్యుదయమున కెంతమాత్రము వ్యతిరేకిని కానని మాత్రము తెలివిడి.

ది 23-9-49 ఆంధ్రప్రతిభ - పత్రికాసంపాదకీయమునుండి :—

"రాజస్థానలాంఛనములగు పగటిదివ్విటీలు - రాజదండము పట్టుబడుటయు శ్రీపింగళివారు శ్వేతచ్ఛత్రమును బట్టుటయు శ్రీవేటూరి రాయప్రోలువారలు వింజామరలు విసరుటయు.........శ్రీమారేపల్లి దేవులపల్లి వారలు వేదపఠనము గావించుటయు తదితరకవిపండితవరేణ్యులు బారులు తీరి యిరుపార్శ్వముల నిలచి యుండ శ్రీవెంకటశాస్త్రి కవికంఠీరవుఁడు నిండుపేరోలగమున కరుదెంచిన తావు భాషాదేవి కొలువుతీర్చినయట్లుండె ననుట అత్యుక్తి కానేరదు —"

ది 19-3-1949 తేదీని శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారు వ్రాసిన ఉత్తరమునకు నకలు :—

శ్రీరస్తు

చిరంజీవి — శతావధాని

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రికి

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ఆశీర్వదించి వ్రాయునది :—

"నిన్న వెలువడిన పత్రికలలో మెడ్రాస్‌గవర్నమెంటువారు నిన్ను దెలుఁగునందు ఆస్థానకవిఁగా నెన్నుకొనియుండుటం జూచి మిక్కిలి సంతోషించుచున్నాను. నీ భాగధేయము బ్రశంసించితి. నీకు భగవంతుఁడు మేలు సేయుఁగాక."

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి (అని యున్నది)

ది 18-9-49 తేదీ జాగృతిలోని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి వ్యాసమునుండి :—

"మదరాసు రాజధానిలో నాంధ్రదేశభాగమునకు గురుమూర్తులు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి నాస్థానకవిగా రాచరికమువారు నిర్ణయించిరి. ఈ నిర్ణయము తర్జన భర్జన లైన తరువాతనే జరిగినది. నలుగురిపేర్లు పేర్కొన బడినవి. చివరకు వీరికిచ్చిరి. తక్కిన ముగ్గురును మాకురాలేదని మాకు రాలే దని దుఃఖింతు రేమో? తెలియదు.........ఇది ప్రజాప్రభుత్వము. ప్రజాహృదయమునకు నచ్చినకవి యాస్థానకవి యగును. వెంకట శాస్త్రిగారు ప్రజాహృదయమునకు నచ్చినకవి. ఆ యనది కవిత్వము గా దని లొల్లాయిపదములు వ్రాయు నని వ్రాయుట మాత్సర్యవిషయము. వారిది కావ్యకవిత్వము కా దని వారు వెక్కిరింతురు వారిదైనట్లు వారిదినికాదు. కావ్యమునందు రసము బహువిధాలుగా నుండును. మధురమైన రచనయో సుకుమారమైన రచనయో? ఆ రసాధాయకమైన దానిలో భాగము - అట్టి రచన తక్కినకవులందరికంటె శ్రీవెంకటశాస్త్రిగారియం దున్న దన్న మాట నిస్సంశయముగ యథార్థము.........ఒకకవి నేనుంగు నెక్కించి రని మరియొకకవి దుఃఖించుట యెందులకు? అన్నియేనుఁగులమీఁద తానే యెక్కవలయునా? ఎక్కవలసినచో నెక్కను. అదివానికి వ్రాసి యున్నచో నట్లు జరుగును-తెలియక యీర్ష్యపడుట వివేకిలక్షణము కాదు.

ఒక్కొక్కప్పు డదృష్టము గుణము కలచోట పట్టును. సామాన్యముగా నిట్లు జరుగుట భగవంతుని సృష్టిలక్షణము కాదు. మాగురువుగారివిషయములో నిట్లు జరిగినది. గుణ మున్నచోటనే ఈ అదృష్టము పట్టినది. మా యందఱకు మఱియు మాదృశులకు - ఈమాదృశులు బహుళసంఖ్యాకులు - వీరందఱకు నాస్థానకవి వెంకటశాస్త్రిగారు తప్ప మఱియొకరు కాకూడ దని తెలియును. అందుచేత నిది న్యాయము ఇంకొకరి కింకొకరీతిగా తెలియ వచ్చును. దానివలన లాభములేదు. దుఃఖించి ప్రయోజనము లేదు. మాత్సర్యాగ్ని వృద్ధి చేసుకొనుట తప్ప వేరే లాభము లేదు.........

ఈ కాలమున కాస్థానకవి నిస్సందేహముగా గురువుగారే. వారికి జోహార్లు—''

అదే తేదీగల జాగృతిపత్రికలోని కొంతిరామమూర్తిగారి ప్రసంగము నుండి :—

"శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి సమ్మానసంఘ నిర్ణేతలు ఈ సందర్భములో ఆంధ్రకళాప్రదర్శనము నేర్పాటుచేయుట ఎంతయూ ప్రశంసనీయము. లలితకళల కెల్ల అత్యంతలలిత మైనది కవిత్వము ఆంధ్రప్రజారాజ్యపు ప్రథమాస్థానకవిగా శ్రీ వెంకటశాస్త్రిగారిని నేడు సమ్మానించుట మిక్కిలి యొప్పిదముగ నున్నది.

అదే తేదీగల జాగృతిపత్రికా సంపాదకీయమునుండి :—

''ఈనాడు మద్రాసుప్రభుత్వం శ్రీ వెంకటశాస్త్రిగారిని ఆస్థానకవిగా పాటించడం లాంఛనప్రాయంగా కనిపిస్తుంది - కళాప్రపూర్ణ కింకవీంద్ర ఘటాపంచానన ఇత్యాది బిరుదాలవలె గాక శతావధానిగారికి ఆస్థానకవి హోదా అసలు పుట్టుకతోనే వచ్చింది — లేకపోతే అట్టి మహాకవీశ్వరునికి ఆ పదవిని ప్రసాదించే సమర్థత ఎవరి కున్నది? జన్మతః సిద్ధించిన వెంకటశాస్త్రిగారి విశిష్టతను ప్రజాప్రభుత్వం లాంఛనప్రాయంగా గుర్తించి తనవిధిని నిర్వర్తించుకొన్నది. ఇది సమంజసం.''

అదే పత్రికలోని శ్రీఏడిద కామేశ్వరరావుగారి వ్యాసమునుండి :—

"జీవితమహార్ణవంలో సంవత్సరాలు బుద్బుదాలవంటివి. శ్రీశాస్త్రుల వారి 79 ఏండ్లవయస్సులోను 60 యేండ్లు సాహిత్యరంగంలో పర్యవసించాయి. ఈ మహాప్రస్థానంలో ఆయన తెనుగునుడికారాన్ని తీర్చిదిద్దారు. సంస్కృతవ్యామోహంలో కొట్టుమిట్టాడుతూవున్న కలాలకు తెనుగుతీపిని గఱపి తెనుగుకవులను కోయిలలుగా కూయించినఘనత ఆయనకే దక్కింది. ఆయన ఆధునికాంధ్రభాషాపిత ! అర్ధశతాబ్దికి పైగా ఆంధ్ర సాహిత్య భద్రసింహాసనాధిష్ఠులై అశేషసామ్రాజ్యాన్ని శాసించినవారి శాసనానికి నేడు "ధర్మచక్రం" ముద్రపడి ప్రజాప్రభుత్వ పసిడిహారతు లందుకుంటున్నది. ఆయన అమరుడు."

24—9—49 కృష్ణాపత్రికనుండి :—

"విజయవాడలో ఆస్థానకవిసన్మానమహోత్సవాలు – అతివైభవంగా జరిగినాయి............సుప్రసిద్ధ నాగస్వరకోవిదులయిన దాలిపర్తి పిచ్చిహరిసోదరుల మంగళాచరణంతో సభలు ప్రారంభమైనాయి.... శ్రీ వెంకటశాస్త్రిగారిని శిష్యులు పల్లకీలో మోసుకొని సభలోకి తీసుకొని రావడం సభలోనుంచి ఆహ్వానవాక్యాలు ఎలుగెత్తి వినిపించడం – వెనుకటి కవితల్లజులను – పూలపల్లకీలో వూరేగించడం జ్ఞాపకం వచ్చింది. ప్రధానమంత్రిలు మొదలయినవారు శ్రీవారికి ఎదురై స్వాగత మీయడం చూస్తే – "ఎదురైనచో తన మదకరీంద్రము డిగ్గి" అన్న పద్యం స్ఫురణకు వచ్చింది. తెలుగులోకానికి ఆనాటికార్యక్రమం తీయనికవితగా అవతరించింది – ప్రజాయుగంలో "ఆస్థానకవులు" రాయలుకాలాన్ని జ్ఞాపకం చేస్తున్నారు తిరిగి; ఇది నిజంగా శుభోదయం.

" మహాకవీ ? తుభ్యం న మోస్తు ! "

ఆధునికాంధ్రసాహిత్యమాధవీపుంస్కోకిలా ! – జయము జయము. బ్రహ్మపదావతీర్ణ కవితాలీలావతీవల్లభా ! – జయము జయము. శతశతానేక శతావధానమరందధారాధోరణీ సమ్మోహితాంధ్ర క్షమామండలా!– జయము

జయము. చరణపీఠోపకంఠ నృత్యమానదుహిణకలకంఠీ మంజుమంజీర శింజానరంజితాంతఃకరణా! - జయము జయము. సువిశాలఫాలాంకిత కాశ్మీరముద్రాముద్రిత కామేశ్వరీకటాక్ష - వీక్షణపక్షణి సంతోశఘూర్ణ మధ్యాంతరంగా! - జయము జయము. కంప్రవక్ష - నమ్రనేత్రపత్రి - ఘలంఘలిత రత్నకటకవాగ్దేవీ - వీజ్యమానరమ్యాతిరమ్య కవితారసభావ భావనోద్రిక్త ప్రస్విన్నభస్మత్రిపుండ్రాంకిత లలాటా! - జయము జయము. వాణీనఖముఖముఖరిత వీణానిక్వాణవిమలవీథీవిహార - నవీనచతుర్ముఖా!- జయము జయము. ప్రగల్భశిష్యానేకగురూ! - జయము జయము. అఖిలాంధ్రమహాకవీ! - జయము జయము.

మీ కవితాసుధాధార మాకు శ్రవణానందమై వెలసినది. మీచక్కని చిక్కనినుడులు రసపర్యాయములు - అద్యతనాంధ్రకవి - ప్రపంచనిర్మాతలైన మీరాకచే నవీనాంధ్రకవితాలత నూత్నజీవముతో చిగిర్చి ఎనడు దొడిగి నవనవోన్మిషిత మైనది - తరతరములదాస్యముచే చవిచచ్చిన ఆంధ్రజాతికి మీ కవిత్వమాధుర్యము అమృతపరిషేచన మొనర్చినది. పండిముగ్గిన తనువుతో అనూరులయ్యును - సహస్రమాసానుభవపరీపాక స్వరూప వివిధవ్యాసపరంపరారయోద్వేగముచే పతిత్రులోకము నీ నాటికిని పరువులెత్తించు మీధీశక్తికి నమోవాకములు.

రసమూర్తీ - లౌకికచక్రవర్తీ!

అనంతపుర సమాజ సర్వసభ్యనమిత సుందరపదాంభోజా! భోజా!

సెలవు - సెలవు

షరా:- ఇంకను తదితరములగు పత్రికలలోని వ్యాసవిషయములను గ్రింప విస్తర భీతిచే వ్రాయ విరమించి - యావదాంధ్రమునుండియు నెంతోయుత్సాహముతో చనుదెంచిన కవికుమారులయు - కవీశ్వరులయు పద్యభాగములనుండి - కొండొక యుదాహరింతు.



# కవితాపుష్పాంజలి

చ. అకలుషవృత్తి మీ రుభయు లద్భుతసేవ యొనర్చి యాంధ్రికిన్
శకపురుషప్రిథం గనినజంటకవుల్ జత సేసి వాణి మీ
సకుడు గతించినన్ గృతుల సల్పితి రెన్నియొ మద్రరాజ్యపా
లకపరిషద్గృహీత ప్రథమాంధ్రకవీ ? నతి వెంకటేశ్వరా.

(ద) పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు.

మ. ధరణిన్ గల్గినచిన్నపెద్దయగు నాస్థానమ్ములన్ దత్సభాం
తరదిగ్దంతి కవీంద్రులన్ గెలిచి యానాడే కవీంద్రేంద్రసిం
హరవం బూనినవేంకటేశకవి వీ వద్దానికిన్ సాక్ష్య మి
వ్వరసంస్థాన కవీశ్వరత్వ మగు గీర్వాణీమణీపీఠమా.

(ద) వేదుల వెంకటశాస్త్రి.

శా. ద్రోణాచార్యుని కేకలవ్యు డొక డే ద్రోణుండు సర్వాంధ్రభూ
మినై కాచ్ఛ తదేకలవ్యతను దీప్తించెన్ మహాపాండితీ
ప్రాణమ్ముల్ జివపోసి ఆంధ్రి కొకనవ్యత్వమ్ము దివ్యత్వ మ
క్షీణస్ఫూర్తి గడించిపెట్టినది నీకే చెల్లు విద్వద్గురూ.

(ద) పి. యస్. ఆర్. ఆంజనేయశాస్త్రి.

ఉ. ఏకవి వాక్ప్రచారము లనేకుల కీ యొరవళ్ళు వెట్టి సు
శ్లోకము నాంధ్రమండలములో నలుదిక్కుల కెక్కజేసె నా
శ్రీకర చెళ్ళపిళ్ళకుల సింధుసుధాకర వేంకటేశ్వరా
ఖ్యాకు డశీతి సేర నిపుడయ్యెను రాట్కవియర్హపూజ్యతన్.

(ద) నాదెళ్ళ మేదాదక్షిణామూర్తిశాస్త్రి.

చ. కలము హలమ్ముగా తెలుగుగడ్డను కావ్యకృషీవలుండవై
వెలలెగబోయు సత్కవుల విశ్వము మెచ్చెడి సత్కవిత్వరా

ఫల తెగబండ జేసితివి జోరున నెండలు వానలున్ పథం
బులు కలకెత్తజేసినను భోక్తవు నేటికి వృద్ధమూర్తివై.

(ద) బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి.

సీ. రాయప్రోలిల్ నీ పాదరాజీవముల్ కడుగ
పింగళి వీవనల్ విసరుచుండ
అయ్యదేవర నీకు హారతు లెత్తంగ
వేటూరి స్వాగతవిధులు నడుప
కట్టమంచిరెడ్డి ఘనప్రశంసలు చేయ
శివశంకరుడు నాశీర్వదింప
అచంట కవికొండ లానందహృదయులై
చెరియొకవంకను చేరి నిలువ

తే. గీ. విశ్వనాథుడు వేటూరి వెంకటావ
ధాని తుమ్మల పల్లకీధరులుగాగ
చేరవచ్చితి వాస్థానసీమ కీవు
వహ్వా యేమయ్య నీ వైభవంబు తలప.

(ద) భాగవతుల సత్యనారాయణ శర్మ.

సీ. అపరవాగను శాసనావతార స్ఫూర్తి
ప్రకటించె నీ దేవిభాగవతము
ఊగించె నీ పాండవోద్యోగవిజయమ్ము
లల కవిబ్రహ్మకుండలయుగమ్ము
సార్వభౌమునియశస్సంరంభ మణచె నా
నారాజసందర్శన ప్రసక్తి
సహజపండితవచస్సందర్భమును మించె
చాటుగాథామృదు సహజకవిత.

తే. గీ. శాంతి మాధుర్య మంగళాస్థానవిమల
సహజసౌజన్యలక్ష్మి వత్సలత మెఱయ

భావికవులను దీవింప బట్టియున్న
పొగడపూదండ సామి నీ బుద్ధచరిత.

శా. రెండౌభాషల మీసముల్ మలచి యూరేగంగ నీముందు నొ
క్కండుఁ నిల్వడు సంస్కృతాంధ్రికవితాఘంటాపథమ్మందు నీ
నిండౌప్రాయము నైచె శిష్యజనతానిస్తుల్య సౌభాగ్యముల్
పండింపన్ దలపోసి గావలయు దేవా ! వేంకటేశప్రభూ !

(ద) మల్లంపల్లి వీరేశ్వర శర్మ.

మ. శతలేఖి న్యవధానవిస్తృత కలాసంరంభులై సత్కవి
ప్రితతిన్ సంతతసన్నుతుల్ వడసి గీర్వాణాంధ్రనీరంధ్రులై
నతనానాధరణీశులై కవలచందం బొప్పియున్నట్టి తి
ర్పతినిన్ వెంకటశాస్త్రి మ్రొక్కెద వచఃప్రాగల్భ్యభావార్థినై.

(ద) కృత్తివెంటి వెంకటసుబ్బారావు.

శా. నానాదర్శనపారగుండ సకలామ్నాయార్థసర్వజ్ఞతా
మానోద్భాసితవాగ్విలాస కవిసమ్రాణ్మూర్తి కామేశ్వరీ
ధ్యానానంద మరందపాన ముఖరాంతర్వాణి పారీణధీ
రా ! నిశ్చంచల చిత్తవృత్తి నిక సమ్యగ్దర్శివై యొప్పుమా.

(ద) హరి నాగభూషణం.

సీ. పల్నాటిజొన్నయంబలి త్రాగి చిక్కిన
శ్రీనాథుడో యేమొ చెళ్ళపిళ్ళ
గండపెండేరమ్ము ఘల్లున మ్రోగించు
పెద్దన్నయో యేమొ వెంకటకవి
గర్వించుకవులను గర్వ మడంచు లిం
గన్నయో యేమొ శతావధాని
కానరాని మహత్తుగల్గిన యలఘుడు
పోతన్నయో యేమొ పుణ్యమూర్తి

గీ. ఏమొ ఏ పుణ్యపురుషుడో ఎరుగ గోరి
దర్శనము జేసి ఏదో సార్థకత బడసి
ఆంధ్రవైభవశ్రీ గని హర్ష మంద
వచ్చితిని ఓ మహాకవీ! పరిణతు లివిగో!

(ద) జంధ్యాల వెంకటేశ్వరశాస్త్రి.

శ్లో. యదీయం పాండిత్యం కుకవిజయలీలాసువిదితం
యదీయం వాత్సల్యం నిజసుజనశిష్యావనచణం
స ఏష శ్రీదేవీచరణకమలాలక్తకరస
స్ఫురత్కావ్యశ్రీకో జగతి జయతా ద్వేంకటకవిః.

(ద) మంచావర్ఝుల సీతారామయ్య.

మ. కవితాలోకమునన్ జిగీషమెయి మీ కావించుదాడుల్ జయో
త్సవముల్గా పరిణామ మైనవి కవీంద్రా నేడు స్వాతంత్ర్యమై
జవసత్వంబులు పెంచుకొన్న తెనుగున్ జ్మాదేవి ఆస్థానపున్
గవిగా నిన్ దొలిపూజ నేసినది ఆనందమ్ము పొంగారగన్.

మ. భువిజన్మించినదాది నేటివఱకే భోగంపుటానంద మే
కవిమూర్ధన్యునికేని లేదొ? అది నీకై పుట్టి వర్ధిల్లి శి
ష్యవితానంపు మనోంబుజమ్ముల వికాస మ్మౌని నిన్నున్ బ్రజా
కవినిన్ జేసియు గౌరవించినది లోకం బెల్ల నుప్పొంగగన్.

మ. నిను తండ్రింబలె గౌరవింప వలెనో? నీలోగురుత్వంబు నే
జొనుపంగా వలెనో? ప్రజాకవివిగా జోహారు లర్పించి మ
న్ననలన్ జేయుట లొప్పునో ప్రకృత మైనన్ దత్త్రిమూర్తి స్వరు
పునిగా నెంచి యజింతు నాదుకవనంపున్ బుష్పగుచ్ఛమ్ములన్.

చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రి.

సీ. గాయనీగాయక కలకంఠములుభవ
ద్విజయ గానంబు గావింపుచుండ

కవిషట్పదములు మీ గ్రంథపుష్పాసీక
మకరంద మాని మై మరచుచుండ
పరిభువతంసములు మీ పావన పాద ప
ద్మారాధ నానంద మందుచుండ
శిష్య పరిశిష్యులు స్థిరతర సత్కావ్య
కుసుమ వర్షంబును గురియుచుండ

గీ. ఆంధ్రసామ్రాజ్య సంస్థానమందు స్వర్ణ
సింహపీఠిని గైసేసి చిరకృపార్ద్ర
దృష్టిగనుగొని యాశీర్వదింప గదవె
సరసగుణసాంద్ర! వేంకటేశ్వరకవీంద్ర.

(ద) గౌరావఝ్ఝుల రామకృష్ణ సీతారామసోదర కవులు.

గీ. సుకవితారాజ్యమును సముత్సుకతగాంచి
రాజు రెడ్డియు పేదయు రైతు ననక
అందఱును గ్రోల నందలి యమృత రసము
పంచితివి సామ్యవాదివై వర కవీంద్ర.

(ద) ఆరవెల్లి లక్ష్మీనారాయణాచార్యులు,

మ. కవులెల్లన్ భవదీయకావ్యరచనా కౌశల్యమున్ గాంచి మీ
కవితాభావపు టాప్తులై చెలగిరయ్యా? తెల్గువారెల్ల మీ
శ్రవణానంద సుపద్యముల్ మిగుల నుత్సాహంబుతో బాడుచున్
గవితాసుందరి ప్రాపునందరె! కవీ! కళ్యాణమున్ పొందుమా.

(ద) బాచిమంచి శ్రీహరిశాస్త్రి.

సీ. ఇమ్మగా మునుమున్న యే పరిభుత్వంబు మ
ద్యనిషేధచట్టంబు నమలుపఱచె
నెలమిమై దొలుదొల్త నే పరిభుత్వంబు జ
మీందార్ల బిల్లును పొందుపఱచె

ప్రపిధమంబుగా నే ప్రభుత్వంబు తా
నఖిలకార్యముల ముందంజ వేసె
భారతావనిలోన నే రాష్ట్రపుప్రభుత్వ
మగ్రిగణ్యత నొంది యతిశయించె.
గీ. నట్టి మదరాస్ప్రభుత్వంబు మొట్టమొదట
నిట్టి యసమానవిద్వత్కవీంద్రమణుల
నంచితముగ సమ్మానింపనెంచు టెల్ల
కవులభాగ్యమును ప్రభుత్వఘనత గాదె.

(ద) తిరుమల వింజమూరు పార్థసారథికవి.

సీ. చర్లాన్వయబ్రహ్మశాస్త్రి పర్వతమూల
మునయందు మురువుగా బుట్టి వంది
ఒకపాయ సాహిత్యప్రకటముఖమ్మున
శిష్యకేదారకృషిం జెలంగి
ఒకపాయ నాశుధాటికి మెప్పు గొని నిర
ర్గళధారనవరసార్ణవము నెఱపి
ఒకపాయ మధురధ్వనికి జాలి మృదుపద
బంధురగ్రంధసంపత్తి హత్తి
గీ. విదితవేంకటవిద్వత్కవీంద్రతీర్థ
పావనసరస్వతి మనోజ్ఞభావలహరి
రాజసంస్థానకృతసమర్చావిధాన
భవ్యబాహ్యాంతర ప్రకటావ్యయాత్మ.

(ద) చల్లా పిచ్చయ్యశాస్త్రి.

మ. శ్రవణానంద విధాత ! గీరతవిహారఖ్యాత ? కామేశ్వరీ
స్తవసంభార ! మనోజ్ఞ మృచ్ఛకటికాసంచార కాశీసహ
ప్రవిచారప్రియ ! హర్ష, బుద్ధ, సుచరిత్ర జ్ఞానధౌరేయ ! గ
ణ్యావధానస్వన ! భారతాభరణ ! నానారాజసందర్శనా.

మ. కవు లున్నారు ఝళంఝళత్పదనటత్కావ్యంబు లీ నేల లే
నివి కా వెన్నొ వధానముల్ గలవు కానీ : ఓ వధానిప్రభూ
కవులన్ కావ్యములన్ వధానముల నొక్కం డైన మీలీల మా
కవురా గూర్పవు పక్షపాత మసు మే మైనన్ సరే పల్కుమీ.

(ద) పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి.

ఉ. కోటిగళాలతో పిలుచుకొన్నది నీతెలగాణ నిన్ను నీ
నోటచెలంగుభారతిని నూత్నయుగప్రథమోదయాన ము
క్కోటితెలుంగు లొక్కకడగూడ విశాలమహాంధ్రతాసుమ
స్ఫోటన మాచరింపుము యశోనిధి చెళ్ళపిళాన్వయాగ్రణీ.

(ద) దాశరధి కృష్ణమాచార్యులు.

సీ. అతులకథాకథనాది వైచిత్రిలో
నన్నయ్యవెనువెంట నడువ గలరు
కావ్యశిల్పమనోజ్ఞకవనంపు రీతిలో
తిక్కన్నచాయల తిరుగ గలరు
ముద్దుముద్దుగ తేనెల దినసుద్దిలో
అలసానిపదమున నలుగ గలరు
భవ్య భక్త్యావేశపరిణతస్ఫూర్తిలో
పోతన్నత్రోవల బోవ గలరు.
గీ. కాన అభినవ యని యేమొ కలుపబోయి
యే యొకరితోడ నే బోల్ప నిష్టపడక
యెవరి వీ వౌదు వని మది నెంచి యెంచి
అభినవసరస్వతీమూర్తి వని నుతింతు.

(ద) బృందావనం రంగాచార్యులు.

ఉ. చిన్నతనంబునందె నిను జేరె కవిత్వరమాలలామ వి
ద్వన్నుతవైభవం బమరె వాసికి నెక్కె శతావధానముల్

సన్నుతి జేసి భూపతులు సంతస మందగ సత్సభాస్థలిన్
వన్నెను గాంచి తీవు కవివర్గములో చెళపిళ్ళసద్గురూ!

(డ) దీవి నరసింహాచార్యులు.

మ. అవధానంబు లనేకముల్ సలిపినా వార్యా! జగంబందు నీ
కవితానైపుణి జూపి మేటియశమున్ గన్నావు నీ సాటివా
రెవరయ్యా! కవులందు వెంకటకవీ యీనాడు ఆంధ్రావనీ
కవితారాజ్యరమాభిషిక్త పదవిన్ గైకొమ్ము నీ వింపుగన్.

(డ) ధవళ సుందరనారాయణశర్మ.

మ. కలరో, లేరొ పురాతనాంధ్రికవిసంఘంబందు నాచార్యశ
క్తులు చాటం గలశిష్యవర్యులు భవత్సుస్నిగ్ధసాహిత్యమం
జులసౌరభ్యము పంచిపెట్టగలశిష్యుల్ నీకు నున్నట్లుగా
గలరే సారతరాంధ్రి సత్కవిశకైక స్రష్టవిద్వత్కవీ.

(డ) దేవరకొండ చిన్నికృష్ణశర్మ.

గీ. తెలుగుమాగాణమందు కాంతులు వెలార్చ
కవితవచియింపనేర్చినఘనుల కెల్ల
నీవకా భిక్షపెట్టుననిధివి స్వామి
అంకితముకాదే కవిలోక మరయనీకు.

(డ) వంగూరి రామారావు.

సీ. వాగనుశాసనుండై గణ్యుడే కాని
అవధానపరుడె? నన్నయ్యబుధుడు
పాత్రౌచితీరసబంధురుండే కాని
కవిరాజ గురువె? తిక్కన్న సుకవి
జటిలసంస్కృతబంధచణగుణుండే కాని
ననతెల్గువలతె? శ్రీనాధభట్టు
చిత్రిబంధశ్లేషసిద్ధహస్తుడె కాని
ప్రివిశదకధకుఁడే? భట్టుమూర్తి.

గీ. అన్ని సుగుణముల్ మీయందె యున్న వన్న
నతిశయోక్తి గలదొకో ! రవంతయేని
సరసకవితాగుణోజ్జ్వలసారమూర్తి !
చెళ్ళపిళ్లసువంశాబ్ధి శీతకిరణ.

(ద) జి. సి. బసవరాజు.

ఉ. స్వానుభవంబువల్ల పలుసంగతులన్ విశదీకరించెదన్
వీనులవిందుగా వినుడు వేంకటశాస్త్రి గురూత్తముండు మే
ధానిధి దుష్కవీంద్రసముదాయము నెల్ల నడంచినట్టి భా
షానిధి లౌకికోత్తముడు సత్కవిచంద్రుడు కైతలోన దీ
క్షానిధి పూజనీయుడు ప్రశస్తగుణుండు శతావధాని వ్యా
ఖ్యానిధి గాయకుండు జగదంబకు భక్తుడు నీతిశాలి యె
వ్వానికి లేని కీర్తి పొలుపార గడించిన యోగశాలి వి
శ్వానికి జాలునట్టి కవివర్యుడు పెక్కుకవీంద్రు లేటికిన్.

మ. కవినే గా నని వ్రాసికొంటివి చమత్కారంబుగా నెన్నియో
యవధానంబులు జేసి సద్యశము నిండారంగ నార్జించినన్
భవదీయాత్మకు సంశయంబు గలుగన్ భావ్యంబె యోజింపగా
గవి వీవే గవి వీవె నిశ్చయము వక్కాణించుచుంటిన్ గవీ.

(ద) యీరంకి వెంకటరమణమూర్తి.

చ. తిరుపతివేంకటేశకవిధీరులు ఖ్యాతిని బొంది రందునన్
తిరుపతి యేగి స్వర్గపురి దేవసభన్ గవి యయ్యె నిప్పుడీ
ధరణిని వెంకటేశకవి దా బ్రభువర్యులసన్నిధానమం
దు రహిని సత్కవీంద్రు డయి తోరపుసద్యశ మందె నద్దెసల్.

(ద) సాలగ్రామ చింతామణి.

సీ. ఘనపండితులు మహాకవు లంచు పేర్వడ్డ
వారు మీ ప్రియశిష్యవరులు గారె ?

ఎన్నిక గన్నకవీంద్రవాదమ్మును
ఖండింప దాసులు గారె మీకు
సార్వభౌము లటంచు సభలోన జేర్వడ్డ
వారలు మీక్రిందివారు గారె
మీ సరి గనబూని మే మేస్గు నెక్కినా
మని విఱ్ఱవీగిన గనునె యశము
గీ. అహహ మీ కైతలోని యొయ్యార మెన్న
మిసిమిజవరాలికొప్పులో పసిమిపూత
యై చెలంగుచు సర్వపూజ్యత్వ మొందు
యుష్మదంఘ్రిసరోజపూజోపకృతియ.

(ద) సాలగ్రామ భాస్కరనరసింహమూర్తి.

చ. కలియుగమందు వేఱొకడు కాగల డెట్టులు నాఁచుకుండు వి
హ్వలమతి నెంతకొట్టుకొనినప్పటికిన్ ? గురుదేవ ? నీకె కే
వల మది నిశ్చితం బయి ప్రభాసిలుచుండదె వేఱురీతికై
తలు తలవంచి నీ యడుగుదమ్ములకున్ బ్రణమిల్లకుండునే.

క. దొరతనములన్నిటిని దొం
తరగా చేర్చినను వానివల దన్నదె నీ
దొరతనము? వెంకటేశా
తరమా నీ మాటధాటి దాట నెవరికిన్.

(ద) వడ్డాది సీతారామాంజనేయకవి.

సీ. కృష్ణవేణీతరంగిణి త్వద్యశోగీతి
వితతోర్మికల నాలపించుచుండ
విలసత్ప్రవాహధారల నింద్రకీలాద్రి
పతి బరాబరి నర్ఘ్యపాద్య మొసగ
నిలువేలు పొచు గోర్కెల నిచ్చు మాయమ్మ
కనకదుర్గమ్మ దీవెన లొసంగ

రామరాజ్యమునకు బ్రీతివచ్చునెప్రాూ ప్రి
భుత్వంబు నీ పాదపూజ లొసగ.

గీ. ప్రకృతిమధువాణి కోకిలస్వరము నెత్తి
పత్రిపశ్చరమున సుమప్రిభలువెలుగ
తమక నివ్వాళి నొసగ నిత్యమును మనుము
చళ్ళపిళ్ళవెంకటశాస్త్రిశతవధాని.

(ద) కోలాహలం సీతారామరాజు.

శా. నానారాజసభాంతరాళముల నానాపండితానీకస
మ్మానాభ్యర్చితవేదశాస్త్రకవితా మాధుర్యవాగ్వృత్తిలో
రానీతిం దలపింప భారతకథన్ రంగస్థలార్హంబుపెం
పానన్వ్రాసిన కింకవీంద్రికరిపంచాస్యంబః కైకో నతుల్.

(ద) అవ్వారివారిసంతతి.

గీ. బళిరె కొమ్ములుతిరిగినపండితులను
శాస్త్రవాదములో దింపి జంకగొట్టు
కింకవీంద్రిఘటామృగేంద్రాంకితు డయి
వెలయుచున్నాడు చెళపిళ్ళవెంకటకవి.

(ద) వేదుల వెంకటార్రివు.

సీ. నన్నయ్య కబ్బెనాః నాడు రాజమహేంద్రి
నాస్థానమున నింత ఖ్యాతి దనర
తిక్కన్న కబ్బెనా ? తెలియ మనుమసిద్ధ
ధీశునాస్థానిలో నింత తేజు
శ్రీనాధునకు నబ్బెనాః నాడు రెడ్డిరా
జాస్థానముల నింత యభ్యుదయము
అలసానిపెద్దన్న కబ్బెనా ? రాయల
సంస్థానమున నింత సద్యశస్సు.

గీ. అబ్బెనో లేదొ కాని యీ యతిశయోన్న
తయశ మాచంద్రతారార్క మయి వెలుంగ
నేడు మద్రాసురాష్ట్రసన్నిధిని నియతి
కలిగెబో; నీకె యాస్థానకవిబిరుదము.

(ద) సోమార్కుల వెంకటకవి.

శా. విద్వన్ముఖ్యుడ వై కవీంద్రుడవు నై వీరుండవౌనీకు కృ
ష్ణద్వైపాయనుఁడాదిసత్కవులు శ్రీనాథాదిధీమంతులున్
సద్వంద్యుండగు నన్నపార్యుడును నీ సాటౌదురో లేదొ సా
క్షాద్విష్ణుండవు కావె వేంకటకవీ! సాహిత్యవిద్యారవీ

(ద) దివాకర్ల సోమసుందరశాస్త్రి.

ఉ. మౌనివరుండు నాగ నొకమాటయు బల్కక సర్వకాలమున్
ధ్యానసమాధినుండునిను నాధృతిమై వరియించె నౌర! యా
స్థానకవీంద్రసాధుబిరుదం బిదె వెంకటశాస్త్రిసత్కవీ!
శ్రీనిలయుండు రక్షణము సేయ మహోన్నతకీర్తి నందుమా.

(ద) జనమంచి శేషాద్రిశర్మ.

క. ఆయే డాయే దేయే
డీ యేడుంగొండలయ్య కెల్ల సుకవులున్
జేయించుపూజలం గని
శ్రీయేడుంగొండలయ్య కెల్ల సుకవులున్.

క. క్రొన్నగలను క్రొంజిలుగుల
దొన్నెల గూర్పించి బాలతోడు గిడె పల్కుం
గన్నియకు వెంకటేశ్వరు
డన్నలువా యనగ లోక మాహా యనగన్.

(ద) వేంకటపార్వతీశ్వరకవులు.

ఉ. మందుకు నైన నింత యభిమానము నీపయి లేనివార లే
కొందరొ యుండి యుండు రధికుండవునీ వని యెప్పకుండినన్

డెందములోన నెప్పు డౌకటే పనిగా స్మరియించుచుందు రా
నందముతోడ దెన్గు కౌకనవ్యత గూర్చిననీదునామమున్.

(ద) ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రి.

ఉ. పాప్రాక్తనశైలికిన్ భరతవాక్యము నాంది వినూత్నశైలికిన్
సూక్తిబహుశ్రుతుల్ పలుకుచుందురు మీ కవితఁగుఱించి త్వ
త్ప్రోక్తము లార్షసూత్రములపోల్కి బఠించెద రంధ్రభారతీ
భక్తులు పూర్వపుణ్యవిభవవ్యయలబ్ధము లేతదర్థముల్.

(ద) ఏటుకూరి వెంకటనరసయ్య.

క. తిరుపతికవినామకభ
వ్యరసాలకిసాలయప్రభవహేతువసం
తరమాయితవరధిషణా
విరచితకావ్యప్రపంచ! వెంకటశాస్త్రీ.

ఉ. భారతసంహితన్ జదివి భాగవతమ్ము పఠించుకొంచు నో
రూర వరూధినీప్రణయమో కలభాషిణిచిత్రవృత్తమో
సారె పఠించు నీ తెలుగుజాతికి గొంజవులూరునీదుసిం
గారపుగబ్బమున్ శ్రవననందన మయ్యె గదా?కవిప్రభూ!

మ. అవనీపాలసభాంతరమ్ములఁ నసూర్యంపశ్య యై పండిత
ప్రవరుల్ చర్వితచర్వణక్రియల నావర్తింపగా జేయునృ
త్యవినోదమ్మను జూపుమా తెలుగుకన్యన్ బల్లకీమీద ది
ప్పవె దిగ్విధుల నీవు నైకవిధనై పద్యప్రదానమ్ములన్.

చ. కుసుమితచూతవృక్షమున గుత్తుక నిండగ బల్లవమ్ములన్
మెసవి వసంతకాలమున మేను గగుర్పొడువంగ మాటికిన్
గొసరి కలధ్వనుల్ విసరు కోకిల కూహుకుహూ నివారముల్
కొసగల ముత్తెపున్సరులగుత్తులు మీ సుకవిత్వధోరణుల్.

ఉ. త్రుప్పులు డుల్లె జిహ్వలకు దోసిళులన్ జవు లానె వీను లో
యప్ప! రసమ్ము లూరె హృదయమ్ముల గగ్గురుపాటు మేనులం

గప్పె దెనుంగువాసి బొడగట్టెను గన్నులగుప్పగూరగా
గుప్పిన త్వద్వినూత్నకృతి ఘూర్ణితకాహళి కాహళా హళిన్.

చ. పడమటిగాడ్పుతాకునకు వాడి వివర్ణత జెంది ధూళి బ్రుం
గుడుపడి యాకురాలిచినకొమ్మలు గల్గు తెలుంగుతోటలో
మడవలు మాడ్చి పాదులును మళ్ళు నమర్చి మరందధారలన్
జడిగొన గ్రిమ్మరించినది. సత్కృతికన్యకు సేమమే కదా!

ఆ. వె. కవినిరంకుశుండు కవి యభిమానమ
హోధనుండు సుకవియంచ నిలుచు
జగము లనుచు వెండి జాటినకవిసింహ!
ఆ మనస్వితకు ననామయమ్మె.

సీ. పలుకులజవరాలుపలికించు కచ్ఛపి
సుస్వరమ్ముల కుపశ్రుతులనీని
కమలాసనునిరాణి కర, కంకణ, క్వణ
క్వణనిక్వణములపై గాలుద్రివ్వి
పద్మసంభవురాణివాసంపు మొలనూలి
మణుల ఘల్ఘలలతో మచ్చలించి
శారదాచరణ మంజీరఝుళం ఝళా
రావమ్ములకు బ్రతిరవము లిచ్చి
గీ. ఆంధ్రిబృందావనీవీధులందు మెరసె
మురళియై నీదుకంఠమాధురులు నీదు
శాసనము తెల్గునుడి శిరసా వహించె
ఆంధ్రకవిపరమేష్ఠి? నీ కగుత జయము.

(ద) కాటూరి వేంకటేశ్వరరావు.

ఉ. మీసము దువ్వి పండితులమీద సవాలొనరించి గెల్పుసిం
హాసన మెక్కినట్టిప్రతిభాఢ్యుడ వీవు భవత్కవిత్వ ది

వ్యాసవ మూని మత్తుగొనసట్టిరసజ్ఞుడు లేడు వే యుప
న్యాసములేల ? యీపదవి కర్హుఁడ వీవ సుమీ ? కవీశ్వరా ?

మ. మడమందిప్ప నీయాంధ్రపుత్రికుల ధీమా ? నీ కళాసృష్టిలో
నుడికారమ్మున బట్టువడ్డ దనఁకొందున్ భాషకున్ గొప్పతోఁ
కడ శిక్షించిన కింకవీంద్ర గజశిక్షాదక్షహర్యక్ష నీ
వడుగుల్ మెట్టినచోట బుట్టెడి కవిత్వాదేశబీజావళుల్.

సీ. తలవంచలేదు నీ పలుకు రాజులపజ్జ
గంధేభములమీద కాలుమోపి
చెదరిపోలేదు నీ మొదటితాంబూలంబు
సకలాంధ్రసత్కవిసభలయందు
కనఁమాయ లేదు నీ కావ్యసౌందర్యంబు
క్రొంగ్రొత్తరచనల గొడవలందు
దసిలిపోలేదు నీ పసరుగంటపుచేవ
ముదిమి పైకొని పండిపోవువఱకు,

గీ. సదమలాస్థానసుకవిరాజ్యంపుపదవి
పుట్టుకవి వైన నిన్ను చేపట్టు గాని
పుట్టి కవులైనవారి చేపట్ట గలదె
పలుకు మెలకువగల చెళపిళకవీశ.

(ద) జి. జాషువ.

చ. పొలుపటి హూణకావ్యములు బొట్టులు బొట్లుగ రాల్చుతేనె మీ
సల బడి తాక నాలుకలు సాచుచు నున్న తెలుంగుజాతినిన్
లలితశతావధాన ధిషణా పరిణాహ సరత్సరస్వతీ
కలిత తరంగమగ్నమును గా నొనరించితి వయ్య సత్కవీ.

(ద) ధూళిపాళ శ్రీరామమూర్తి.

మ. నవమాకంద మహీజపల్లవ నితాంతగ్రాస మాద్యత్పికీ
వివృతోత్తేజిత పంచమస్వరముతో విస్రంభియై మాధురీ

స్తవనీయంబగు చెళ్ళపిళ్ళ గళ నిస్వానమ్ము త్రైలింగ్య భూ
ధవశాక్షీతతి పద్యపుంబఠనలో దక్కించుకో నెంచెడిన్.

(ద) హరి రామలింగశాస్త్రి.

ఉ మల్లెలు జాజులున్ పొగడమాోకులు సంపెగగున్నలున్ విరా
జిల్లుచు పూచి తావి నెగజిమ్ముచు నున్నవి తోటమాలిగా
చల్లగ సాదికొంటి వట జానుకవిత్వపుపూలదోట నో
చెల్లపిళాన్వవాయ? కవిశేఖర? నీ భవ మెంత ధన్యమో.

(ద) కొండపల్లి గోపాలరావు.

మ. ప్రిధితుల్ పూర్వనరేంద్రు లాత్మసభలన్ బ్రఖ్యాతవిద్వత్కవి
ప్రిథ గల్గించి విశేషకీర్తి గనినారల్ మంత్రివర్గంబు త
త్ప్రథమున్ ద్రొక్కెను నేడు కృమ్మఱ బ్రిజాస్వామ్యప్రిభాతాంకిత
ప్రిథమాస్థాన కవీంద్ర?నీ కివెనమోవాకమ్ము లర్పించెదన్.

చ. తిరుపతిసాహచర్యమున దేజము నీ కలరారె నాతఁడున్
గురు వని నిన్ను గొల్చి కవికుంజరుడై యశ మొందె నిర్వ రొ
క్కరె యనిపించె గావ్యముల గల్ల,నిజ మ్మయి నిల్చి రొక్కరున్
దిరుపతివెంకటేశ! గురుదేవ! నమస్కృతులఁ గ్రిహింపుమా.

మ. తిరునాళ్ళయ్యెను సంచరించినధరిత్రిన్ రాజులన్ జూచుచున్
బరమోత్కృష్టశతావధానకవితాప్రాశస్త్యమున్ జూపి ము
ష్కరవాదమ్ము లొనర్చుకాకవుల పొంకంబెల్ల జర్లార్చుచో
గురువర్యా! భవదాఖ్య పర్వెను తెలుంగున్నాట మంత్రింబుగన్.

మ. సకలాంధ్రావని యీ మహోత్సవములో సంతోషవారాసిపీ
చికలన్ దేలుట కేమి గాని యిట నీ శ్రీపాదపద్మమ్ములో
పికనర్చించిన శిష్యసంతతులకున్ బీయూషసంకాశమై
యొకపర్వంబును గర్వకారణమునై యుత్సాహమున్ గూర్చెడిన్.

మ. జమకట్టెన్ దమ కెన్నడో సుకవితాసామ్రాజ్య పట్టాభిషే
కము నాంధ్రిప్రిజ మానసంబుననె సంకల్పించి యీనాటికిన్

దమభావమ్మైన కొక్కరూప మిడి సంభావింపగా జాలుభా
గ్యము సిద్ధించె బునాది యౌచు గవిలోకప్రీతిపర్యాప్తికిన్.

మ. ఒకకావ్యమ్మె రచించి నీ ప్రథమశిష్యుం డున్నచో నేడు తా
వకపాదద్వయి మంచి యేపగిది సంభావించునో యంచు నిం
చుక చింతించితి గాని వెంటనె మనస్సున్ దిప్పె భాషాధినా
యకులై మించినతక్కశిష్యులవచో వ్యాపారవిన్యాసముల్.

మ. శివరాముల్ సువచోభిరాములును లక్ష్మీకాంతు లుద్యద్యశ
స్తవనీయాత్మలు విశ్వనాథులును విస్తారప్రభావోన్నతుల్
భవదీయప్రియశిష్యపుంగవులు విశ్వారాధ్యు లీదేశమై
భవమున్ జూచుచు దిద్దుకో గలరు నీ పాదమ్ము లర్చించుచున్.

మ. ప్రమదం బొప్పగ శిష్యసంతతుల సంభావింపుచున్ వార లు
త్తమకావ్యంబు లొనర్ప జూచి ఫలవంతమ్మైన మార్గమునన్
సముపార్జించిననేటిమేటిపదవిన్ సాగింపు మయ్యా? గురూ
త్తమ! పూర్ణాయువు నిష్టదైవ మనుసంధానింపగా నిచ్చలున్.

గీ. నీకుమాకు నుపాస్యయై నిఖిలజగము
నేలునట్టిపరాంబికయే ఘటించు
నామయనిరాసనమ్ము నీ కనఘ యింక?
నీ కృపాదృష్టి మమ్ము మన్నించు గాక.

(ద) దివాకర్ల వెంకటావధాని.

ఉ. కింకవిరాజమత్తగజకేసరి యై తెలుగుంగవిత్వపుం
బొంకము లెల్ల జూపి రుచిపోయిన శారదనోయగమ్ములో
వంకలు దిద్ది సత్కవుల వందల వేల సృజించె నెవ్వ డా
వెంకటశాస్త్రి కంచిత కవిత్వవిధాతకు గేలు మోడ్చెదన్.

ఉ. ఓకవితాతపస్వి! భవదుజ్జ్వలయోగ మపూర్వ మెన్నడున్
నీకడ రామశబ్దమును నేర్చుటెఱుంగనివార లెందఱో

మాకును జెళ్లపిళ్లకవిమండనుడే గురు డంచహో ! నమో
వాకము లిచ్చి నిన్ను గొలువన్ బలియుం గనువారిదంతముల్.

క. మాటలు పెక్కేలా తొలి
నాటికవిబ్రహ్మ తిక్కనప్రభు డీవో
నేటికవిబ్రహ్మవు నీ
నాటినమల్లియలు తెల్గునాటికవీంద్రుల్.

చ. అఱవతనమ్మురక్తమునయం దొకలేశము డాగి యుంటనో
వెఱవక సాహసింతు సుకవీ ! కులశైలమునేని డీకొనన్
నుఱు మయి పిండి పిండి యయి నుగ్గయి తద్గిరికూలునంతకున్
నెఱి నెడనీవు నీ కథలు నిర్భరశౌర్యసువర్ణభాండముల్.

ఉ. కంటిమె యిట్టి వింత సరకారు కడుంగడు గాసి కోర్చి నీ
యింటికె వచ్చి నీకు బిరుదిచ్చిరి మెచ్చిరి కాన్క వెట్టి నీ
వంటికవీంద్రు డిట్టి విభవమ్మునకున్ దగువాడ ! దీనిగ
న్గొంట ప్రజాప్రభుత్వమునకున్ సరికొ్రత్త వెలుంగు దెచ్చెడిన్.

(ద) తుమ్మల సీతారామమూర్తి.

ఉ. ఉండకపోరు సత్కవులు నుండిన నొక్కొకభాషయందు బే
రుండును గాని యీవిధిగ నుండునె ? భాషల రెంటియందు ను
ద్దండశతావధాన కవితావిషయమ్ము తలంచుకొన్న నె
వ్వం డిల గేలు మోడ్చి నుతివల్కని సత్కవి ? వెంకటేశ్వరా.

మ. కవితావీధి జరించుసింధుర మనంగా నొప్పు నీ మూర్తిలో
నవధాన మ్మొనరించువేళ వివిధవ్యామోహరూపాశిశాం
తవిధిన్ భీకరవృత్తి సుందరవిధిన్ దద్వాణి పుంభావరూ
ప విచారింపగ శిష్యశతు్రియువతుల్ వాత్రుత్తు రంచందురే.

(ద) కోగంటి సీతారామాచార్యులు.

సీ. భారతరచనా విభాసురపుణ్యాగ్ర
హారములొలయుమ హాత్మకీర్తి

కవితసెప్పి మహోగ్రికదనభూమికి జేని
ఫౌజు రప్పించిన పుణ్యఘనత
రాజునాస్థానమ్ము రహిమించు కనకాభి
షేకమ్ము నందినజేత యశము
ఆశుకవిత్వాన నీశుని మెప్పించి
పల్లకినెక్కిన భవ్యకీర్తి
గీ. గగన గంగను బ్రార్థించి కదలనీక
కట్టకట్టినకవివర్య గౌరవంబు
మీకు దక్కెను సంధ్రిభూమీశవితతి
పట్టుధవళాతపత్రిజృంభణము లోలయ.

(ద) ఎక్కటి వెంకటరామయ్య.

సీ. నలువయిల్లాలి క్రొందళుకు వీణియలోని
గీతారవమ్ముతో గేలు కలపి
నిండుజాబిల్లివెన్నెల సానిచిలికించు
నమృతంబుతోడ నైక్యమ్ము నొంది
లేదీవజవరాలియొాదల వరమిచ్చు
పూవునెత్తావితో బొందు కలపి
కమ్మతెమ్మెర విలుకాని నెన్నడకయొ
య్యారమ్ముతోడ వియ్యమ్ము చేసి.
గీ. పాదమంజీరమంజుల స్వరముతోడ
విశ్వమోహనగానమ్ము వెలయ గూర్చి
కవిత నృత్యమ్ము సేయు.మీ కలమునందు
కింకవికరీంద్రపంచాస్య వెంకటకవి.

(ద) శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి.

సీ. ఒకడు కోకిల మరియొకరుండు భృంగమ్ము
తెనుగుటామనిశోభ సనలు తొడిగె

ఒకడు మల్లీవల్లి ఒకడు మాకందమ్ము
తెనుగుతోట పసందు తెనుగుమీరె
ఒకడు వీణియ మఱియొకడు మృదంగమ్ము
తెనుగుగానములోన దెసలు పూచె
ఒకడు ద్రాక్షాసవ మ్మొక్క డిక్షురసమ్ము
తెనుగుజిహ్వాలదేల్చె దేవజగతి,

గీ. శబ్ద మర్థమ్ము పుష్పము సౌరభమ్ము
వంటిదొక విశిష్టాద్వైతభావమందు
సాగు తిరుపతివేంకటేశ్వరయుగమ్ము
తెనుగుకైత కపూర్వభూషణయుగమ్ము.

(ద) బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు.

మ. అనిశంబున్ వటపత్రశాయివలె బర్యంకస్థుడై యుండి కూ
డ నికామాద్భుత శేముషింగొలుపు జాడల్‌గల్గు కావ్యాదిలే
ఖనముల్సల్పు ననల్పదీక్షనికి సెక్కాలంబునన్ జేయు వం
దనముల్ వేంకటసత్కవిప్రభునకున్ సర్వోర్వియున్ సన్మతిన్.

(ద) దోమా వెంకటస్వామిగుప్త.

ఉ. జ్యోతిషమందు మీకు గలజ్ఞానము వాక్యగుణప్రసిద్ధి మీ
జాతకచర్య చెప్పు మఱి సాక్షిగ నేనును జెప్పువాడ నా
జాతకమందు యోగములు సాగుచు నున్నవి చెప్పినట్లుగా
నా తరమా నుతించుట కనారతమున్ మిము నాత్మ నెంచెదన్.

(ద) వాజపేయాజుల రామసుబ్బారాయుడు.



ఆ స్థా న క వి

# ప్ర త్యా భి న ం ద న ము

౧

గీ. నేను తగుదునో, తగనో ఈ స్థానమునకు
నాకుఁ దెలియదు, పదిమంది నన్ను నిచట
గూరుచుండఁ బెట్టిన నిటఁ గూరుచుంటి
నర్హతానర్హతలు మీర లరయవలయు

ఆ. వె. కవియుఁ బాచకుండు, గాయకుండును ముగ్గు
రొక్క రూప, వీర లొకరిమీఁద
భరము బెట్టుకొనుచు బ్రిదుకఁగావలయు, స్వ
తంత్రిభావ మెందు దడవ నాస్తి.

ఆ. వె. నన్ను వృద్ధుఁ డంచుఁ బున్నెమ్మునకు మీరు
గౌరవింతు, రే నుదారమైన
మీ సపర్య లెలమి మెచ్చి కైకొనియెదఁ
గవిని నేను కాను, కాను, కాను.

మ. 'యతియున్ బ్రాసయుఁగూర్చుమాత్రికవియే' యంచేను వా కొంటి గీ
రత మన్ కావ్యమునందు, నా రచన లారాధ్యమ్ములే యైన నే
కతమో తెల్పుఁడు, సంతసింతు, గణసంఘాతంబు కావ్యంబె? యే
మతిమంతుం డిటు లాడు నాతనికి సన్మానంబు గావింతురే?

క. ఇరువురొ మూగురొ కవులుం
దురు, కబ్బమ్ములును నంతె, దోషజ్ఞులు ధీ
వరమాన్యులు తితఉవులై (జల్లెడలు)
పరిశీలించునెడఁ బైకివచ్చెడి సుకృతుల్.

క. నెరసులు దొరలిన మాత్రిన
పరమార్థమ్మునకు హాని వాటిల్లదు, చు

ర్భర మగు దోషోత్కరమును
బరిహృతి గావించు రసము పరిభవించునెడన్.

క. బుధులకు 'సాధ్యోహిరసో
యధాతథ' మ్మనెడి వాక్య మర్థమ్మగు వా
రధమ మని పరిహరింతురు
వృథాగఁ గష్టించినట్టి వేత్తలరచనల్.

గీ. కవితవలనఁ బున్నెముగూడఁ గలిగెనేని
గలుగ నిం డావశక్యమ్ము గాదు; రామ
కోటివలె నుండు రచనలు కోవిదులకు
నచ్చ దీ రహస్యమ్ము విన్నాణి యెఱుఁగు.

గీ. కవులు పత్రికల్ నడపెడి ఘనులు కొంద
రెందఱో వారు మున్నారు కృష్ణరావు
లగుదురే, యాతనికిఁ జిర మబ్బుఁగాక
నాకలోక సుఖంబు విజ్ఞానిగాన.

క. బిరుదుల పరమార్థం బతఁ
డెఱుఁగును, కవితారహస్య మెఱుఁగును, సాక్షా
త్పరమేశ్వర భక్తుఁడు, కృ
ష్ణరాయఁడు యశశ్శరీరి సదసద్విదుఁడున్.

మ. కవులన్ గౌరవ బుద్ధితో నెలమిమైఁ గష్టంపు దారిద్ర్యబా
ధవశానం బడి క్రుంగకుండ మన భూదారుల్ కడున్ భక్తితో
శివమున్ గోరి భజించి రా భర మిఁకన్ శీర్షమ్మునన్ దాల్చి యే
లవలెన్ భూపప్రజలే మఱేలవలె వాలాయమ్ము శీలించుచున్.

ఉ. ఎంతయొ కష్టమున్ సయిచి యింతికిఁ గాంతుఁడు గాక కాంత క
య్యంతియుఁగాక సౌఖ్య మన నెట్టిదియో కలనే నెఱుంగ కే
వంతకు జంకకే కొనిన భారతమాతకుఁ బేరుదెచ్చు స
త్స్వాంతుల కబ్బుఁగావుత యశ మ్మనిశమ్ము భృశమ్ము శ మ్మిఁకన్.

శా. న న్నాస్థానకవీంద్రుఁ జేసితి. వీఁక న్నా కాయురారోగ్యసం
పన్నత్వంబు నొసంగు టన్నది క్రమప్రాప్తంబ, నా యీడువా
రున్నా రెందఱో విజ్ఞులల్ల ఘను లందొం డొక్క రాస్థానమం
దున్నన్ దేహబలంబు గోరుదురె? ని న్నోతల్లి! కామేశ్వరీ.

మ. పదొకండేఁడుల పైని రెండిపుడు నాప్రాయంబు నాబోటికిన్
గదిలో మంచమె యెల్లలోక మగుచున్ గాలమ్ము వెళ్ళించు వృ
ద్ధ దయార్ద్రం బగు దృష్టిఁ జూచి యిది తేదో గొప్పదౌ గద్దె నా
కది భుక్తం బగుదాక నాయు విడుమం చర్థింతుఁ గామేశ్వరీ.

మ. అనుకంపామృతదృష్టి నించి నను నీ వాస్థానవిద్వత్కవీం
ద్రుని గావించితి నేను దత్పదవియందున్ గూరుచుండంగ నే
ర్తునె మందిచ్చితి, తేనెఁ గూడ నిడుమందు న్నిన్నె యీదృగ్విష
ఘ్నులున్ మాదృశరుగ్ణులున్ గలరుసూ! కళ్యాణి! కామేశ్వరీ.

శా. సన్నాసిన్ వరుఁ జేయుచో నెరవెకా? సర్వంబు నా కిప్డు వి
ద్వన్నేతల్ కవు లేలఁ గాఁదగిన "ఆస్థానంబు" నీఁ జేసి తీ
యౌన్నత్యంబున కిమ్ము దీర్ఘతరమౌ నాయుష్య మ ట్లిచ్చుచో
నిన్నున్ మెచ్చు జగ మ్మిఁ కెట్టివరము న్నేఁ గోరఁ గామేశ్వరీ.

మ. ప్రతిసంవత్సర మింక నా కిడుఁ బ్రజారాజ్యంబు వేయారు లు
న్నత ముద్యోగముచేసి వాసిమెయిఁ "బెన్షన్" గొన్న బల్మేటికిన్
భృతకం బిచ్చు విధాన, దీనికి భవత్ప్రేమమ్ము తోడౌచు దీ
ర్ఘతరం బాయు వొసంగఁగావలెఁ గృపార్ద్రా! తల్లి! కామేశ్వరీ.

మ. జతనంబుం బొనరించి నే నెటులో యాస్థానీకవీశత్వ మూ
ర్జిత మౌ పాండితి గల్గువారు గొని ముశ్రీగూర్పఁ గాఁదగ్గ ద
ర్హత లేదంచు నెఱింగికూడఁ గొనలేదా గౌరవం బంబ? యి
చ్చితి వీవెందుల కిచ్చితో యెఱుఁగు నీ చిత్తంబ కామేశ్వరీ.

శా. స్థానం బున్నత మే జఘన్యుఁడ, మహోచ్చైఃస్థానవిభ్రాజితున్
దీనున్ జ్ఞానులుగాంచి నవ్వినను నాధీరత్వము న్వీడ నే

డెనిన్ గోర, స్వయంవరంపుగతి నేతెంచెన్ గరం బిచ్చితిన్
నానేరం బిట నింతయే, యెఱుఁగవే నాతల్లి! కామేశ్వరీ.

మ. స్వయ మేతెంచి వరించినట్టిడియె నాసర్వస్వమే పూరిపు
ల్లయుఁ గష్టార్జిత మున్నయట్లెఱుఁగ, బాల్యం బేగెఁ దారుణ్యమున్
వ్యయమయ్యెన్ ముదుకండ నై తిఁ దుదిప్రాయం బిప్డుడీప్రాయమున్
జయమే కా దయ మౌట నీకృపకు సాక్ష్యం బిచ్చుఁ గామేశ్వరీ.

శా. ఆయుర్దాయము మూడుభాగములునేయున్ దాన "పన్ థర్డు" బో
సేయంగా మిగిలెన్ శరీరము కడున్ జీర్ణించి శుష్కించె శే
షాయుర్దాయము భోజ్య మౌట కడు గడ్డై తోచుఁ ద్వత్సన్నిధి
స్థాయింగా నొనరింపు మేమిటి కిఁకన్ జాలంబు కామేశ్వరీ.

మ. "తనపెండ్లిన్ గన దాసుగూడఁ జన యత్నం బాచరింపండితం"
డన "నే నెందుకు నాదుపెండ్లి" కను వా రందందు మున్నున్న వా
రని వాక్రుత్తురు పెద్ద లిప్డు "చెళపి"శ్శారీతి నున్నాఁడు నీ
యనుకంపన్ సకలంబు భద్ర మగునం చర్థింతుఁ గామేశ్వరీ.

మ. జననీ! యుత్సవ మంచు నాకు నెదియో సందర్భమున్ గూర్చ నే
ర్చిన నీ వా సభఁజూడవచ్చుటకునై చే విమ్ము కాసంత నీ
వనుకంపించినఁ గానిడంచుఁ గలదే? ఆర్యామహాదేవి! స
ర్వనియంతృత్వము నీది నే నెఱిఁగి యారాధింతుఁ గామేశ్వరీ.

శా. చెన్నశ్రీపురమంద యుండి ధరకున్ శ్రేయంబు గల్గించు సం
పన్నుల్ గేస్తులుఁ బండితుల్ కవులు సామ్రాజ్యమ్ము సర్వమ్ము నాఁ
డన్నన్ శ్రీబెజవాడనుండు భవదీయాద్రీశ్వరోపత్యకన్
నన్నున్ జూడఁగ వత్తు రెందఱొ జనుల్ నాతల్లి! కామేశ్వరీ.

శా. కౌపీనంబు ధరించి యా సభకు నేగ న్నన్ను వీక్షించి ఓ
హో పాఱుం డిటు మారెనే! వయసుచే నొండొక్కరుం డయ్యె వా
గ్వ్యాపారమ్మును మాఱితీరు ననుచున్ గారుణ్య మొప్పార నా
వై పేచూతురు పంపు మమ్మ సభకున్ వందింతుఁ గామేశ్వరీ.

మ. కవులెల్లన్ జయపెట్టువైభవ మొసంగన్ లేదొ సచ్ఛిష్య వ
ర్గవిభూతిన్ గరుణింపవో తనుజనుర్భాగ్యంబు గైసేయవో
వివిధైశ్వర్యము లిచ్చి తింక నొకచే విశ్వేశి నీసన్నిధిన్
గవిగా నుండ ననుగ్రహింపు మిదియే కామ్యంబు కామేశ్వరీ.

శ్లో. సభాయై మంగళం భూయాత్ సభ్యానాం చ యశస్వినామ్
సర్వం శివమయం భూత్వా చిరవృద్ధింప్రపద్యతామ్.

శ్లో. స్వారాజ్యాయ శివం భూయాత్ విజయో విభవో జయః
సర్వం శివమయం భూత్వా చిరవృద్ధిం ప్రపద్యతామ్.

విరోధి సం॥ ఆశ్వయుజ శు ౩ మొదలు మాఘ శు ౧౨ వఱకును శనిలో గురునిలో

— బుధవిదశ —

క. ఈబుధుడెంతో కీర్తి
ప్రాబల్య మొసంగి గౌరవకరంబగు స
ద్ధీ బలమునకా ధారుం
డై బహుళానందకరుఁడునై యున్నంతన్.

ఉ. ప్రాణముతోడి మిత్రమయి, వార్ధకమందున నాకు నర్థముల్
దానుగఁగోరకే యిడెడిదాత ప్రకాశనృపుండు స్వర్గసం
స్థానము నేలఁబోవుచు విచారముగూరిచె నాత్మ నిట్టివి
జ్ఞానికిఁ జింతగూరుట అసంగతమయ్యును జింతగల్గెడిన్.

వ. ఆ యీ బుధవిదశలో నిట్టి విచారంబు దక్క తదితరము లెవ్వియును లేక యోపిక యున్నంతలో నిరంతర శివపంచాక్షరీజపము సేసికొనుచు గాలమ్ము నెట్టుచు నా అనంతర భవిష్యత్తులో దాయాదులు అన్యోన్య కలహంబులు పొందకుండుటకుగాను పుస్తకవిత్తంబుం గుఱించి నానిర్ణయంబులు దెల్పఁగల "వీలునామా" యొక్కండు వ్రాయించి "రిజిష్టరు" చేయించి యున్నంత.

విరోధి సం॥ మాఘ శు ౧౨ మొదలు వికృతి సం॥ చైత్రశు ౫ వఱకు

శనిమహాదశలో గుర్వంతరములో

—• కేతువిదశ •—

క. కేతువిదశ యారంభం
బై తను బలమున్ మఱింత హరియింపన్ వి-
ఖ్యాతికరంబై రాఁగల
నూతనసంవత్సరం బనువుపడువేళన్.

వ. పఠించు నిమిత్తమై విజయవాడ-ఆకాశవాణీకేంద్రము వారి కోరికపై నొక "సందేశము" వ్రాసి యిచ్చుటయు-విశాలాంధ్రావతరణము నుద్దేశించి కృషి సలుపు సభల నిమిత్తమై వేఱొక సందేశ మంపుటయు నిందే జరిగియుండు నంత నొకనాడు—

ఉ. గుండెలలోన నొప్పి యొకకొంచెము గన్పడి చిత్తశాంతికిన్
గండముగాఁగ మారుటయె కాకది బుద్ధినిగూడ మార్పునం
బండఁగఁబెట్టె నీశ్వర కృపానిగళంబునఁ జిక్కి సత్కవీ
శుండగు వేంకటేశ్వరుఁడు సొక్కియుసోలెను దీర్ఘ నిద్రలో.

గీ. నాఁడు శివరాత్రి వెనుకదినంపు రేయి
లేనియోపిక యెటువచ్చి లేపెనో ? ప్ర
బుద్ధమౌ చేవతో మంచమును డిగియెను
"అయ్యొయేమిది" యని కొడు కడ్డుపడఁగ—

గీ. ఏమిటా ? వెఱ్ఱివాఁడ ? నే నింకదిగనె
వలయు శివరాత్రిగాదె ? యీ నడికిరేయి
యింతమంచిరోజింక నాకెపుడు వచ్చు ?
అని యడిగి "నేఁడుగాదురే" పనుట వినియు.

గీ. అంతవఱదాఁక నొకరు సాయపడకుండ
శయ్య డిగుటయు నెక్కుట సలుపలేని

కవివరేణ్యుండు డిగి యెక్కఁ గలుగుశక్తి
నెనయు టరసిన నాశ్చర్య మినుమడించె.

ఆ. వె. కలిగి లేమగాక! తెలివి యామీఁదట
వచ్చువారి గుర్తుపట్టుచుండె
మాటరాదుగాక! నోట స్ఫుటమ్ముగ
సంజ్ఞచేసి స్ఫుటము సలుపుచుండె.

ఆ. వె. వార్త దెలిసివచ్చెఁ బట్టణంబఖిలమ్ము
విజయవాడలోని పెద్దలెల్ల
వచ్చి రల నమశ్శివాయ దక్షిణామూర్తి
సీతరామశర్మ చేరికొనిరి.

వ. తక్కుంగల విషయమ్ము లాయాయీ ఘోరవార్త విన్న కవివరేణ్యుల బాష్పబిందువులఁబోలు పద్యమ్ముల నుల్లేఖించి విన్నవింతు.

షరా:- అందఱి కవుల- అన్ని పద్యములును గ్రంధవిస్తరభీతిచే స్వీకరింప జాలనందుకు క్షమింపగోరెదను.

# విషాదబాష్పాంజలి

చ. తిరుపతి లేడటన్నవెలితిన్ గనుపింపగనీక వెంకటే
శ్వర! కవితాసరస్వతి కుపాయనపూజ లొనర్చి సత్కవీ
డ్గురువరమూర్తివై నెగడి కొండొకవ్యాధినెపంబునన్ గురూ?
పరమశివైక్య మందితివె? భవ్యమహాశివరాత్రిరోజునన్.

క. కారణజన్ముండవుగా
ధారుణి కరుదెంచి తెనుగుతల్లిసుతుడవై
సారస్వతశాఖలలో
తీరులు పరిదిద్ది వెడలితివె? స్వర్లోకిన్.

మ. కవనార్థం బవతార మెత్తి జగతిన్ గంపింపగా జేసి మా
నవలోకంబున నింత కెక్కు డగుస్థానం బేది: లేదన్నగా
రవమున్ బొంది శతావధాని కవిసామ్రాణ్మూర్తివై నేటికిన్
శివసాయుజ్యపు టగ్రపీఠి గవితాసింహాసనం బెక్కితే.

శా. కానన్ రా దిక నీదుకాయము యశఃకాయంబె కానీ ప్రబో
ధానన్ మ మ్మెసిగొల్పి జ్ఞానహితబోధల్ చేయుట ల్లేవు వి
జ్ఞానాంభోనిధులైన పుస్తకములే గావే? భవన్మూర్తి మ
త్ప్రాణం బిం కభయం బొసంగుటకు లేదా! తండ్రి మా కీ పయిన్.

ఉ. పుట్టినదాది నీవు చనిపోయెడిదన్కను దైవికాంశలే
పట్టము గట్టుకొన్నవి భవద్విభవమ్మన గొప్పగొప్పసా
మ్రాట్టుల కందరాని యసమానవిలాసవిహారమోక్షసా
మ్రాట్టువుగా తుదిన్ శివునిప్రక్క మహాకవిరాజువైతివా.

చ. ఒకరకమైన దీనదశనున్న సరస్వతి నుద్ధరించి దే
శికపదమం దపారముగ శిష్యుల సృష్టి యొనర్చి కైతలో
శకపురుషుండవై యుపనిషత్ప్రవచనంబును విన్చు గన్ను మూ
సికొనినతండ్రి! నీ వమరజీవివిగా సుఖియింపు మచ్చటన్.

ఆ. వె. చెప్ప మరచినాడ శ్రీపాదగురువులు
నిన్ను జూడ వచ్చియున్నవారు
కాని నీవు లేవు కడసారి నిను జూచి
పొంగుచున్నదుఃఖమును భరించి.

ఆ. వె. నేను బిడ్డలేని నిర్భాగ్యుడైతిని
నీవు తండ్రిలేని నిసుగువైతి
వనుచు బొక్కి నన్ను నాశ్వాస మొనరించి
వెళ్ళినారు తండ్రి? వింటివా కొ?

శా. నాన్నా యీవఱదాక నెట్లొ మదిలోనన్ ధైర్యమున్ బూని నే
నున్నానైనను పొంగులై వెడలుదుఃఖోద్వేగ మాపంగలే

కున్నా నెంతవిరాగమూనిన మనుష్యుండన్ గదా?యిందుకై
నన్నున్ మన్నన జేయుమీయపకృతిన్ మన్నించి దీవించుచున్.

గీ. ధన్యతమజీవివైననీతనువుగూర్చి
యేడ్వరా దని యెఱుగుదు నేమి చేతు
కంటికిన్ రెప్పవలె జూచుకన్నతండ్రి
యెదుట లేకున్ననాడు నే నేమి చేతు.

ఉ. మా దురదృష్టజీవితముమాట దలంచుకొలంది వేదనా
చ్ఛాదితమై మనస్సు వివశత్వము జెందుచు నుండె కృతిప్రమా
హ్లాదము లేమి చేయగల?వైనను మా కిక దండ్రిలేనిలో
టీదృశబాధలో సమయుచే విధిలేఖనమా? కవీట్పితా.

—• గీతమాలిక •—

తెలిసితెలియనితనమున గలసియున్న
మనుమడున్ మన్మరాలు, నీ తనువు కాల్చి
తిరిగివచ్చిన నాగుండె కరగిపోవ
"అన్న మెవ్వరు పెట్టెద రచట తాత"
కనుచు నను ప్రశ్నజేసినయంత కడుపు
తరుగుకొనిపోయి దుఃఖమ్ము పొరలిపోయె
గడ్డపెరుగున కలవాటుపడ్డవాండ్ర
కేమి ప్రత్యుత్తరం బిత్తు నింక నేను?

చ. అనుగుకుమారులన్ మఱచునట్లు భవత్పరిచర్య సేయు న
ల్లునివనటన్ గనుంగొనుటలో బ్రవహింపుచు నున్నకంటినీ
టిని యరికట్టు టెట్లు?ప్రకటీకృతమౌ విధిచైదిలోనిబం
ధనమది త్రెంపరానిది గదా?పెనుమాయజగత్తులోపలన్.

మ. మును భీష్మం బలె నుత్తరాయణమహాపుణ్యంపు గాలమ్మునన్
ఘనమౌనీశివరాత్రినాడు శ్రవణానక్షత్రమం దంపశ

య్యనుబోల్ శయ్యమ భౌతికంబయినకాయంబున్ సదా వీడి యీ
శునిలో నైక్యముగొన్న నీకు నివిగో జోహార్లు వేవేల్ పితా.

(ద) చెళ్ళపిళ్ళ దుర్గేశ్వరశాస్త్రి.

మ. చెళపిశాద్రియడు మున్ను పుట్టి సకలక్షేమంకరుండై ధరా
తలమందున్ గలకష్టముల్ డులిచి సత్యం బందె తద్వంశమే
చెళపిళ్ళాఖ్య వహించె నందు మఱియుం జెళ్ళిళ్ళయే పుట్టెనా
నెలమిన్ వెంకటశాస్త్రియై ప్రథితు డయ్యెన్ గావ్యకృద్వర్యుడై.

కళాపరిపూర్ణ, శతావధాని, చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి స్వర్గస్థులైరని వ్రాయుట కెంతయు చింతించుచున్నాడను. వెంకటశాస్త్రికిని నాకును అవినాభావసంబంధ మెంతయో కలదు. దానిని నే నిపుడు వెల్లడింప దలచి యుండలేదు. వెంకటశాస్త్రి తల్లిదండ్రులకు ఏకైకపుత్రు డగుటంజేసి వారు గారాబమున పది వత్సరములు వచ్చుపర్యంతము చదివింప శ్రద్ధ తీసికొనియుండలేదు. ఆతడు చిన్నతనమునందు ఎట్లున్నను తరువాత తరువాత బుద్ధిమంతుడై విద్యాభ్యాసము చేయుచు కుశాగ్రబుద్ధియై ఏకసంధాగ్రాహి యని పేరుపొంది కావ్యములు, నాటకములు, అలంకారములు చదివి పిమ్మట చర్ల బ్రహ్మయశాస్త్రిగారివద్ద తిరుపతిశాస్త్రి యను సహాధ్యాయితో భాష్యాంతము వ్యాకరణశాస్త్ర మధ్యయనము చేసి ఉభయభాషలలో కవిత్వము చెప్పెడి సామర్థ్యము కలవా డయ్యెను. ఈతని కవిత్వమునకు నేనే ఉపదేశకుడ నని మాత్రము చెప్పగలను. పిదప నాతడు మిక్కిలి కృషి జేసి తిరుపతిశాస్త్రితో కలిసి సంస్కృతములో కొన్ని శతకములు, అష్టకములు, మొదలగునవియు కాళీసహస్ర మనునొక స్తోత్ర గ్రంధమును రచించెను. అందు ప్రధానములు పాండవాజ్ఞాతవాసాది భారత నాటకములు ఈ గ్రంధము లన్నియు తిరుపతివేంకటీయ మనుపేరుతో ఉభయులును కలసి వ్రాసినవియే తిరుపతిశాస్త్రిగారి యనంతరమందు వెంకటశాస్త్రి ప్రత్యేకించి మఱికొన్ని గ్రంధములు కూడ రచించెను. వెంకటశాస్త్రి కవిత్వము మృదు మధురశైలి కలదై జాతీయములతో విరాజిల్లు

చుండును. తిరుపతిశాస్త్రి కవిత్వము భావగంభీరమై కొంచెము క్లిష్టముగా నుండును. వెంకటశాస్త్రి బందరు హిందూహైస్కూలులో ఉపాధ్యాయులుగా నున్నప్పుడు పెక్కుమంది శిష్యులకు కవిత్వ మభ్యసింప జేసెను. వారందరు అతనికి శిష్యులై భక్తితాత్పర్యములు ప్రకటించుచుందురు. వారిలో ముఖ్యులు పింగళి కాటూరులు. తరువాత స్వగ్రామమగు కడియమునకు వచ్చి యున్నప్పుడు వేటూరి ప్రభాకరశాస్త్రి వేలూరి శివరామశాస్త్రి లోనగు వారిని ఎందరనో మహావిద్వాంసులను మహాకవులనుగా జేసెను. ఈ శిష్యులందరును వెంకటశాస్త్రి యందు మిక్కిలి భక్తితాత్పర్యములు కలవారు. ఆ శిష్యులు గురువులను మించినవా రనియే చెప్పవచ్చును. ఇట్లు జగద్విశ్రాంతకీర్తిని సంపాదించిన చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రికి మద్రాసు ప్రభుత్వమువారు ఆస్థానకవి పదము నొసంగి గౌరవించిరి......... ... అట్టి యుత్సవము వెనుకముందులు మ తెవ్వరికిని జరిగినట్లు వినియుండము. అట్టి మహావైభవము అట్టి మహాసామ్రాజ్యము అయిదుసంవత్సరములగడువుకాలము నైనను అనుభవింపకుండ దైవదుర్ఘటనచే వెంకటశాస్త్రి ఆమయగ్రస్తుండై కొంతకాలమునుండి పర్యంకమే శరణ్యముగా శ్రమపడుచు మొన్నటిమహాపర్వదినము పగలు 11 గం॥ల మీద భౌతిక దేహమును విడిచి శివసాయుజ్యమును పొందినందులకు సంతోషమును మహాకవీశ్వరుని గోల్పోయితి మను దుఃఖమును పొందుచున్నాము. మహాశివరాత్రి మహాపుణ్యదివసము. ఆనాడు కైలాసములోనితలుపులు తెఱచియుండు ననియు అట్టిసమయమందు మృతించినవారిని శివదూతలు శివసాయుజ్యమును పొందింతు రని మన కనేకగ్రంథములు చెప్పుచున్నవి. కావున విచారింపగా వెంకటశాస్త్రి మహాపవిత్రదేహి యని తెలియుచున్నది. ఎనుబది సంవత్సరముల వయస్సు వచ్చి జగద్విశాలకీర్తిని వహించి సంసారసుఖంబు లెల్ల ననుభవించి పరమపదించినవెంకటశాస్త్రి మృతికై వారిపుత్రపుత్రికాదిబంధువర్గమును శిష్యబృందమును; మిత్రులును వగవ నక్కరలే దనియు వెంకటశాస్త్రిఆత్మకు శాంతి గల్గునట్లు

పరమేశ్వరుని ప్రార్థించుటయే అందరికర్తవ్య మనియు మనవి చేయు చున్నాను.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

(ద) శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

మ. చదువా శాబ్దికవారిరాశి,గుణమా సన్మార్గదీపంబు ప
ల్కు- దయారూపము పాఠమా రసములొల్కున్ తొమ్మిదిన్ కావ్యసం
పదయా భారతిదివ్యనృత్యము మనంబా వెన్నపూసే ఎటుల్
విధి పుట్టించెనొ వెంకటేశగురు నుర్విదేవు గామేశ్వరీ.

(ద) పద్మనాభస్వామి.

ఆ. మంచివానితీరు మరణకాలంబున
తెలియు నంచు రెఱుకగలుగువారు
ఏగినాడ వయ్య యిమ్మహాశివరాత్రి
వివిధకవికులేశ వెంకటేశ.

ఉ. సూనులు గూతులున్ దమదుసూనులతో గొలువంగ వృద్ధుడై
మేనిని రాల్చె నేల వగ?మే లని మెచ్చద యంతరాత్మ గం
గానది యింకె నేని యది కాలము చెల్లిన యేఱటంచు మో
దాన మునుంగువా రఖిలధాత్రిని నెయ్యెడ నేని యుందురే.

చ. తిరుపతిదేశికుం డెపుడొ తీఱినమ దివి జేరె నంచు మే
మరయము నేటితోడ నిక నాయనతో దమతో సరస్వతీ
తరుణికి పుంవిధావదవతార సమాప్తి యటయ్యె దెల్గునన్
వెరసు లసంఖ్యమైనకవివీరులు మీ యవతారలేశముల్.

(ద) వేలూరు శివరామశాస్త్రి.

మ. భువిపైనర్వదియేండ్లపై జిలుకునీముల్లోకసామర్థ్యముల్
కవనంబందున రంగరించి రసపాకం బెల్ల గావించి వి
శ్వవసంతోత్సవశారికాశుకపికబ్రాహ్మీమణీశిష్యభా
ష్యవనశ్రీ విభు డైనవా డెచట నమ్మా తల్లి కామేశ్వరీ.

(ద) వేదాంతకవి.

క. శివసాయుజ్యము జేరితె?
కవితిరుపతితోడ ప్రమధగణసేవితుడౌ
శివుకొలువున నవధానము
శివరాత్రివి సేయుకొఱకు శ్రీగురుదేవా.

(ద) పల్ల వెంకటశాస్త్రి

క. కవితారాత్రికతిరుపతి
నవరాత్రిగ వెలుగ విశ్వనాథుడు గలుగన్
భవరాత్రి దొలగినాడవె
శివరాత్రివి వేంకటప్రసిద్ధకవీంద్రా.

క. తిరుపతివెంకటకవు లట
సురుచిరకవితాకళాప్రసూనము లట యా
పరమాత్మపదార్చనమున
మరగినవా రంట యెంత మహాత్మకులో.

సీ. వారు కామేశ్వరీవరమాతృదేవతా
ప్రబలమంత్రజపప్రభావులంట
వారు కింకవిఘటావారపంచాననా
నేకసద్బిరుదాభినేత లంట
వారు నానారాజవరపండితాస్థాన
శతవధానవిధానచతుర లంట
వా రంధ్రగీర్వాణవరకవిత్వశ్మశ్రు
చిహ్నావబోధప్రసిద్ధు లంట
తే. గీ. వారు దశదిశావలయాలవాలకీర్తి
చంద్రికావల్లికల గన్నజంట లంట
వారు సాయుజ్యమందినవార లంట
వారు కైలాసనాథులైనార లంట.

క. దేవీభాగవతము వా
గ్దేవికరుణ నంధ్రభాష దేర్చినకవితా
ప్రావీణ్యులకున్ గైలా
సావాసం బెన్న నాత్మహర్మ్యమె కాదే.

(ద) శ్రీవెంకటపార్వతీశ్వరకవులు.

క. శివసాయుజ్యం బందెను
శివకవి శివరాత్రిభక్తశేఖరుడగుటన్
శివభక్తి శివస్తుతులను
భువి వెంకటశాస్త్రి నిలిపి పోయెన్ దివికిన్.

గీ. నిన్ను మేరువుగా నెంచి నీదుపుత్రి
వరులు పుత్రికల్ విజయునివాడ వాస
మొనర జేయుచు నుండిరి కనలకుండ
వారి నూరార్పవయ్య దివంబునుండి

(ద) కాంచనపల్లి కనకాంబ.

సీ. అమృతంబు జాల్వాఱినట్టుల గమ్మని
నుడులతో గవనమ్ము నడుపునేర్పు
పదులు నూఱులు వేలు పద్యముల్ గుది గూర్చి
యేకధాటిగ గుదియించుపజ్ఞ
వివిధాంశములు వేనవే లవలీలగా
ధరియింపగా జాలుమేధాబలంబు
ప్రతిపక్షకుకవివాగ్బంధంబు త్రుటిలోన
గావింపగల చమత్కారశక్తి.
గీ. యమర నాశ్చర్యకరవిధానావధాన
కళ వెలార్చిన ప్రోఢ వేంకటకవీంద్రు
డస్తమించెను తత్కాళ యంతరించె
నాంధ్రవాఙ్మయమును తమం బావరించె.

ఉ. భౌతికమూర్తితోడి యెడబాటుకు కుందెద మంతె గాని మా
చేతములందు భద్రముగ చిహ్నితులై యలరారుమీకు మా
కేతటిసేన్ వియోగ మది యెట్లు ఘటిల్లగ నేర్చు నింతకున్
ధాత కుచేష్టిత మ్మొకడె ధాత్రికి వెల్లడి యయ్యె సద్గురూ.

(ద) దీపాల పిచ్చయ్యశాస్త్రి.

గీ. ఆంధ్రకవితాజగద్గురు డమరపురికి
దరలిపోయెను శిష్యసంతతుల విడచి
సహజగీర్వాణ వాణీప్రసక్తులైన
దేవతలు చెప్ప గల రింక దెల్గుకవిత.

గీ. మరల దిరుపతివెంకటేశ్వరులజంట
కలిసె ముప్పదియేండ్లపైకాలమునకు
సాగ గల దింక దిక్పాలసభలయందు
అద్భుతావహ శతవధానాంధ్రకవిత.

గీ. మా గురుం డిప్డు దిగినవాఙ్మయపుగద్దె
యుర్వి ననధిష్ఠితం బయి యుండ గలదు
అనభిగమ్యము నప్రధృష్యమ్ము నౌచు
విక్రమార్కుని సింహాసనక్రమమున.

(ద) పింగళి లక్ష్మీకాంతం,

సీ. రంజనశక్తికి ప్రాణమ్ము ప్రాణము
ధారణాదేవి కాధారసీమ
సాహిత్య సౌహిత్య చర్చాప్రచారమ్ము
సమయస్ఫురణకు నిశ్వాససరణి
విద్వత్కవీంద్రవాగ్విభవమ్ము రవణమ్ము
నానానృపాస్థానవ్యశోభ
బ్రహ్మసద్గురుయశో భాండారసౌధంబు
నుభయభారతి సుకావ్యోదయమ్ము.

గీ. రాజసంస్థాన సుకవిరాడ్రత్నమూర్తి
చెళ్ళపిళ వెంకటాభిధ క్షితిని నిండి
లలి నమరలోకసభల నలంకరింప
జనియె భూలోకసుకవి విచార మురల.

(ద) చల్లా పిచ్చయ్యశాస్త్రి.

శ్లో. కాశ్మీరరేఖాంచిత పాలభాగో
హాసాంకురోర్జస్వల వక్త్రబింబః
నిత్యం దృశో ర్భాతి గురు ర్గురూణాం
మిథ్యా పున స్స్వర్గమనం తదీయం.

శ్లో. కవి స్స్వయం య శ్శివ ఏవ సాక్షా
ది తీహ వక్తుం ను శివస్య రాత్రౌ
శివే విలీనోద్య శివస్వరూపః
కవిః కవీనాం పదవీవిధాతా.

శ్లో. నక్షత్రతారా వియ తీవ యస్య
శిష్య ప్రశిష్యాః పరిత స్స్ఫురంతి
అఖండితజ్యోతిరవాప్తరూపో
విరాజతే సంప్రతి వెంకటేశ్వరః.

(ద) మల్లంపల్లి వీరేశ్వరశర్మ.

మ. అవధానం బని తిర్పతిప్రథితు డాహ్వానించెనో దేవరాట్
కవిపీఠంబుల బాస కొక్కకవి జక్క న్నిల్ప నాంధ్రాన నీ
వువినా లే రని పిల్వ నేగితివా యింపు న్నింపు నవ్యాంధ్రియే
యవతారించెను నీదురూపమున నిర్యాణించితే సత్కవీ.

(ద) అద్దేపల్లి లక్ష్మణస్వామి.

సీ. మట్టినుండి మహాత్మ డెట్టివీరుల జేసె
ననటను కవి చేసి సాకి తీవ

గ్రామీణభావంబు గాంధి వర్ధిల జేసె
గ్రామశైలికి ముచ్చి వైచి తీవు
శ్రోత్రియత్వము గాంధి రూపుమాప గడంగె
ఛాందసాలకు స్వస్తి జరిపి తీవు
హెచ్చించె దేశసాహిత్యమ్ము బాపుజీ
యెలయించి తాంధ్రసాహిత్య మీవు.

గీ. మీర లుభయులు విప్లవకారు లరయ
ప్రజలకోసము దిగివచ్చి పాటుపడిరి
గాంధి తిరుపతివేంకటకవులపేరు
ధారుణిన్ నిల్చు నాచంద్రతారకముగ.

(ద) చల్లపల్లి అప్పారావు.

ఉ. నీ కవితావధూటి నవనీతపుమూర్తి ప్రబంధవాఙ్మయా
నీకపుటందమున్ గదిసి నిగ్గులుదీర్చినయంచయాన యీ
లోకకవిత్వపర్మములు లోతుగ నేర్చినమేటిజాణ యీ
నీ కవితాలతాంగి నటియించనిరంగము గానలే మహో.

(ద) యే. కృష్ణ.

శా. గుండెల్ ఝల్లన నూరిపోసె గదపల్కుల్ ముల్కులై యంతటన్
నిండన్ భారతనాటకంబుల బురాణింపన్ దలం పుంచి యా
తండేగా నిలబెట్టె నా కవితయాంధ్రంబందు మార్రోగు ఈ
జెండాపై కపిరాజు లేడు గద యిస్సీ జన్మజన్మాలకున్.

(ద) గురుజాడ రాఘవశర్మ.

మ. అవతారంబు సమాప్తమయ్యెనె తమిస్రాంతర్నిమగ్నాంధ్రమున్
వివిధాధ్వమ్ముల జూపి సాహసము నుద్వేలంబు చైతన్యమున్
రవులన్ జేయుచు దీర్చిదిద్దినయపూర్వజ్యోతివల్లాతెనే
భవమున్ వీడెనె వేంకటేశ్వరుడు మా ప్రారబ్ధమూలమ్ముగన్.

మ. చటులస్ఫూర్తినెసంగు వేదనను నిచ్చల్ మ్రింగితిన్ దండిప్రమా
రటరూప మ్మని నిన్ను గొల్చుచు భవత్ప్రస్థాన మాలించినం
తట నీనాడె గతించె నా జనకు డన్నట్లయ్యె దుఃఖాగ్ని నే
నెటు సైరింపగ నేర్తు సోదరుల నిం కేరీతి నోదార్తునో.

ఉ. మాయెడ బుత్రభావమున మాపిత యేగిననాటినుండియున్
బాయనికూర్మి జూపితి వపాయములన్ దొలగింప నేర్చి సు
శ్రీయుతులన్ బొనర్చె నొనరించినదీవనయే యమోఘమై
సాయము జేయు మా కది యజస్రము పీడనియంగరక్షయై.

సీ. చివ్వకు గాల్దివ్వు చీకొట్టు గురు సైన
సహియింపనేరనిసాహసంబు
పలుకుపల్కిన హాస్య మొలికించుచుం బోవు
సహజసంభాషణాచతురిమంబు
సఖ్యుల నానందసమ్మోహితుల జేయు
శ్రావ్యగంభీరగళస్వనంబు
గుణ మున్నచో మెచ్చి కుత్తుకైతల కైన
దార్ఢ్యమ్మొ నొసగునుదారగుణము

గీ. శిష్యవాత్సల్యగరిమ వశీకృతాఖి
లాంధ్రసుకవిప్రయోగమార్గాంతరాళ
తక్షణజ్ఞప్తి సుస్వతంత్రప్రవృత్తి
మరచిపోవుదు మన్నను మరపురావు.

చ. ఎద జిరవిప్రయోగము సహింపగలేక సగౌరవంబుగా
బదిలముగా గిరీశ్వరునిపజ్జకు ని న్గొనిపోవ నెంచి నీ
కెదురుగ వచ్చు దిర్పతికవీంద్రుడు దివ్యులు చుట్టి కొల్వ నా
సదయులతో బ్రణామములు సల్పిరి నీ సుతు లంచు దెల్పుమా.

చ. తిరుపతివెంకటేశ్వరుడు దేవుడు మాకు దెలుంగునాట గో
ర్కులు సమకూర్చుచుండు నని కోటిజనుల్ వినుతింపుచుండు రా

దరమున దెల్గుభారతికి దైవముగా నలరారినట్టినీ
చరణసరోజభక్తి మము సాకును తిర్పతివెంకటేశ్వరా.

(ద) దివాకర్ల వెంకటావధాని.

మ. గుఱినేడే శివరాత్రి వెంకటకవిన్ గొంపోవ నేర్పడ్డదా
యరయం జూడదె మంచిచెడ్డ లిపు డయ్యెయాంగ్లమర్యాదు లే
చరలగ్నంబున జెళ్ళపిళ్ళకవి నాస్థానంబు నెక్కించిరో
పరలోకానకు మూటగట్ట మనదౌర్భాగ్యంబు గా కే మగున్.

చ. వరకవితావితానముల వాసికి నెక్కినయాంధ్రభూమిలో
సురుచిరవాక్ప్రవంతులను బొంపుగ మల్పి నవీనవాగ్ఝరిన్
బరిణతవాక్ప్రచారముల వంతెన లేసినయింజనీరుకా
తిరుపతి వెంకటేశులు గతించుటదేటిదిబాట మేటిగాన్.

(ద) నాదెళ్ళ మేధాదక్షిణామూర్తి శాస్త్రి.

క. ఇల నీ వాగర్భ శ్రీ
లలరినమేటివి చిరాయురారోగ్యశ్రీ
కలితులు నీ ముప్వురు పు
త్రులు నీ యిర్వురు సుతలు నిరూఢగుణాఢ్యల్.

(ద) కోన రాఘవయ్య.

మ. కరుణావారిధి శిష్యవత్సలుడు దిగ్రంగద్యశోవైభవుం
డరవిందాసనురాణి వాణియె భృశం బారీతియన్నట్టినే
ర్పరి మా వేంకటశాస్త్రి నిక్కముగ నైర్మల్యాత్ము డంచుందగన్
మరణంబున్ శివరాత్రి నొందుటయె సంస్థాపించు నత్యంతమున్.

ఉ. కింకరకల్పభూరుహ మకించనభావహరంబు నైనశ్రీ
శంకరభక్తి సెంతయు భృశంబుగ బూనినపావనాశయుం
డంకిలిలేనివృత్తిసముదారుడు వెంకటశాస్త్రివర్యుడా
శంకరు నంక మొందె నన సందియ మెందును గానవచ్చునే.

(ద) దోమా వెంకటస్వామిగుప్త.

మ. ప్రథమాస్థానకవీంద్రు జేసినపృథుత్వం బెంతొ చింతింప నీ
కథలన్ గానము జేయు శిష్యు లిక వాగ్వ్యాపారసంవర్తిలో
పథికుల్ గాగ సమస్తమున్ విడిచి సాపాటిన్ గనం గోరి మా
పృథివిన్ వీడి ప్రయాణ మైతి విక దేవీదర్శనోత్సాహివై.

(ద) బాచిమంచి శ్రీహరిశాస్త్రి.

ఉ. ఎప్పుడొ భువత్సఖుండు దివి కేగెను శ్రీపతిసత్కవీశ్వరుం
డిపుడు తమంతదాము దివి కేగినయంతనె వారు దాము నె
య్యపుగలిమిన్ గ్రహించుచు యథార్థముగా మునుపున్నయేకమ
త్యపుఫలమున్ మహత్తరత నంది చిరమ్ముగ నుండిరి యచ్చటన్.

(ద) శిష్ఠా హనుమచ్ఛాస్త్రి.

క. సోదర దుర్గేశ్వరశా
స్త్రీ! దయయేలేనిదైవ మీ గతి విశ్వై
కాదర్శగుణుల మీ పితృ
పాదుల గొంపోయె సుకవిబాంధవు లడలన్.

(ద) గొట్టిముక్కల రామకృష్ణశాస్త్రి.

శా. బావా దుర్గయశాస్త్రి నేడును గతింపన్ లేదు మీతండ్రి ని
ర్వ్యాదం బగునొక్కమాట విను నిర్వేదించుటల్ మాని నీ
వే వీక్షింపగలాడ వాంధ్రహృదులన్ విద్వత్కవీశావళీ
ధావళ్లేఖినులన్ నటాగ్రిరసనన్ తన్నిత్యసత్యాకృతిన్.

ఉ. కఱపిరి విద్యలన్ సుకవిగా నొనరించిరి నిన్ను చాల దు
ర్భర మగు నీకు నేటిపితృపాదవియోగము నీ విచారమున్
వరుసగ బంచుకోగలుగువారలు వేనకువేలున్నవా
రరయు మయా మహాంధ్రవిపులాంతరసీమ నెల్లతావులన్.

(ద) కాకరపర్తి కృష్ణశాస్త్రి.

ఉ. ధీరులు మీ తనూజుడును దిర్పతిసూనుడు సత్కవీశు ల
వ్వారలు మీకు దుల్యు లగువారలు కాదగువారు దీనిఫల్

వారలకున్నయట్టిపితృభక్తియు గూడ నపార మౌను న
వ్వారికి సర్వశక్తు లిడి వర్ధిల జేయగ జేయు డాంధ్రినిన్.

(ద) ఓగిరాల సుబ్బారావు.

ఉ. కోరి భజించి నిన్ను వటకుం గొనిపోయినవేల్పు పెద్దలే
కూరుతు రాత్మశాంతి భవకూపము దాటిననీకు మాకు విం
పారుకవిత్వపద్ధతుల నన్నిటదోచుచు నుండు మీవు ము
న్దీటిచిదిద్దినట్టినడనే నడిపింతుము మా కలమ్ములన్.

(ద) చెళ్ళపిళ్ళ బంగారేశ్వరశర్మ.

శా. శ్రీకమేశ్వరిభక్తి జేసి శివరాత్రిన్ దుర్గపుణ్యస్థలిన్
నీకున్ సన్నిధి దుర్గయాఖ్యమతు డెంతే భక్తి నొప్పెగితే
నీ కొక్కింత కొఱంత లేదు జగతిన్ నీ కీర్తి మూర్తీభవ
త్ప్రాకామ్యంబు దనర్చె వెంకటకవీంద్రా రామచంద్రాత్మజా.

(ద) ద్వివేది నారాయణశాస్త్రి.

గీ. స్వర్గధామంబునందు దిర్పతికి నీకు
గండపెండేరముల నిచ్చి కౌతుకమ్ము
గలుగజేయుట కింద్రుండు కమ్మ యొకటి
వ్రాసె గాబోలు నేగితో స్వర్గమునకు.

క. శివభక్తుడ వగుటకతన
శివరాత్రిదినంబునందు జేకుఱె మరణం
బవలీల జెళ్లపిళ్లస
త్కవివర మోక్షంబు నీకు గలుగును విధిగా.

(ద) ఈరంకి వెంకటరమణమూర్తి.

గీ. పెండ్లియాడితె లక్ష్మియన్ వెలది మహాని
బొరసితివె మారుమూర్తులన్ పుత్రికులను
గవనగానమూర్తు లనుంగుగన్నె లైరె
యార్యవెంకటేశ్వరుడ వీ వైనకతన.

(ద) యోగానందకవి.

అరిగితివా కవీంద్రా
ఆంధ్రదేశరవీంద్రా
కూలిం దొకవటవృక్షం
రాలిం దొకగగనతార
ఆఱిం దొకదివ్యజ్యోతి
మారిం దొకమహిమోన్నతి
పిడుగువంటివార్తను విని
కొట్టుకున్న మాగుండెలు
ఆగిపోయె ననుకొంటిమి
పోలే దీ శిష్యకోటి
నిలిచిం దొకబాధతోటి
విన్నారా విశ్వనాథు
డున్నాడా మీసన్నిధి
ముద్దుల శిష్యుడు ముందట
మీ గద్దెకు తగినవాడు
నీవులేని తెలుగుధాత్రి
చంద్రుడు లేని కాళరాత్రి
అర్ధశతాబ్ది మీ కవనం
ప్రవహించిం దీ భువనం
తెలుగు కవితాసాహితి
రంగంలో వెలుగు జూపి
విప్లవ శంఖోద్ఘోషలు
విజయంతో వినిపించి
ఆంధ్రావని అంతటినీ
ఉర్రూతలు ఊగించీ
జరిపించిన విజయయాత్ర
సాగించిన జైత్రయాత్ర
మరువరు ముక్కోటాంధ్రులు

మిగిలిన మీ ఆస్థంతా
తెలుగురాణి అమరవాణి
జోహారులు చెళ్ళపిళ్ళ
కైమోడ్పులు వెంకటేశ

(ద) రెంటాల గోపాలకృష్ణమూర్తి.

"శ్లో. జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తియేషాం యశఃకాయే జరామరణజంభయమ్"

—• గ్రంథోపసంహారము •—

శా. కాశీవెళ్ళితి నీదునస్థికలతో గంగానదిన్ ముగ్గిత
త్కాశీనాధు ననుగ్రహమ్ముఁ బడయంగాఁ గల్గినా నన్నపూ
ర్ణాశీర్వాదముఁ జెందినాఁడను భవవ్యాకోచసంకోచముల్
నాశంబందఁ బ్రయాగలోమునిఁగి యున్నాఁడన్ ద్రివేణీనదిన్.

ఉ. శేఖరరావునీకిడిన చెల్లని "చెక్కును" వానివద్దకే
"ఆఖరు" కంపివైచి మరియాదకు మిత్రుఁడనైతి "కోర్టులో"
"దాఖలు" చేయుమంచనిరి తద్జ్ఞులు గొందఱుగాని నీ యశో
వైఖరి కాప్రవర్తనము భావ్యము కాదని యెంచితిన్ బితా!

ఉ. ఇచ్చునుగాక ఈయకయె యేగునుగాక! భవచ్చరిత్రలో
మచ్చను సృష్టిఁజేయు టది మామతమెన్నఁడుఁగాద యెందఱో
యిచ్చెదమంచుఁ బల్కి తుదకీయనిసత్కృతు లీవుపీడవో?
పుచ్చుకొనంగఁ బట్టుదలపూనితివో? వచియింపుమా? పితా!

మ. ఎవఁ డెంతెంతగఁ బెట్టిపుట్టు నతఁడంతేహెచ్చు సంపత్సతీ
ధవుఁడౌఁగాక! సుకీర్త్యకీర్తులకుఁ దత్తత్కృత్యముల్ సాక్ష్యమై
భువినిల్చున్ జనిపోవునాడు డనతోఁ బొల్చున్ ధనాగారమెం
తవుఁ గాకయ్యది వెంటవచ్చెడిది యౌనా? యెంత "పీనాసికిన్"

ఉ. వాఙ్మణపదంబుగాఁ బిలచి పల్కిన నీ తుదియాజ్ఞ నేలువున్
నే నిడినాడ ఋష్యనకు నీ విడినట్టులు వేంకటేశ్వరుం

డానయనాంతబాష్పకణుఁడై గ్రహియించెఁ జుమా? గురూ! భవ
న్మానస శాంతికిన్ దుది పరిణామమిదే! మముఁ బ్రోచుచుండుమా?

—• గ్రంథాంతపద్యము •—

మ. "కవనార్థం బుదయించితిన్ సుకవితాకార్యంబె నావృత్తి యీ
భవమద్దానఁ దరింతుఁ దద్భవమె మద్భాగ్యంబు సర్వంబు మృ
త్యువు నే దానజయించితిన్ రుజ జయింతున్ దానిచే" నన్న స
త్కవివాక్యం బిడుఁగాత! నీ కెలమి మోక్షంబున్ బ్రకాశప్రభూ!

—• ముగింపు •—

క. ఎవరో వ్రాసిన రీతిని
స్వవిషయమును జాతకపు మిషన్ వెంకట స
త్కవి వ్రాసిన "చర్యఁ" దనూ
భవుండు దుర్గేశ్వరుండు వ్రాసి ముగించెన్.

క. కృతిపతి కల్లప్రకాశ నృ
పతికిన్ సుకృతి కినుగంటి వంశ్యసుమతికిన్
కృతికర్తకు సత్కవితా
పతిభర్తకు మోక్షమొసఁగి శర్వుఁ డలరుతన్!




— గద్య —

ఇది శ్రీ....కింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి[illegible]కళానిధి
బాలసరస్వతి కళాప్రపూర్ణేత్యాది బిరుదాంచితులును ప్రప్రథ
మాంధ్రాస్థాన కవీశ్వరులును అగు శతావధానులు తిరు
పతి వేంకటేశ్వరులచే రచింపఁ బడిన వెం॥ శా॥
జీవితచరిత్రలో నిటీవలిచర్య సర్వంబును
సమాప్తము.

శ్రీ మత్పరదేవతార్పణమస్తు!

# ముఖ్యమైన సవరణలు

## జాతకచర్యలో

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు | పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 21 | 28 | ఖాత్రా | భ్రాత్రా | 114 | 15 | నతియు | నత్యు |
| 26 | 11 | రుగె | రుగు | 119 | 2 | లము | లమి |
| 26 | 19 | తమ | తన | 119 | 26 | లమ్ము | లహమ్ము |
| 28 | 25 | యము | యమున | 167 | 4 | రము | రమ్ము |
| 40 | 1 | మింగ | మించుగ | 173 | 17 | గుటా | గూటా |
| 62 | 7 | న్నె | న్నే | 176 | 12 | షష్ఠి | షష్టి |
| 72 | 10 | కానా | లౌనా | 179 | 6 | తనకి | తనికి |
| 95 | 26 | నటి | నట్టి | 194 | 17 | నెంచె | నెంచి |
| 96 | 14 | చపు | చవు | | | | |

## ఇటీవలిచర్యలో

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు | పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 11 | 20 | నేట | నౌట | 138 | 1 | యుంటి | ఋంటి |
| 19 | 18 | దాయి | ధాయి | 172 | 16 | కేగి | కేగె |
| 22 | 22 | మీదా | మీందా | 190 | 6 | పులిపులి | పులి |
| 31 | 14 | గమా | గమెం | 232 | 8 | పక్క | ప్రిక్క |
| 32 | 21 | నర్చె | నర్చి | 236 | 18 | సంక | నంక |
| 37 | 18 | త్రిము | త్రిత | 246 | 14 | డెంతో | డెంత |
| 41 | 3 | ర్తాఖ్య | ర్త్యాఖ్య | 248 | 10 | గలిగిరి | గలరు |
| 42 | 3 | హము | హమ్ము | 268 | 23 | వార | నాద |
| 54 | 12 | నున్నవి | నున్నది | 270 | 3 | ప్పనీ | ప్పని |
| 118 | 19 | యతిని | యతని | 276 | 19 | నర | వర |
| *124* | *19* | దౌర | డౌర | | | | |